# జ్ఞాన సిద్ధాంతం

## (THEORY OF KNOWLEDGE)







రచన:

మారిస్ కారన్‌ఫోర్త్

అనుసరణ:

పాములపర్తి సదాశివరావు

★

... ప్రచురణాలయం,

... వాడ.

# విషయానుక్రమణిక



## మొదటి భాగం

## మనస్సు : దాని స్వభావం, పుట్టుక

# వినతి

జ్ఞానసిద్ధాంతం మానవుని భావపరిణామాన్ని వివరించాలి. అనాది నుంచీ మానవుడు పొందుతున్న భావాలు, ఆ భావాల ఆధారం, అవి వాస్తవాన్ని ప్రతిబింబించిన క్రమం, దాని అభివృద్ధి చర్చకు వస్తుంది.

తత్వశాస్త్రం మానవుని భావాలను, ఆలోచనలను, నిరూపణలను ప్రత్యేకించే జ్ఞాన విభాగం. కాని తత్వశాస్త్ర చర్చల్లో తరచు 'ఈ భావం గొప్పదా? అంతకంటె ఆ భావం గొప్పదా?' అనే వాదోపవాదాలు కొనసాగుతూ ఉంటాయి. మనుష్యులు ఆలోచిస్తారనీ, గొప్పమనుష్యులు గొప్పగా ఆలోచిస్తారనీ, కనుక వారికి గొప్పభావాలుంటాయనీ యిలా ఆయా మేధావులను ఆలోచనా యంత్రాలుగా చూడటం తరచు భావాల భౌతిక భూమికను విసర్జించటంవల్ల అనివార్యమవుతుంది. అందువల్ల భావాలను భావాలుగా తీసుకొనే యీ దృష్టి భావక్రమ సమస్యను పరిష్కరించలేదు.

కనుక తత్వశాస్త్ర చర్చల్లో తరచు 'కత్తి గొప్పదా? లేక కలం గొప్పదా?' 'విత్తుముందా? చెట్టుముందా?' అనే విధమైన స్వీయజిజ్ఞాసలు కొనసాగుతవి వీటికి ఆచరణ భాగంగాని, ప్రయోజనంగాని శూన్యం. అయినా. శుద్ధ జిజ్ఞాసలలో కాగితాలు మాత్రం నిండిపోయూనే ఉంటాయి. అసలు కలమూ కత్తితో ప్రమేయం లేకుండా కలమూ కత్తుల ఎక్కువ తక్కువలను గూర్చి, అసలు విత్తు ప్రమేయమూ, చెటు ప్రమేయమూ లేకుండా విత్తు - చెట్టుల ముందువెనుకలను గూర్చి పరిశోధనలకు పూనుకొనడం కేవలం పగటికలలు కనటమేగాని, సమస్యలను పరిష్కరించే

పై ఖరికాదు. తత్వశాస్త్రంలోను యిలాగే దేవుణ్ణి, ఆత్మనుగూర్చి అనేక చర్చలు, సూత్రీకరణ యత్నాలు కొనసాగుతూ ఉంటాయి.

అందువల్లనే సామాన్య ప్రజల్లో తత్వశాస్త్ర మనగానే, అది పనిలేని వారి పనిలెమ్మని త్రోసిపుచ్చే పరిస్థితిఉంది. అందువల్ల భావాలు, ఆలోచనలు పగటికలల ధోరణిలో పడిపోకుండా తగు జాగ్రత్తలు తీసుకొన్నప్పుడే, తత్వశాస్త్ర చర్చలుకూడ అర్థవంతమై, ప్రయోజనకరం కాగల్గుతవి.

(అ) భావాలు, ఆలోచనలు పైవిధంగా అయోమయంలోపడి కొట్టుకొనిపోకుండా తగు జాగ్రత్తలు తీసుకొనుటకు సాధనం భౌతిక వాదం. భౌతికవాద ఆలోచనాపద్ధతి భావాల వాస్తవభూమికను పరిశీలించి, ఆ భూమికపైనే ఆలోచనాక్రమంలోని కార్యకారణక్రమాన్ని వివరిస్తుంది.

(ఆ) కాని, కేవల భౌతికవాదంకూడ భావపరిణామాన్ని నిరూపించలేదు. భావాల పరిణామక్రమాన్ని చూడాలంటే, భావంయొక్క భౌతిక స్థితినేకాక వాని పుట్టుపూర్వోత్తరాలను, వివిధ దశలను, దిశలను, పాత్రను కూడ వాస్తవికంగా చూడవలసియుంటుంది. ఇందుకు చారిత్రక వీక్షణ అవసరమవుతుంది.

(ఇ) చారిత్రక వీక్షణ అంటే, ఆయా సాంఘికార్థిక వ్యవస్థల పరిణామాన్నీ, ఆయా వ్యవస్థల జ్ఞానపరిణామాన్నీ సమన్వయించి చూడట మన్నమాట. ఈ రెండు భూమికలద్వారానే భావాల పరిణామాన్ని జ్ఞాన సిద్ధాంతం నిరూపణ చేస్తుంది.

ఈ గ్రంథంలో పై దృక్పథాలను పాటిస్తూ, ఆగంతుక ప్రతిచర్య నుండి సర్వమానవ స్వాతంత్ర్యంవరకు భావవికాసక్రమం చర్చింపబడింది. పై సమన్వయ దృష్టితో మారిస్ కారన్‌ఫోర్త్ "జ్ఞానసిద్ధాంతం" వ్రాశారు. ఆయన ఆంగ్ల మాతృకకు అనుసరణగా తెలుగులో యీ గ్రంథాన్ని ప్రకటించుటకు పూనుకొని, ఆ బాధ్యతను విశాలాంధ్ర ప్రచురణాలయ

నిర్వాహకులు నా పై నుంచారు. నా అమిత ఆర్థిక యిబ్బందుల్లో ధన సహాయంకూడ చేశారు.

ఇక యీ పుస్తకం ఈ విధంగా రూపుదాల్చటంలో మిత్రులు శ్రీ కంభంపాటి సత్యనారాయణగారు, మిత్రులు శ్రీ ఏటుకూరు బలరామ మూర్తిగారు నా కెంతైనా సహాయపడ్డారు. ముఖ్యంగా, నా రచనలోని అనేక వాక్యాల క్లిష్టతను, వాక్య దీర్ఘతను నివారిస్తూ అనేక పదాలను, వాక్యాలను సులభశైలిలో తిరిగి వ్రాశారు ఇందుకు వారికి కృతజ్ఞుడను.

ఇది ఏ నవలో, లేక కావ్యమో వలె ఒక్క మొగిలో సులభంగా చదివి ఆనందించే కావ్యగ్రంథం కాదు. జటిలమైన తత్వ సూత్రీకరణల తోను, ప్రతి అంశాన్నీ గతిక్రమంలో మలచి వివరించే భారమైన పద్ధతిలో వ్రాయబడిన జిజ్ఞాసాత్మక రచన. అంతేకాక, యథావసరంగా ఆయా సమస్యలను ఆయా విభాగాల్లో పోల్చిచూచుకొనుటకు ఉపకరించే గ్రంథంకూడా. అందువల్ల మన కళాశాలలు, ఉన్నత విద్యాలయాలు, గ్రంథాలయాలు, యితర వైజ్ఞానికసంస్థలు, విజ్ఞానశీల వ్యక్తులు — ముఖ్యంగా, ప్రజాఉద్యమాలలో పనిచేసే సామ్యవాద కార్యకర్తలు, విద్యార్థులు యీ పుస్తకాన్ని ఆదరించగలరని నమ్ముతున్నాను.

కాగా - యిందలి లోపాలోపాలను తెలిపినచో, మరుముద్రణలో తగు విధంగా సవరించుకొన ప్రయత్నించగలనని ప్రాజ్ఞ పాఠకులకు సవినయంగా మనవి చేస్తున్నాను.

ఇట్లు,

బుధజన విధేయుడు,

పాములపర్తి సదాశివరావు.

# పరిచయం

భౌతికమైనది విజ్ఞానమనీ, ఆధ్యాత్మికమైనది జ్ఞానమనీ విభజించే వారు కొందరున్నారు. ఆ విభజన ప్రకారం జీవాత్మ, పరమాత్మల చర్చ ఈ జ్ఞాన సిద్ధాంతంలో ప్రధానాంశం కావాలి.

అలాంటి చర్చ ఏదీ ఇందులో లేదనీ, అసలు జ్ఞానాన్ని విజ్ఞానం నుండి విడదీసే పద్ధతి సరికాదనీ పాఠకులకు మొదట్లోనే విన్నవించుకోవటం అవసరం.

శాస్త్రాలు రెండు రకాలు. ప్రకృతి రహస్యాలను పరిశోధించే రసాయన పదార్థ విజ్ఞాన, జీవ, జంతు, ఖగోళ శాస్త్రములు ఒక తరహావి; చరిత్ర, తత్వశాస్త్రం, అర్థశాస్త్రం. న్యాయశాస్త్రం మొదలైన సామాజికశాస్త్రాలు రెండో తరహావి.

బాహ్య వస్తువులకు, వ్యక్తి చైతన్యానికిగల సంబంధాన్ని చర్చించే జ్ఞానసిద్ధాంతం తత్వశాస్త్రంలో ఒక ముఖ్యమైన ఉపాంగం.

మొదటి తరహా శాస్త్రాలు వస్తుప్రధానాలు; రెండో తరహావి సమాజప్రధానాలు. జ్ఞానసిద్ధాంతం వ్యక్తిప్రధానమైనది.

ప్రకృతి, సమాజం, వ్యక్తి అన్యోన్యాశ్రయాలైనట్లే, పై శాస్త్రాలు అన్యోన్యాశ్రయాలు. వ్యక్తి సమాజంలో ఒక భాగం. సమాజాన్ని ప్రకృతి పరివేష్టించిఉంది. కనుక, వివిధ విజ్ఞానశాస్త్రాలమధ్య ఏదో పెద్ద అఖాత మున్నదని భావించటం పొరపాటు.

వస్తు సారూప్యమే జ్ఞానం. వస్తు పరిజ్ఞానానికి మూలం బాహ్య వస్తువా, మానవ చైతన్యమా అనేది తత్వశాస్త్రంలో కీలక సమస్య.

వస్తువు మూలమని ఎంచేవారు భౌతికవాదులు; చైతన్యం మూలమని ఎంచేవారు భావవాదులు.

శరీరానికి, మనస్సుకు అవినాభావ సంబంధమున్నది. అత్యున్నతమైన పదార్థ నిర్మాణమే మెదడు.

బాహ్య వస్తువులను మనం పంచేంద్రియాలద్వారా గ్రహిస్తాము. ఈ ఇంద్రియానుభూతులు అతి సున్నితమైన గ్రాహక కేంద్రాలద్వారా మజ్జాముఖాన్ని చేరతాయి. పిమ్మట విశ్లేషణ, సంశ్లేషణ వంటి మనోవ్యాపారానికి లోనై అనుభూతిజ్ఞానం ఏర్పడుతుంది. పై ఇంద్రియానుభూతులు, యీ అనుభూతిజ్ఞానం రాపిడిచెంది తార్కికజ్ఞానం ఏర్పడుతుంది. ఇది ఆచరణ అనే పరీక్షలో నెగ్గి, రూఢిజ్ఞానం అవుతుంది.

జీవితం వైరుధ్య పూరితం. స్థితి, గతి; అఖండత, సాపేక్షత; స్వేచ్ఛ, అనివార్యత; జడత్వం, చైతన్యం; సత్యం, అసత్యం – ఇలా అసంఖ్యాకమైన వైరుధ్యాలున్నాయి. ఈ వైరుధ్యాలను, వాటి పరస్పర సంబంధాలను అధ్యయనం చెసేదే తత్వశాస్త్రం.

వైరుధ్యాలతో కూడుకున్నది అసత్యం, అశాశ్వతం, అస్థిరం అనీ, వైరుధ్యరహితమైన నిరాకార, నిర్వికార స్థితే పరమసత్యమనీ ఎంచేది అద్వైతం.

వైరుధ్యాలు వాస్తవాలనీ, వీటిమధ్య గల వ్యత్యాసం, అఖాతం శాశ్వతమనీ, వైరుధ్యంలోని వ్యతిరేకశక్తులమధ్య ఏ విధమైన సంబంధమూ లేదనీ భావించే ధోరణి ద్వైతం.

వ్యతిరేక శక్తులమధ్య ఘర్షణ, ఐక్యత లోకధర్మమనీ, జగత్ పరిణామమంతా ఈ సూత్రాన్ననుసరించే జరుగుతున్నదనీ భావించేది గతితర్కం.

జ్ఞానసిద్ధాంతాన్ని గురించిన గతితార్కిక భౌతికవాద సూత్రాలను దాదాపు సాకల్యంగా చర్చించేదే ఈ గ్రంథం.

మనస్సును ఆత్మ అని వ్యవహరించి, దేహాన్నుండి వేరుచేసి దానికి శాశ్వతత్వం ఆపాదించటం భావవాదధోరణి. ఈ ధోరణి ఉపనిషత్తుల కాలంనుండీ సాగుతూనే ఉంది.

ఐతే శరీరం, పదార్థాం, జగత్తు కేవలం మిథ్య అనీ, ఆత్మ మాత్రమే శాశ్వతమనీ వాదించే ధోరణి శంకరాచార్యుల స్వకీయభావ వాదం మాత్రమే. మిగతా భావవాదధోరణులు ఆత్మ శాశ్వత మంటూనే పదార్థానికి ఎంతో కొంత అస్తిత్వాన్ని అంగీకరిస్తూ వచ్చాయి.

శరీరం నశించటంతో ఆత్మకూడా నశిస్తుంది కనుక అంతటితో ఆత్మ ఆఖరైనట్లేనని చార్వాకుల వాదం.

కారణరహితమైనది, చలనరహితమైనది ఏదీ ఉండదు కనుక, అలాంటి ఆత్మకూడా లేదని గౌతమబుద్ధుని సిద్ధాంతం.

ప్రకృతిలోని ప్రతి వస్తువును వేర్వేరుగా అంటిపెట్టుకుని అసంఖ్యాకమైన ఆత్మలు శాశ్వతంగా ఉంటాయని జైనుల నమ్మకం. వైశేషికులు ధాదాపు యిలాగే భావించారు.

ఆత్మ శాశ్వతమేకాని, శరీర సంబంధంలేని ఆత్మకు విలువ లేదనీ, ప్రకృతి – పురుషుడు వీరిద్దరూ ఆద్యంతరహితాలైన స్వయంసిద్ధ శక్తులనీ సాంఖ్యుల మతం.

ఇలా ఎన్నో మతభేదాలు !

పై ధోరణులలో ఏదీకూడ, శరీరానికీ మనస్సుకూగల సంబంధాన్ని శాస్త్రీయ దృష్టితో గుర్తించలేదు. విజ్ఞానశాస్త్రాలు అతి ప్రాథమిక దశలో ఉన్న ప్రాచీన కాలంలో ఆ గుర్తింపు అసాధ్యంకూడా.

కాని ఆధునిక విజ్ఞాన శాస్త్రాలు మాత్రం శరీరానికీ మనస్సుకూ మధ్య దుస్తరమైన అగాధ మేమీలేదనీ, మనస్సుకంటె శరీరం, భావం కంటె పదార్థం ప్రాథమికమనీ ఘంటాపథంగా ఘోషిస్తున్నాయి.

ఐనప్పటికీ, ఈనాటికీ ఆత్మశాశ్వతత్వభావం హెచ్చుగా వ్యాప్తిలో ఉన్నమాట నిజం. ఇందుకు కారణాలు అనేకం.

విజ్ఞానశాస్త్రాల అభివృద్ధికి సరిపోయే విధంగా తాత్వికచింతన వృద్ధి కాకపోవటం ఒక కారణం విజ్ఞానంవేరు, జ్ఞానంవేరు అనే కృత్రిమ విభజనే ఇందుకు కారణం.

విశ్వాస ప్రధానమైన మతంతో ఆలోచనాప్రధానమైన తత్వశాస్త్రాన్ని ముడివేసి ఆలోచించేధోరణి మరొక కారణం.

బానిస, భూస్వామ్య, పెట్టుబడిదారీ సమాజాలలో వ్యక్తి తరచు సమాజదౌష్ట్యానికి బలి అవుతూ వచ్చాడు. నేటికీ అవుతున్నాడు. ఫలితంగా నిస్పృహాయతా నిస్పృహా ధోరణులు తల ఎత్తాయి. ఈ జన్మ నశించినా ఆత్మకు మరో జన్మ ఉంటుందనీ కనుక ఆత్మ శాశ్వతమనే భావం నిస్పృహా ధోరణులకు ప్రతిఘాతంగా, కొంతమందికి మానసిక సంతృప్తిని కలిగించింది; నేటికీ కలిగిస్తున్నది.

ఆద్యంత రహితమూ, అవిచ్ఛిన్నమూ అయినది విశ్వపరిణామం. వాస్తవమైన ఈ అవిచ్ఛిన్నతను వస్తువునుండి తొలగించి, స్వగత దృష్టితో ఆత్మపరం గావించటం మరొక కారణం.

ఈ అన్ని కారణాలవలన ఆత్మ శాశ్వతమనీ, శరీరానికీ - ఆత్మకు ఎట్టి సంబంధం లేదనే ధోరణులు నేటికీ ప్రబలంగా ఉన్నాయి.

ఎంత ప్రబలంగా ఉన్నా, ఇది కేవలం విశ్వాసం మాత్రమే శాస్త్రీయ దృష్టి మాత్రం కాదు.

నేటి మానవుడు పరమాణువులను ఛేదించాడు. అంతరిక్షయానా అయత్తమౌతున్నాడు. వ్యక్తికీ సమాజానికీగల వైరుధ్యాలను పరిష్కరించే సోషలిస్టు యుగంలో నేడు మనం జీవిస్తున్నాం.

వికసిస్తున్న జ్ఞానాని కనుగుణ్యంగా తన ఆలోచనలను మార్చుకోవటం మానవ స్వభావం. ఈ దృష్ట్యా జరిగినప్పుడు గతితార్కిక భౌతికవాద జ్ఞానసిద్ధాంతం అత్యంత శాస్త్రీయమైన దృష్టి అని బోధపడ గలదు. ఆ సిద్ధాంతాన్ని వివరించటమే ఈ గ్రంథ లక్ష్యం.

మారిస్ కారన్‌ఫోర్త్ అను ప్రఖ్యాత బ్రిటిష్ రచయిత వ్రాసిన గ్రంథానికిది అనుసరణ. వీలైన సందర్భాలన్నిటా భారతీయ తత్వశాస్త్రం నుండి ఉదాహరణ లివ్వటం ద్వారా గ్రంథాన్ని సులభగ్రాహ్యం చేయుటానికి కృషి జరిగింది.

అసలు తత్వశాస్త్రమే జటిలం. అందులోను జ్ఞాన సిద్ధాంతం మరీ జటిలం. ఆంగ్లమూలాన్ని అనుసరిస్తూ రచన సాగవలసి ఉండటం కూడా ఒక భారమే. కనుక, విషయాన్ని అర్థంచేసుకోవానికి పాఠకుడు కొంత పరిశ్రమ చేయవలసియుంటుంది. కాని ఆ శ్రమ ప్రయోజనకరం కాగలదని నీయమూను.

ఈ పరిమితులన్నీ గ్రహించికూడా మేము యీ గ్రంథ ప్రచురణకు పూనుకున్నామంటే, ఇందుకు ఒకే కారణముంది.

గతితార్కిక భౌతికవాదదృష్టి ఆంధ్రలో గణనీయమైన స్థానాన్ని సంపాదించుకున్నది. మేధావులు, విద్యావంతులు, ప్రగతిశీలురు మరింతగా ఈ దృష్టివైపు ఆకర్షింపబడుతున్నారు. ఇదొక సహజమైన, వాంఛనీయమైన, అవసరమైన సాంస్కృతిక పరిణామం. ఈ పరిణామానికి శక్తి కొలది దోహదం చేయాలనే ఆకాంక్షే మా ప్రయత్నానికి కారణం.

తెలుగు పాఠకులు ఈప్రయత్నాన్ని ఆదరిస్తారనే మా విశ్వాసం.

— ప్రకాశకులు

# మొదటి అధ్యాయం

# మనస్సు: దేహం

మనస్సును దేహంనుండి విడదీయ వీలులేదు. మానసిక వ్యాపారం మస్తిష్క వ్యాపారమే. అంగజీవికి పరిసరాలతో గల శ్లిష్టసంబంధాల అవయవమే మేధ లేదా మెదడు.

ఒక జంతువుకు దాని ఇంద్రియానుభూతులు బాహ్య ప్రపంచంతోడి సంబంధపు ఒక సంకేతక్రమం ఔతాయి. మానవునిలో అనుభూతి సంకేతక్రమంతోబాటు దాని సంకేత క్రమమైన శబ్దసంకేతక్రమం వృద్ధిచెందినది. ఇది పదార్థాల వాటి విభిన్నసంబంధాల గుణీకరణ - సామాన్యీకరణలద్వారా మానవ ప్రత్యేకమైన ఉన్నత మనోవ్యాపారానికి సాధనం ఔతుంది.

## పదార్థమూ, మనస్సు

ఇటీవలివరకూ అనేకమంది తాత్వికులు దేహమూ-ఆత్మ వేర్వేరని భావించారు. మానవుని దేహంలో విడిగా "ఆత్మ" అనే దొకటుంటుందని అనేకవాదనలు చేశారు. తత్వశాస్త్రంలో మెలకువ నిద్రలతోబాటు స్వప్నం అనే మూడవఅవస్థను గూర్చిన చర్చకూడ తరచు కొనసాగుతూ ఉంటుంది. ఒకమనిషి కలలో తాను ఆకాశంలో విహరిస్తున్నట్లు చూస్తాడు. కలల్లో ఇంకా అనేక అసంభవకార్యాలు జరుగుతూఉంటాయి.

కనుక ఈ కలల్లోని "తాను" అనేదేమిటని ఒక ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానంగా మానవశరీరంలో మరొక సూక్ష్మదేహం ఉంటుందన్న ఊహలు రూపొందాయి. దీన్నే "ఆత్మ" అన్నారు. ఆత్మ వాయుపదార్థమనీ, తేజోవిశేషమనీ, జీవమనీ, ప్రాణమనీ, శక్తివిశేషమనీ, గుణమనీ తాత్వికులు అనేక నిర్వచనాలు చేశారు. ఆత్మ పరిమాణాన్ని గూర్చికూడ అణువంతనీ, గోధుమగింజంతనీ, అంగుష్ఠమంతనీ ఊహించారు. ఆత్మను జ్యోతిగాను, తామరపువ్వుగాను ఉత్ప్రేక్షించారు. అది జ్ఞానమనీ. దైవమనీ వర్ణించారు. ఇలా కొనసాగిన ఆత్మజిజ్ఞాస దేహంనుండి మనస్సును వేరుపరచింది. దేహం ప్రధానమా లేక ఆత్మప్రధానమా అన్న చర్చకుకూడ ఇది దారితీసింది.

కొందరు ఆత్మప్రధానం అన్నారు. దేహం జడమనీ, ఆ దేహంలో గల ఆత్మ చేతనమనీ విభజించారు. జడపదార్థమైన దేహం ప్రకృతి నియమాలకు లోనై నశించిపోతుందనీ ఆత్మ అలాకాక ప్రకృతి నియమాలకు, పరిణామానికి, జననమరణాలకు అతీతమైనదనీ అన్నారు. దేహంనశించినప్పటికీ ఆత్మ నశింపక జన్మాంతరాలను పొందుతుందనీ, ఉత్తరగతులను చేకూర్చుకుంటుందనీ వాదించారు. మీమాంసకులు వైదికకర్మవాదం కొనసాగించారు. వేదోక్త-పురాణోక్త కర్మాచరణద్వారా ఆత్మ స్వర్గ నరకానుభవాలను పొందుతుందనీ, కనుక శరీరధారియైన మనుష్యుడు మతకర్మలకు అధీనుడుకావాలనీ శాసించారు. యోగశాస్త్రం మానవుడు ఐహిక రాగద్వేషాలను మానుకొని, భౌతిక సుఖదుఃఖవాంఛలను అణచుకొని, దేహాన్ని శుష్కింప జేసే యమ నియమ ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధులద్వారా ఆత్మను విముక్తం చేసుకోవాలని బోధించారు. అద్వైతులు భౌతికాలోచనలనూ, ప్రాపంచిక విషయాలనూ విసర్జించి శమదమాదులద్వారా ముముక్షుత్వదశకు చేరుకొని శ్రవణ మనన నిధి ధ్యాసల ద్వారా పారమార్థికజ్ఞానాన్ని సాధించాలన్నారు. అలాగే బౌద్ధులు, జైనులు కూడ ప్రాపంచిక విషయాలను, భౌతికాలోచనానుభూతులను నిరోధించే "నిర్వాణ" లక్ష్యాన్ని ప్రబోధించారు. వీరు దేవుడూ-ఆత్మ ఉంటాయని నమ్మకపోయినా, జన్మాంతరవాదాన్నీ కర్మసిద్ధాంతాన్నీ త్రోసిపుచ్చలేక

కేవలం "మనస్సు"కు ఆధిపత్యాన్నిగూర్చే ఉపన్యాసం సాగించాడు. ఆత ఉద్దేశంలో మనస్సుఅంటే తాను నమ్మే ఆత్మ - లేక దైవాంశ అన్నమాట. శారీరక ధర్మాలకు అతీతమైన ఈ మనస్సుకు లేక ఆత్మకు స్థానం 'హృదయం'లోపలనికూడ అతడు నమ్మవచ్చు. కాని మనోవ్యాపారాలకి ఆధారం హృదయం కాక మెదడు అని శరీరశాస్త్రం నిరూపిస్తుంది.

విజ్ఞానశాస్త్రం మనస్సును దేహంనుండి విడదీసి ఆలోచించే పంథాను నిరాకరిస్తుంది. వాస్తవంలో మానసిక వ్యవహారమంతా అందుకు సంబంధించిన శరీరావయవాలద్వారా కొనసాగేదేకాని తద్భిన్నంగాకాదు. దృష్టికి శరీరావయవమైన కన్ను ఆవశ్యకమౌతుంది. కన్ను లేనప్పుడు కేవలం మనస్సు యే పదార్థాన్నీ చూడజాలదు.

మానవుని చైతన్యం, విజ్ఞానం. ఆలోచనలు భౌతిక పరిసరాలపై ఆధారపడేవేకాని కేవలం ఆత్మకు, లేక మనోవిశేషానికి మాత్రమే చెందినవేమీకావు. మనస్సు అంటే ఆలోచనలకు కేంద్రమైన మేధ. ఈ మేధ లేక మెదడు భౌతిక పదార్థమే. పదార్థపు అత్యంత మహోన్నత నిర్మాణమే మానవమేధ. మేధ ద్వారా మనోవ్యాపారం కొనసాగుతుంది. అపూర్వమైన పరిణామవాద, జీవశాస్త్ర, శరీరశాస్త్ర పరిశోధనలు నేడు మెదడు ద్వారా మానసికవ్యాపారం యెలా కొనసాగుతుందో ప్రయోగాత్మకంగా నిరూపించి చూపాయి. విజ్ఞానశాస్త్రపు ఈ ఆధునిక విజయాలను మనం అసందిగ్ధంగా గుర్తించాలి. అప్పుడే మానవుని మనోవ్యాపారాన్ని గూర్చి మనం అర్థం చేసుకోగలం.

*జీవజాలం - పరిణామం*

ప్రాచీన తాత్వికులుకూడ సృష్టిని జడ చేతనాలుగా విభజించారు. సజీవపదార్థాలు తమ పరిసరవస్తువుల ప్రేరణలకు (Stimuli) ఉత్తేజన (React) చెందే స్వభావముంది. బ్రతుకుట, పెరుగుట, ప్రత్యుత్పత్తి (Reproduction) చేయుట జీవజాలపు ప్రధాన ధర్మాలు. ఇంకా శ్వాసక్రియ, సంచలనక్రియ, బాహ్యప్రేరణలకు ఉత్తేజన, ఉపచయక్రియ (Anabolic activity) అపచయక్రియల (Katabolic activity) తో

కూడిన వృద్ధి - క్షయ క్రమం మున్నగునవి అంగజీవుల ధర్మాలు. జీవ పదార్థాన్ని (Protoplasm) అందలి జీవకణవిభాగాన్ని ఆధునిక విజ్ఞాన శాస్త్రం పరిశోధించింది. జీవజాల పరిణామక్రమాన్ని వివరించింది.

సృష్టిక్రమంలో అల్పజీవులైన ప్రొటొజో, పారిఫెరా, కొలెంటిరేటా, క్రిమిజాలం, కీటకజాలం (Anthropode) మున్నగు వాటినీ, వెన్నెముకలుగల చేప, కప్ప, పక్షి, పాము మున్నగు (Vertibrates) వాటినీ, ఉన్నత జంతువులైన స్తనమృగాలనూ (Mammals), వాటి వాటి పరిణామాన్ని జీవశాస్త్రం పరిశోధించింది. ఇందులో వానరజాతి (Primates) పరిణామక్రమంలో Anthropoid ape ఒక ద్విపాద వానరునినుండి మానవదశ ఎలా రూపొందిందో శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. ఇది మానవుని శరీరశాస్త్ర పరిశోధనలో నూతన కవాటాలను తెరచింది.

అంగజీవి (Organism) పరిణామాత్మక అభివృద్ధిలో మెదడు యేర్పడుతుంది. జీవజంతువులు తమ పరిణామంలో ఒకానొక నాడీమండలాభివృద్ధిదశకు చేరుకున్నస్థితిలో మేధ రూపొందుతుంది. ఉన్నత నాడీమండల పరిణామంలో చైతన్యం యేర్పడుతుంది. ఈ చైతన్య పరిణామంలో మానవుని మనోవ్యాపారానికి ఆధారమైన మెదడు రూపొందుతుంది. ఇలా శరీర పరిణామక్రమంలో అంతర్గతమైయున్నదే మానసిక వ్యాపారం. అతి హీనదశనుండి మహోన్నతదశవరకు మానసికవ్యాపారం దేహధర్మానికి, లేక పదార్థధర్మానికి చెందినదే. కనుక పదార్థ పరిణామపు సంయోజనయొక్క అత్యంత మహోన్నతక్రమానికి చెందినదే మేధ లేక మెదడు. ఈ మేధోవ్యాపారమే మానసిక వ్యాపారమని విజ్ఞానశాస్త్రం నిరూపించింది.

కనుక భౌతికధర్మాలకు చెందక, దేహంనుండి విడిగాఉండే ఆత్మ లేక ఆధ్యాత్మికమనస్సు అన్న విశేషత్వం వట్టి ఊహాగానం మాత్రమే.

ఇంతకూ. దేహానికి అతిరిక్తమైన మనస్సనేది వేరేలేదు. కాని దీని అర్థం మనోవ్యాపారం లేదనిమాత్రం కాదు. మానవునిలో అనుభూతి, ఆలోచన, భావన, ఆకాంక్ష ఉన్నాయి. ఇవన్నీ మెదడుయొక్క కేంద్ర

నాడీవ్యవహారమూలకంగా కొనసాగుతవి. కనుక మనోవ్యాపారానికి కేంద్రం మెదడు. కనుక మనస్సు దేహానికీ, దేహధర్మాలకూ అతీతమైన ఆధ్యాత్మిక విశేషత్వంమాత్రం కాదు. అది పదార్థ విశేషమే.

వేదాంతులు ఆత్మనుగూర్చి ఒకవిధమైన తర్కం సాగిస్తారు "నీవు అంటే ఎవరు? నీవంటే నీచేయికాదుగదా; నీ వంటే నీతల కాదు గదా; నీవంటే నీకాలుకాదుగదా; పొట్టకాదుగదా. మరి నీవంటే యెవరు నీవంటే నీశరీరంకాదు; నీవంటే ఆత్మ లేక పరబ్రహ్మము మాత్రమే" తీరా ఇదొక యుక్తిమాత్రమేగాని నిత్యవ్యవహారానికి సమన్వయించే వాదన కాదు. నిత్యవ్యవహారంలో మనం శరీరం వేరూ, పరబ్రహ్మమైన ఆత్మ వేరూ అని విడదీయము. ఒక అద్వైతి వీపుపైన ఒకతుంటరి బాదెననుకొండి. అప్పుడా అద్వైతి ఈ గూండా "నన్ను కొట్టినా"డని గోల కెత్తుతాడేకాని తన దేహమైన వీపును కొట్టాడనికాదు. కనుక శరీరానికి చెందని పిడిమనస్సుయొక్క విడివ్యవహారమనేది ఆచరణకు నిల్వదు మనం నిత్యవ్యవహారంలో శరీరాన్ని, మనస్సును విడదీసి ఆలోచించటం సాధ్యంకాదు. ఉదాహరణకు "నామనస్సు బాగాలేద"న్నప్పుడు పరిస్థితుల మూలంగానని అర్థం. అంతేకాని దేహానికి అతీతమైన "ఆత్మవిశేషం" చెడిపోయిందని కాదు. కనుక సామాన్య దృష్టితోచూచినా మనస్సు వేరు దేహం వేరు అన్నవాదన జీవితవ్యవహారానికి పొసగదు.

ఆత్మను రుజువుచేయటానికి వేదాంతులు మరొక మార్గం అనుసరిస్తారు. ఆత్మఅంటే ఇదికాదు; అదికాదు; మనకు తెలిసిన మరేదీ కాదు అని "నేతి నేతి" అంటూ అన్ని దృష్టాంతాలనూ నిరాకరిస్తు అది స్వతఃప్రమాణ మంటారు. అంటే బుద్ధికి అగోచర మన్నమాట మరి బుద్ధికి అగోచరమయ్యే ఆ "ఆత్మ"కు ఆధారం యేమిటి? గు నమ్మకం మాత్రమే. కనుక ఆత్మను, లేక తద్విశేషమైన మనస్సును శాస్త్రం నిరాకరిస్తుంది.

"భావం పదార్థమూలకమైనదే. పదార్థ పరిణామక్రమపు మహోన్నతాభివృద్ధిమూలంగా ఏర్పడ్డ మేధ, దాని వ్యవహారమే భావం."—స్టాలిన్.

చైతన్యమూ, నాడీమండలం

గత శతాబ్దకాలంలో మానవజీవితపు వివిధ రంగాల్లో అపూర్వ విప్లవం కలిగింది. ఆర్థికరంగంలో అధికోత్పత్తి పరిశ్రమలు రూపొందాయి. రాజకీయరంగంలో పార్లమెంటరీ విధానం, పౌరహక్కులు అవతరించాయి. సాంఘిక జీవితంలో బహుళ విద్యావ్యాప్తి చేకూరింది. సామ్యవాద జీవితవిధానం ఆవిష్కరణ అయినది. విజ్ఞానశాస్త్రంలో పరిణామవాదం, జీవశాస్త్ర పరిశోధనలు, శక్తి మార్పిడిసిద్ధాంతం, అణు పరిశోధనలు మున్నగు మహోన్నత వికాసం చేకూరింది. ప్రెస్సు, రేడియో, రైళ్ళు, విమానాలు, సినిమాలు, వైద్య సౌకర్యాలు, విద్యుచ్ఛక్తి పరికరాలు, అణుఇంధన వినియోగం మున్నగు వికాసం చేకూరింది. ఐనప్పటికీ మధ్యయుగాలనాటి పాతవ్యవస్థలు, పాత విశ్వాసాలుకూడ కొనసాగుతూనే వున్నాయి.

మానవుడు మరణానంతరం పితృలోకం చేరుకుంటాడని నమ్మేవారూ, శ్రాద్ధాలుపెడితే స్వర్గంలోవున్న పితృదేవతలకు కడుపునిండుతుందని నమ్మేవారుకూడ ఉన్నారు. మానవునికి యీ జీవితంలో లభించని "ముక్తి" లేక మానసికసౌఖ్యం మరణానంతరం చేకూరగలదని అనేకులు విశ్వసిస్తున్నారు. అంటే, మానవుని మానసిక సౌఖ్యం (ముక్తి) అతడు చనిపోయి దేహాన్ని విసర్జించినపిదపగాని లభించదని నమ్మడమన్నమాట. మానవుని మేధ జీవితంలో అతని మనోవ్యాపారాన్ని కొనసాగిస్తుంది కనుక, ఆ మెదడుయొక్క ఆలోచన బెడదను వదలించుకోనంతవరకూ మనస్సుకు తృప్తిదొరకదన్నమాట. కనుక బుద్ధినీ, హేతువాదాన్నీ విసర్జించాలని భావవాదులు ప్రబోధాలు చేస్తారన్నమాట. శంకరాచార్యుడు ప్రపంచాన్నీ, ప్రపంచాన్నిగురించిన జ్ఞానాన్నీ, భౌతిక ఆలోచననూ, తర్కాన్నీ అలా నిరాకరించాడుకూడ.

అద్వైతులు ప్రపంచాన్నీ, మానవుని భౌతికజీవితాన్నీ మాయాజనిత మంటారు. ఈ జోజాటాన్ని వదలించుకొని "అహం బ్రహ్మాస్మి" అన్న ఉపనిషద్వాక్యాన్ని సిద్ధిచేసికొనుటే జీవితపరమార్థమనీ, ముక్తియనీ అద్వైతం చెబుతుంది. కాని ఈ జ్ఞానసిద్ధినీ, ముక్తినీ జీవితానుభవం,

విజ్ఞానశాస్త్రం, తర్కం వ్యతిరేకిస్తాయి. కనుక వాటికిచెందిన చైతన్యాన్ని మనుష్యుడు విసర్జనచేయా లన్నమాట. అంటే మానవుడు ముక్తుడు కావాలంటే బుద్ధినీ, మెదడునూ తుడిచిపెట్టుకోవా లన్నమాట. భావవాద తన 'మనస్సు' ఆధిపత్యాన్ని నెలకొల్పుకొనుటకు ఇలాంటి ధోరణికి పోతుంది.

కాని విజ్ఞానశాస్త్రం, దానిపైన ఆధారపడే భౌతికవాదం బుద్ధి నిరోధించాలనీ, జీవితానుభవాన్ని నిరాకరించాలనీ చెప్పదు. అది వా వాన్ని ప్రయోగాత్మకంగా, సహేతుకంగా నిరూపిస్తుంది. అంగజీవి (Organism) నాడీమండల వికాస పరిణామంలో మానవమేధ యెలా రూపొందిందో, ఆ మేధద్వారా మనోవ్యాపారం యెలా కొనసాగుతుందో భౌతికవాదం శాస్త్రీయంగా నిరూపిస్తుంది.

అల్పజీవులు (Anthropodes) వెన్నెముక గల జంతువులు (Vertibrates) గాను, సస్తనజంతువులు (Mammals) గాను, వానరజాతి (Primates) గాను పరిణామంచెందటంలో నాడీమండలం క్రమవికాసం చెందుతుంది. కేంద్ర నాడీమండల వికాసపరిణామంలో మజ్జాముఖం (Cerebral cortex) మరియు దాని కేంద్రాల నిర్మాణంతో ఉన్నత మానసిక వ్యాపారం ప్రారంభమౌతుంది. ఇలా మెదడు ఆలోచనకు సాధనంగా అభివృద్ధి గాంచుటతో మానవుని మనోవ్యాపారం వికసిస్తుంది.

"మానసికధర్మాల విశ్లేషణకోసం, వివరణకోసం, వాటి ఉత్పత్తినీ స్వభావాన్నీ గుర్తించటంకోసం మనోవ్యాపారానికి ఆధారమైన నాడీ ధర్మాలను (Nervous activity) పరిశోధించాలి" అని లెనిన్ వ్రాశారు. అలాగే, ప్రఖ్యాత సోవియట్ శాస్త్రజ్ఞుడు పావ్లావ్ నాడీమండల వ్యాపారాన్ని పరిశోధించాడు.

## పావ్లావ్ సిద్ధాంతం

పావ్లావ్‌కు ముందే శరీరశాస్త్రజ్ఞులు దేహవ్యాపారానికి కేంద్రం నాడీమండలమని కనుగొన్నారు. షెరింగ్‌టన్ శరీరవ్యాపారం కేంద్ర నాడీమండలపు సమన్వయచర్య అన్నాడు. నాడీమండలం శరీరయంత్రాంగపు

విభిన్న అవయవాల సమన్వయ, సంచాలన కేంద్రమేగాక శరీరయంత్రాంగపు పరిసరప్రకృతితోడి సంబంధంకూడా అని పావ్లావ్ నిరూపించాడు.

అంగజీవి (Organism) నాడీమండల వ్యవహారంద్వారా తన శరీర ధర్మాలను క్రమబద్ధంగా కొనసాగిస్తుంది. తోడ్తో పరిసర ప్రకృతితో క్లిష్టమైన సంబంధాలను నెలకొల్పుకొనడంద్వారా అది తన అవసరాలను నెరవేర్చుకుంటూ నిర్దిష్టపరిస్థితుల్లో నిర్దిష్టప్రవర్తన కొనసాగిస్తూ జీవిస్తుంది. జంతుజాలం పరిసర ప్రకృతితో సంబంధాలను నెలకొల్పుకుంటుంది. పరిసర ప్రకృతినిగూర్చిన అవగాహన కల్గియుంటుంది; బాహ్య సంఘటనల ప్రభావానికి లోనౌతుంది; బాహ్యప్రకృతిపై ప్రతిప్రభావాన్ని కల్గిస్తూ వ్యవహరిస్తుంది. ఇందుకు ఉన్నత జంతువులు తమ జ్ఞానేంద్రియాలను వినియోగపరచుకుంటాయి. ఈ శరీరప్రక్రియ కంతటికీ సారధి మెదడు.

జంతుజాలానికి కొన్ని సహజ ప్రవృత్తులుంటాయి. ఒక కుక్క ఎదుటికి మనం ఆహారాన్నితీసికొనిపోతే దాని నోట్లో నీరూరుతుంది. కుక్క ఆహారాన్ని చూస్తుంది. గుర్తిస్తుంది. వెంటనే ఆ ఆహారాన్ని సులభంగా నమిలిమ్రింగుటకూ, జీర్ణంచేసికొనుటకు వీలుగా దానినోట్లో నీరూరుతుంది. ఆహారాన్నిగూర్చిన కుక్క ఇంద్రియానుభూతి (చూపు, వాసన) దాని మెదడులోని గ్రాహకకేంద్రాలకు (Sensory centres)ప్రసరించి తక్షణమే చాలకకేంద్రాలకు (Motor centres) చేరుకొని తద్వారా కుక్కనోటిలోని లాలాజలగ్రంధులకు ప్రసరణచెందటం మూలంగా నోట్లో నీరూరుతుంది. ఆహారపు ఇంద్రియప్రేరణలకు కుక్కశరీరం అవలంబించే సహజమైన ప్రతిచర్య నోట్లో నీరూరడం. ఈవిధంగా జంతుజాలం బాహ్యపదార్థాలపట్ల ప్రతిచర్యను కొనసాగిస్తాయి.

పావ్లావ్ ఒక ప్రయోగం జరిపాడు. ఆయన ఒక కుక్కవద్దకు రోజూ ఆహారం కొనిపోయేవాడు. ఆహారపు వాసన రాగానే కుక్క నోట్లో నీరూరేది. ఆ పిదప పావ్లావ్ కుక్కకు ఆహారం పెట్టినప్పుడల్లా ఒక గంట మ్రోగించేవాడు. కొన్నాళ్ళపిదప ఆహారం ప్రసక్తి

లేకుండానే ఊరికే గంట కొట్టినప్పుడు కూడ కుక్క నోట్లో నీరూరేది. దీన్నే పావ్లావ్ ఆగంతుక ప్రతిచర్య అన్నాడు.

ఆహారాన్ని చూడగానే కుక్క నోట్లో నీరూరడం ఆహారంపట్ల కుక్కసహజంగా అవలంబించే ప్రతిచర్య. కాని గంట కొట్టినప్పుడు కుక్క నోరూరటం అలాకాదు. జరిగిందేమంటే, రోజూ గంట కొట్టినప్పుడు ఆహారం దొరకడంవల్ల కుక్కకు గంట శబ్దం అలవాటైంది; కుక్క గంట శబ్దానికీ, తన ఆహారానికీ ఒకానొక సంబంధాన్ని యేర్పరుచుకొన్నది. అందువల్ల గంటశబ్దం వినగానే ఆహారంతో నిమిత్తం లేకుండానే దాని నోట్లో నీరూరటం జరిగింది. అంటే, గంటశబ్దాన్ని అభ్యాసవశంగా కుక్క తన ఆహారానికి సంకేతంగా గుర్తుపెట్టుకో గల్గిందన్నమాట.

పై ప్రయోగంవల్ల ఉన్నత జంతుజాలం తన పరిసరాలపట్ల రెండు విధాలైన ప్రతిచర్యను నెరపగలదన్నితేలుతుంది. ఒకటి సర్వసాధారణంగా పుట్టుకతో జంతువులలోగల సహజ ప్రతిచర్య. రెండవది ఆగంతుక కారణాలమూలంగా ఒక జంతువు అవలంబించే ఆగంతుక ప్రతిచర్య

సహజ ప్రతిచర్య జంతుజాలానికి సహజంగా, అనువంశికంగా వస్తుంది. అది స్థిరస్వభావాన్నికూడ కల్గియుంటుంది. ఉదాహరణకు ఒక కుక్క కంటివద్ద ఏదైనా వస్తువు కదిలితే అది తన రెప్పలను మూసుకుంటుంది. ఆ విధంగా తన కంటికి హానికల్గకుండా కాపాడుకొంటుంది. ఇలాంటి సహజ ప్రతిచర్యల రూపంలో జంతుజాలం పరిసర ప్రకృతితో సంబంధాలను కల్గియుంటాయి. ఎండవేడికి ఒక కుక్క నీడకుచేరి పడుకుంటుంది. ఆహారాన్ని చూడగానే నోట్లో నీరూరుతుంది. ఈ ప్రతిచర్యలు స్వాభావికమైనవి.

కాని ఆగంతుక ప్రతిచర్య అలాకాదు. ఒకానొక జంతువు తన పరిసరాలతో నెలకొల్పుకునే ఆగంతుకమూ తాత్కాలికమూఐన సంబంధాన్నిబట్టి అది ఏర్పడుతుంది. పావ్లావ్ ప్రయోగంలో గంట కొట్టినప్పుడు ఆ గంట శబ్దాన్ని తన ఆహారపు సంకేతంగా గుర్తించి కుక్క ప్రతిచర్య నవలంబించింది. ఐతే, తిరిగి కొంతకాలంపాటు గంట కొట్టినప్పుడు

ఆహారం పెట్టకపోతేసరి, ఈ ప్రతిచర్య మారిపోతుంది. గంట కొడితే అప్పుడు కుక్కకు నోట్లో నీరూరదు.

ఒక కుక్కకు ప్రతిరోజూ ఒకే స్థలంలో ఆహారం పెట్టామనుకోండి. ఆ స్థలానికీ ఆహారానికీ ఆ కుక్క సంబంధం నెలకొల్పుకుంటుంది. రోజూ ఆహారానికి అదే స్థలానికి చేరుకొంటుంది. కాని ఆ ఆహారస్థలాన్ని మనం మార్చివేశా మనుకొండి. మరొక స్థలంలో ఆహారం పెడితే కుక్క ఆ మరోస్థలానికి అలవడుతుంది. ఒక జంతువుకు పరిసరాలతో యేర్పడే ఆగంతుకమైన అస్థిరమైన సంబంధాన్నిబట్టి ఆగంతుక ప్రతిచర్య మార్పుకు గురియౌతుంది.

జంతుజాలం తమ పరిసర ప్రకృతిపట్ల ప్రతిచర్యను నెరపుతాయి. ఈ ప్రతిచర్యలకు కేంద్రం నాడీమండలకేంద్రం, లేక మెదడు. మెదడులో నిశితమైన గ్రాహక - చాలక కేంద్రాలుంటాయి. బాహ్యపదార్థాన్నిగూర్చి జ్ఞానేంద్రియ ప్రేరణలద్వారా గ్రాహక కేంద్రాలు వార్త నందుకుంటాయి. వెంటనే ఆ వార్తను చాలక కేంద్రాలకు ప్రసారిస్తాయి. చాలక కేంద్రాలు తక్షణమే ఆ వార్తకు సంబంధించిన అవయవాలకు, కండరాలకు, గ్రంధులకు అందిస్తాయి. అప్పుడు ప్రతిచర్య జరుగుతుంది. ఈ సంక్లిష్ట వ్యవహారమంతా తృటికాలంలో జరిగిపోతుంది.

ఉదాహరణకు మనం నిప్పును తాకగానే వేడిని గ్రహిస్తాం; చేతిని లాక్కుంటాం.

మెదడులోనిగ్రాహక-చాలక కేంద్రాల మధ్యగలసహజమైన, సుస్థిరమైన సమన్వయక్రమంవల్ల సహజప్రతిచర్య యేర్పడ్తుంది. మనం నిప్పును చూడగానే గుర్తించిచేయికాలకుండాజాగ్రతపడతాము. కాని ఆగంతుకప్రతిచర్య ఆగంతుకపరిస్థితులమూలంగా గ్రాహక-చాలకకేంద్రాలమధ్యయేర్పడే ఆగంతుక సంబంధంపై ఆధారపడుతుంది. పావ్లావ్ తన పరిశోధనలద్వారా ఉన్నతజంతువుల నాడీమండలం యెలా వాటి పరిసరాలతో, ఆ పరిసరాల మార్పుల ననుసరించి మారే అస్థిరమైన, ఆగంతుకమైన సంబంధం నెలకొల్పుకుంటుందో, తద్వారా స్వీయజీవిత వ్యవహారంకోసం పరిసరప్రకృతిపట్ల యెలా ఆగంతుక ప్రతిచర్య నవలంబిస్తుందో నిరూపించిచూపాడు. ఈ

ప్రక్రియ కొనసాగేది మెదడులోనే. కనుక పావ్లావ్ "మెదడు అంగజీవి యొక్క బాహ్యపదార్థాల సంక్లిష్టసంబంధాలకు కేంద్రం" అన్నాడు

*వ్యవహారం - చైతన్యం - ఇంద్రియానుభూతులు*

"మనస్సు వేరూ, దేహం వేరు అన్న నమ్మకం మనలో ఇంకా బాగానే నాటుకొనియుంది. కాని విజ్ఞానశాస్త్ర దృష్ట్యా ఈ ద్వైతవిభాగం అసంభవం" అని పావ్లావ్ వ్రాశాడు. శరీరంపై ఆధారపడ్డదే మనస్తత్వం అని పావ్లావ్ నిరూపించాడు. మానసికవ్యవహారాన్ని పరిశోధించాలంటే ఉన్నత నాడీ ప్రక్రియను పరిశీలించాలని ఆయన అన్నాడు. శరీరశాస్త్రం వేరూ మనస్తత్వశాస్త్రం వేరూ, దేనికదేనన్న ఛాందసాన్ని పావ్లావ్ తన శాస్త్ర పరిశోధనలద్వారా వమ్ముచేశాడు.

మానసికవ్యాపారం మెదడుకు చెందినదే. మెదడు జంతుజాలానికి బాహ్య ప్రకృతితోగల శ్లిష్ట సంబంధాల అవయవం. కనుక మానసిక వ్యాపారమంటే తన పరిసరాలతో ఒక జంతువు నెలకొల్పుకొనే సంబంధాల అంతర్భాగమే. ఈ సంబంధాలకూ, మనోవ్యాపారానికీ ఆధారం ఆగంతుక ప్రతిచర్యల పరిణామం.

జీవితక్రమంలో ఒక జంతువు ఒకానొక పదార్థపు గుర్తింపును కల్గియున్నప్పటినుండీ దాని మనోవ్యాపారం ప్రారంభమౌతుంది. ఉదాహరణకు ఒక కుక్క తన జ్ఞానేంద్రియ ప్రేరణద్వారా భిన్నపదార్థాలను భిన్నంగా గుర్తిస్తుంది. ఒక ప్రత్యేకమైన వాసనద్వారా తన ప్రత్యేక ఆహారాన్ని గుర్తిస్తుంది. అలాగే తన యజమానిని గుర్తిస్తుంది. ఇంకొక కుక్కను గుర్తిస్తుంది. ఈ విధంగా అది తన ఇంద్రియానుభూతులవల్ల విభిన్న పదార్థాలనుగూర్చి విభిన్న ప్రేరణలను పొందుతూ, వాటిని విభిన్న పదార్థాలపరంగా సమన్వయించుకోగల్గుతుంది. ఇలా విభిన్న పదార్థాల ఉత్తేజాలద్వారా విభిన్నపదార్థాలతో విభిన్న సంబంధాలేర్పరచుకొని వాటి పట్ల విభిన్న వర్తనలను అవలంబిస్తుంది.

ఐతే, ఈ తెలిసికొనటం బాహ్యపదార్థంమూలంగా దానంతటదే జరిగిపోతుందనుకోరాదు. ఇందులో కుక్క ఇంద్రియప్రేరణల ఉత్తేజాలూ,

వాటిని గూర్చిన మెదడుయొక్క గ్రాహక చాలకకేంద్రాల చర్య కూడ పాత్ర వహిస్తున్నాయి. కనుక ఇందులో కుక్క ప్రయత్నంకూడా వుంది. పదార్థాల ప్రభావానికి గురికావడమే గాక, ఆ పదార్థాలతో కుక్క సజీవమైన సంబంధాలను నెలకొల్పుకొనడం ద్వారా విభిన్న పదార్థాలయెడ విభిన్న ప్రతిచర్యలను అవలంబిస్తుంది. ఐతే, జంతువు తన పరిసరాలను యేవిధంగా తెలుసుకుంటుంది ?

1. జీవితవ్యవహారంలో ఒక జంతువు పదార్థాలనుగూర్చి తెలుసుకుంటుంది. అలా తెలిసికొని అది ఒక్కొక్క పదార్థంతో ఒక్కొక్క విధంగా వ్యవహరిస్తుంది. తెలిసికొనడమంటే ఒక జంతువు తన గ్రహణేంద్రియాల వినియోగంద్వారా తన పరిసరాలలోని కొన్ని పదార్థాలను గుర్తించి, వాటిపట్ల ప్రతిచర్య నవలంబించడం అన్నమాట, కుక్క తన ఆహారాన్నీ, తన యజమానినీ గుర్తించడం దీనికి ఉదాహరణ.

2. తెలిసికొనడమంటే ఒక జంతువు తన పరిసరాలలోని కొన్ని పదార్థాలను నేరుగా గుర్తించడమేకాక, ఒక వస్తువుకూ మరొక వస్తువుకూ మధ్య సంబంధాన్ని నెలకొల్పుకొనడంద్వారా ఒకదాన్నిబట్టి మరొకదాన్ని శ్లిష్టంగా తెలిసికొనడం కూడ. కుక్క గంటశబ్దానికీ, ఆహారానికీ సంబంధం నెలకొల్పుకున్నందున గంట కొట్టినప్పుడు నోట్లో నీరూరడం దీనికి ఉదాహరణ.

పై ఉదాహరణలనుబట్టి ఒక ఉన్నతజంతువు ప్రత్యక్ష పదార్థాలను నేరుగా గ్రహించటమేగాక, పరోక్షపదార్థాలతో తన ఇంద్రియప్రేరణలను సమన్వయించడంద్వారా శ్లిష్టంగాను తెలుసుకోగలదని తేలుతుంది. ఒక జంతువు అనుభవంద్వారా నేరుగా తెలుసుకొంటుంది కొన్ని ప్రేరణల ద్వారా పరోక్షపదార్థాలను గూర్చికూడ తెలుసుకోగల్గుతుంది. ఉదాహరణకు గంటశబ్దం విని ఆహారం రానున్నదని కుక్క ఆశిస్తుంది.

ఇక్కడ మనకు జ్ఞానంయొక్కస్వగత శీల, వస్తుశీల విభాగపు సమస్య వస్తుంది. కుక్క తన ఆహారాన్ని చూచి నేరుగా గ్రహించటం వస్తుగత జ్ఞానం. కాని గంటశబ్దం విని ఆహారానికది సంకేతమని తెలుసుకొనడం స్వగతశీలజ్ఞానం. జంతుజాలం విభిన్నపదార్థాలనుగూర్చి తెలుసు

కొనడం ప్రారంభించిన దశలోనే జ్ఞానంయొక్క స్వగతశీల, వస్తుశీల విభాగపు సమస్య యేర్పడుతుంది.

ఐతే ఈ సమస్యపై అనేకమంది తాత్వికులు అనేక విచిత్ర వాదనలు లేవదీస్తారు. భావవాదులు స్వగతశీలతయే ప్రమాణమంటారు. భౌతికవాదులు వస్తుశీలతయే ప్రమాణం అంటారు. అజ్ఞేయవాదులు ఏది ప్రమాణమో దురూహ్యమని తప్పుకుంటారు.

కాని పావ్లావ్ పరిశోధనలు జ్ఞానపు వస్తుశీల–స్వగతశీల విభాగాన్ని గూర్చి ప్రస్ఫుటంగా వివరిస్తున్నాయి. తత్వశాస్త్రంలోని పదార్థం, దాన్ని గూర్చిన భావంయొక్క సమస్యకు లేక భౌతిక - మానసిక విభాగాల వైరుధ్యానికి పావ్లావ్ పరిశోధనలు సమాధాన మిస్తున్నాయి. జంతుజాల పరిణామపు ఉన్నత నాడీమండల వ్యవహారంలో ఈ విభాగం రూపొందిందని ఆయన నిరూపించాడు.

వస్తుగతజ్ఞానం వస్తువు గుణధర్మాల గుర్తింపు. కుక్క తన ఆహారాన్ని పోల్చుకొని గుర్తిస్తుంది. కాని బాహ్యపదార్థాలతో జంతుజాలం నెలకొల్పుకున్న సంబంధాల క్లిష్టమైన గుర్తింపు స్వగతజ్ఞానం. కుక్క గంటశబ్దం విని పరోక్షపదార్థమైన ఆహారాన్ని గుర్తించటం దీనికి ఉదాహరణ. స్వగతజ్ఞానం మెదడుయొక్క ఆగంతుక ప్రతిచర్యల నిర్మాణంలో ఉదయిస్తుంది. కనుక జ్ఞానంయొక్క స్వగతశీలత వస్తుశీలత రెండూ వేర్వేరు అంశాలే. ఒకటి ప్రత్యక్షజ్ఞానమైతే మరొకటి పరోక్షజ్ఞానం.

1. స్వగతశీలత : (ఎ) జంతువుకు తన పరిసరాలలోని కొన్ని పదార్థాల, కొన్ని ధర్మాల పరిజ్ఞానమేకాని సమగ్రజ్ఞాన ముండదు. (బి) పదార్థాన్నిగూర్చి దానికి కలిగే అనుభూతి అది ఆ పదార్థానికీ యితర పదార్థాలకూ ఆరోపించుకునే సంబంధంమూలంగా యేర్పడుతుంది. ఆలా ఆరోపించుకొనే సంబంధాలు వాస్తవమైనవి కాకపోవచ్చు (గంటశబ్దం, ఆహారంవలె). ఈ పరిమితులవల్ల స్వగతశీలజ్ఞానం తప్పుచైతన్యంకూడ కావచ్చు.

2. వస్తుశీలత : వస్తుశీలజ్ఞానం ఆలాకాదు. (ఎ) వస్తువు ఉన్నప్పుడే దాన్నిగూర్చిన పరిజ్ఞాన మేర్పడుతుంది; అంతేగాని పరిజ్ఞానాన్నిబట్టి వస్తువు ఉండదు. (బి) పరిజ్ఞానంకంటె ముందే పదార్థం ఉండియుంది. వస్తుపరిజ్ఞానం గల జీవరాసి యేర్పడక పూర్వమునుంచీ సృష్టిలో పదార్థాలుంటున్నాయి. అందువల్ల మౌలికమైనది వస్తుశీలతయే.

జ్ఞానవిభాగం పై విధంగా ఉంటుంది. జంతుజాలం నాడీమండల ప్రక్రియలో, పరిసరపదార్థాలతో శ్లిష్టమూ, పరివర్తనయుతమూ అయిన సంబంధాలను నెలకొల్పుకొనడంలో చైతన్యం రూపొందుతుంది. ఒక జంతువు తాను పొందే ఇంద్రియప్రేరణలను యెప్పుడయితే పదార్థ సంబంధాల సంకేతాలుగా వినియోగపరచుకుంటుందో, అప్పుడే ఆ జంతువు నాడీ ప్రక్రియలో చైతన్యమనే నూతనగుణం రూపొందిందన్న మాట.

మేధో వికాసక్రమంలో చైతన్యం తనంతటతానుగా యేర్పడదు. మేధ యొక్క జీవక్రమపు గుర్తింపు ఉన్నప్పుడే చైతన్యం రూపొందుతుంది. బాహ్యపదార్థాలతోడి శ్లిష్టసంబంధాల అవయవం మేధ. అంగజీవి తన జీవితక్రమానికి అనుగుణ్యంగా యీ అవయాన్ని వినియోగించుకొంటుంది ఈ వినియోగ ఫలితంగా దాని మేధోప్రక్రియ చైతన్యయుత వ్యవహారణ ఔతుంది. ఇలా మేధయొక్క జీవక్రమం ఒకానొక జంతువుకు బాహ్యపదార్థాలతో కల్పించే సంబంధాల నిర్దిష్టగుణమే చైతన్యం, జంతువు తన మెదడుయొక్క విభిన్నకేంద్రాల వాటి సంబంధాల ప్రేరణ ద్వారా తన పరిసరాలను గూర్చి తెలుసుకొంటుంది. అలా తెలుసుకొనే స్థితి చైతన్యం. అలా తెలుసుకొన్నప్పుడే జంతువు తన పరిసర పదార్థాలతో విభిన్నసంబంధాలను కలిగియుంటూ వ్యవహరిస్తుంది. ఒక జంతువు జీవితంలో ఈ సంబంధాల గుర్తింపు ఏ మేరకు వర్తిస్తుందో ఆమేరకు అది చైతన్యయుతవర్తన కలిగియుంటుందన్న మాట.

జంతుజాలానికి ప్రాథమికంగా యేర్పడే చైతన్యరూపం గ్రాహక చైతన్యం. ఒక జంతువు ఆగంతుక ప్రతిచర్యల ద్వారా తన ఇంద్రియానుభూతులను అర్థంచేసికొని వాటిని సంకేతాలరూపంలో అలవరచు

కొంటుంది. అలా అలవరచుకునేదశలో గ్రాహక చైతన్యం లేక ఇంద్రి యానుభూతి యేర్పడుతుంది. పైకిచూస్తే ఇది ఇంద్రియ ప్రేరణలకు అనుగుణ్యమైన వర్తనగా తోస్తుంది. కాని నిజంలో ఒకానొక జంతువు జీవితం అనుభూతిసహితమైన చైతన్యాన్ని అలవరచుకున్న దశలోనే దాని మేధో ప్రక్రియ చైతన్యయుతం అవుతుంది. ఇంద్రియ ప్రేరణలు మేధయొక్క గ్రాహక క్రమంలో చైతన్య సహితమైన అనుభూతులుగా అలవడినప్పుడే ఒకానొక జంతువుయొక్క మేధోప్రక్రియ సచేతన ప్రక్రియ ఔతుంది.

ఇలా యేర్పడుతుంది జంతుజాలపు చైతన్యం. చైతన్యంలో వస్తుగత, స్వగత విభాగం యిలా రూపొందుతుంది. ఒకానొక జంతువు ఇంద్రియానుభూతులు దాని జీవితపు స్వగతశీల స్వభావాన్ని నిర్మిస్తాయి. అంటే దాని చైతన్య స్వభావాన్ని నిర్ధరిస్తాయన్నమాట. దాని అనుభూతు లన్నీ దానికి నిర్దిష్ట పదార్థాలతో, లేక పదార్థాల సంబంధాలతో గల సంకేతాలౌతాయి.

కుక్క తన యజమానినీ, ఆహారాన్నీ, గంటశబ్దాన్నీ గుర్తించి వ్యవహరిస్తుందంటే, దాని విభిన్నానుభూతులు ఒక చైతన్య యుత క్రమంలో నిర్మాణం గాంచటం మూలంగా నే నన్నమాట.

దీన్నే పావ్లావ్ "ఇంద్రియానుభూతులు అంగజీవికి బాహ్య ప్రపంచంతోగల వాస్తవిక సంబంధాల స్వగతశీల సంకేతాల" న్నాడు. జంతువు జీవితక్రమానికి అనుగుణ్యంగా తన ఇంద్రియానుభూతులలో స్వగతశీల సంకేతక్రమాన్ని నిర్మించుకుంటుందని ఆయన వివరించాడు.

ఇలాంటి సంకేతక్రమాన్ని అలవరచుకొనడంతో జంతువు తన అనుభవాన్ని - ఆ అనుభవపు గుణపాఠాన్ని గుర్తించే శక్తిని పొందుతుంది. ఉన్నత జంతుజాలపు జీవిత పరిణామంలో అనుభూతి చైతన్యమనే యీ నూతన విశేషం రూపు దిద్దుకుంటుంది. అంటే సహజప్రవృత్తులు గుర్తింపుతోడి చైతన్యంగా పరిణమిస్తవన్నమాట. గ్రాహక చైతన్యపు పురోవృద్ధిలో ఉన్నత జంతువుల ఇంద్రియాను

భూతులు (Sensations) అనుభూతులు (Perceptions) గా పరిణామం చెంది వికసిస్తాయి.

ఇంద్రియ ప్రేరణలద్వారా ఒక జంతువుకూ విభిన్న పదార్థాలకూ మధ్య యేర్పడే సంబంధాల గుర్తింపే అనుభూతిచైతన్యం. కంటితో వెలుగునూ, ముక్కుతో వాసననూ చూడటం ఇంద్రియానుభూతి. ఇది బాహ్యపదార్థంద్వారా కలిగే అనుభవం. ఆ వెలుగుయొక్క, వాసన యొక్క గుర్తింపే అనుభూతిచైతన్యం.

ఇంద్రియానుభూతిని అనేకమంది తాత్వికులూ, మనస్తత్వవేత్తలూ కేవలం బాహ్యపదార్థపు ఇంద్రియప్రేరణరూపకమైన "ముద్ర" గా పేర్కొన్నారు. వస్తువు మూలంగా ఆ వస్తువుయొక్క గుణధర్మాల అనుభవం ముద్ర వేస్తుందని వారన్నారు. కాని వారు ఇంద్రియప్రేరణలను మేధ తన గ్రాహకక్రమంద్వారా యెలా సంకేతపరచుకొంటుందో గమనించలేదు. వాస్తవంలో ఇంద్రియప్రేరణలద్వారా చేకూరే అనుభవం మేధయొక్క గ్రాహకక్రమంద్వారా యెలా అనుభూతి చైతన్యంగా రూపొందుతుందో అనేకమంది తాత్వికులు పరిగణించలేదు. అనుభూతి చైతన్యం జంతుజాలానికి బాహ్యప్రకృతితో గల సంబంధాల సంకేత క్రమమని మన మిక్కడ ప్రత్యేకంగా గుర్తించాలి.

మెదడు యొక్క గ్రాహక క్రియలో విభిన్న ఇంద్రియ ప్రేరణల ఉత్తేజాలను సమన్వయపరచే క్రమంలో ఇంద్రియానుభూతి అనుభూతిగా వికసిస్తుంది. జ్ఞానేంద్రియాల ద్వారా గ్రహించే సంకేతాలను నిరంతరం గుర్తించి, వాటి ప్రకారం నడచుకొనే వ్యవహారంలో ఒక జంతువు తన విభిన్న ఇంద్రియానుభూతులను సమన్వయించుకోగల్గుతుంది. అలాంటి క్రమంలో అది శ్లిష్టమైన సంబంధాలుగల శ్లిష్టమైన పదార్థాలను శ్లిష్టమైన పద్ధతిలో గుర్తిస్తుంది. అలా గుర్తించే క్రమంలో ఇంద్రియానుభూతి అనుభూతిగా వికసిస్తుంది. అనుభూతి అంటే శ్లిష్టసంబంధాలుగల శ్లిష్టపదార్థాల గ్రాహక చైతన్యం. ఇది అనుభూతి జ్ఞానం ద్వారా ఉన్నతజంతువుల్లో రూపొందుతుంది. ఇంద్రి

యానుభూతికి చెందిన సంకేతక్రమాన్ని వినియోగించుకోడంలో చేకూరే అభివృద్ధియే అనుభూతికి ఆధారం.

ఈవిధంగా, ఉన్నత జంతుజాలం తమ మేధోవికాస పరిణామంలో అనుభూతి చైతన్యాన్ని చేకూర్చుకొని, నిర్దిష్ట జీవిత చైతన్యంతో వ్యవహరిస్తాయని పావ్లావ్ పరిశోధనలు నిరూపించాయి.

*మానవుని మేధోవ్యాపారంలో అభివృద్ధి*

పావ్లావ్ మానవుని ఉన్నత మేధో వ్యాపారాల పరిశోధనకు కూడ పునాదులు వేశాడు. మానసిక వ్యాపారానికి ఆధారమైన భాష, భావం ఎలా వికసిస్తాయో ఆయన నిరూపణచేశాడు.

ఉన్నత జంతువులు బాహ్యపదార్థాలతో తమకుగల సంబంధాలను గూర్చి ఇంద్రియానుభూతికి చెందిన సంకేతక్రమాన్ని కలిగియుంటాయని గమనించాం. ఈ సంకేతక్రమం ద్వారానే అనుభూతి రూపొందుతుంది. ఇదంతా మానవునికి కూడ వర్తిస్తుంది. కాని మానవుడు ఇతర జంతుజాలానికి లేనట్టి మరొక సంకేతక్రమాన్ని కలిగియున్నాడు. అదే అతని వాక్కు, లేక భాష.

జంతుజాల పరిణామక్రమంలో మానవునిదశ రూపొందేసరికల్లా ఉన్నత నాడీప్రక్రియలో ఒక ప్రధానమైన మార్పువచ్చింది. జంతువుల పరిసరాలూ, ఆ పరిసరాలతో అవి నెలకొల్పుకునే సంబంధాలూ జ్ఞానేంద్రియాల ప్రేరణద్వారాను, వాటి పై మెదడుయొక్క గ్రాహక కేంద్రాల అనుచర్య (Response) ద్వారాను సంకేతాలుగా యేర్పడతాయని మనమిదివరకే గమనించాం. జంతుజాలం ఇంద్రియానుభూతుల ద్వారా తమ పరిసరాలనుగూర్చి తెలుసుకొనడమూ, ఈ తెలుసుకొనడం అనుభూతిగా పెంపొందడమూ జరుగుతుంది. ఈ క్రమం మానవునికి కూడ వర్తిస్తుంది. మానవుడుకూడ ఇంద్రియానుభూతుల ద్వారాను, అనుభూతుల ద్వారాను పరిసర ప్రపంచాన్నిగూర్చిన విచక్షణజ్ఞానాన్ని కలిగియున్నాడు. అనుభూతి మూలకమైన ఈ చైతన్యం మానవునికీ జంతుజాలానికీ కూడ వర్తిస్తుంది.

"ఇది ప్రథమ సంకేతక్రమం. కాని మానవుని వాక్కు వాస్తవికత యొక్క రెండవ సంకేతక్రమం; అది ప్రథమ సంకేతక్రమానికి సంకేత క్రమం" అంటూ పావ్లావ్ మానవుని ఉన్నత మనోవ్యాపారానికి గల ఆధారాన్ని చూపాడు.

పావ్లావ్ మానవభాషను రెండవ సంకేతక్రమమన్నాడు. ఇంద్రియానుభూతికి చెందిన మెదడుయొక్క ప్రథమ సంకేతక్రమానికి అది అదనపు సంకేతక్రమమని వివరించాడు. ఈ రెండవ సంకేతక్రమపు అభివృద్ధి మానవుని ఉన్నత మేధోవ్యాపారానికి ఆధారం అని ఆయన నిరూపించాడు.

ఇంద్రియానుభూతికి చెందిన సంకేతాలు వాస్తవికతయొక్క మొదటిసంకేతాలు; "నిర్దిష్ట సంకేతాలు". అవి జంతుజాలానికీ మానవునికీ వర్తిస్తాయి. అవి నిర్దిష్టమూ ప్రత్యేకమూ అయిన పదార్థాలకు చెందుతవి. పదార్థాల తక్షణ సంబంధాలకు అవి సంకేతాలు. అంటే ఇంద్రియానుభూతుల ప్రత్యక్షానుభవంపై అవి ఆధారపడతాయి.

నా చేతిలో కానీ జారి పడిపోయిందనుకొండి. వెంటనే నేను నేల వంక చూస్తాను. పడిపోయినకానీ కనిపించగానే దాన్ని తీసుకొంటాను. ఇక్కడ పడిపోయిన కానీని కనుగొనుటకు "దృష్టిసంకేతం" ఆధారమౌతుంది. ఒక నిర్దిష్ట పదార్థమైన కానీని వెదకుకొనుటకు నాకొక నిర్దిష్టమైన ఇంద్రియానుభూతి (చూపు) సంకేతమౌతూంది.

కాని పదాలు అలా కాదు. అవి మరొకవిధంగా సంకేతాలుగా పనిచేస్తాయి. పావ్లావ్ అన్నట్లు అవి నిర్దిష్టమైన ప్రత్యేక పదార్థాల సంకేతాలు కావు. ప్రాథమికమైన ఇంద్రియానుభూతి సంకేతాలు కావు. ఆ సంకేతాలకు సంకేతాలుగా ఇవి పనిచేస్తాయి.

నేను కానీ పారేసుకున్నప్పుడు నా మిత్రునితో "నా కానీ వెదకి పెట్టండ"ని కోరాననుకొండి. నా మిత్రుడు కానీ పారవేసుకోలేదు. ఐనప్పటికీ "కానీ" అన్న పదం నాకూ నా మిత్రునికికూడ ఒకే ఇంద్రియానుభూతికి సంకేతంగా పనిచేస్తుంది. అందువల్ల ఆ మిత్రుడు కానీని వెదకి కనుగొంటాడు. ఒకవేళ నా పైవాక్యం ప్రాథమిక సంకేతానికి

సంకేతం కానట్లయితే, నా మిత్రుడు ఆ కానీని వెదకికనుగొనియుండేవాడు కాదు. నా మాటలు సంకేత వ్యవహారానికి పనికిరాకపోయేవికూడ. కనుక నా పైమాటలు నిర్దిష్టమైన ఇంద్రియానుభూతికీ, అనుభవానికీ యెంతవరకు సమన్వయించవో అంతవరకు నా మిత్రుడు పోయిన నా కానీని వెదకిపెట్టడం సాధ్యంకాదు. కాని నా మిత్రుడు కానీ వెదకి పెడతాడు. అందువల్ల నా పదాలు ప్రాథమిక సంకేతానికి సంకేతం ఔతాయన్నమాట.

భాష ప్రాథమిక సంకేతాలకు సంకేత మౌతూంది. భాషద్వారా మనం చెప్పేది మన ఉద్దేశాన్నిబట్టి ఉంటుంది. ఇంద్రియాను భూతులనేవి వాటిని కలిగించే బాహ్యపదార్థాలపై, లేక వాటినిగూర్చిన మన అనుభవాలపై (దేహధర్మాలపై) ఆధారపడియుంటాయి. ఎండలో నిల్చుంటే వేడిగా ఉంటుంది. చక్కెర నాలుకకు తగిలితే తీయగా ఉంటుంది. అందుచే ఇంద్రియానుభూతులు పదార్థంయొక్క ప్రత్యక్ష సంబంధానికీ, వర్తమానపరిమితికీ లోబడి యున్నాయి. కాని పదప్రయోగ శక్తి ఈ పరిమితికి అతీతంగా ఉంటుంది. పరోక్షవ్యవహారాని కది అవకాశం కలిగిస్తుంది.

కాబట్టి పావ్లావ్ చెప్పినట్లు శబ్దసంకేతం వాస్తవికతయొక్క గుణీకరణకు మరియు సామాన్యీకరణకు వినియోగపడుతుంది. శబ్దసంకేతం మానవుని ప్రత్యేక ఉన్నత మనోవ్యాపారానికి ఆధారం. శబ్దాలు నిర్దిష్ట (అనుభవ) సంకేతాలు కావు. అవి నిర్దిష్ట (అనుభవ) సంకేతాలకు సంకేతాలు. కనుక అవి తక్షణానుభూతులలో ప్రతిబింబించే నిర్దిష్ట ప్రత్యేక పదార్థాలనుకాక మరొకవిధమైన అనుభూతులను కలిగించే సామాన్య పదార్థాలను వ్యక్తం చేస్తాయి.

రాముడు రొట్టెను తింటున్నాడు. రాముడు నిర్దిష్టమైన ఒక వ్యక్తి. అతడు తినే రొట్టె నిర్దిష్టమైన పదార్థం. తినటం వర్తమాన వ్యవహారం. రొట్టెకూ మానవునికీ గల సంబంధం ఆకలి తీర్చడం. అందువల్ల రొట్టె తినడంవల్ల ఆకలి తీరటమనే అనుభూతి ప్రాథమిక సంకేతం.

కాని రాముడు తన మిత్రునితో "కుక్క విశ్వాసంగల జంతువు" అని చెప్పినాడనుకొండి. అలా చెప్పటంలో రాముని యెదుట నిజమైన కుక్క లేదు. వాస్తవమైన విశ్వాస ప్రదర్శనకూడ లేదు. జంతువు అనేదొక జాతివాచకమేగాని వాస్తవ పదార్థంకాదు. ఐనా జంతుశబ్దానికి నాల్గు కాళ్లుగలది అనీ, ఈ నాల్గుకాళ్లుగల జంతువుల్లో కొన్ని విశ్వాస పాత్రమైన వనీ, కొన్ని ఘాతుకమైన వనీ, అందులో కుక్క అనే జంతువు ఉంటుందనీ, దానికొక యజమాని ఉంటాడనీ, ఆతని ఇష్టానికి అను కూలంగా ఆ కుక్క మెలగుతుందనీ, అలా మెలగటాన్ని విశ్వాసం అంటా రనీ, ఈ విశ్వాసం మెచ్చుకోదగ్గ గుణమనీ - మనం అర్థంతీస్తాం. ఐతే, ఈ అర్థాన్నంతా మనం యెలా గ్రహించ గల్గుతున్నాం? దీనికి సమా ధానం మన మానసిక సంస్కారమే. ఈ మానసిక సంస్కారం మనకు భాషద్వారా, నిర్దిష్టవాస్తవాల గుణీకృత - సాధారణీకృత సంకేతాలను మేధ యొక్క గ్రాహకక్రమంలో పెంపొందింపజేసుకొనుట ద్వారా యేర్పడుతూ ఉంది.

సంభాషణలో మనం పదార్థాల, పదార్థ సంబంధాల సామాన్యతను వ్యక్తంచేస్తాం. పదాలు నిర్దిష్ట పదార్థాలనూ, వాటికి చెందే అనుభూతి సంబంధాలనే కాక సామాన్యీకృత పదార్థాలనూ - పదార్థాల సామాన్యీ కృత సంబంధాలనూ వ్యక్తీకరిస్తాయి. శబ్దసంకేతం యొక్క ఈ గుణీ కరణ, సామాన్యీకరణల ద్వారా మానవుని ప్రత్యేక ఉన్నత మనో వ్యాపారం రూపొందుతుంది. దీనివల్ల ప్రతిపాదనలు, ఆలోచనలు ముందుకు సాగుతవి.

గుణీకరణ, సామాన్యీకరణ అంటే ఏమిటి? "కుక్క" అన్నది ఒక శబ్దం. ఈ శబ్దం ఒకానొక కుక్కకుకాక, ఏ కుక్కకైనాసరే జాతి పరంగా వర్తిస్తుంది. ఇది సామాన్యీకరణ. అలాగే, కుక్క అనగానే మనకు సర్వసామాన్యమైన కుక్కయొక్క గుణధర్మాలు ద్యోతక మవు తాయి. ఆ గుణధర్మాలుకూడా అన్నికుక్కలకూ జాతిపరంగా వర్తిస్తాయి. అది గుణీకరణ అన్నమాట. శబ్దంద్వారా మనం పరోక్ష పదార్థాలను వాటి సామాన్యీకృత గుణీకృతరూపాల్లో అర్థం చేసుకోగలం. ఇలా విభిన్న

పదార్థాలను శబ్దాలద్వారా గ్రహించే క్రమాన్ని మానవ మేధ వివరంగా అలవరచుకొని యుంది. ఈ గ్రాహక క్రమాన్నే మనం జ్ఞానసంస్కారం అంటాం.

ఐతే, ఇంద్రియానుభూతి సంకేతాన్నీ, శబ్దసంకేతాన్నీ దేనికది విడదీసి ఆలోచించటం సరికాదు. ఈ రెండు సంకేతాలూ విడివిడిగా ఉండవు. రెండవ సంకేతక్రమం ఉదయించేదీ, వ్యవహరించేదీ మొదటి సంకేత క్రమపు ఆధారంపైన, దాని పరిణామం నుండియే. కనుక రెండవ సంకేతానికి మొదటి సంకేతంతో అనివార్య సంబంధం ఉంది. మేధో వ్యాపారంలో ఈ రెండు సంకేతాలూ పరస్పరాధారంపై అనుబద్ధచర్యగా (Interaction) పనిచేస్తాయి. కనుక మానవుని ఆలోచన ఇంద్రియాను భూతితో సంబంధంలేకుండా కొనసాగుతుందని అనుకోరాదు. లేక మానవుని ఆలోచనావ్యాపారం అతని భౌతికజీవితపు నిర్దిష్ట స్థితిగతులతో సంబంధంలేకుండా జరుగుతుందని భ్రమపడరాదు.

ఇంద్రియానుభూతి లేకుండా సంభాషణగానీ, ఆలోచనగానీ జరగటం సాధ్యంకాదు. మనం మాట్లాడుతున్నప్పుడు, ఆలోచిస్తున్నప్పుడు మన నాడీమండలం అందుకుచెందిన ఇంద్రియానుభూతులకు గురి యౌతూనే వుంటుంది. అందువల్లనే అనుభూతిమూలకమైన మొదటి సంకేతానికి భాషామూలకమైన రెండవ సంకేతం సంకేతమౌతూంది. కనుక రెండవ సంకేతక్రమం ప్రాథమిక సంకేతక్రమానికి సమన్వయ శీలమే. అంతేకాదు. మొదటి సంకేతక్రమపు అభివృద్ధి రెండవ సంకేత క్రమ వికసనపై ఆధారపడుతుందికూడ. పదార్థాలనుగూర్చిన మానవ అనుభూతి ఆ పదార్థాలను గూర్చిన భావాలపైకూడ ఆధారపడి పరివర్తన చెందుతుంది. ఉదాహరణకు స్కూలుపిల్లలలో వస్తుపరిజ్ఞానం కలిగించ డానికి మనం ఆ యా పదార్థాల పేర్లను ఉపయోగిస్తాం.

మొదటి సంకేతక్రమంతో రెండవ సంకేతక్రమానికి గల సంబం ధాన్నీ, రెండవ సంకేతక్రమపు గుణీకరణ. సామాన్యీకరణల నిర్మా ణాన్నీ గ్రహించుటకు మనం ఆగంతుక ప్రతిచర్యను మరొకమారు గమనించాలి. ఒక జంతువు ఇంద్రియానుభూతులద్వారా పదార్థాలతో

శ్లిష్టమైన అగంతుక సంబంధాలను నెలకొల్పుకొంటుంది. ఆ ప్రక్రియ లోనే అది విభిన్నపదార్థాల గుణసామ్యాలను గుర్తించి వ్యవహరించ గల్గుతుంది. అంటే అది నిర్దిష్టపదార్థంయొక్క సామాన్యతను గ్రహించ గలుగుతుం దన్నమాట. ఉదాహరణకు ఒక కుక్క విభిన్న పదార్థా లకు విభిన్న వాసనలను ఆపాదిస్తుంది. దీనివల్ల విభిన్నసమయాల్లో కుక్క ఒకే వాసనను గుర్తించగలుగుతున్నదని తేలుతుంది. అంటే ప్రత్యేక గుణంలో అది సామాన్యతను గ్రహిస్తుందన్నమాట. ఒక దీపస్తంభపు వాసన మరొక దీపస్తంభపువాసన రెండు వాసనలు, కాని ఈ రెండువాసనలనూ కుక్క దీపస్తంభపు అదే వాసనగా గుర్తించ గలదు. అంటే దాని ముక్కు ఆ రెండు వాసనలయొక్క పోలికనూ గ్రహించగలుగుతుందన్నమాట. రెండు దీపస్తంభాలవద్ద వాసన చూడ డంతో కలిగిన రెండు ఇంద్రియానుభూతుల సామ్యమూ, మరోకుక్క ప్రతి దీపస్తంభాన్నీ వాసన చూచిందనటానికి సంకేతం. ప్రతి కుక్కా ప్రతి దీపస్తంభపు వాసనను చూడటం ద్వారా సర్వసామాన్యమైన కుక్క సర్వసామాన్యమైన దీపస్తంభపు వాసనను గుర్తించగలదన్న మాట.

మానవుడు శబ్దాలను రెండవ సంకేతంగా వినియోగిస్తున్నప్పుడు వాడే పదజాలం విభిన్నానుభూతుల సామ్యాన్ని యేరుటకూ, గుణీకరించి సామాన్యీకరించుటకూ ఉపయుక్తమౌతుంది. అన్నిశబ్దాలూ ప్రత్యేకత నుండి సామాన్యతను గుణీకరిస్తాయి. జంతువు అనుభూతిద్వారా ప్రత్యే కతలో సామాన్యతను గుర్తిస్తుంది. మానవుడు జంతువువలె ప్రత్యేకతలో సామాన్యతను అనుభూతిద్వారా గుర్తించటం మాత్రమే చేయడు. అతడు నూతనంగా శబ్దాన్ని కనుగొనడంద్వారా ప్రత్యేకతలో సామాన్యాన్ని గుణీకరిస్తాడు.

కాని ఈ గుణీకరణకుముందు ఇంద్రియానుభూతికిచెందిన సంకేతం ద్వారా ప్రత్యేకతలో సామాన్యాన్ని గుర్తించగల్గాలి. ఇదిలేకుండా పదాల ద్వారా ప్రత్యేకతనుండి సామాన్యతను గుణీకరించడం సాధ్యంకాదు.

కుక్క దీపస్తంభపు వాసన చూస్తుంది. ఇంద్రియానుభూతిసామ్యం ద్వారా అది దీపస్తంభపు సామాన్యతను గుర్తిస్తుంది. కాని మానవుడు

అలా కాదు. దీప స్తంభాన్ని చూచి అతడు దీపస్తంభమన్న పదాన్ని సృష్టి స్తాడు. ఈ శబ్దం సర్వసామాన్యమైన దీపస్తంభపు గుణధర్మాలను వ్యక్తం చేస్తుంది. అంటే అది రోడ్డుప్రక్కగల ఇనుపస్తంభమనీ, దానికొక దీప ముంటుందనీ, అది రాత్రిపూట వెలుగుతూ బాటసార్లకు దారి కనబడేటట్లు చేస్తుందనీ 'దీపస్తంభ' శబ్దంద్వారా అతడు అర్థం చేసుకుంటాడు. ఇలా గుణీకృత, సామాన్యీకృత రూపాల్లో అనేక పదార్థాలను గూర్చిన, పదార్థాల శ్లిష్ట సంబంధాలను గూర్చిన మానసిక అనుభూతి మనలో ఏర్పడుతుంది. వాస్తవమైన దీపస్తంభం మన ఎదుట లేకుండానే దీప స్తంభ శబ్దంద్వారా మనం సామాన్యీకృత, గుణీకృత రూపంలో 'మాన సిక దీపస్తంభపు' అనుభూతిని కలిగియుంటాం. మెదడు యొక్క గ్రహణ సంస్కారరూపంలో పరోక్షపదార్థాల చైతన్యం మన మనస్సులో "శబ్దశక్తి" ద్వారా ఇమిడియుంటుంది. పదార్థాలు వాస్తవంగా మన ఎదుట లేనప్పటికీ వాటి సామాన్య గుణరూపాల మానసిక ప్రతిబింబాలు మన మేధలో ఇమిడియుంటాయి. ఇలా వాస్తవ పదార్థాలకూ, వాటి గుణ ధర్మాలకూ చెందే మానసిక ప్రతిబింబాల నిర్మాణం మెదడు యొక్క ఆగంతుక ప్రతిచర్యను తెలియజేసే సంకేతం. ఈ సంకేత వ్యవహారమే శబ్దంద్వారా గుణీకరణ, సామాన్యీకరణగా వికసించిందని మనమిక్కడ గమనించాలి.

ప్రాథమికమైన ఇంద్రియానుభూతి సంకేతం నుండి మానవు నిలో రెండవదగు శబ్దసంకేతం సాంఘికంగా నిర్ధారితమౌతుంది. మాన వులు తమ పరిసరాలతో సంబంధాలను నిర్మించుకొనటంలో కేవలం జంతువులవలె వ్యవహరించరు. సమాజగతుడైన మానవుడు విశిష్టమైన నూతన మార్గాన్ననుసరిస్తాడు. అందువల్ల మానవ వర్తనలో గుణాత్మక మైన మార్పు కల్గుతుంది. మెదడులో నూత్న వ్యవహారం ఉదయిస్తుంది. తమ చేతులను ఉత్పత్తి సాధనాల నిర్మాణానికి వినియోగించుకొనడంలో మానవులు సమాజాన్ని నిర్మిస్తారు. తద్వారా తమ జీవితవిధానాన్ని జంతు దశనుండి మానవ ప్రత్యేకమైన క్రొత్తదశకు మార్చివేస్తారు. ఈక్రమంలో అంటే సంఘ జీవన పురోగమనంలో ఆ సంఘ జీవితావసరాల సాధనకై

చేసే కృషిలో భాష రూపొందింది. కనుక భాష అనే రెండవ సంకేత క్రమం ఉత్పత్తి వ్యవహార ఫలితంగాను, మానవుల పరస్పర వ్యవహార సాధనంగాను రూపొంది అభివృద్ధిగాంచింది.

## రెండవ అధ్యాయం

# మనస్సు: పదార్థం

**మానసికధర్మాల ప్రధాన లక్షణం, వాటిద్వారా అంగజీవి తన పరిసరాలతో నిరంతరం క్లిష్టమైన మార్పుచెందే సంబంధాలను నెలకొల్పుకోవటం. కనుక చైతన్యధర్మాలు బాహ్యమైన భౌతిక వాస్తవాన్ని ప్రతిబింబించే క్రమాలు. మెదడుయొక్క జీవక్రమంలోని బాహ్యప్రపంచపు ప్రతిబింబక్రియలే చైతన్యం.**

*మానసికవ్యాపారాలకు మూలం మెదడు*

దేహమూ - మనస్సు, లేక పదార్థమూ - భావం ఈ రెండూ దేనికదేగా ఉండవని మనం గమనించాం. అవి పరస్పరాధారం కల్గియుంటాయి. దేహమూ - మనస్సుల సంబంధాన్నిగూర్చి మార్క్సు, ఎంగెల్సు, లెనిన్‌లు చేసిన వివరణలను పావ్లావ్ శాస్త్రపరిశోధనలు బలపరుస్తున్నాయి. పావ్లావ్ సిద్ధాంతం మార్క్సిస్టు మూలసూత్రాల విపులీకరణకు తోడ్పడుతూంది. ఆ వివరాలను సంగ్రహంగా సమీక్షిస్తూ భావవాదానికీ మార్క్సిజానికీ గల భేదాలను గమనిద్దాం.

1. భావవాదం మనస్సూ - దేహం వేర్వేరని నమ్ముతుంది. పదార్థమై, పదార్థ ధర్మాలతో కూడుకొనియున్న దేహానికి మనస్సూ దాని ఆలోచనావ్యాపారమూ సమన్వయం కాజాలవని భావవాదులు అంటారు. మనస్సు

పదార్థంకాదనీ, పదార్థ ధర్మాలకది అతీతమైనదనీ వారు వాదిస్తారు. కనుక మానసికవ్యాపారం దేహానికీ, భౌతిక పరిసరాలకూ అతీతమైన దని భావవాదం చెప్తుంది.

మార్క్సిజం అలా నమ్మదు. మనోవ్యాపారం మెదడుయొక్క వ్యవహారం. మెదడు మహోన్నతాభివృద్ధిగాంచిన పదార్థం. పదార్థ విశేషమైన శరీర యంత్రాంగపు అవయవమే మెదడు లేక మేధ. కనుక మానసిక ధర్మాలు ఒక దైహికావయవమైన మెదడుకు వర్తించే వని అంటాం.

మెదడు తన గ్రాహకక్రమంద్వారా పరిసరపదార్థాలతో ఎలా శ్లిష్టమూ, పరివర్తనయుతమూ అయిన సంబంధాలను నెలకొల్పుకుంటుందో గత అధ్యాయంలో చూచాం. ఈ సంబంధాలద్వారా జంతుజాలం పదార్థాలను గూర్చిన అనుభూతిని చేకూర్చుకుంటాయి. అను[illegible]ంటే మేధ యొక్క గ్రాహకక్రమంద్వారా బాహ్య పదార్థాలతో యేర్పడే సంబంధపు గుర్తింపు. దీని పరిణామంలో మానవమేధ వికసితమౌతుంది. భాష అను సంకేతాన్ని వినియోగించడంద్వారా మానవుడు ఆలోచించ ప్రారంభిస్తాడు. ఆలోచన అంటే మేధయొక్క విచక్షణాక్రమం ద్వారా బాహ్య పదార్థాల సంబంధాలను సమన్వయించడం.

మానసిక వ్యాపారం దేహానికీ పదార్థానికీ అతీతమని భావవాదం నమ్ముతుంది. అందువల్ల భావవాదులు మానసికతత్వాన్ని వివరించుటకు స్వీయ పరిశీలనా పద్ధతిని అనుసరిస్తారు. ఈ స్వీయపరిశీలనా పద్ధతి "చైతన్యం చైతన్యం వరకే'' నన్న రీతిలో కొనసాగుతుంది. అంటే మానసిక వ్యాపారాన్ని ఇటు శారీరక ధర్మంతోను, అటు బాహ్య ప్రపంచంతోను సంబంధం లేకుండా విడదీస్తుంది. అంటే మనస్తత్వం మనస్తత్వం వరకే నన్న ధోరణిలో భావాలను పరిశీలిస్తుందన్న మాట. ఇది ఆలోచనలను లేక మనోవ్యాపారాన్ని జీవితాన్నుండి విడ దీసే ధోరణి.

ఈ స్వీయ పరిశీలనా పద్ధతిని ఈనాడుకూడ అనేకమంది మన స్తత్వవేత్తలూ, తాత్వికులూ అనుసరిస్తున్నారు. ఈ పద్ధతిలో ప్రధాన

సూత్రం "ఎవరి మానసిక చైత్యాన్ని వారే స్వయంపరిశీలన ద్వారా గుర్తించా" లని. వేదాంతం ఎవరి మోక్షాన్ని వారే సాధించుకోవాలంటుంది. అది వ్యక్తిని సమాజంనుండీ, దానితోగల సంబంధంనుండీ విడదీస్తుంది. ఐతే, అలా చెప్పటంమాత్రం తేలికే. ఆచరణలో ఈపద్ధతి అడుగడుగునా చిక్కులకు లోనౌతుంది.

మనకు కోపంలేదని భావిస్తూ, కోపంలేదని చెప్తున్నపుడుకూడ మన ముఖకవళికలు, లక్షణాలనుబట్టి యెదుటివాడు మనం కోపంగా ఉన్నామని గ్రహించవచ్చు. కనుక యెవరికివారే తమ మనస్తత్వాన్ని గ్రహించుకొనటం సాధ్యం కాదు; అందువల్ల ఆచరణలో ఈ 'యెవరికి వారే' తత్వం నిల్వదు. అందుకని స్వీయపరిశీలనా పద్ధతి ''బాగా ఆరితేరిన గురువుల సహాయంతోగాని మానసిక వ్యవహారాన్ని స్వయంగా పరిశీలించడం సాధ్యం కా''దంటుంది అందుకని ముముక్షువు జ్ఞానియైన గురువును ఆశ్రయిస్తేకాని మోక్షం దొరకదంటుంది.

స్వీయపరిశీలనలో బాగా ఆరితేరినవారు ఫ్రాయిడ్‌గారి సైకో అనాలిసిస్ (Psycho analysis) లో కనపడతారు. సైకో అనాలిసిస్ మానసికవ్యాధుల నివారణకు స్వీయపరిశీలనా సూత్రాన్ని అనుసరిస్తుంది. రోగియొక్క మానసికవ్యాధిని కుదుర్చుటకు ఒక నిపుణుడైన సైకో అనలిస్టు ఉంటాడు. రోగి సహకారంతో, అతనిపైన తన నైపుణ్యాపు ప్రభావంవేస్తూ ఈఅనలిస్టు పరిశోధనసాగిస్తాడు. రోగిని అతని యధేచ్ఛా భావాలను (Musings) గూర్చి కలలనుగూర్చి ఊహాపోహల వైచిత్ర్యాలనుగూర్చి సెక్సు అలవాట్లను గూర్చి అవకతవకలనుగూర్చి అనేక ప్రశ్నలు వేస్తాడు. అతి నిపుణంగా, రోగికి తెలియకుండా అతని మనస్తత్వాన్ని వెలికి లాగుతాడు. రోగి మనస్తత్వ రహస్యాలను చాకచక్యంతో భేదిస్తాడు. ఇందుకు చైతన్యం, అచైతన్యం, అహం, ఇద్, సూపర్, ఇగో మున్నగు మనస్తత్వ యంత్రాంగాలనూ, వాటి పాత్రలనూ వివరించే బోలెడంత గ్రంథం ఉంది. మొత్తానికి పారమార్థికజ్ఞానాన్ని ఉపదేశించే గురువులాగా సైకో అనలిస్టు రోగి అంతరచైతన్యంలో గల లోపాలను కనిపెట్టి అతనికి వివరిస్తాడు. అంతటితో చికిత్స పూర్తవు

తుంది. ఐతే, ఈ సైకో అనాలిసిస్ బాహ్య ప్రపంచంతో విడివడ్డ భావాలకుచెందిన మనస్తత్వాన్ని మాత్రమే ప్రత్యేకిస్తుంది. కనుక ఈ శాస్త్రం వ్యక్తికోసం మరియు వ్యక్తివరకే అమలౌతుందన్నమాట.

భావవాదులు పదార్థ చైతన్యాన్ని పదార్థం నుండి విడదీస్తారు. దేహమూ - మనస్సులలో చైతన్యం ఒక్క మనస్సుకు మాత్రమే చెందే దంటారు. అంటే పదార్థాలను గూర్చిన మన అవగాహనలూ, ఆలోచనలూ ఆ పదార్థాలకు చెందేవిగాక మనస్సుకు మాత్రమే వర్తించేవని అంటారు. బాహ్య పదార్థాలతో మన భావాలకుగల సంబంధమూ, సమన్వయమూ, సామ్యమూ కేవలం మన మనస్సుమూలంగా యేర్పడుతుందని వారు వాదిస్తారు. ఉదాహరణకు ప్రఖ్యాత తత్వవేత్త బెర్ట్రాండ్ రసెల్ "మనం బాహ్య ప్రపంచంలో చూస్తున్న విషయాలన్నీ నిజంలో మన మానసిక ప్రపంచంలోనివే" అన్నాడు.

అలాగే లాక్, హ్యూం మున్నగు తాత్వికులు "మనకు తెలిసేదల్లా పదార్థాలకు చెందిన మనోప్రతిబింబాలే కాని అసలు పదార్థాలుకావ" న్నారు. ఒక చెట్టును మనం దూరంనుండిచూస్తే చిన్నదిగా కన్పిస్తుంది. దగ్గరనుండిచూస్తే పెద్దదిగా కన్పిస్తుంది. కనుక అసలు చెట్టు చిన్నదిగా ఉన్నట్లా లేక పెద్దదిగానా ? అని వీరొక ప్రశ్న వేస్తారు. ఈ ప్రశ్నద్వారా అసలు చెట్టు ఎలాఉందో చెప్పటం అసాధ్యమంటారు. కాగా, మనకు తెలిసేదల్లా మన మనసులో ప్రతిబింబించే "మానసిక వృక్షం" మాత్రమేనని నిర్ధారణ చేస్తారు. ఈ ఉదాహరణలో అసలు చెట్టనేది ఉందికాని, దాని గుణాలను మనం తెలుసుకోలేమని తేలుతూంది. ఇది అజ్ఞేయవాదం. కాని శంకరాచార్యుడు, బర్క్లీ మున్నగు తాత్వికులు మరొక అడుగు వెనుకకు పోయారు. వారు మన మనస్సులోని చెట్టేకాని అంతకుమించిన అసలు చెట్టు ఉండనేఉండదని 'పదార్థానికి' మొదటికే మోసం తెచ్చారు.

పదార్థానికి ఆధారం మనస్సనీ, అలాగే ప్రపంచానికి ఆధారం దేవుడనీ నిరూపించటానికి మాత్రమే పై వాదనలన్నీ కొనసాగుతవి. మనస్సు ఆధిక్యతనూ, దేవుని ఆధిక్యతనూ సిద్ధాంతీకరించడమే యీవాదన

లన్నిటి ఉద్దేశం. కాని జీవిత వ్యవహారంలో మనం పదార్థాన్నీ ప్రపంచాన్నీ కేవలం మనోజనితమైనవని భావించటం సాధ్యంకాదు. పదార్థాలూ, వాటి గుణధర్మాలూ వాస్తవంగానే ఉన్నాయి. ఆ ఉన్నవాటినే మనం గ్రహిస్తాం. ఉదాహరణకు రొట్టె; రొట్టె రొట్టెయే. అందువల్లనే మనం రొట్టెను తిని ఆకలి తీర్చుకోగలుగుతున్నాం. మనం తినే రొట్టె మన ఆకలినితీర్చే రొట్టెఅనీ, మానసికరొట్టెకాక నిజమైన రొట్టెయేననీ మనం ఆచరణద్వారా తెలుసుకొని వ్యవహరిస్తాం.

ప్రపంచమూ పదార్థం మానసిక ప్రతిబింబమే కనుక దానికి ఆధారమైన మనస్సును స్వీయపరిశీలన చేసేపద్ధతిని భావవాదులు అనుసరిస్తారు. మార్క్సిజం ఈ ధోరణిని పూర్తిగా వ్యతిరేకిస్తుంది. పదార్థాల వాస్తవిక ధర్మాలను భౌతికవాదం వాస్తవాలుగా గుర్తిస్తుంది. సజీవ - చైతన్యయుత అంగజీవులను విజ్ఞానశాస్త్రం వాటి పరిసరాలతోటి సజీవ (active) సంబంధంతో పరిశీలిస్తుంది. శాస్త్రీయమైన ఈ పద్ధతి 'చైతన్యం చైతన్యంవరకే' నన్నరీతిలో ఉండదు; చైతన్యాన్ని స్వీయపరిశీలనకు గురిచేయదు. పైగా "చైతన్యం ఎల్లప్పుడూ చైతన్య జీవనం" అని నిరూపిస్తుంది. మార్క్స్, ఎంగెల్స్‌లు ఈదృక్పథాన్నే పాటించారు. శాస్త్రజ్ఞుడు పావ్లావ్ కూడ ఆవిధంగానే తన పరిశోధనలను సాగించాడు. మార్క్సిజం చైతన్యాన్ని అంగజీవుల సజీవ, చైతన్యయుత జీవితక్రమం నుండి విడదీయకుండా వాటి చైతన్యయుత వ్యవహారంలో పరిశీలిస్తుంది.

"అంగజీవుల చైతన్యయుత వ్యవహారం" అంటే అవి "తమపరిసరాలతో నెలకొల్పుకొనే సజీవమైన (active), శ్లిష్టమైన (Complex) పరివర్తనశీలమైన సంబంధాల క్రమం" అని మన మిదివరకే గమనించాం. కనుక చైతన్య లక్షణం అంగజీవి పరిసరాలతో నెలకొల్పుకునే సంబంధాల క్రమమే. అందువల్ల మనోవ్యాపారం బాహ్య పదార్థాల పరిజ్ఞానానికి అతీతంకాదు. మానసికమైన అనుభూతులూ, భావాలూ బాహ్య పదార్థాల పరిజ్ఞానాన్ని ఆటంకపరచే బదులు ఆ పరిజ్ఞానానికి సాధనలుగా వ్యవహరిస్తాయి.

"చైతన్యానికీ, బాహ్య ప్రపంచానికీమధ్య సూటియైన లంకె ఇంద్రియానుభూతి" అని లెనిన్ వ్రాశాడు. "భావవాద తత్వశాస్త్రపు మానస ధోరణి (sophism) ఇంద్రియానుభూతిని చైతన్యానికీ, బాహ్య పదార్థానికీ మధ్యగల సమన్వయంగా కాక బాహ్య ప్రపంచానికీ చైతన్యానికీ మధ్య ఒక అడ్డుగోడగా భావిస్తుంది" అని ఆయన అన్నాడు. అందువల్లనే భావవాదం భౌతిక జీవితంనుండి విడివడే నివృత్తిశీలతకు లోనౌతుంది. భారతీయ తత్వశాస్త్రపు విభిన్న ధోరణులు వైరాగ్య, సన్యాస, నిర్వాణధోరణుల నెలా ప్రతిపాదించాయో మనం చూచాం.

భావవాదులు "రెండుప్రక్రియల"వాదం కొనసాగిస్తారు. ప్రాపంచిక దృష్టియనీ, పారమార్థిక దృష్టియనీ రెండు ప్రక్రియలను జోడిస్తారు. అంటే మనం ఆలోచిస్తున్నప్పుడూ, అనుభూతి పొందుతున్నప్పుడూ ఒక వంక మేధయొక్క భౌతికప్రక్రియా మరోవంక మనస్సుయొక్క ఆధ్యాత్మిక ప్రక్రియా రెండూ కొనసాగుతా యంటూ వారు రాజీ వాదం సాగిస్తారు. అంటే మళ్ళీ యిది మనస్సు వేరూ, దేహం వేరన్న ధోరణియే. మార్క్సిజం ఈ రెండు ప్రక్రియలవాదాన్ని ఖండిస్తుంది. వాస్తవంలో కొనసాగేది రెండు ప్రక్రియలు కాక ఒకే ప్రక్రియ. ఆ ఒక్క ప్రక్రియ కూడ మెదడుయొక్క భౌతిక ప్రక్రియయే. అంతకు మించి వేరే మానసిక ప్రక్రియ ఉండదు. కనుక మానవుని మానసిక వ్యాపారమంతా బాహ్య ప్రపంచంతోడి క్లిష్ట సంబంధాల అవయవమైన మెదడుయొక్క వ్యవహారంలో అంతర్భాగమే నన్నమాట. దీన్నే మార్క్స "ఆలోచన మానవ మేధయొక్క జీవితక్రమం" అన్నాడు.

*చైతన్యం పదార్థాభివృద్ధి ఫలితం*

2. భావవాదానికీ భౌతికవాదానికీగల రెండవభేదం: భావవాదరీత్యా అనుభూతులకు, ఆలోచనలకు, భావోత్తేజనలకు ఎలాంటి భౌతికపునాదీ ఉండదు. జీవక్రమ వికాసంలో జ్ఞానం ఎలా ఉదయిస్తుందో, ఎలా వికసిస్తుందో భావవాదం పరిగణించదు. జీవిత - చైతన్య పరిణామంపట్ల అది కండ్లు మూసుకుంటుంది. భావవాదులు మానసిక వ్యాపారానికిచెందే తమ

చైతన్యపు ప్రత్యేకవిశేషతను భౌతికస్థితిగతుల సంభవ సమన్వయంద్వారా కూడ వివరించడానికి వీలులేదని భావిస్తారు. చైతన్యపు ప్రత్యేక విశేషత భౌతికేతరమైన మనస్సుకులేక ఆత్మకు మాత్రమే చెందుతుందని భావవాదం విశ్వసిస్తుంది. అంటే యేమిటి? మానసిక వ్యాపారం భౌతికంగా అనిర్వచనీయమైన దన్నమాట. అంటే మనోధర్మాలు అవాఙ్మానస గోచరమైన పరమాత్మకు లేక ఆధ్యాత్మ విశేషతకు చెందుతాయన్నమాట.

కాని మార్క్సిజం చైతన్యాన్ని అనిర్వచనీయం అనదు. అది చైతన్యాన్ని వివరిస్తుంది. చైతన్యం పదార్థాభివృద్ధి ఫలితమనీ, కేంద్ర నాడీమండలం గల జీవజాల పరిణామ ఫలితమనీ నిరూపిస్తుంది. కనుక ఇంద్రియానుభూతులు, అవగాహనలు, ఆలోచనలు మెదడుయొక్క మహోన్నత వికాసక్రమ ఫలితాలని నిర్వచిస్తుంది.

"ఆలోచన, చైతన్యం యేమిటనీ, అవి ఎలా వచ్చాయనీ ప్రశ్నిస్తే అవి మానవ మేధస్సులోనే పుట్టాయనీ, మానవుడే తన పరిసరాలతోసహా మహోన్నతాభివృద్ధి గాంచిన ప్రకృతియొక్క ఫలితమనీ" ఏంగెల్స్ వ్రాశాడు. ఆయన "భౌతికమైన, ఇంద్రియాలచే తెలిసికోగల యే ప్రపంచానికి మనం చెందియున్నామో అదే ఏకైకవాస్తవం. మన చైతన్యమూ, ఆలోచనలూ యెంత అమేయజ్ఞానానికి చెందినవిగా కన్పించినప్పటికీ వాస్తవంలో అవి పదార్థంయొక్క అంటే దేహావయవమైన మేధయొక్క ఫలితాలే" అని కూడ వ్రాశాడు.

పావ్లావ్ "జంతుజాలం నాడీమండలాన్ని అభివృద్ధి చేసుకోవడంలోను, తమ పరిసరాలతో ఆగంతుక సంబంధాలద్వారా సజీవ ప్రతిచర్యను నెలకొల్పుకొనడంలోను వాటి నాడీ ప్రక్రియ యెలా అనుభూతి క్రమంగా పరిణమిస్తుందో, ఆ పరిణాభివృద్ధిలోనే మానవుని ఆలోచన లేక మనోవ్యాపారం యెలా రూపుదీర్చుకుంటుందో" వివరించాడు. కనుక మానసిక వ్యాపారానికి చెందే ఇంద్రియానుభూతులూ, ఆలోచనలూ మేధయొక్క నాడీమండల ప్రక్రియకు చెందిన ప్రత్యేక ఫలితాలన్నమాట.

దీన్నే లెనిన్ యిలా వివరించాడు : "ఇంద్రియానుభూతి పరిణామ శీలమైన పదార్థపు గుణాలలో ఒకటి. పదార్థం మన గ్రహణేంద్రియాలపై వేసే ప్రభావమే ఇంద్రియానుభూతి. ఈ అనుభూతి ఒక ప్రత్యేకరూపంలో వ్యవస్థీకృతమైన మెదడు - నాడులు - కనుగ్రుడ్డు మున్నగు శరీర యంత్రాంగంపై ఆధారపడుతుంది. కనుక ఇంద్రియానుభూతి, చైతన్యం, ఆలోచనప్రత్యేకపద్ధతిలో వ్యవస్థీకరింపబడిన పదార్థంయొక్క మహోన్నత ఫలితమే."

*భౌతిక ప్రపంచపు ప్రతిబింబమే చైతన్యం*

3. మూడవభేదం : మనస్సు దేహానికి అతీతమని భావవాదం భావిస్తుంది. అనుభూతులూ, ఆలోచనలూ భౌతిక క్రమానికి సమన్వయం కావంటుంది. అంటే మానవుని భావాలు, ఆలోచనలు మానసిక వ్యాపారానికి చెందినవనీ - అంటే బాహ్యప్రపంచ సంబంధానికి అతీతమై యున్న - మానవచైతన్యానికి అంతర్గతమై యుంటాయనీ చెబుతుందన్న మాట.

మార్క్సిజం అనుభూతులూ, ఆలోచనలు భౌతికపదార్థపు ప్రతిబింబాలనిచెబుతుంది, పదార్థపు వాస్తవికతను మనస్సులో ప్రతిబింబించే ప్రక్రియయే చైతన్యక్రమం అన్నమాట. మనం చెట్టునుచూస్తాం. లేక చెట్టు అన్న పదాన్ని వింటాం. అప్పుడు మన మనస్సులో చెట్టు ప్రతిబింబిస్తుంది. అలాకాక, మరోవిధమైన మానసికచైతన్యం ఉండదు. బాహ్యపదార్థపు ప్రతిబింబం కాని దేదీ చైతన్యంలో రూపొందజాలదు. ఇంతకుమించి మరోవిధమైన చైతన్యంగాని, ఆ చైతన్యంలో రూపొందే మరో విశేషం గాని వుండటం అసాధ్యమైన విషయం.

దీన్నే మార్క్స్ "మనస్సుచే ప్రతిబింబింపబడి, భావస్వరూపాలుగా అనువదింపబడ్డ భౌతికప్రపంచమే భావప్రపంచం" అని వివరించాడు. మానవుని ఆలోచనాక్రమం, లేకసాధారణజ్ఞానం ఒకానొక భౌతికక్రమమైన మేధో వ్యవహారంద్వారా పరిణతిచెందే బాహ్యప్రపంచపు విభిన్నభాగాల, గుణాల ప్రతిబింబమని ఆయన అన్నాడు. ప్రపంచాన్ని గురించిన

మన జ్ఞానంలో భౌతిక ప్రపంచపు అనేక భాగాలూ, అంశాలూ చైతన్య ప్రతిబింబాలుగా, అనుభూతులుగా, ఆలోచనలుగా అనువదింపబడి యుంటాయి. మెదడుయొక్క జీవితవ్యవహారంలో అవి తదనుగుణ్య మైన రూపాల్లో పునరావిష్కార మౌతాయి.

ఉదాహరణకు రంగులు. ప్రకాశాన్ని ఆకర్షించి ప్రతిబింబించే విభిన్నపదార్థాల ధర్మాలు మన మెదడుయొక్క గ్రాహకక్రమంలో విభిన్న వర్ణాల అనుభూతి ప్రతిబింబాలుగా పునరావృత్తి యౌతాయి. ఈ ప్రతి బింబాల మూలంగా మనం విభిన్నపదార్థాల రంగులను గుర్తిస్తాం. అలాగే పదార్థాల గుణసామ్యాలు, వాటి సంబంధాలు మెదడుయొక్క గ్రాహకక్రమంలో భాగాలుగా పునరావృత్తి యౌతాయి. అందువల్ల మనం ఒక్కొక్క పదార్థంయొక్క ఒక్కొక్క రంగును ఆయా రంగు లుగా వ్యవహరిస్తాం. ఉదాహరణకు ఆకులు ఆకుపచ్చగా ఉంటాయి. ఈ ఆకుపచ్చరంగును మనం గుర్తిస్తాం. ఆ రంగునే కలిగియున్న పసరికపాము కూడ ఆకుపచ్చగానే ఉన్నదని గ్రహిస్తాము.

కనుక భౌతిక వాస్తవపు ప్రతిబింబమే చైతన్యం అన్నమాట. ఐతే ప్రతిబింబం అంటే ఏమిటి? ఈ ప్రతిబింబాన్ని మనం నాల్గు విధా లుగా వివరించవచ్చు.

### *1. భౌతికవాస్తవికత ప్రాథమికం : మానసిక ప్రతిబింబం దానికి అనుగుణ్యం*

ప్రతిబింబ నిర్మాణంలో రెండు విభిన్న వ్యవహారా లుంటాయి. ఆ రెండు వ్యవహారాలమధ్య సమన్వయం ఉంటుంది. ఒక వ్యవహారపు లక్షణాలు అందుకు సంబంధించిన రెండవ వ్యవహారంలో పునరావృత్తి అవుతాయి. ఇందులో మొదటి వ్యవహారం ప్రాథమికం. ప్రతిబింబమైన రెండవ వ్యవహారం తదనుగుణ్యం. మొదటి వ్యవహారం రెండవదానిపై ఆధారపడదు. మొదటి వ్యవహార లక్షణపు ప్రతిబింబమే రెండవ వ్యవహారం.

ఉదాహరణకు ఒక అద్దం. అద్దంముందు ఒక పదార్థ ముండాలి. అప్పుడే అద్దం ఆ పదార్థాన్ని ప్రతిబింబిస్తుంది. అద్దంముందుగల పదార్థం

కదిలితే అద్దంలోని ప్రతిబింబంకూడ కదులుతుంది. ఆవిధంగా ప్రాథమికమైన పదార్థపు వ్యవహారాన్ని అద్దంయొక్క రెండవ వ్యవహారం పునరావృత్తి చేస్తుంది. ఇలాగే మెదడుకూడ పదార్థాలను ప్రతిబింబిస్తుంది. కాని, మనస్సు అద్దంలాంటి నిర్జీవవస్తువు కాదు. అందుకని బాహ్య ప్రకృతిని ప్రతిబింబించడంలో మనస్సు తన స్వీయప్రభావాన్ని కూడ కలిగిస్తుంది.

ఒక పదార్థం అద్దంలో ప్రతిబింబించినపుడు ఆ పదార్థపు అస్తిత్వంగాని, దాని ఆకార వ్యవహారంగాని అద్దంలో ప్రతిబింబితం కావడంపై ఆధారపడదు. పైగా అద్దంలోని ప్రతిబింబం ఆ అద్దం యెదుట ఉండే పదార్థపు అస్తిత్వంపైనా, ఆకార వ్యవహారంపైనా ఆధారపడితీరుతుంది. కనుక పదార్థం ప్రాథమికమూ - దాని ప్రతిబింబం తదనుగుణ్యముగా ఉంటాయి.

ఇదేవిధంగా భౌతిక పదార్థపు అస్తిత్వం మన చైతన్యంపై ఆధారపడదు. పైగా మన చైతన్యంలో పునరావృత్తిచెందే ప్రతిబింబం భౌతిక ప్రపంచంలోగల ఏదో ఒకదానికిచెందినదేకాని, దానికి అతీతం కాజాలదు. ఇలా భావం పదార్థంపైన ఆధారపడుతుంది.

మన ఇంద్రియానుభూతుల్లో ప్రతిబింబించని కొన్ని పదార్థగుణాలు ప్రకృతిలో ఉంటాయి. కాని యేదో ఒక గుణానికి యేదోవిధంగా సమన్వయించని ఇంద్రియానుభూతి మాత్రం ఉండదు. అలాగే కొన్ని పదార్థాల సామ్యాలూ, సంబంధాలూ మన భావాల్లో ప్రతిబింబించనివి ఉంటాయి, కాని మనస్సుకుచెందే యే భావంకూడ పదార్థాల గుణాలనూ, సంబంధాన్నీ ఆశ్రయించి యుండకతప్పదు. కనుక భావప్రతిబింబం పదార్థపు పునరావృత్తి తప్ప మరొకటికాదు. కాని ఒక్కొక్కసారి ఈ పునరావృత్తి వంకరద్దంలోవలె సహజమైన ప్రతిబింబం కాకపోవచ్చు. ఐనా, ఎలాంటి ప్రతిబింబానికైనాసరే ఆలంబన పదార్థమే. ఇది అనివార్యం.

మన భావాల్లో కొన్నిభౌతికవాస్తవికతకు అనుగుణ్యం కానట్లుతోస్తాయి. దీనికి కారణం మన విభిన్న భావాలను అసహజరీతుల్లో ఒకదానితో ఒకటి కలిపివేయడమే. ఉదాహరణకు సముద్రాల్లో మర్మెయిడ్స్ అని

ఒక తరహా మనుష్యు లుంటారట. ఈ మర్మెయిడ్స్ తలనుండి నడుం వరకు సుందర మనుష్యదేహాన్నీ, క్రిందిభాగం కాళ్ళకు బదులొకతోకనూ కలిగియుంటాయట. ఆడ మర్మెయిడ్స్ ఒకచేత అద్దంతో, మరొకచేత వెండ్రుకలు సింగారించుకుంటూ కులాసాగా సముద్రజలాలమీద ఈదుతూ ఉంటాయని ఈజిప్టు పురాణగాధలు. ఈ మర్మెయిడ్స్, వాటి చేతి అద్దాలూ, తల సింగారింపూ అంతా అభూతకల్పనే. అసలు మర్మెయిడ్స్ ఉండవు. కాని ఈ మర్మెయిడ్స్ లక్షణాలన్నీ మనకు పరిచితమైనవే. స్త్రీకీ చేపకూ చెందిన భావాల విచిత్రమిశ్రణలో మర్మెయిడ్స్ కల్పన రూపొందింది. చేపలూ అవి ఈదటమూ, స్త్రీలూ వారి సింగారింపూ కలిపివేయబడ్డాయి. కనుక ఇది వంకరద్దం యెదుటగల పదార్థాల ప్రతిబింబం లాంటిదే. అద్దం వంకరవలన మర్మెయిడ్స్‌గా కన్పించినా, అసలు అద్దం యెదుటగల పదార్థాలు మాత్రం స్త్రీలూ, చేపలే. కనుక దీనివల్ల కల్పనకు ఆధారం భౌతిక వాస్తవమేనని తేలుతూంది.

మర్మెయిడ్స్ కల్పనలో వలెనే స్వప్నావస్థలో మన చైతన్యక్రమం వాస్తవికతకుచెందే విభిన్నభావాలను కలగాపులగం చేయటంద్వారా మనం అనేక అసంభవ (మానసిక) దృశ్యాలను చూస్తాం. నిద్రావస్థలో మజ్జాముఖం (Cerebral cortex) యొక్క అన్ని భాగాలూ సుప్తంకావు. కొన్ని నాడీకేంద్రాలు పనిచేస్తుంటటంవల్ల అర్థ చైతన్యస్థితిలో స్వప్నాలు వస్తాయి. నిద్రా జాగరస్థితుల సమ్మిశ్రణలో (Protopathic) ఒకానొక స్థితిలో భావాలను వివిధ అసంభవరీతుల్లో కలగాపులగం చేసే విధంగా కలలు వస్తాయని మనస్తత్వవేత్తలు వివరిస్తున్నారు. అలాగే, మెలకువలో కూడ హిస్టీరియావ్యాధిలో ఇలాంటి జాగ్రత - నిద్రల సమ్మిశ్రణ స్థితి కనబడుతుంది. ఈ వ్యాధికి గురియైన రోగులు మెలకువతోనే ఉంటారు. కాని వారి మాటలు, చర్యలు అసహజంగా ఉంటాయి. వారు తమ భావాలను, ఇంద్రియానుభూతులను కలగాపులగం చేసి విచిత్రంగా వ్యవహరిస్తారు.

'ఐతే భావవాదులు కల్పననూ, కలలనూ, ఉన్మాదాన్నీ, భ్రాంతులనూ 'మనస్సు' యొక్క ప్రత్యేక విశేషత్వాన్ని నిరూపించుటకు ఉదా

హరణలుగా వినియోగిస్తారు. కాని ఈ దృష్టాంతాలన్నీ మెదడు మూలకంగా జరిగేవీ, భౌతికపునాదిని ఆశ్రయించియున్నవీ తప్ప వేరేమీ కాదు.

చైతన్యంలో భౌతికవాస్తవికత ప్రతిబింబిస్తుంది. ఇలా అంటే, భౌతికధర్మాలు చైతన్యంలో పునరావృత్తియౌతాయనీ, భౌతికవాస్తవికత ప్రాథమికమైనదనీ, చైతన్యప్రతిబింబం తదనుగుణ్యమై యుంటుందనీ గమనించడంలో తికమకపడరాదు. "మన చైతన్యం బాహ్యప్రపంచపు రూపచిత్రమే" అని వ్రాస్తూ లెనిన్ "అసలు చిత్రింపబడే పదార్థం (ఆలంబన) లేకుండా రూపచిత్రమనేది అసంభవం" అని చెప్పాడు. "చిత్రింపబడే పదార్థవ్యక్తిత్వం చిత్రణప్రక్రియకు (చైతన్యం) అతీతమని వివరించాడు.

స్టాలిన్ "పదార్థం ప్రాథమికం. ఎందుకంటే ఇంద్రియానుభూతులకూ, భావాలకూ మనస్సుకూ పదార్థమే ఆధారం. "మనస్సు ఆ పదార్థపు ప్రతిబింబం కనుక ద్వితీయమూ - తదనుగుణ్యమూ" అని నిరూపించాడు.

*2. మేధో ప్రక్రియచే నిర్ధారితమైన రూపాల్లో భౌతిక వాస్తవికత చైతన్యంగా ప్రతిబింబిస్తుంది.*

ప్రతిబింబక్రమంయొక్క రెండవ లక్షణం: మొదటిక్రమంలో ఒకరూపం కల్గియున్నదే రెండవక్రమంలో మరోరూపంలో పునరావృత్తి చెందుతుంది. స్వతస్సిద్ధంగా ఒక రూపాన్ని కల్గియున్న పదార్థమే (బింబం) ప్రతిబింబక్రమంలో మరోరూపంలో అనువదింపబడుతుంది. అంటే ప్రతిబింబక్రమం ఒకరూపాన్ని మరోరూపంగా మార్చే, అనువదించే ప్రక్రియ అన్నమాట. అందువల్ల ప్రతిబింబస్వరూపం ప్రతిబింబ ప్రక్రియ స్వభావంపై ఆధారపడుతుంది.

పదార్థాల వాస్తవికత మన చైతన్యంలో భావాలుగా అనువదింపబడుతుంది. ఈ భావాల నిర్మాణంలో మెదడుయొక్క సజీవపాత్రకూడ ఉంటుంది. కనుక భౌతికవాస్తవికత చైతన్యంలో ప్రతిబింబించడమంటే అర్థం భౌతిక వాస్తవప్రక్రియ మేధయొక్క జీవక్రమమనే రెండవ భౌతిక ప్రక్రియలో ప్రత్యేక[illegible] భావాలరూపంలో పునరావృత్తి యౌతుం దన్నమాట.

ఒకపదార్థం అద్దంలో ప్రతిబింబించినప్పుడది కేవలం యధాతథంగా ప్రతిబింబిస్తుంది. ప్రతిబింబక్రమంలో అద్దానికి స్వీయపాత్ర లేదు. అది అన్ని వస్తువులనూ ఒకేక్రమంలో ప్రతిబింబిస్తుంది. కాని మనస్సు అలా కాక, పదార్థాలను భావరూపాల్లో ప్రతిబింబించడంద్వారా తన సజీవపాత్రను కూడ నిర్వహిస్తుంది. శత్రువును శత్రువుగాను, మిత్రుని మిత్రునిగాను చైతన్యం ప్రతిబింబిస్తుంది. అంతేగాని శత్రువునూ, మిత్రుడినీ ఒకే క్రమంలో "మనుష్యులు"గా కాదు. కనుక శత్రువును గూర్చిన భావమూ మిత్రునిగూర్చిన భావమూ మనస్సుయొక్క అనుభూతి మూలకంగా ఏర్పడతాయి. ఈ రెండుభావాలలోని ప్రత్యేకత మనస్సులేక మేధయొక్క జీవక్రమమూలకమైనదే.

భావంయొక్క ప్రత్యేక స్వరూపం మేధయొక్క జీవక్రమంలో ఇంద్రియానుభూతి సంకేతమూ, శబ్దసంకేతక్రమాల వ్యాపారం ద్వారా ఏర్పడుతుంది. అంగజీవియొక్క సజీవ చైతన్యయుత జీవితావసరాలకు అనుగుణ్యంగా భౌతికవాస్తవికత మనస్సులో పునరావృత్తియౌతుంది. ఈ పునరావృత్తియే చైతన్య ప్రతిబింబం. దీనిఅర్థం భావాలకు, పదార్థాలకు సంబంధం ఉండదనికాదు. పదార్థాలను గూర్చిన మన ఇంద్రియానుభూతులు, ఇష్టానిష్టాలు మేధయొక్క చైతన్యక్రమంలో పదార్థపు భౌతిక లక్షణాలే. ఎరుపురంగునుగూర్చిన మన భావం వాస్తవంలో యెరుపు రంగుకు చెందినదే.

చైతన్య ప్రతిబింబంలో ఇంద్రియానుభూతుల పాత్ర ఉంటుంది. పదార్థాల లక్షణాలే మన ఇంద్రియానుభూతులు కావు. అవి మొదటి క్రమం. కాని ఆ పదార్థాలక్షణాలు ఇంద్రియానుభూతుల్లో ప్రతిబింబిస్తాయి. ఇది రెండవ క్రమం. కనుక ఇంద్రియానుభూతులు పదార్థలక్షణాల అవగాహనకు స్వరూపం అన్నమాట. అంతేకాక మన ప్రతిచర్యకు ఆధారంకూడ ఔతాయి. ఉదాహరణకు వేడినీళ్లు. వేడినీళ్ళలో మనం చేతినిముంచుతాం. వేడినీళ్లు కాలుతాయి. వెంటనే చేతినిలాక్కుంటాం. వేడినీళ్ళు కాలుతాయన్న భావం మన చైతన్యంలో యేర్పడుతుంది. వేడినీటిని గూర్చిన మన భావం, మరోసారి త్వరపడి వేడినీటిలో చేతిని

ముంచకుండా హెచ్చరిక చేస్తుంది. వేడినీటిని గూర్చిన మన భావంలో "కాలడం" అనే ఇంద్రియానుభూతి మిశితమైయుంటుంది.

అలాగే మనం వివిధరంగులు చూస్తాం. ఎరుపు, పసుపు, నలుపు వగైరా. ఐతే భావవాదులు చెప్పేటట్లు మనం 'మానసిక రంగులను' చూడటంలేదు. స్వతస్సిద్ధంగా, మన మనస్సుకు వెలుపలగల వస్తువుల రంగులనే చూస్తాం. మన చైతన్యంలో వాస్తవమైన రంగుల లక్షణాలే ప్రతిబింబిస్తాయి. భౌతికశాస్త్రరీత్యా చెప్పాలంటే, విభిన్న పదార్థాల విభిన్న ప్రకాశస్వీకార - ప్రకాశప్రసార ధర్మాలే మన చైతన్య క్రమంలో వివిధరంగుల అనుభూతులుగా ప్రతిబింబిస్తాయి. అందువల్ల యెరుపు రంగును గూర్చిన మన భావం, తెలుపురంగును గూర్చిన మన భావం, పసుపురంగునుగూర్చిన మనభావం ఆయా రంగుల వాస్తవికతకు లేక మొదటిక్రమానికి చెందినవే.

దీన్నే లెనిన్ ఇలా వివరించాడు :

> "ఒకవేళ రంగులను గూర్చిన మన ఇంద్రియానుభూతులు, భావాలు మన కనుగ్రుడ్డుపైన ఆధారపడియున్నా, మన కనుగ్రుడ్డుపైన పడే తేజో కిరణాలే రంగులనుగూర్చిన అనుభూతులను కల్గిస్తాయి. దీనివల్ల మనకూ, మన మనస్సుకూ వెలుపల మన ఆధారంలేకుండానే పదార్థంయొక్క గతిక్రమం ఉందన్నమాట. అది మన కనుగ్రుడ్డుపై ప్రభావం వేయటంమూలంగా రంగుయొక్క అనుభూతిని కల్గిస్తుందన్నమాట. ప్రకృతిశాస్త్రం విభిన్నరంగుల విభిన్న అనుభూతులను కాంతితరంగాల పరిమాణాలుగా చెబుతుంది. ఐతే కాంతి తరంగాల ఈ విభిన్నపరిమాణాలు మనుష్యుని కనుగ్రుడ్డుకు వెలుపల అతని ఆధారంలేకుండా ఉంటూండేవే".

చైతన్య ప్రతిబింబంలో కొన్నిరంగులు మనకు ఆహ్లాదం కలిగించవచ్చు. మరికొన్ని రంగులు వెగటును సూచించే భావాలను కలిగించవచ్చు ఇది శరీర ధర్మాన్నిబట్టి ఉంటుంది. కాని అసలు రంగులను గూర్చిన మన భావ ప్రతిబింబాలు మాత్రం ఆ అసలు రంగులకు చెందేవే.

అనుభూతిసంకేతక్రమానికి చెందిన ప్రతిబింబాలు పై విధంగా వుంటాయి. ఇక రెండవదైన శబ్ద సంకేత క్రమానికి చెందిన భావప్రతి బింబాలు. అనుభూతి సంకేత క్రమంకంటె శబ్దసంకేతం మరికొంత గుణీ కృత, సామాన్యీకృత రూపాల్లో ప్రతిబింబాలను కలిగిస్తుంది. పదార్థ వాస్తవికత మనశబ్దాల్లో, భావాల్లో, ప్రతిపాదనలు లెక వాక్యాలలో రూపు దిద్దుకుంటుంది. ఈ ప్రతిపాదన లేక వాక్య రూపం కర్త - క్రియల సమన్వయంగా ఉంటుంది ఐతే భౌతిక ప్రపంచంలో పదార్థం కర్త - క్రియల జతగా ఉండదు. ఈసమన్వయం రెండవ సంకేతక్రమంమూలంగా జరుగుతుంది. అంటే ఇది మెదడుయొక్క ఆలోచనా వ్యాపారం మూలంగా కలుగుతుం దన్నమాట.

ఉదాహరణకు ఎర్రపెన్సిలును గూర్చి ఆలోచించేటప్పుడు దాన్ని గూర్చిన మన చైతన్య ప్రతిబింబాన్ని ప్రతిపాదనలు లేక వాక్యరూపాల్లో ప్రకటిస్తాం. పెన్సిలు ఎర్రనిది అంటామన్నమాట. ఈ వాక్యంలో ఒక కర్త, ఒక క్రియ కలిసియున్నాయి. అంటే పెన్సిలు కర్త - ఎర్రదనం క్రియ గా మిశ్రితమైయున్నాయి. వాక్యంలో అయితే కర్తయైన పెన్సిలూ, క్రియయైన యెర్రదనమూ విడివిడిగాఉన్నాయి. కాని అసలు ఎర్రపెన్సిలు ఒకే పదార్థం. అసలు వున్నది ఒక్క 'ఎర్రపెన్సిలే'. కాని మన ప్రతి పాదనలో పెన్సిలు ఒకటిగాను యెర్రదనం ఒకటిగాను రెండుశ లున్నాయి. కనుక భౌతిక వాస్తవమైన ఒకే పదార్థాన్ని (ఎర్రపెన్సిలున) మనం వాక్యంలో యథాతథంగా ప్రకటించడంలేదు.

దీన్నిబట్టి పదార్థానికీ, దాన్నిగూర్చిన మన మానసిక ప్రతి దన కూ సంబంధంలేదని అనుకోకూడదు. అలా భావవాదులు మా మే తికమకపడతారు. వాక్యంలో పదార్థం శబ్దాలక్రింద చీలియున్నప టికీ, వాక్యం పదార్థవాస్తవికతను భావస్వరూపాల సమన్వయంతో ంగానే అనువదిస్తూవుంది. ప్రతిబింబ పునరావృత్తిలో శబ్దసంకేతం ఈ ధంగా వ్యవహరిస్తుంది.

కాని భావవాదులు "నామరూపాలు" పదార్థానికి చెం న క కేవలం మానవకల్పితములే నంటారు. శంకరాచార్యుడు దార్థా

చెందిన మన చైతన్యాన్ని. నామరూపాలను మిధ్యలు లేక భ్రాంతులు మాత్రమే నంటాడు. ఐతే యిది ఆచరణతో సమన్వయం కాజాలదని వేరే నిరూపించవలసిన అగత్యం లేదు.

*౩. చైతన్యంలో భౌతిక వాస్తవప్రతిబింబం అంగజీవియొక్క పరిసరాలతోడి సజీవ సంబంధంద్వారా యేర్పడుతుంది*

ప్రతిబింబక్రమం యొక్క మూడవ లక్షణం: ప్రతిబింబం యెప్పుడు కానీ ప్రతిబింబితమయ్యే పదార్థపు మొదటి ప్రక్రియకూ ప్రతిబింబం రూపొందే రెండవ మానసిక ప్రక్రియకూ గల సంబంధం ద్వారా రెండు ప్రక్రియల పరస్పరానుకూల చర్యలో యేర్పడుతుంది. కనుక ప్రతిబింబానికి ఆధారం పదార్థమే.

మెదడుయొక్క జీవక్రమం తన పునరావృత్తి వ్యాపారఫలితంలో, అంటే అనుభూతులూ ఆలోచనలలో వాస్తవికతనే ప్రతిబింబిస్తుంది. తన అనుభూతులకు, అవగాహనలకు ఆధారమైన పదార్థ వాస్తవికతనే ప్రతిబింబిస్తుంది. అంటే పదార్థ అనుభూతికీ, లేక భాషద్వారా వ్యక్తమయ్యే పదార్థ అవగాహనకు అనుగుణ్యమైన మానసిక ప్రతిబింబాన్ని మెదడు పునరావృత్తి చేస్తుంది. అంటే ప్రతిబింబం సచేతన అంగజీవి పరిసరాల పట్ల కల్గియున్న అనుబద్ధ చర్యలో (Interaction) రూపం దీర్చుకుంటుందన్నమాట. ఐతే, ఈ అనుబద్ధచర్య జంతుజాలంయొక్క పరిసర ప్రకృతితోడి శ్లిష్టసంబంధాల అవయవమైన మేధచే నిర్ధారితమౌతుందని మనకు విదితమే. కనుక ప్రతిబింబవ్యాపారంలో మేధ అవిరామంగా వ్యవహరిస్తూ, అవిరామంగా చైతన్యంలో భౌతిక పదార్థాల ప్రతిబింబాలను నిర్మిస్తూ ఉంటుందన్నమాట. అంటే, ప్రతిబింబనిర్మాణం మేధయొక్క జీవక్రమం అన్నమాట.

భౌతిక ప్రకృతి మానవ చైతన్యంలో ప్రతిబింబించే విధానంపైన, చైతన్యయుత అంగజీవి తన పరిసరాలతో నెలకొల్పుకోనే సంబంధాలపైన ఆధారపడుతుంది. ఈ సంబంధాలలో అంగజీవి స్థితిగతులు అంటే శారీరక ధర్మాలు - స్థాయి మరియు బాహ్యపదార్థాల భౌతిక ధర్మాలు రెండూ

ఉంటాయి. ఈ అంశాన్ని మనం గుర్తించినప్పుడు, బాహ్యపదార్థం చైతన్యంలో ప్రతిబింబించడంలో దాని క్రమంమార్పుకు గురియయ్యే అవకాశముంటుందని తేలుతుంది. చైతన్య ప్రతిబింబం అద్దంలోని ప్రతిబింబంవలె యాంత్రిక క్రమంలోకాక, మెదడుయొక్క నిరంతర సజీవ అను బద్ధ చర్యమూలంగా మార్పుకు గురియౌతుంది.

పై కారణంవల్ల పదార్థాలనుగూర్చిన మన అవగాహనలు కొన్ని తప్పుగాను, భ్రాంతులుగాను ఉండే అవకాశం యేర్పడుతుంది. మనకు కలిగే కొన్ని అవగాహనల్లో ఒక పదార్థంయొక్క ధర్మాలు మరో పదార్థంలో ఆరోపణకావచ్చు. లేక ఒక్కొక్కప్పుడు అసలు లేని పదార్థాలను గూర్చి మనకు భ్రాంతులు కలగవచ్చు. దీనికి అద్వైతులు రెండు ఉదాహరణలిస్తారు. ఒకటి రజ్జుసర్ప భ్రాంతి. రెండు మృగతృష్ణాభ్రాంతి. ఒకటి తాడుకు పాము ధర్మాలను ఆరోపించటం. రెండవది యెండమావుల్లో లేని నీళ్ళను ఉన్నాయని భ్రమపడటం. ఇలాంటి భ్రమలు చైతన్యానికి లేక మనస్సుకుచెందేవే కాని, అసలు పదార్థానివి కావు.

భావవాదులు 'చైతన్యం బాహ్యప్రకృతిని ప్రతిబింబిస్తుంద' నే మూల సూత్రానికి వ్యతిరేకంగా చేసే వాదనల్లో తరచు మానసిక ప్రతిబింబంయొక్క భ్రమలను నిదర్శనాలుగా పేర్కొంటారు. మానసిక భ్రమలను దృష్టాంతాలుగా చూపుతూ, ఆ మానసికభ్రమలకు అతీతమైన భౌతికవాస్తవికత అస్తిత్వాన్ని వారు నిరాకరిస్తారు.

1. సర్పరజ్జు భ్రాంతి : అద్వైతులు సర్పరజ్జు భ్రాంతి దృష్టాంతాన్ని విరివిగా ఉపయోగిస్తారు. "మనం చీకట్లో ఒక త్రాడును త్రొక్కి నామని భ్రమపడతాం. పామని గోలపెడతాం. అప్పుడు చుట్టుప్రక్క వాళ్ళంతా గందరగోళపడ్తారు. కాని తీరా పరిశీలించి చూస్తే తాడుతా నని తేలుతుంది. ఎప్పుడైతే మనం త్రాడును పామని భ్రమపడట సాధ్యమో, అప్పుడు మనం తాడును తాడుగా భావించటంకూడ ఎందుకు భ్రాంతికాకూడదు?" అని వాదిస్తారు.

2. మృగతృష్ణాభ్రాంతి : "మనం యెండమావుల్లో నీళ్లున్నాయని భ్రమపడతాం. పశువులు వేసవిలో నీళ్ళకోసం ఎండమావుల్లో వెదకుతూ

తిరుగుతుంటాయి. కాని తీరా దగ్గరికి చేరేసరికి ఎండమావులూ ఉండవు. అందులో నీరూ ఉండదు. కనుక లేనిపదార్థం ఉన్నట్లు మనం భ్రమపడుతున్నా మన్నమాట. అలాగే ఈ జగత్తుకూడ లేనిదే ఐనా దాన్ని మనం ఉన్నట్లు భావిస్తున్నాం."

పై ఉదాహరణల్లోని తర్కం తాము చెప్పదలచుకొన్న విషయానికే గాని, అసలు వాస్తవానికి సమన్వయించదని వీరు గుర్తించరు. తాడును పామనిభ్రమపడితే తాడు పాముగామారదు. అలాగే మృగతృష్ణలో నీరుకూడ చేరదు. కనుక ఇది వాస్తవికతను - ఉపేక్షించిన లేక నేలను విడిచిన సామే.

ఇంకా ఇలాగే పదార్థానికీ, భావానికీగల సమన్వయం విషయంలో అనేకమంది తాత్వికులు తికమకకు గురియైనారు.

3. జైనులు స్యాద్వాదమనే ఒక ధోరణిలో పడిపోయారు. ఉదాహరణకు "రాముడుఉన్నాడు" అని ప్రతిపాదన. దీనికి వివరణ: రాముడు ఇప్పుడున్నాడు కాని ఒకప్పుడు లేడు; చనిపోయాక ఉండబోడు; 'కనుక రాముడు ఉన్నాడా అంటే ఉన్నాడూ, లేడూను; ఇప్పుడు రాము డున్న రూపంలో ఉన్నాడా అంటే, అతని అసలు రూపం యేమిటో చెప్పలేం. ఐనా మనకు రాముడు ఒకరూపంలో కన్పిస్తున్నందున అలాగే ఉన్నాడేమో తెలియదు; రాముడు బహుశః మనకు కన్పించేలాగా లేడేమోకూడ చెప్పలేం; రాముడు బహుశః కన్పిస్తున్నట్లుగా ఉన్నాడూ లేక కన్పిస్తున్నట్లు లేడూ కాబట్టి ఎటూ తేల్చలేము" అన్నారు. దీనివల్ల తేలేదేమంటే, రాముడు అజ్ఞేయమూ, అయోమయం అని.

4. కొందరు బౌద్ధులుకూడ ఇదే పంథాలో క్షణికవాదం సాగించారు. "రాముడు ఒకప్పు డింకా పుట్టలేదుగనుక లేడు. రాము డిప్పుడున్నాడు కనుక ఉన్నాడు. రేపు రాముడుండబోడుకనుక లేడు. కనుక తీరా ఉండటమూ, ఉండకపోవడమూ క్షణికం; లేక ఎప్పటికప్పటికి చెందిన అంశం. అందువల్ల రాముడు ఉన్నాడా, లేడా అన్న జిజ్ఞాస అనవసరం." పదార్థాన్నిగూర్చి బౌద్ధులు ఇలా చెప్తూ ఆత్మనుగురించి కూడా "అది ఉంటే ఉంటుంది; లేకపోతే ఉండదు. కాని అది యెల్లప్పుడూ మాత్రం

ఉండదు. కాబట్టి ఉందా లేదా అన్న ప్రశ్న అనవసరం" అని ఉపేక్షాభావం వహించారు. ఐతే ఇది భావపరంగానూ, అటు పదార్థపరంగానూ రెండు విధాలా అజ్ఞేయవాదమే. అందువల్లనే బౌద్ధుల కార్యకారణవాదం "పదార్థం ప్రాథమికమా లేక భావమా?" అన్న మౌలిక ప్రశ్నకు సమాధాన మీయలేక పోయింది.

5. సాంఖ్యులు ప్రళయాన్నిగూర్చి ఇలా చెప్తారు: "ప్రపంచంలో పురుషులంతా (ఆత్మలు) కైవల్యం పొందాక ప్రపంచం (ప్రకృతి) నశించిపోతుంది అదే ప్రళయం." ఈ వివరణనుబట్టి వీరు పురుషుడూ ప్రకృతి లేక భావమూ పదార్థం రెండూ ఉండేవని చెప్పినప్పటికీ తీరా పదార్థంకంటె భావానికి, లేక ప్రకృతికంటె పురుషునికి అధిక ప్రాధాన్యతనిచ్చినట్టు స్పష్టమౌతుంది. కనుక వీరుకూడ మనస్సు చూచినప్పుడే పదార్థం ఉంటుం దన్నారన్నమాట.

ఇలా తత్వశాస్త్రంలో "పదార్థం, భావం" లేక "బింబం, ప్రతిబింబం" మరియు వాటి సమన్వయాన్నిగూర్చి అనేక తికమకలు కన్పిస్తాయి. ఈ తికమక కంతటికీ "ఆస్తికత్వం – మతం" యొక్క ఉపరి నిర్మాణమే కారణం అన్నమాట. కాని, సమస్య వాస్తవంలో అంత కష్టమైనదేమీకాదు. చైతన్య ప్రతిబింబం అంగజీవికి పరిసరాలతోగల వాస్తవ సంబంధంపై ఆధారపడే సజీవ ప్రక్రియ అని మన మిదివరకే గమనించాం. అదే పై తికమకల కన్నికిటీ పరిష్కారం ఔతుంది.

పై ఉదాహరణలలో గల లోపం పదార్థ వాస్తవికతను కాక తమ నమ్మకాలను, ఊహాపోహలను పదార్థానికి సంక్రమింపజేసే ప్రయత్నమే. తమ ఊహల, విశ్వాసాల స్థాపనకోసం పదార్థాలనుగూర్చి చేసే ఇలాంటి తార్కిక చర్చలు పదార్థ వాస్తవికతకుగాని, జీవితానుభవానికి గాని సమన్వయం కాజాలవు. అంటే ఇలాంటి స్వీయ మానసిక భావ వాదాలు ఆచరణయొక్క గీటురాయికి నిల్వవు. కనుక ఇలాంటి అధిభౌతికతర్కం భావాల స్వీయ విలోకన పద్ధతికేగాని. పదార్థ వాస్తవ విలోకనకు ఉపకరించవు.

మనస్సుయొక్క విశేషతను విశ్వసించడంవల్ల పై ధోరణు లేర్పడుతున్నాయి. అందువల్ల ఈ ధోరణుల్లో ఆలోచనచేసే కర్తకూ, ఆలోచింపబడే కర్మకూ సంబంధం మృగ్యమౌతూంది. భావాల్లో ఇలా ఉంది. ఇక అనుభూతుల్లో 'పదార్థాల సంబంధాల' వక్రతమూలంగా కల్గే భ్రాంతులను చర్చిద్దాం.

మనం ఒక కొండను దూరంనుంచిచూస్తే అది చిన్నదిగాను, దగ్గర నుంచిచూస్తే పెద్దదిగాను కనపడుతుంది. పరిమాణంలో యీ మార్పుకు కారణం మనకూ కొండకూ మధ్యగల దూరమే.

అలాగే పెన్సిలును సగంవరకు నీటిలో ముంచి పైనుండి చూస్తే అది వంకరగా కనబడుతుంది. మన దృష్టికీ, పెన్సిలుకూ మధ్యగల ప్రకాశ సాధనాల తేడాయే దీనికి కారణం.

అలాగే మనం ఒక కన్నుపైన వ్రేలితోనొక్కి పదార్థాలను రెండు కండ్లతోచూస్తే అవి రెండుగా కన్పిస్తాయి. దీనికి కారణం వ్రేలి నొక్కుడు మూలంగా ఒక కనుగ్రుడ్డు స్థానం మారియుండటం.

మనం ఒక చేతిని చాలా వేడినీటిలోను, మరోచేతిని చాలా చల్లని నీటిలోనుముంచి పిదప రెండు చేతులనూ గోరువెచ్చనీళ్ళలో ముంచితే, అవే నీళ్ళు ఒక చేతికి ఎక్కువ చల్లగాను మరొకచేతికి ఎక్కువవేడి గాను అనిపిస్తాయి. దీనికి కారణం మన చేతులు అదివరకు వేర్వేరు ఉష్ణమానాలలో ఉండటమే.

ఇలాగే మనకు అనేక అసంభవ సంఘటనలతో కలలువస్తాయి. అలాంటి కలల్లో మన మెదడుయొక్క గ్రాహక ప్రక్రియలోగల విభిన్న భావాలు అసహజంగా సమ్మిశ్రణమవుతాయి. ఇంకా, ఆలోచనల్లోను ఊహల్లోను పదార్థాలనుగూర్చిన అభూతకల్పనలనుకూడ మనం చేయ గలం. కొన్ని పదార్థాలకు వాస్తవంగా లేనిగుణాలను ఆరోపించ గలం. లేని పదార్థాలనుకూడ కల్పన చేయగలం. పురాణగాథల్లో ఎన్నో అసంభవసంఘటనలను మనం చూస్తున్నాం.

ఐతే ఇక్కడ ఒక అంశం చాలముఖ్యం. మనం వివేచనద్వారా, విచక్షణద్వారా మన అవగాహనల, భావాల, ఆలోచనల లోపాలను

గుర్తించి సరిదిద్దుకోగలం. లేక కొత్త కొత్త అభూతకల్పనలనూ భ్రాంతులనూ కల్గించుకోగలంకూడ. మానవ చైతన్యపు ఈ క్రియాశీల పాత్రను మనం నిరాకరించలేం.

కనుక భౌతిక వాస్తవికత చైతన్యంలో ప్రతిబింబించుటలో "సంబంధాల" ప్రశ్న ఉదయిస్తుంది. మన ఇంద్రియానుభూతుల్లో పదార్థానికీ, జ్ఞానేంద్రియాలకూ గల సంబంధం, మరియు భావాల్లోనూ ఆలోచనల్లోనూ పరిస్థితుల మూలకమైన ఆగంతుక సంబంధం పాత్ర వహిస్తాయి. పావ్లావ్ ప్రయోగంలో "గంటశబ్దాన్ని ఆహార సంకేతంగా" అలవరచుకున్న కుక్క ఉదాహరణను మనం చూచాం. గంటశబ్దానికీ, ఆహారానికీ గల సంబంధం ఆగంతుకమైనదీ, ఆరోపితమైనదీఅని సువిదితమే. అలాగే భావ ప్రతిబింబాల్లోకూడ భ్రాంతులు, స్వప్నాలు నిర్దిష్టమైన ఆగంతుక సంబంధాల మూలంగా యేర్పడినవే. ఐతే, ఈ సంబంధాల లోపాన్ని మనం ప్రతిబింబ వక్రతగా గమనించాలి. అంతేగాని మొదటిక్రమానికీ, రెండవ క్రమానికీ సంబంధ ముండదని అపోహపడరాదు.

*4. వాస్తవికతయొక్క చైతన్య ప్రతిబింబం ఆ వాస్తవికతను మార్చివేసే ప్రేరణశక్తి*

ప్రతిబింబం క్రమం యొక్క నాల్గవ లక్షణం: చైతన్య ప్రతిబింబం అంగజీవికి పరిసరాలతోగల సంబంధమూలకమైన వ్యవహారం. అది సజీవ వ్యవహారం. కనుక మానవుని చైతన్యంకూడ అతని అనుభవానికీ, సాంఘిక వ్యవహారానికీ సంబంధించినదే. మానవుల అనుభూతులు, ఆలోచనలు బాహ్యపదార్థపు సూటి పునరావృత్తివల్ల ఉత్పన్నంకావు; వారి జీవితానుభవాన్నిబట్టి, జీవిత విధానాన్నిబట్టి, సాంఘిక సంబంధాలను బట్టి అవి ఉంటాయి.

ఒక ఇంజనీరు యంత్రాన్ని చూస్తాడు. ఆ యంత్రాన్నే ఒక సామాన్యుడుకూడ చూస్తాడు. యంత్రం అదేయైనప్పటికీ, దాన్ని చూచే కన్నుల్లో, చేతుల్లో తేడాలు లేనప్పటికీ ఇంజనీరు యంత్రాన్నిగూర్చి పొందే అనుభూతిని ఒక సామాన్యజనుడు పొందజాలడు. ఇరువురి అనుభూతుల్లో ఎంతోభేదముంటుంది. ఒకవేళ ఆ యంత్రంచెడిపోతే, ఇంజనీరే కాని సామాన్యుడు దాన్ని బాగుచేయలేడు.

అలాగే పల్లెసీమలోని ఒక దృశ్యాన్ని ఒక పట్టణవిద్యార్థీ, ఒక చిత్రకారుడూ, ఒక గ్రామరైతూ ముగ్గురూ చూచారనుకొందాం. రైతు ఆ దృశ్యాన్ని మామూలుగానే చూస్తాడు. పట్టణవిద్యార్థి విహరించుటకు వీలుగా వుందనుకొంటాడు. చిత్రకారుడు ఆ దృశ్యం కళామయంగా, సౌందర్యవంతంగా ఉందని గుర్తిస్తాడు.

పదార్థాలనుగూర్చి వ్యక్తులకుండే దృక్పథాల్లో వారి వారి అనుభవాలూ, జీవిత విధానాలూ, అలవాట్లూ ప్రత్యేకతను కలిగిస్తాయి. మానవుల భావాల్లో, ఆలోచనలలో వర్గమూలకంగాను అభ్యాసమూలకంగాను అనుభవం విద్యా సంస్కారాలమూలకంగాను యేర్పడే ప్రత్యేక విభేదాలు గణనీయమై యుంటాయి.

రెండోవైపు పదార్థాలనుగూర్చిన మానవుని భావాలు అతని ఇంద్రియానుభూతులపై ప్రతి ప్రభావంకూడ వేస్తాయి. మనం పదార్థాలను యాంత్రికంగా చూడం. వాటినిగూర్చి భావాలను పొందుతాం. కనుక మన భావాలు అనుభూతిపై ప్రభావం వేస్తాయి. అంటే, ఇది ప్రాథమికమైన అనుభూతిసంకేతక్రమంపై రెండవదైన శబ్దసంకేతం (ఇది ప్రాథమిక సంకేతానికి సంకేతమే ఐనప్పటికీ) వేసే ప్రతిప్రభావ మన్నమాట.

ఒక ఇంజనీరు ఒక యంత్రాన్నిగూర్చి సామాన్యునికంటె యెక్కువ అనుభూతిని పొందుతున్నాడంటే, అందుకు కారణం యంత్రాలనుగూర్చి సామాన్యజనులకంటె ఇంజనీరు మనస్సులో ఎక్కువ భావాలు ఉండటమే అలాగే ఒక చిత్రకారుడు జానపద దృశ్యాన్నిగూర్చి ఇతరులకంటె యెక్కువ సౌందర్యానుభూతిని పొందగలడు. కారణం? దృశ్యసౌందర్యాలనుగూర్చి అతనిలో అదివరకే ఎన్నో ప్రత్యేకమైన భావాలు యేర్పడి యున్నాయి.

ఇదేవిధంగా ఒక చిత్రకారుని అనుభూతిలోను, మరొక చిత్రకారుని అనుభూతిలోను కూడ భేదా లుంటాయి. ప్రతి చిత్రకారుడూ ఒకే రకపు దృశ్యంతో ప్రభావితుడుకాడు. ఎవరిభావాలు, అభిరుచులు వారికి ప్రత్యేకంగా ఉంటాయి. కొందరు చిత్రకారులు 'మానవరూపాలను' ఉదాత్తతతో శక్తివంతంగా చిత్రిస్తారు. మరికొందరు కేవలం ఫొటో

గ్రావువలె యధాతథంగా చిత్రిస్తారు. కొందరు పాశవికమైన ఉద్రేకంతో చిత్రిస్తారు. మరికొందరు మనిషిని గుర్తుపట్టనంత అస్వాభావికంగా చిత్రించేవా రున్నారు. ఇందుకు చెందిన వివిధ కళా సంప్రదాయాలు కూడా నానాపేర్లతో అమలులో ఉన్నవే.

ఇలా వ్యక్తులలో చైతన్య గతమైయున్న దృక్పథపు 'సంబంధం' వారివారి అనుభూతులూ అవగాహనలూ ఆలోచనల్లోని ప్రత్యేకతను కలిగిస్తుంది. మన పరిసరాల ప్రతిబింబం, ఆ పరిసరాలతో చైతన్యగతమై యున్న సంబంధం ఆ పరిసరాలను మార్చివేసే మన వ్యవహారాన్ని నిర్ధరించటంలో చాల ప్రధానమైనపాత్ర నిర్వహిస్తుంది. చైతన్య మొక ప్రతిబింబం అన్నప్పుడు అర్థం, చైతన్యం జీవితంలో సజీవపాత్ర వహించదని కాదు. మొదట మానవచైతన్యం జీవితవ్యాపారానికి ఫలితం. అటుపిదప ఏ జీవిత వ్యవహారానికి అది ఫలితమో ఆ జీవిత వ్యవహారాన్నే పురోగమించుటలో చైతన్యం ప్రధాన పాత్ర నిర్వహిస్తుంది. అంటే జీవిత క్రమమే తన గమనాన్ని నిర్దిష్టమార్గంలో నడిపించే సాధనాన్ని చైతన్యమనే రూపంలో నిర్మించుకుంటుందన్నమాట.

అందువల్లనే, చైతన్యం అంగజీవుల జీవితపరిణామంలో వికసితమైనదని నిరూపించగల్గుతున్నాం. జీవితం చైతన్యయుత జీవితమౌతుంది. చైతన్యయుత జీవితం మెదడులోగల బాహ్యపరిస్థితుల ప్రతిబింబంచే శాసింపబడు జీవనవ్యవహారం. ప్రతిబింబం మొదట చైతన్యయుత అంగజీవుల మరియు వాటి పరిసరాల సంబంధాల ఫలితం. తిరిగి అది ఆ సంబంధాల పురోభివృద్ధికి సంబంధం. ఈ సంబంధ సాధనంతోనే మానవులు తమ పరిసరాలను మార్చివేసే కృషిని సాగిస్తారు. కనుక మానవచైతన్యం తొలుత ఆచరణ ఫలితంగాను, పిదప ఆచరణకు మార్గదర్శకంగాను జీవితాన్ని పురోగమింపజేస్తుంది.

ఇలా జీవితానుభవంలో రూపొందిన చైతన్యం తిరిగి జీవితానుభవానికి మార్గదర్శిగా ఉంటుంది. చైతన్యంయొక్క ఈ క్రియాత్మక పాత్రను పరిశీలించటంలో చైతన్యగతమైయున్న భౌతిక ప్రతిబింబం కేవలం భావాలు ఆలోచనలద్వారానే యేర్పడుతుందని పొరబడకూడదు.

చైతన్యంయొక్క భౌతిక క్రమభూమికను విడిచిపుచ్చటం సరికాదు. మాన వుడు తన ఆచరణాత్మక, చైతన్యయుత, జీవనవ్యవహారంలో ఆలోచన లనూ, ఉద్రేకాలనూ, ఆవేశాలనూ పొందుతాడని గమనించాలి.

భావవాదులు ఆలోచనలూ, ఉద్రేకాలూ, ఆవేశాలూ మానవుని అంతరంగానికి అంటే దేహాని కతీతమైన మనస్సుకు చెందే లక్షణాలుగా చెప్తారు. ఆలోచనలూ, భావనలూ కేవల మానసికవ్యాపారం అంటారు. అంటే ఆలోచనలను, భావనలను, ఆకాంక్షలను జీవిత వ్యవహారంనుండి లేక ఆచరణనుండి విడదీస్తారన్నమాట. కనుక వారు ఆచరణతో సంబంధంలేని ఆలోచనలను సాగిస్తారు. అందుకే భావవాద తత్వ శాస్త్రంలో వాస్తవానికి పొసగని అనేక ఊహాపోహలు కొనసాగుతవి. అంతులేని ఊహాగానాలపై తర్కవితర్కాలు కొనసాగుతవి.

కాని భౌతికవాదం అలా చెప్పదు.

భౌతికవాద దృష్ట్యా, భౌతికవాస్తవికత చైతన్యంలో ప్రతిబింబించే ప్రక్రియకుచెందినవే మానసికోద్రేకాలు. అవి మానవునికి తన పరిసరా లతోగల క్రియాత్మక సంబంధాన్ని ప్రతిబింబిస్తాయి. మానవుడు క్రియా శీలిగాను, తన జీవితవ్యవహారంలో బాహ్యపదార్థాలచే ప్రభావితుడయ్యే వాడుగాను, మరియు ఆ పదార్థాలనుగూర్చి వాటిలో సాధ్యంకాగల మార్పులనుగూర్చి నిర్దిష్టమై ఖరి నవలంబించేవాడుగాను ఉన్నాడు. అందు వల్లనే అతడు పరిసరాలలోని పదార్థాలను గూర్చి ఉద్రేకాలు పొందుతాడు. ఆ ఉద్రేకాలద్వారా తన ఆచరణకు ప్రేరణచేకూర్చుకుంటాడు. ఇలా మానవుడు తన చైతన్యయుత జీవనంలో పదార్థాలనుగూర్చిన అనుభూతు లను, అవగాహనలను వాటి వలని పరిజ్ఞానాన్ని మాత్రమే గాక పదార్థాల సంబంధానికి చెందిన తన పాత్రనుగూర్చిన భావననూ, ఉద్రే కాన్నీ కూడ కలిగియుంటాడు. అందుకే అతడు పరిసరాలను తన జీవితావసరాలకు అనుగుణ్యంగా మార్చుకొంటూ ముందుకు సాగుతాడు.

కనుక మానవజీవితంలో భావనాత్మకచైతన్యం (Emotional consciousness) కూడ అవసరపాత్రను నిర్వహిస్తుంది. పరిసర వాస్తవపు అనుభూతిద్వారా, ఆలోచనద్వారా ఆ వాస్తవికతతో మానవుడు సక్రియ

సంబంధం నెలకొల్పుకొని వ్యవహరిస్తాడు. ఐతే, ఈ సంబంధం భావన (Feeling) లో సమగ్రరూపం ధరిస్తుంది. కనుక అనుభూతులూ, భావాలూ ఉద్రేకాలుగా, భావనలుగా వికసింపవలసిన అవసరం కూడ ఉంది. "ఇలా మానవుని ఇచ్ఛానిచ్ఛలతో, అనుకూల ప్రతికూలతలతో, విచక్షణకు - ఔచిత్యానికి గల సంబంధంతో అతని చర్య లేక వ్యవహారం రూపొందుతుంది.

*పదార్థమూ, దాని ప్రతిబింబం*

దీనంతటి సారాంశమేమంటే, సజీవమైన మేధకు అతీతమైన చైతన్యమనేది లేదు. చైతన్యానికి, చైతన్యంలో ప్రతిబింబించే ప్రతిఅంశానికి కూడ ఆధారం భౌతిక ప్రపంచమే. మేధయొక్క జీవక్రమం ద్వారా చైతన్యంలో బాహ్యపదార్థం ప్రతిబింబిస్తుంది. ఆ ప్రతిబింబమే చైతన్యం యొక్క స్వభావంగా ఉంటుంది.

అందువల్ల భౌతిక, ఆధ్యాత్మిక విభాగాలంటూ రెండు వేర్వేరు ఆవరణలు లేవు. అలాగే భౌతిక ప్రపంచం, మానసిక ప్రపంచం అంటూ రెండు ప్రపంచాలు లేవు. అసలు ఉన్నది భౌతికప్రపంచమూ, దానికి చెందిన భౌతికక్రమాలు మాత్రమే.

భౌతిక పరిణామక్రమంలో భౌతికప్రక్రియల ప్రతిబింబం మేధ యొక్క జీవక్రమమను మరొక భౌతిక ప్రక్రియలో పునరావృత్తిచెందింది. కనుక మనం భౌతికమనీ ఆధ్యాత్మికమనీ, లేక శారీరకమనీ మానసికమనీ విడివిడిగా పేర్కొంటున్నప్పుడు, దేశకాలాలలోని ఒకేగతిని, లేక ఒకే భౌతికవాస్తవాన్ని మేధయొక్క జీవక్రమంలో రూపొందే దాని ప్రతిబింబంనుండి విడిగా ప్రత్యేకిస్తున్నామన్నమాట.

ప్రతిబింబానికి కారణమయ్యే పదార్థక్రమమూ, ప్రతిబింబం రూపొందే మేధోక్రమమూ ఈ రెండూ కూడ భౌతికప్రక్రియలే. కాని యిందులో ప్రతిబింబంమాత్రం భౌతికం కాక మానసికమే నన్నమాట. అంటే ప్రతిబింబం ప్రతిబింబమేకాని పదార్థం కాదన్నమాట.

దీన్నే లెనిన్ యిలా వ్యాఖ్యానించాడు :

"ఆత్మ, శరీరాల ద్వైతభావాన్ని భౌతికవాదం ఖండింస్తుందంటే అర్థం, ఆత్మ శరీరానికతీతమైనది కాదనీ, ఏదో ప్రక్రియమే ఆత్మ అనీ, బాహ్యప్రపంచానికది ప్రతిబింబమనీ నిర్ధారణ చేయడమన్నమాట."

ఐతే ఇక్కడ మనం శరీరం, ఆత్మ అనేపదాలను పదార్థం, భావం అన్నరూపంలో పరిగణించాలి.

"పదార్థమూ మనస్సుల వైరుధ్య ప్రాధాన్యత చాలకొద్ది మేరవరకే. ఆ కొద్దిపరిమితీ ఈ రెంటిలో యేది ప్రాథమికం, యేది ద్వితీయం అనే మౌలికసమస్య పరిధివరకే. ఆ పరిధికి బయట ఈ వైరుధ్యపు ప్రసక్తి అప్రయోజకం మాత్రమే"—అనికూడ లెనిన్ వ్రాశాడు.

## మూడవ అధ్యాయం

# సాంఘిక శ్రమ: సాంఘికాలోచన

మానవుని మానసిక ధర్మాల అభివృద్ధి సాంఘికవ్యవహారంలో అనుభూతిదశనుండి ఆలోచనదశకు చేరుకుంటుంది. ఆలోచించే, మాటాడేశక్తి సాంఘికశ్రమ క్రమంనుండి ఉదయిస్తుంది. సాంఘిక వ్యవహారానికంతటికీ మూలం సాంఘికశ్రమయే.

*మానవ మేధ, దాని వినియోగం*

భావాల సామాన్యీకరణకూ, భావనా చైతన్యానికీ, ఆలోచనా వ్యాపారానికీ కేంద్రం మానవ మేధ. అంగజీవి సుదీర్ఘ పరిణామ వికాస ఫలితమే మేధ లేక మెదడు. ఈ పరిణామంలో ఒకదశకు ముగింపు ఘట్టమే మానవమేధ. ఉన్నత జంతుజాలపు నాడీమండల కేంద్ర నిర్మాణంలో మానవ మేధ ఆవిష్కరణ ఒకగుణాత్మక పరివర్తన. మానవ మేధయొక్క మజ్జాముఖం (Cerebral cortex) జంతువులతో పోలిస్తే ఎన్నోరెట్లు పెద్దది. అల్పజంతువుల మేధలో మజ్జాముఖం ఉండదు. గొరిల్లావానరం మెదడులోని మజ్జాముఖం కంటె మానవ మేధయొక్క మజ్జాముఖం ఆరురెట్లు పెద్దదిగా ఉంటుంది. ఎంతో తెలివితేటలు గల చింపాంజీ మెదడుకంటె ఒక తెలివితక్కువ పిల్లవాని మెదడులోని మజ్జాముఖం ఎంతో విశిష్టమైన నిర్మాణం కలిగియుంటుంది. మానవుని మేధ

యొక్క మజ్జాముఖంలో అధికభాగం అతడు తనచేతులనూ, సంభాష ణావయవాలనూ వినియోగించే వ్యవహారానికి చెందినది.

అత్యంత క్లిష్టమైన మానవమేధ యేక్రమంలో ఉన్నత మనో వ్యాపారం సాగిస్తుందో తెలుసుకోడానికి శారీరశాస్త్రజ్ఞులింకా పరిశోధనలు సాగిస్తున్నారు. ఆ పరిశోధనలింకా సమగ్రంకాలేదు. ఐనా, ఆలోచనా వ్యాపారానికి కేంద్రం మజ్జాముఖమనీ, దాని సుదీర్ఘపరిణామంలో ఒకా నొకదశ యేర్పడ్డప్పుడే మానవుని ఉన్నత మానసికవ్యాపారం ప్రారంభ మౌతుందనీ శాస్త్రజ్ఞులు నిరూపించారు.

మెదడు ఆలోచనాస్థితిని చేకూర్చుకున్నదశ మానవాత్పూర్వదశ నుండి ఆదిమ మానవదశ రూపొందినదశకు చెందినది. ఆ దశలో ఒకానొక వానరజాతి (Anthropold ape) క్రమంగా మానవునిగా పరిణామంచెంది నట్లు శాస్త్రజ్ఞులు నిరూపించారు. ఆ వానరాలు తమ కాళ్ళపై నిటారుగా నిలిచి నడువగలినస్థితిలో వాటి చేతులు ప్రత్యేకంగా జీవితావసర విధుల నిర్వహణకై వినియోగపడసాగాయి. అందువల్ల వాటి ఉత్పత్తివ్యవ హారంలో నూత్నాభివృద్ధి ఏర్పడి క్రమంగా మానవప్రవర్తన రూపుతీర్చు కుంది. ఉత్పత్తివ్యవహారానికి చేతులను చేతివ్రేళ్ళను వినియోగించుకొనే నేర్పులో మానవహస్తం రూపొందింది. శారీరకమైన ఈపరిణామానికి అనుగుణ్యంగానే నాడీమండలాభివృద్ధిలో, అంటే మేధయొక్క పరిమాణ-నిర్మాణాల క్రమంలో నూత్నాభివృద్ధికల్గింది. అంటే, చేతిని అభివృద్ధి పథంలో నడపవలసిన ఆవశ్యకత ఏర్పడ్డంవల్ల మజ్జాముఖం అభివృద్ధి గాంచింది. ఈ అభివృద్ధిక్రమాన్ని డార్విన్ పరస్పర సంబంధంగల అభివృద్ధి (Correlation of growth) అని నిరూపించాడు. చేతి అభి వృద్ధికి అనుగుణ్యంగా పుర్రె ఆకారంలోను మెదడు నిర్మాణంలోను నూత్నాభివృద్ధితో కూడిన మార్పులు రూపొందాయని ఆయన వివ రించాడు.

ఆదిమ మానవులకు కూడ మనకువలెనే మెదడు, చేతులు, కాళ్ళు, కన్నులు, దంతాలు ఉండేవి. ఈ అవయవాల పోలికల్లో ఆదిమ మానవులనాటికీ, నేటికీ పెద్దమార్పేమీ లేదు. కాని ఆదిమమానవుని నాటికీ,

ఈనాటికీగల భేదమంతా ఆ అవయవాలతో మనంచేసే పనుల్లో ఉంటుంది. ఆదిమమానవునికి తెలియని యెన్నెన్నో వ్యవహారాలను మనం ఈనాడు నిర్వహిస్తున్నాం. కనుక మేధయొక్క అభివృద్ధి గుణాత్మకమైన దన్నమాట.

శారీరక పరిణామంలో మానవమేధ రూపొందటంతో మానవుడు వినూత్న పరిణామచరిత్రను ప్రారంభిస్తాడు. కనుక మానవపరిణామమంటే కేవలం శారీరకపరిణామమే కాదు. మానవుడు తనకు తానుగా, తన సాంఘిక వ్యవస్థను, కార్యవిధానాలను, తన విజ్ఞానాన్ని, సంస్కృతిని నిర్మించుకుంటాడు. ఈక్రమంలో అతడు తన చైతన్యయుత ఆధిపత్యాన్ని తన పైనా తన పరిసరాలపైనా నెలకొల్పి చరిత్రను నిర్మిస్తాడు.

అందువల్ల ఆదిమమానవుని నాటినుండి నేటివరకు కలిగిన అపారాభివృద్ధి మానవుని మేధలో, శరీరంలో కాక దాన్ని వినియోగించటంలో, అంటే మేధోశక్తులను పెంపొందించుకొనే గుణంలో కన్పిస్తుంది. మనుష్యుడు తన భౌతిక వ్యవహారాన్ని పెంపొందించుకొన్నాడు. తన అవగాహనలూ ఆలోచనలను కూడ పెంపుచేసుకున్నాడు. ఆ పరిజ్ఞానంతో జీవిత పరిస్థితులను అతిశయంగా అభివృద్ధి చేసుకున్నాడు. ఇలా తన శక్తులను, అర్హతలను మానవుడు నిరంతరం పురోగమింప జేసుకుంటాడు.

*అనుభూతులనుండి ఆలోచనలకు*

అనుభూతి ఆలోచనకు పునాది. ఇంద్రియానుభూతి అనే ఆలంబన లేనిచో ఆలోచనలేదు. ప్రపంచాన్ని గూర్చి మనం ఆలోచించాలంటే ముందు మనకు ప్రపంచాన్ని గురించిన అనుభూతి అవసరమౌతుంది. అనుభూతి అనే పునాది, దాని ప్రేరణం లేకుండా మనం ఏ అభిప్రాయాన్నీ నిర్మించుకోలేం. అనుభూతుల ఆధారం లేనిదే భావాలు ఏర్పడ జాలవు.

ఒక మనుష్యుని చిన్నతనం నుంచీ సమాజం నుండి విడదీసి యేకాంతంలో పడవేసి యుంచితే, ఆ మనుష్యుని మెదడు పరిమాణం ఇతరులమెదడుతో సమానంగానే ఉన్నప్పటికీ, ఇతరులవలె అతడు ఆలో

చించలేదు. అతని భావాలూ, వాటి ఆవరణా చాలపరిమితమై యుంటాయి. అదే విధంగా ఆదిమ మానవునిభావాలూ, వాటి ఆవరణలు కూడ ఈనాటి నాగరిక మానవునితో పోలిస్తే – ఉభయుల మెదడు తూకం సమంగానే ఉన్నప్పటికీ – ఎంతో పరిమితమై యున్నట్లు తెలుస్తుంది. అందువల్ల మన అనుభూతులు, జీవిత వ్యవహారాలు, సాంఘిక సంబంధాలు పెంపు చెందటంపై మన ఆలోచనల, భావాల వికాసం ఆధారపడుతుంది.

సాంఘిక జీవనంలో అనుభూతులనుండి ఆలోచనలు అభివృద్ధి గాంచుతాయి. ఈ అభివృద్ధికి ఆధారం తన సాంఘికజీవితవ్యాపారంకోసం మానవుడు క్రియాత్మకంగా బాహ్య ప్రపంచంతోనెలకొల్పుకునే సంబంధం. బాహ్యప్రపంచంతో సంబంధం అంటే కేవలం బాహ్యపదార్థాల ప్రభావ ముద్రయేకాదు. ఇంద్రియానుభూతి క్రమంలో వికసించే ఆలోచన బాహ్య ప్రకృతితో మానవునికి గల క్రియాత్మక సంబంధాల వికాసంవల్ల కలుగు తుందన్నమాట. మానవునికి పరిసరాలతోగల క్రియాత్మక సంబంధం యెంత అధికశ్లిష్టతకూ, వైవిధ్యతకూ గురియౌతుందో అతని చైతన్య స్వభావంకూడ అంత అధికశ్లిష్టతకూ వైవిధ్యతకూ లోనౌతుంది. దీన్నే "ఒక వ్యక్తి మేధోసంపద అతని వాస్తవ సంబంధాలపై ఆధారపడుతుం" దని మార్క్స్ పేర్కొన్నాడు. ఈ విషయంలోఒక యంత్రాన్ని గూర్చిన ఇంజనీరు అవగాహనకూ, ఒక సామాన్యుని అవగాహనకూ ఎంతభేదం ఉంటుందో మనమిదివరకే చూచాం.

ఇతర యే జంతువులతో పోల్చినప్పటికీ మానవుని అనుభూతి లేక చైతన్యం యెంతో విస్తృతంగా ఉంటుంది. దీనికి కారణం మానవ జీవితం విస్తృతమైన ప్రయోజనాలనూ కార్యకలాపాలను కల్గియుండటమే. తన ప్రయోజనాల, వ్యవహారాల అభివృద్ధిక్రమంలో అందుకు సంబం ధించిన గ్రాహకశక్తులనుకూడ మానవుడు పెంపుజేసుకున్నాడు. తన జీవితవ్యవహారాలనూ, అనుభూతులనూ అభివృద్ధిపరచుకోవడంలోనే మానవుడు తన భావసంపదనూ, ఆలోచనాశక్తినీ పెంపుజేసుకున్నాడు. అలా పెంపొందిన తన భావాలు ఆలోచనల ద్వారా మానవుడు తిరిగి తన వ్యవహారాల్లో, అనుభూతుల్లో నూత్నాభివృద్ధిని చేకూర్చుకున్నాడు.

కనుక జీవిత వ్యాపారాభివృద్ధి, తత్ఫలితంగా కలిగే చైతన్యాభివృద్ధి, ఆ చైతన్యాభివృద్ధివల్ల తిరిగి జీవిత వ్యాపారాభివృద్ధీ పరస్పర సంబంధంగల ఒక గతితార్కికక్రమంలో కొనసాగుతుంది. తత్ఫలితంగా జీవితపరిణామం నిరంతరం పురోగమిస్తుంది.

పశుపక్ష్యాదులకంటె మానవునిలో ఎన్నోరెట్లు అనుభూతి నైశిత్యమూ, ఆలోచనా నైపుణ్యమూ పరిణతి పొందగలవు.

> "ఒక డేగ మనిషికంటె చాల దూరంచూస్తుంది. కాని మనిషి కన్ను డేగకంటె పదార్థంలో యెక్కువ విశేషాలను చూడగలదు. అలాగే కుక్క ఘ్రాణశక్తి మానవుని ఘ్రాణశక్తికంటె నిశితం. కాని మానవుడు నిర్దిష్టపదార్థాలలో గ్రహించే నిర్దిష్టమైన వాసనల్లో నూరో భాగాన్నికూడ కుక్క గుర్తించలేదు. అలాగే స్పర్శకూడ. వానరం కంటె నరునిచేతి స్పర్శాజ్ఞానం ఎంతో పరిణతమైనది." ఎంగెల్స్

నిజమే - గడియారాలు బాగుచేసేవాని కంటి నైశిత్యంతో, అత్తర్లు వాసన చూచేవాని అనుభూతితో, కుండలు తయారుచేసే కుమ్మరి స్పర్శాజ్ఞానంతో డేగనూ కుక్కనూ వానరాన్నీ పోల్చిచూస్తే, మానవ అనుభూతి ఎంత అధికమైనదో బోధపడుతుంది.

ఇలాంటి ఉన్నతమైన మానవానుభూతి, దాని విస్తృత పరిధి మానవుని జీవితక్రమంలో రూపొందింది. ఆదిమ మానవుడు కాళ్ళపై నిటారుగా నిల్చొని నడువ గలగటం, మెడను నలువంకలా త్రిప్పి చూడ కలగడం, చెట్లెక్కి కాయ గసురులను కోసుకొనేబదులు చేతులను క్లిష్టమైన పనులలో వినియోగించడం, పనిముట్లనూ ఉత్పత్తి సాధనాలనూ నిర్మించుకొనడం మున్నగు జీవిత వ్యవహారం అంతా అతని ఉన్నత చైతన్యానికి ఆధారం.

మానవుని జీవితవ్యాపారం క్రమాభివృద్ధి గాంచినకొలదీ, పరిసర ప్రపంచంతో అతనికి గల సంబంధాల పరిజ్ఞానంకూడ పెంపుచెందింది. మనుష్యుడు ఒక ప్రత్యేకమైన ఉన్నతస్థాయి, విస్తృత పరిధి గల అవగాహన చేకూర్చుకున్నాడు.

ఇంతవరకు అనుభూతి సంకేతక్రమం వర్తించినది. పిదప రెండవ సంకేత క్రమమైన భాష రూపొందుతుంది. భాషను సాధించుటతో అనుభూతి మూలకమైన నిర్దిష్టావగాహనలు గుణీకృత, సామాన్యీకృత భావాలుగా రూపొందాయి. ఐతే, ఆపైన రెండవ సంకేతక్రమం ప్రాథమిక సంకేతక్రమంపై వేసిన ప్రతిప్రభావం అనుభూతుల ఇతోధికాభివృద్ధికీ, ఆ అభివృద్ధి తిరిగి భావాల ఇతోధికాభివృద్ధికీ చక్రక్రమంలో దోహదం కలిగించాయి. ఈ విధంగా మానవ వ్యవహారంలో మేధ యొక్క అవగాహన శక్తి సాధింపబడి క్రమాభివృద్ధి గాంచింది.

ఈ జ్ఞానోత్పత్తి క్రమాన్నిగూర్చి ఇటీవలివరకు శాస్త్రీయ దృక్పథం పెంపొందలేదు. విజ్ఞానశాస్త్రాల వెనుకబాటుదనమే ఇందుకు కారణం. కనుక తత్వశాస్త్రం జ్ఞానోత్పత్తి వికాసాలను తరచు వ్యక్తి పరంగామాత్రమే నిరూపించి జ్ఞాననిరూపణల సామాన్యీకరణలో కేవల ఊహాగానంపై ఆధారపడింది. అందువల్ల జ్ఞానసిద్ధాంతాల సామాన్యీకరణలో నిరాధారములైన అనేక పొరబాటు ధోరణులు, నమ్మకాలు కొనసాగాయి.

ఉదాహరణకు క్రీ॥పూ॥ 6వ శతాబ్దంనాటి కపిలుని జ్ఞానసిద్ధాంతం. సాంఖ్యులు, ఇంద్రియాలు బాహ్య పదార్థాల అనుభూతులను కల్గిస్తవనీ. మనస్సు అనుభూతులను అవగాహనలుగా పెంపొందిస్తుందనీ, ఇందులో అహంకారచైతన్యమేర్పడి అవగాహనలను నిరూఢపరుస్తుందనీ, ఆపైన బుద్ధి అవగాహనలను భావాలుగా ప్రత్యేకిస్తుందనీ, భావాలు ఉన్నత అనుమాన జ్ఞానంగా ఆత్మయొక్క వినియోగానికి చెందుతాయనీ వ్రాశారు. ఇదేవిధంగా గ్రీకు తాత్వికులుకూడ ఇంద్రియాలు అనుభూతులను పొందటం, పిదప ఆ అనుభూతులు అవగాహనలుగా పెంపొందటం, ఆపైన చైతన్యం వాటిని భావాలుగా ప్రత్యేకించటం, పిదప హేతువాద జ్ఞానం ఆ భావాలను నిర్ణయాలుగా మార్చటం జరుగుతుందన్నారు.

ఈ నిరూపణలు వాస్తవమైనవే. కాని ఈ నిరూపణలు వ్యక్తిగత ఆధారాన్నికల్గి తర్కంపై ఆధారపడియున్నాయేకాని, అంగజీవి పరి

ణామాభివృద్ధి క్రమపరిశీలనపై కాదు. ఈనాడు జీవశాస్త్రం ఇంద్రియ రహితజీవదశలోని ఉత్తేజనలను, సేంద్రియదశలోని అనుభూతులను, ఇంద్రియజ్ఞాన సమన్వయపు అవగాహనలను, ఆపై ఈ ప్రాథమిక జ్ఞానం తన ఉన్నతపరిణామంలో అవగాహనలనుండి భాషద్వారా భావాలు, హేతువాదం ద్వారా నిర్ణయాలు నిరూపణలుగా పెంపొందేక్రమాన్ని ప్రయోగాత్మక పరిశోధనలద్వారా వివరించింది. ఈ విధంగా, జ్ఞానసిద్ధాంత సామాన్యీకరణ విజ్ఞానశాస్త్ర ఆధారాన్ని చేకూర్చుకుంది. అయితే, జ్ఞాన సిద్ధాంతపరిశీలనలో మనం మధ్యయుగపు కేవల తార్కిక నిరూపణలకూ, ఈనాటి భౌతికశాస్త్ర నిరూపణలకూ మధ్యగల గుణాత్మక భేదాన్ని గుర్తించటంలో తికమకపడరాదు.

*శ్రమానుక్రమం*

మానవుడు సంఘజీవి. అతడు సమాజంలో నివసిస్తూ తోటి మానవులతోకలిసి పనిచేస్తాడు. మానవుని జీవితవిధానం మొత్తం సాంఘికమైనదే. అందువల్ల మానవుడు సాంఘిక వ్యవహారంలో తన అనుభూతులను రూపొందించుకుంటాడు. అలాగే అనుభూతులతో ప్రారంభించి భావాలనూ, ఆలోచనలనూ, తిరిగి ఉన్నతభావాలను సాంఘిక వ్యవహారంలోనే నిర్మాణం చేసుకుంటాడు.

సాంఘిక వ్యవహారం అంటే యేమిటి? సమాజ జీవితానికి అవసరమయ్యే "శ్రమ" యే సాంఘిక వ్యవహారాని కంతటికీ కీలకం. కనుక మానవుడు తన ప్రాథమికమైన అనుభూతులను శ్రమలో, శ్రమ ద్వారా చేకూర్చుకుంటాడు. అలాగే శ్రమ ఆధారంపై తొలిసారిగా తన మెదడు నుపయోగించి ఆలోచించడం ప్రారంభిస్తాడు. శ్రమలోనే భావాలను రూపొందించుకుంటాడు. వాటిని వ్యక్తీకరిస్తాడు. అంటే మానవుడు భాషనూ, ఆలోచననూ శ్రమలో నిర్మాణం చేసుకుంటా డన్నమాట. కనుక భాషకు, ఆలోచనలకు పునాది శ్రమే నన్నది గమనార్హం.

ఎంగెల్స్ యిలా వ్రాశాడు: "శ్రమ మానవుని అస్తిత్వానికంతకూ మౌలికమైన సంబంధం. ఒక విధంగా శ్రమయే మానవుణ్ణి సృష్టించిందని చెప్పవలసియుంటుంది."

ఎలాగ? మానవపరిణామంలో ముందు నిటారుగా నిల్చొనటంతో మొదటిమెట్టు ప్రారంభమయింది. దీనివల్ల చేతులు 'నడక' నుండి విడివడ్డాయి. ఆ పిదప చేతులతో ఆదిమ మానవుడు క్రొత్తపనులు ప్రారంభించాడు. అతడు పనిముట్లనూ, సాధనాలనూ రూపొందించుకొని వాటిద్వారా బాహ్యప్రపంచాన్ని మార్చివేయుట, తన జీవితావసరాలను ఉత్పత్తి చేసుకొనటం ప్రారంభించుటతో మానవుని చరిత్ర, మానవసమాజపుచరిత్ర ప్రారంభమైంది.

రాళ్ళను విసిరి శత్రువులనుకొట్టడం, గాలంతో చేపలుపట్టడం మున్నగు ప్రాథమిక వ్యవహారాలలో రాళ్ళు, గాలాలు తొలి పనిముట్టుగా పనిచేశాయి. ఐతే యే జంతువుకూడ తన అవయవాలనేకాని, ఇతర పదార్థాలను పనిముట్లుగా, సాధనాలుగా వినియోగించుకొనే చైతన్యాన్ని కలిగియుండదు. కనుక పనిముట్ల సాధనాల వినియోగం మానవచరిత్రకు నాందీపాఠమౌతుంది. ఈ తొలిదశలో మానవులు తమ ఆహారసాధనకై వేటపరికరాలనూ, ఆత్మరక్షణకై ప్రత్యేక సాధనాలనూ వినియోగించుకున్నారు. వారు సమష్టిగా మృగాలను వేటాడారు. సమష్టిగా ఆత్మరక్షణకు చర్యలు గైకొన్నారు.

అందుకనే మార్క్స్-ఎంగెల్సులు యిలా వ్రాశారు:

"మానవచరిత్రకు తొలిభూమికగా సజీవ మానవవ్యక్తుల అస్తిత్వాన్ని అంగీకరించాలి. అందుచేత ఆ వ్యక్తుల శారీరకవ్యవస్థను, తన్మూలకమైన బాహ్య ప్రకృతితోడి సంబంధాన్ని ముందు నిరూపించాలి. అలా నిరూపించాక ఆ మనుష్యులు యేంచేస్తారో, వారి వ్యవహారం యేమిటో, జీవితవిధానం యెలాంటిదో నిర్ధరింపవలసియుంటుంది. మానవులు తమ శారీరకనిర్మాణాని కనుగుణ్యంగా యెప్పుడైతే జీవితావసరాలను ఉత్పత్తి చేసుకుంటారో అప్పుడే జంతుజాలంనుండి విడివడతారు. తమ జీవితావసరాలను సాధించుకొనడంద్వారా మానవులు తమ భౌతిక జీవితాన్నికూడ పరోక్షంగా నిర్మాణం చేసుకుంటారు."

ఈ ప్రకారంగా జీవితావసరాలను నిర్మించుకొనడం ద్వారాను, తద్వారా తమ భౌతిక జీవితాన్ని పరోక్షంగా నిర్మించుకోవడం ద్వారాను మానవులు మానవులుగా వ్యవహరిస్తారు. ఇందులో మానవుని ఆంగిక నిర్మాణంకూడ పాత్రవహిస్తుంది. ఐతే మానవులు మానవులుగా వ్యవహరించడం అంటే, వారు తమ సాంఘికవ్యవస్థను అభివృద్ధిచేసుకోవటం, తమ చరిత్రను తామే నిర్మించుకోవటం, ఆ కృషిలో భావాలను రూపొందించుకొని ఆలోచించడం, మాట్లాడటం ప్రారంభిస్తా రన్నమాట.

*మానవశ్రమ : దాని ప్రత్యేక లక్షణాలు*

ఇతర జంతుజాలానికిలేని కొన్ని ప్రత్యేక లక్షణాలు మానవుని శ్రమకు వున్నాయి.

1. మొదటి లక్షణం : మొదట మానవులు పనిముట్లను, సాధనాలను నిర్మించుకుంటారు. వాటి నిర్మాణంలో ప్రకృతిపదార్థాలను మార్చివేస్తారు. వాటి గుణధర్మాలను తమ ప్రయోజనాలకు అనుగుణ్యంగా వినియోగించుకుంటారు. ఉదాహరణకు ఒకచెట్టు కొమ్మతో చేతికర్రను తయారుచేసుకోటం. చేతికర్ర ఆత్మరక్షణకూ, చీకటిలో దారిపోల్చి చూచుటకూ, ఇంకా యితర అవసరాలకూ పనికివస్తుంది.

దీన్నే మార్క్స్ యిలా వివరించాడు :

> "శ్రమ పరికరం ఒక పదార్థం, లేక పదార్థాల సంయోగం. దాన్ని శ్రమచేసే వ్యక్తి తనకూ తన శ్రమకు గురిఅయ్యే వస్తువుకూ మధ్య నెలకొల్పుతాడు. తద్వారా తన శ్రమ కార్యంలో దాన్ని వినియోగపరుస్తాడు. ఆ విధంగా కొన్ని పదార్థాల భౌతిక, రసాయనిక, యాంత్రిక ధర్మాలను తన ఉద్దేశాల కనుగుణ్యంగా ఇతర పదార్థాలను నిర్మించుకొనడానికి వినియోగపరచుకొంటాడు".

ఉదాహరణకు నాగలి. రైతు కొయ్యతో నాగలి చేస్తాడు. ఆ నాగలితో పొలం దున్నుతాడు. నేలను దుక్కిగామారుస్తాడు. ఫలితంగా పైరు పండిస్తాడు.

జంతుజాలంకూడ తమ శారీరకధర్మాలకు అనుగుణ్యంగా పదార్థాలను మార్చి అమర్చగలవు. ఉదాహరణకు పక్షులు రెల్లుతో గూళ్ళు కట్టుకుంటాయి. చీమలు పుట్టపెడ్తాయి. కాని అవి పదార్థాల గుణధర్మాలనూ ప్రాకృతిక శక్తినీ జీవితావసరాల నిర్మాణానికి వినియోగించవు. అంటే తమ అవసరాలకు అనుగుణ్యంగా పరిసరాలను మార్చివేసి పెద్దపెట్టున వినియోగపరచుకోలేవు. అంటే, పనిముట్లద్వారా ప్రకృతిని మార్చజాలవన్నమాట. అవి తమ అవయవాలను మాత్రమే పనిముట్లుగా వినియోగిస్తాయి.

"పనిముట్టు ఒక ప్రత్యేక వ్యవహారానికి చెందేది. అది ప్రకృతిపైనా, ఉత్పత్తిపైనా మానవుని పరివర్తనశీలమైన ప్రతిచర్య."
— ఎంగెల్స్.

"జంతువులుకూడ పరిమితంగా పనిముట్లను కలిగియుంటాయి; ఆ పనిముట్లు వాటి శరీరఅవయవాలే. చీమ, తేనెటీగ దీనికి ఉదాహరణలు. జంతువులుకూడ ఉత్పత్తివ్యవహారం కొనసాగిస్తాయి. కాని మానవునితో పోలిస్తే వాటి ఉత్పత్తి కార్యాల ప్రభావం దాదాపు అగణ్యమే. ఒక్క మానవుడు మాత్రమే ప్రకృతిపై తన గాఢ - స్థిర ముద్రవేయటంలో విజయం పొందాడు .... ఇది వృక్షసంతతినీ, జంతుజాతినీ ఒకస్థలంనుండి మరోస్థలానికి మార్చటంవరకే కాదు. మానవుడు తన నివాస ప్రదేశపు లక్షణాల్నీ, వాతావరణాన్నీ వృక్ష పశు జాతులతోసహా తారుమారు చేయటంవరకూ జరుగుతుంది. ఇలా మానవ వ్యవహార ఫలితం భూప్రపంచంపై ఏనాటికీ మాసిపోనంత గాఢంగా ఉంటుంది." — ఎంగెల్స్.

మానవుడు జనపదాలను సృష్టించడం, పంట పొలాలను నిర్మించటం, పాడిపశువులను సాకటం, వస్త్రాలను నేయటం మున్నగు వ్యవహారాలన్నీ పై వాక్యాలలో ద్యోతకమవుతాయి.

ఎంగెల్స్ యింకా ఇలా అన్నాడు:

"జంతువులు తమ వ్యవహారం ద్వారా ప్రకృతిని మానవునిలాగే మారుస్తాయి, కాని మానవుని అంతగాకాదు. ఒకవేళ జంతు

వులు కూడ తమ పరిసరాలపై గాఢ ముద్ర వేసినప్పటికీ అది చైతన్య యుత చర్యద్వారా కాదు. జంతువులకు సంబంధించినంతవరకు అదొక యాదృచ్ఛికఘటన మాత్రమే.కనుక మానవుడు జంతుజాలంనుండి ఎంత హెచ్చు దూరం చేరుకుంటాడో ప్రకృతిపై అతనిముద్ర అంత ఉద్దేశపూర్వకమైన దవుతుంది; మరియు ఒక నిర్దిష్ట లక్ష్యంకోసం చేసే సంయోజిత చర్యవల్ల యేర్పడినదవుతుంది.

"ఒక్క మాటలో చెప్పాలంటే, జంతుజాలం బాహ్య ప్రకృతిని వినియోగించుకొంటుంది; తద్వారా తన అస్తిత్వంవల్ల ప్రకృతిలో మార్పును కల్గిస్తుంది. కాని మానవుడు తన మార్పుద్వారా కూడ ప్రకృతిని తన ప్రయోజనాలకై శాసిస్తూ వినియోగించుకుంటాడు."

పైవాక్యాలు మానవశ్రమయొక్క ప్రత్యేకతను నిరూపిస్తున్నాయి. మానవుడు తన శ్రమద్వారా ప్రకృతిపై ఆధిపత్యం వహిస్తాడు. పనిముట్ల ద్వారా ప్రకృతిని తన లక్ష్యాలకు అనుగుణ్యంగామార్చివేసి వినియోగించు కుంటాడు. అంతేకాదు. తాను ముందే నిర్ధరించుకొన్న ఫలితాలకై, నిర్ధరించుకున్న రూపాల్లో పరిసరాలను మార్చివేస్తాడు.

దీన్నే మార్క్స్ యిలా వివరించాడు :

"శ్రమానుక్రమంలో మానవ వ్యవహారం శ్రమ పరికరాల సాయంతో, ముందే మానవుడు ఉద్దేశించిన పద్ధతిలో అతడు పనిచేసే పదార్థంలో మార్పును కల్గిస్తుంది."

కర్రతో ఒక వడ్రంగి కుర్చీని, బల్లను కూడ తన ఇష్టానుసారం చేసివేయగలడని మనకు తెలుసు. ఐతే కుర్చీలూ, బల్లలూ చేయడంలో వడ్రంగి పనితనం, నైపుణ్యం పెంపొందుతాయి. అందువల్ల అతడు మేలి రకంకుర్చీలూ, బల్లలూ చేయప్రారంభిస్తాడు. అలాగే మానవుడు శ్రమాను క్రమంలో వృద్ధిచెంది -తన చైతన్యస్థాయిని పెంపొందించుకుంటాడు. దీని ఫలితమే గుర్రపుబండి కాలక్రమంలో మోటారుకారుగా మారడం.

2. రెండవ లక్షణం : మానవశ్రమకు చెందిన రెండవప్రత్యేక లక్షణం సహకారయుత వ్యవహారం. ఈ రెండవ ప్రత్యేకలక్షణం రూపొందేది మొదటి లక్షణంనుండే.

పనిముట్లను చేసి వాడటంలో, ప్రకృతి పదార్థాలను తన లక్ష్య సాధనకై వినియోగించడంలో మానవుడు తన లక్ష్యాలనుగూర్చిన చైతన్యాన్ని కలిగియుంటాడు. అంటే తాను సాధించగోరే ఫలితాన్ని గూర్చి అతడు కొన్నిభావాలను కలిగియుంటా డన్నమాట. అందువల్లనే అతడు చైతన్యయుతమైన ఉద్దేశమూ, పథకము తో పనిచేయగలుగు తున్నాడు. ఐతే ఈ ఉద్దేశమూ పథకమూ, వాటికి చెందిన చైతన్యమూ సమాజజీవితంగా రూపొందుతవి. మానవుడు సంఘజీవిగా వ్యవహ రిస్తాడు. సమష్టికృషి సాగిస్తాడు.

తేనెటీగలుకూడ సమష్టిగా, సహకారభావంతో తేనె పెరలను నిర్మిస్తాయి. కాని అది వాటి సహజప్రవృత్తి. పిచ్చుకలుకూడ అలాగే సహజ ప్రవృత్తులమూలంగా గూళ్ళు కట్టుకుంటాయి. అవి తమ ప్రవృత్తులకు అధీనమైయుంటూ జీవితచర్యకు అనుగుణ్యమైన కొన్ని పనులనే కొనసాగించగలవు. కాని మానవుడు చైతన్యవంతుడు. అందు కని అతడు చైతన్యయుతమైన పథకాలను రూపొందించుకొని అమలుకు తేగలడు పశువులు, పక్షులు ప్రవృత్తిమూలంగా పనిచేస్తాయేగాని చైత న్యంతోకాదు. అంటే అవి ప్రవృత్తులకు బానిసలు. మానవుడు అలాకాక తన చైతన్యానికి యజమానిగా ఉంటాడు.

మార్క్స్ యిలా వ్రాశాడు :

"మనం ముందే శ్రమను ఒక స్వరూపంలో ఊహించగలం. ఇది మానవ శ్రమయొక్క ప్రత్యేకముద్ర. ఒక సాలీడు గూడునల్లు కొనటం నేత పనిని (అల్లకం) పోలియుంటుంది. తేనెటీగ తన పెరల నిర్మాణంలో ప్రదర్శించే నేర్పు గొప్ప గొప్ప వాస్తుశాస్త్రజ్ఞుల్ని కూడ సిగ్గుపడేటట్లు చేస్తుంది. కాని ఒక అధమాధముడైన వాస్తు శాస్త్రజ్ఞునికీ, ఒక ఉన్నతోన్నతమైన తేనెటీగకూ గల భేదం ఏమంటే, వాస్తుశాస్త్రజ్ఞుడు తాను నిర్మించబోయేభవనాన్ని వాస్తవంగా దాన్ని ప్రారంభించేముందు తన ఊహలో చిత్రించుకోగల్గుతాడు. ఈ శక్తి తేనెటీగలో లేదు. కనుక, ప్రతి శ్రమక్రమంవల్ల చేకూరగల

ఫలితం, ఆ శ్రమ ప్రారంభదశలోనే శ్రామికుని భావనలో ఉండియున్న దన్నమాట."

పశువులు, పక్షులు తమ ప్రవృత్తులను మార్చుకోలేవు. ప్రవృత్తి వలని చర్య గుడ్డి అలవాటువల్ల జరిగే పనిలాంటిది. కాని చైతన్యం అలాకాదు. మానవుడు తన ఇచ్ఛను వినియోగించి బుద్ధిపూర్వకంగా ఒక చర్యను కొనసాగించుట కది వీలుకల్గిస్తుంది

మానవుని జీవితవ్యవహారం, అతడు రూపొందించుకొనే లక్ష్యాలు, ఆ లక్ష్యాల సాధనకై శ్రమయొక్క అవసరం, అది పెంపొందడంవల్ల ఉన్నతతర కర్తవ్యనిర్వహణ, సమష్టికృషి ప్రాధాన్యతచెందడం - ఈ విధంగా సాంఘికపరిణామం ముందుకు సాగుతుంది.

*శ్రమ, వాక్కు, ఆలోచన*

మానవ శ్రమయొక్క రెండు ప్రత్యేక లక్షణాలను మనం పైన చూచాం. ఒకటి పనిముట్లు, సాధనాల వినియోగం ద్వారా బాహ్య పదార్థంలో మార్పులు కలిగించటం. రెండవది సహకారయుతంగా ముందే నిర్ధరించుకొన్న ఫలితాలను చైతన్యయుతంగా సాధించుకొనడం. ఈ లక్షణాలవల్లనే భాష- ఆలోచనలు కూడ అభివృద్ధిచెందుతాయి. కనుక భాష, ఆలోచనలు శ్రమలో రూపొంది, తిరిగి శ్రమయొక్క అభివృద్ధికి తోడ్పడతాయి.

శ్రమయొక్క మొదటిలక్షణం మొదటి సంకేతక్రమానికీ, రెండవ లక్షణం రెండవ సంకేతక్రమానికీ చెందుతాయని వేరే చెప్పవలసిన పనిలేదు. ఐతే ఈ రెండుక్రమాల పరస్పరాధారం ఉత్తరోత్తర దశల్లో ఉన్నత స్థాయిలలో జరిగే అభివృద్ధికి ఆధారమౌతుంది.

"చేతి అభివృద్ధివల్ల కలిగిన శ్రమద్వారా ప్రకృతిపై యేర్పడ్డ యాజమాన్యం ప్రతి మెట్టులోను మానవుని జ్ఞానావరణను విస్తృత పరచింది. అతడు ప్రకృతి పదార్థాల్లో నిరంతరం నూతన ధర్మాలను కనుగొనసాగాడు." —ఎంగెల్స్.

శ్రమ దాని ఆదిమరూపాల్లో కూడ, అంటే చేపలుపట్టుకొనేందుకు వేటసాధనాలను నిర్మించుకునే ప్రాథమిక దశలోకూడ మానవుడు కొత్త పదార్థాలను అవగాహన చేసికొనుటకు, ఆ అవగాహనను విస్తృత పరచుకొనుటకు ఆధారమవుతుంది. అంటే జ్ఞానావరణ పెరుగుదలకు తన వ్యవహారణద్వారా ప్రకృతిపదార్థాల్లో కొత్తకొత్త గుణధర్మాలను కనుగొనుటకు ఆధారమౌతుంది. ఈ విధంగా శ్రమ ప్రకృతిపై మానవుని యాజమాన్యాన్ని నిరంతరం పెంపొందించటం మూలంగా ప్రతి కొత్త స్థాయికీ మానవుని అనుభూతి (ప్రకృతియొక్క గుణధర్మాలను గూర్చిన) విస్తరిల్లుతుంది. ప్రతి నూతనాభివృద్ధి దశ వినూత్న విస్తృతితోడి అనుభూతినీ, నూతన పరిశోధననూ, నూతన విస్తృతితోడి విజ్ఞానాన్నీ రూపొందిస్తుంది.

"మరోవైపు శ్రమ సమాజగతులైయున్న సభ్యమానవులను సన్నిహితపరుస్తుంది. పరస్పర సహకారాన్ని, ఐక్యకృషిని పెంపొందిస్తుంది. వ్యక్తిగత వ్యవహారంకంటె సమష్టి ఆచరణవలనే (విశాల) ప్రయోజనాన్ని స్పష్టీకరిస్తుంది. ఇలా నిర్మాణాత్మక శ్రమలో మానవులు ఒకరితో మరొకరు మాట్లాడుకొనే స్థితి రూపొందుతుంది."

— ఎంగెల్స్.

మానవులు మొట్టమొదట ఒకరితో ఒకరు మాట్లాడుకునే విషయం వారు ఉపయోగించే వస్తువుల గుణధర్మాలకూ, సాధింపవలసిన లక్ష్యాలకూ, మరియు సహకారరూపంలో వారు సాధించుకోవలసిన ఫలితాలకూ సంబంధించియుంటుంది. ఈ వ్యవహారం సంభాషణలేకుండా సాధ్యం కాదు. జంతువులవలె అరవడం, కేకలుపెట్టడం, ఏవో కొన్ని సౌంజ్ఞలు చేయడంవల్ల యీ ఆవశ్యకత నెరవేరదు. అందువల్ల అర్థవంతమైన శబ్దనిర్మాణంద్వారానే పదార్థవిజ్ఞానాన్ని సంకేతపరచవలసి వస్తుంది.

ప్రాచీన శిలాయుగానికి చెందిన ఆదిమవాసుల గేయాలు, నాట్యాలు, చిత్రాలు అత్యధికంగా వేటనుగూర్చి ఉండేవి. ఆనాడు సాహిత్యమూ, కళలూ వేటను అనుకరించాయి; మరియు ప్రోత్సహించాయి కూడ. ప్రాచీన శిలాయుగంలో వేటయే ప్రధానమైన ఉత్పత్తి వ్యవహారం.

ఆ కాలంలో చిన్న చిన్న తెగలుండేవి. ఈ తెగలు సమష్టిగా వేటాడి, తాము చంపిన జంతువుల మాంసాన్ని సమష్టిగా వినియోగించుకునేవారు. అలాగే వారి గేయాలూ, నాట్యాలు కూడ బృందవ్యవహారాలే. దీన్నిబట్టి మనం భాషయొక్క ప్రాథమిక వ్యవహారం యెలా జీవనవిధానానికి సన్నిహితమైయుందో గమనించవచ్చు

ఎంగెల్స్ యిలా వ్రాశాడు :

"అత్యున్నతాభివృద్ధికి చెందిన జంతువులుకూడ పరస్పరం వ్యక్తంచేసుకొనే స్వల్పాంశాలను అర్థవంతమైన భాష లేకుండానే ప్రకటించవచ్చు."

ఐతే భాష మానవ ప్రత్యేకమైన ఉన్నత జీవితదశకు చేరుకున్నప్పుడే రూపొందుతుంది.

జంతువులుకూడ కొన్ని ప్రత్యేక పదార్థాల ఉనికిని పరస్పరం వ్యక్తీకరించుకుంటాయి. పిట్ట తన గూటివద్దకు పామువస్తే కీచుకీచుమని అరుస్తుంది. కాకులు అరుపులద్వారా గుమిగూడుతవి. తేనెటీగలు ఒక విధమైన సౌంజ్ఞలద్వారా, ఒక తరహా (నాట్యం) ఎగరడంద్వారా తేనె యేదిక్కున దొరుకుతుందో ఇతర తేనెటీగలకు సూచిస్తాయి పెద్ద ఈగ ఇతర ఈగలను వాటివాటి నిర్దిష్టమైన పనులుచేయటానికి ప్రోత్సహిస్తుంది. అలాగే చీమలు బారుగా కదలిపోయి తమ ఆహారాన్ని పోగుచేసుకుంటాయి. ఇందుకు అవి కొన్ని సౌంజ్ఞలను ఉపయోగిస్తాయి. కాని ఈ వ్యవహారమంతా ఈ పరిమితివరకే. ఒకవేళ ఈ జంతువులు పదార్థాల విభిన్నగుణధర్మాలను పరస్పరం తెలుపుకొని, ఆ పదార్థాలను యెలా వాడాలో, ఎలాంటి సమష్టిచర్యద్వారా ఏ పథకం ప్రకారం తమ లక్ష్యాలను సాధించాలో అనే విషయాలను పరస్పరం వ్యక్తీకరించుకోవలసివస్తే - ఆ అవసరం వాటి పిలుపులు, సౌంజ్ఞలద్వారా నెరవేరటం అసాధ్యం. ఎందుకంటే ఆ పరిస్థితుల్లో పదార్థాల నిర్దిష్టతనేకాక సామాన్యతను కూడ గుర్తించవలసియుంటుంది. జంతుజాలానికి అలాంటి అవకాశంలేదు. ఐతే, సాంఘిక శ్రమయొక్క అతి ప్రాథమికరూపాల స్వీకారంతోనే మానవునికి పదార్థాల సామాన్యతను గుర్తించి వ్యక్తీకరించవలసిన

అగత్యమేర్పడుతూంది. మానవులకు ఈ విధంగా పరస్పరం వ్యక్తీకరించుకోవలసిన విషయం ఉంది. అందువల్లనే మానవులు ఒకరితో ఒకరు సంప్రదించుకునే సాధనాన్ని నిర్మాణం చేసుకున్నారు. ఉత్పత్తి సాధనాలను, పనిముట్లను రూపొందించుకొనడంలోనే భాషయొక్క అగత్యమేర్పడుతుంది,

ఎంగెల్స్ భాషయొక్క పుట్టుకను యిలా వివరించాడు : "ఈ అవసరం అందుకు చెందిన అవయవ నిర్మాణానికి దారితీసింది. అభివృద్ధిరహితమైన వానరుని కంఠస్వరపేటిక (Larynx) మెల్లమెల్లగాను, సునిశ్చితంగాను వృద్ధిగాంచిన కదలికలతో మార్పుచెందింది. నోటి అంగాలు క్రమంగా ఒక్కొక్క పదాన్నే ఉచ్చరించటం నేర్చుకున్నాయి. భాష శ్రమానుక్రమంలో పుట్టిందనే ఈ వివరణ శాస్త్రీయమైనదని ఇతర జంతువులతో పోలికద్వారా నిర్ధారణైంది."

పదార్థాలనుగూర్చి, వాటి గుణ ధర్మాలనుగూర్చి, ఆ గుణధర్మాల ఉపయోగాన్నిగూర్చి మానవులు పరస్పరం వ్యక్తీకరించుకోడం అవసరమైంది. ఈ అవసరానికి అనుగుణ్యంగా మానవుడు తన కంఠ స్వరపేటికనూ, మరియు నోటి భాగాల ఉపయోగాన్ని ఎలా అభివృద్ధి చేసుకున్నదీ ఎంగెల్స్ వివరించాడు. ఈ ప్రక్రియ మానవుని మేధపైన ప్రభావం వేసింది. ఈ ప్రభావాన్నే పావ్లావ్ రెండవ సంకేతక్రమపు అభివృద్ధిగా నిరూపించాడు. భాషాసంకేతం మొదటి సంకేతక్రమపు వాస్తవాన్ని గుణీకరించుటకు, సామాన్యీకరించుటకు అవకాశం కల్గించింది. అంటే ఇంద్రియానుభూతివల్ల బాహ్యపదార్థాలతో కలిగే తక్షణ సంబంధాలను భాష భావాలలోకి అనువాదం చేసిందన్నమాట. ఆ విధంగా పరోక్ష జ్ఞానానికి అది మార్గంచూపింది.

### భావాలు

మానవుడు జంతుదశనుదాటి తన ప్రత్యేకతను నెలకొల్పుకున్న దశకు శబ్దసంకేతక్రమం చెందుతుంది. అనుభూతులనుండి భావాలకూ, ఆలోచనలకూ పురోగమించిన దశను అది ప్రతిబింబిస్తుంది.

భావాలు రెండవ సంకేతక్రమానికి చెందేవని మనకు విదితమే. అంటే ఇంద్రియానుభూతులవలె అవి ప్రత్యక్షపదార్థాల తక్షణ సంబంధాలకు చెందవు. ఇంద్రియానుభూతివల్ల కలిగే అనుభవాన్ని అవి ప్రకటించవు. పదార్థాల గుణధర్మాలనూ, సంబంధాలనూ భావాలు గుణీకరించి వ్యక్తంచేస్తాయి. మనం తీరికలో ఆలోచిస్తాం. కనుక ఒకానొక పదార్థాన్నిగూర్చిన మన భావం ఆ పదార్థపు ప్రత్యక్ష సంబంధపు తక్షణ ప్రతిబింబంగా కాక గుణీకృత సామాన్యీకృత ప్రతిబింబంగా వుంటుంది. ఇలా విభిన్న పదార్థాల సామాన్యతలకూ, వాటి గుణధర్మ సామాన్యతలకూ సంబంధించిన పరోక్షానుభూతికి చెందినదే భావం. భావం మానవ మేధయొక్క ప్రత్యేక పరిణతివల్లకలిగిందన్నమాట.

ఇంద్రియానుభూతిద్వారా మనం మన యెదుటనున్న పదార్థాలను గురించి ప్రత్యక్షఅనుభూతిని పొందుతాం. తోడ్తో ఆ పదార్థాల సహజగుణధర్మాలను, వాటితో మనకుగల సంబంధాలను మాత్రమేకాక వాటి కొత్త గుణధర్మాలను, వాటి సంబంధాలనుకూడ వివేచన చేయగలం.

ఉదాహరణకు మన మొక మామిడిటెంకను నాటుతాం. ఆ టెంక క్రమంగా ఎలా మొక్కఔతుందో, ఎలా వృక్షమౌతుందో, ఎలా మామిడిపండ్లను కాస్తుందో మనకు తెలుసు.

ఈ వ్యవహారం భావం ద్వారా మాత్రమే, పదార్థాల గుణధర్మాలను సంబంధాలను గుణీకరించటంద్వారా మాత్రమే సాధ్యమౌతుంది. అందుకని, మనం విభిన్నపదార్థాలతో యేమి చేస్తామో, వాటి గుణధర్మాలను యెలా యే ఉద్దేశంతోమార్చి వినియోగపరుస్తామో భావంద్వారా వివేచించగలం. మన ఆలోచనల, భావనల, పథకాల మహత్తు ఇందులోనే ఉంది.

మనం పదార్థాలతో ఏమి చేయాలో, వాటిల్లో యెలాంటి మార్పులు కలిగించదలచుకున్నామో ఆలోచిస్తాం. ఆ మార్పులను సాధించుటకు మార్గాలను కనిపెడ్తాం. ఆలోచనల్లో ప్రయోగాలను కొనసాగిస్తాం. పరిస్థితుల్లో మార్పులు కల్గించటానికి యేమి చేయాలో, అసలేం జరగాలో పథకం వేస్తాం. ఆలోచనాత్మకమైన ఈ మానసిక ప్రయోగంయొక్క

ఫలితాలను ఆచరణలోకి తెస్తాం. ఆ ఆచరణయొక్క ఫలితాలనుబట్టి ఆలోచనలను సరిదిద్దుకుంటాం. ఇలా ఆలోచన – ఆచరణ గతితార్కిక సమన్వయంతో పురోగమిస్తాయి.

ఆలోచనలు, భావాలు క్రమానుక్రమంలో రూపొందుతాయి. అవి తిరిగి క్రమాభివృద్ధికి ఆధారమౌతాయి. మనం తీరికలోకూడ ఆలోచించగలం. కాని మొదటి సంకేతక్రమానికి, రెండవ సంకేతక్రమానికి గల సమన్వయం, "తీరికలోని మన ఆలోచనలకూ శ్రమకూగల సమన్వయం" అన్నమాట. అంటే అనుభూతి పునాదిపైన ఆ అనుభూతి నుండి ఫలితం పొందడానికే తీరికలో ఆలోచిస్తామన్నమాట.

ఐతే, ఇక్కడ మనం భావాలను ప్రతిబింబాలుగా భ్రమపడరాదు. భావాలకూ ప్రతిబింబాలకూగల భేదాన్ని మనం గుర్తించాలి. ఉదాహరణకు ఒకరంగును గూర్చిన మన భావం ఆ రంగుయొక్క (అనుభూతి) ప్రతిబింబంకాదు. కొందరు అనుభవవాద తాత్వికులు (Empiricists) భావాన్నీ, ప్రతిబింబాన్నీ కలగాపులగం చేస్తారు. కాని వాస్తవంలో ఈ రెండూ వేర్వేరే. ప్రతిబింబాలు మొదటి సంకేతక్రమానికి చెందినవి. వాటికి ఆధారం ఇంద్రియానుభూతి. కాని భావాలు రెండవ సంకేతక్రమపు అభివృద్ధివల్ల ఏర్పడుతాయి. వాటికి ఆధారం శబ్దజ్ఞానం (భాష). అనుభూతి ప్రతిబింబం గుణీకరణకూ, సామాన్యీకరణకూ ఆధారంకాదు. భావం వాస్తవికతయొక్క గుణీకరణకూ, సామాన్యీకరణకూ సమర్థమౌతుంది.

ఉన్నత జంతువులూ, మానవులుకూడ మెదడులో పదార్థాల ఊహాప్రతిబింబాలను కలిగియుండవచ్చు. ఉదాహరణ కొక నక్క తాను కుందేలును వేటాడుతున్నట్లూ, తరుముతున్నట్లూ, వెదకుతున్నట్లూ, చంపివేస్తున్నట్లూ తన మనస్సులో చిత్రించుకొని, ఆ ప్రతిబింబపు క్రమాన్నంతా ఆచరణలో వాస్తవంగా మార్చుకోగలదు. తన్మూలంగా నక్క కుందేటి వేటలో అనేక యుక్తులనూ, వ్యూహాలనూ, తెలివితేటలనూ ప్రదర్శించవచ్చు. కాని నక్క వేటకోసం తన కాళ్ళనూ, నోటినీ, తదితర అవయవాలనేగాని పనిముట్లనూ సాధనాలనూ సృష్టించుకోజాలదు. కనుక దాని ఊహలన్నీ ఇంద్రియానుభూతివరకే.

మానవుడు పై రీతిలో ఆలోచించడు. కుందేళ్ళను వేటాడుటకు అతడు యెలాంటి వలలను వాడవచ్చో, వేటకుక్కలతో ఎలా పని తీసుకోవచ్చో, ఎలా తుపాకిని వాడవచ్చో మున్నగు ఆలోచనలు చేస్తాడు.

కనుక ఎంతచిన్న పనిముట్టునైనాసరే ఉత్పత్తిసాధనంగా ఉపయోగపరచడం మానవునికేగాని జంతువులకు సాధ్యంకాదు. అందువల్ల ఉత్పత్తిసాధనాల వినియోగంలో మానవుడు పదార్థాలనుగూర్చిన అనుభూతిని మానసిక చిత్రాల రూపంలో కల్గియుండటమేగాక, ఆ పదార్థాల గుణధర్మాలను తన ఉద్దేశాల కనుగుణ్యంగా మార్చుకోవాలన్న భావాన్నికూడ అదనంగా కల్గియుంటాడు. మానవుని ఉన్నత చైతన్యం యొక్క ప్రత్యేకత ఇదే.

ఇంద్రియానుభూతికంటె ఆలోచన ఉన్నతమైన చైతన్యరూపం. ఇంద్రియానుభూతిఅంటే ఒక పదార్థం గ్రహణేంద్రియంపై వేసే ప్రభావం వల్ల రూపొందే ప్రతిబింబం. కాని ఎప్పుడైతే మానవుడు భావాలను చేకూర్చుకుంటాడో, పదార్థాలు తన యెదుట నిర్దిష్టంగా లేనప్పటికీ అవి ఎలాంటి స్వరూపాలను కల్గియున్నప్పటికీ వాటి ప్రత్యేక స్వభావాన్నిగూర్చి ఆలోచన చేయగలడు. విభిన్నపదార్థాలు విభిన్నపరిస్థితులలో యెలా మార్పుచెందుతాయో, యెలాంటి ప్రభావం కల్గిస్తాయో, వాటి విభిన్నసామర్థ్యాలేమిటో, పరస్పర సంబంధాలేమిటో, పదార్థం మారే పద్ధతులేమిటో భావాల ద్వారా మానవుడు ఆలోచించగలడు. అందుకే అతడు ప్రకృతిని కూడా మార్చివేయగలడు.

ఉదాహరణకు, ఎలాంటి మామిడిటెంక ఎలాంటి ఫలవృక్షమౌతుందో, దానికి మరో మామిడిమొక్కను ఎలా అంటుకట్టవచ్చో, ఇంకా యితర మొక్కలనుకూడ అంట్లుగా ఎలా వినియోగించవచ్చో, ఎలాంటి తోటలు యెలాంటి లాభాలను చేకూరుస్తాయో, వాటికి యెలాంటి ఎరువులు అవసరమో మున్నగు వివరాలన్నిటినీ ఉద్యానశాస్త్రవేత్త ఆలోచించగలడు.

కనుక, భావాలేర్పడ్డంవల్ల చైతన్య పరిణామంలో వినూత్నాభివృద్ధిచేకూరిందన్నమాట. మానవచైతన్యంలో ఈపురోభివృద్ధి ఒకప్రత్యేక

మైన మానసిక జీవిత వికాసం. మానవుడు పనిముట్ల నిర్మాణం ద్వారా జంతుదశనుండి విడివడి మానవ ప్రత్యేకమైన జీవిత విధానాన్ని ప్రారంభించడం ఒక గుణాత్మక పరిణామం. ఈ గుణాత్మకపరిణామమే మానసిక జీవిత వికాసం. ఐతే జంతుజాలంవలె ముడిపదార్థాలను సేకరించి, వాటిని తిరిగి అమర్చుకొని వినియోగించుకొనడంగాక, మానవుడు ప్రకృతిపై ఆధిపత్యంవహించి పదార్థాలను మార్చివేసి వాటిని తిరిగి పదార్థాల మార్పుకొరకు వినియోగపరచుకొనే క్రమం కొనసాగుతుంది. అంటే ఇది ఇంద్రియానుభూతివల్ల కలిగే చైతన్యప్రవర్తనకాక, పరిసరాల స్వభావాలను వాటి పరస్పర సంబంధాలను ఆ సంబంధాలకు గల కారణాలను తన భావాలద్వారా ఊహలద్వారా వివేచించే ఉన్నత చైతన్యవర్తన అన్నమాట.

## నాల్గవ అధ్యాయం

# ఆలోచన, భాష, తర్కం

మానవుని భావవికాసం భాషాభివృద్ధిపై ఆధారపడి యుంటుంది. భాషలేకుండా ఆలోచనలేదు. శబ్దకోశం, వ్యాకరణసూత్రాలు ఒకానొకభాషలో సమిష్టి అవసరాలకోసం యే విషయాలను ప్రకటించాలోనన్న దానిపై ఆధారపడ్తాయి. విభిన్నభాషల విభిన్న సంప్రదాయాలకు అతీతంగా భౌతికావసరాలు భాషావికసనకు ఆధారమౌతాయి. ఈ అవసరాలే తర్కసూత్రాలను ఆలోచనా పద్ధతులను నిర్మిస్తాయి. భౌతికవాస్తవాల భావ ప్రతిబింబాలకు అవసరమైన తర్కసూత్రాలు సార్వజనీనస్వభావం గలవి.

### భాష, భావాలు

భావాల ప్రత్యేకత ఇంద్రియానుభూతివలన నిర్దిష్టపదార్థాలను గురించిన తక్షణానుభవాల ప్రకటనకాదనీ, వాటి గుణీకృతరూపాల్లో పదార్థాలసామాన్యతలనూ, సంబంధాలనూ వ్యక్తీకరించటమే భావాల ప్రత్యేకత అనీ మనమిదివరకే గమనించాం. ఇది రెండవ సంకేత క్రమఫలితమనికూడ మనకు విదితమే. రెండవ సంకేత క్రమానికి ఆధారం భాష. అందువల్ల ఆలోచన అభివృద్ధీ, వివేచన ఔన్నత్యమూ, భావాల విస్తృతీ అనివార్యంగా భాషాభివృద్ధిపై ఆధారపడియుంటాయి.

ఇంద్రియానుభూతులు నిర్దిష్టపదార్థాలమధ్యగల ప్రత్యక్ష సంబంధాలకు తక్షణ సంకేతాలు. పదాలు ఆ సంకేతాలకు సంకేతాలు. అంటే, పదమూలకమైన భావాలు నిర్దిష్ట పదార్థాలమధ్యగల తక్షణ సంబంధాలకు ప్రతిబింబాలు కావనీ, పదార్థాలగుణీకృత - సామాన్యీకృత నిర్ధారణలనీ గ్రహించాలి.

ఉదాహరణకు మనమొక టేకుచెట్టును చూస్తాం. కొన్ని టేకు చెట్లను చూడటంద్వారా టేకుచెట్ల ప్రత్యేకతను గ్రహిస్తాం. 'టేకుచెట్ట' న్న పదాన్ని నిర్మిస్తాం. అందువల్ల 'టేకుచెట్ట' న్న పేరును మనం వాడినప్పుడు ఆ పదం టేకుచెట్ల ప్రత్యేక గుణాలనూ, సామాన్యధర్మాలనూ వ్యక్తం చేస్తుంది.

ఈ విధంగా పదాలద్వారా మనం పరోక్ష పదార్థాలను, వాటి గుణధర్మాలను, ఉపయోగాలను గూర్చిన సామాన్యాభిప్రాయాలను ప్రకటిస్తాం. కొందరు వ్యక్తులు చెట్లునరికి కలపను సేకరించగోరుతారనుకొండి. అప్పుడు వారు చెట్లను యే పద్ధతిలో నరకాలో, యెలా కొమ్మలు కొట్టివేయాలో, యెలావాటినిపేర్చాలో, యెలా రవాణాచేయాలో మున్నగు పనులన్నిటినీ మాటల ద్వారా ముందేనిర్ణయించుకొని, ఒక ప్లాను ప్రకారం అంతాకలిసి పనిచేయగలరు. భాషాసంకేతాన్ని సాధించాక వారంతటితో ఆగరు ఏయే చెట్లెలా ఉంటాయో, వేటికలప యెలాంటిదో, ఏయేచెట్లు ఏయే ప్రాంతాల్లో ఉంటాయో మున్నగు అనేక విషయాలను ఆలోచించుకుంటారు.

ఇలా శబ్దాల ఉపయోగం మానవుని సాంఘిక వ్యవహారంలో సాంఘికశ్రమయొక్క ఫలితంగాను సాధనంగాను ఉదయిస్తుంది. కనుక భాష తన పుట్టుకతోనే మానవుని సాంఘిక ఆలోచనలకు, భావవ్యక్తీకరణకు సాధనంగా వ్యవహరిస్తుంది. రెండవ సంకేతక్రమమైన భాష ఎవరికివారు ఇతరులతో సంబంధంలేకుండా విడివిడిగా వినియోగించుకొనేందుకు యేర్పడలేదు. అలాయేర్పడే అవకాశంకూడలేదు. అలాకాక మానవుని సాంఘికశ్రమ ప్రారంభమైనప్పటినుండీ ఆ శ్రమక్రమంలో వ్యక్తులు తమ ఉద్దేశాలనూ, భావాలనూ ఒకరికొకరు వెల్లడించుకోవలసిన

అవసరమేర్పడుతుంది. అందుకు సాధనంగా మానవుడు భాషను నిర్మించుకొంటాడు. అంటే సమాజ గతులైయున్న మానవుల అన్యోన్యసంపర్క సాధనంగా భాష రూపొందటంవల్ల రెండవ సాంకేత క్రమం వికసితమౌతుందన్నమాట.

మొదట ఒకానొక సంఘంలో సమష్టి ఉపయోగంద్వారా రూఢి చెందిన శబ్దాలుండాలి. ఆ పిదప సమష్టి వినియోగంద్వారా విభిన్నశబ్దాలను జతపరచి ఒక క్రమంలో వాడే సంప్రదాయం ఉండాలి. ఈ విధంగా శబ్దకోశం - వ్యాకరణం భాషకు ప్రధాన లక్షణాలు.

స్టాలిన్ యిలా వివరించాడు :

"వ్యాకరణం శబ్ద సంస్కార వినియోగ సూత్రాలనూ వాటి సమన్వయ మూలకమైన వాక్య రచనా పద్ధతులనూ నిర్ధరిస్తుంది; ఆ విధంగా భాషకు అర్థపుష్టినీ, సమన్వయతనూ కల్గిస్తుంది."

*భాష, ఆలోచనల అభివృద్ధి*

సాంఘికోత్పత్తికోసం మానవులు పనిముట్లను వినియోగించడం ప్రారంభించినప్పుడే మాట్లాడుకోడం, భాషను నిర్మించుకోడం ప్రారంభిస్తారు. తన్మూలంగా పరిసర ప్రపంచాన్ని గూర్చిన భావాలను పెంపొందించుకో నారంభిస్తారు. కనుక భాష క్రమానుక్రమంలోనే, క్రమనుండే రూపొందింది. భావ వ్యక్తీకరణ - భావవినిమయాల సాధనంగా భాష పుట్టిందన్నమాట. ఇవే దాని ప్రధాన లక్షణాలు.

భాష మానవుని ఉత్పత్తి వ్యవహారంలో జన్మించి, ఆ ఉత్పత్తి వ్యవహారానికి వినియోగపడుతూ, త్వరలోనే మానవుని మొత్తం సాంఘిక సంబంధాలనూ వ్యవహారాలనూ ఆవరిస్తుంది. ఈ స్వభావానికి అనుగుణ్యంగా భాష నిరంతరం ఉత్పత్తి అనే పునాదిని ఆశ్రయించుకొని అభివృద్ధిగాంచుతుంది. ఈ అంశాన్ని వివరిస్తూ స్టాలిన్ యిలా అన్నాడు.

"భాష మానవుని ఉత్పత్తి వ్యవహారానికి నేరుగా సంబంధించి యుంటుంది కేవలం ఉత్పత్తి వ్యవహారానికేగాక మానవుని ఇతర వ్యవహారాలన్నిటికి కూడ అది వర్తిస్తుంది.

"భాష ఒక సాధనం. ఈ సాధనంద్వారా మనుష్యులు పరస్పరం వ్యవహరిస్తారు; భావవినిమయం ద్వారా ఒకర్నొకరు అర్థం చేసుకుంటారు. భాషాసాధనం లేకుండా సాంఘికోత్పత్తి సాధ్యంకాదు; అసలు సాంఘికోత్పత్తి సమస్యేరాదు. కనుక ఒకానొక సంఘంచే అర్థంచేసుకోబడి అందలి వ్యక్తుల కందరికీ వర్తించే భాషలేనిచో, ఆ సమాజంలో ఉత్పత్తి ఛిన్నాభిన్న మవుతుందన్నమాట. అది ఇక సమాజంగా వుండక నశిస్తుందన్నమాట. ఈ అర్థంలో భాష సమాజానికి వ్యవహార సాధనంగా వుంటూ, జీవిత సంఘర్షణకూ సాంఘికాభివృద్ధికీ సాధనమౌతుంది.

"భాష ప్రజల పరస్పర వ్యవహారానికీ, భావవినిమయానికీ, పరస్పర పరిచితికీ జీవితంయొక్క అన్నిరంగాల్లో- ఉత్పత్తి రంగం, ఆర్థిక సంబంధాల రంగం, రాజకీయరంగం, సాంస్కృతిక రంగం- అనుదినమూ ఉపయుక్త మౌతుంది. అందువల్ల భాష యెల్లప్పుడూ ప్రజా సముదాయపు భాషగా వుంటూ ప్రజల మొత్తం చరిత్రతోబాటు నిరంతరాభివృద్ధి జెందుతుంది.

"భాష సమాజ అస్తిత్వంపై నిరంతరం ప్రభావంవేసే సామాజిక శక్తుల్లో ఒకటి. దాని పుట్టుక పెరుగుదల సమాజపు పుట్టుదల పెరుగుదలలతోబాటే. సమాజం నశిస్తే భాషకూడా నశిస్తుంది. భాషను, దాని అభివృద్ధి సూత్రాలను సమాజ చరిత్రనుండీ దాని అవిభాజ్య సంబంధాలనుండీ వేరుపరచి - అంటే భాషా నిర్మాతలు, పోషకులు అయిన ప్రజల చరిత్రనుండి విడదీసి - పరిశీలించడం అసాధ్యమైన విషయం."

కొందరు యువక మార్క్సిస్టులు భాషాభివృద్ధి ఉపరి నిర్మాణపు అంతర్భాగమని వాదించినప్పుడు స్టాలిన్ అది యేవిధంగానూ ఉపరి నిర్మాణం కాదని నిశితంగా మందలించాడు.

ఉపరి నిర్మాణమంటే ఒకానొక ఉత్పత్తి విధానపు వ్యవస్థపై యేర్పడే పైకట్టడం. ఈ కట్టడం ఆర్థిక పునాదిపై ఆధారపడి యుంటుంది; ఆ ఆర్థిక పునాదిని అది బలపరచేదిగాకూడ వుంటుంది. పునాది మారిపోతే

అప్పుడు ఉపరి నిర్మాణంకూడ మారిపోతుంది. ఇలా ఉపరి నిర్మాణం సమాజపు ఆర్థిక సంబంధాలను ప్రతిబింబిస్తూ ఉత్పత్తి విధానం (పునాది) తో పరోక్ష సంబంధం కల్గియుంటుంది. ఉదాహరణకు బానిససమాజం బానిస యజమానుల సంస్కృతినీ, భూస్వామ్యసమాజం భూస్వామ్యసంస్కృతినీ ప్రతిబింబిస్తుంది. కాని భాష అలాకాదు.

భాష ఆర్థికసంబంధాల క్రమంపై ఆధారపడేదికాదు. అది ఆర్థిక విధానంలో పుట్టి ఆ విధానం మారిపోవడంతో అంతరించిపోదు. భాష అనేది ఉత్పత్తి వ్యవహారంతో పరోక్షసంబంధాన్నికాక ప్రత్యక్షసంబంధాన్ని కల్గియుంటుంది. అందువల్ల భాష ఒకానొక వర్గ ఆధిపత్యానికి, వర్గపునాదికి లోబడదు.

భాష ఉత్పత్తి వ్యవహారంలో జన్మిస్తుంది. ఒకానొక భాష ఒకానొక ప్రజాసమూహం యొక్క పరస్పర వ్యవహారానికి సాధనమౌతుంది. కేవలం ఉత్పత్తి వ్యవహారానికేగాక మొత్తం వ్యవహారాలన్నిటికీ అది ఉపయుక్తమౌతుంది. విభిన్న వర్గాలకు చెందిన ప్రజలందరి పరస్పర వ్యవహారానికి వినియోగమౌతుంది. ప్రజలు (సమాజం) యే ఆర్థికవిధానానికి చెందినప్పటికీ, వారిభాష ఆ ఆర్థికవిధానాన్ని బలపరచుటకేగాక దాన్ని మార్చివేసి నూతన విధానాన్ని నెలకొల్పుటకు సాధనంగా కూడ వినియోగ పడుతుంది.

మానవుల ఉత్పత్తి వ్యవహారాల అభివృద్ధిలో భాషలుకూడ వృద్ధి చెందుతాయి. సాంఘిక జీవనంలో భాషలు వికసిస్తాయి. అవి తమ శబ్దకోశాన్నీ, వాటి సమన్వయ క్రమమైన వ్యాకరణాన్నీ మెల్లమెల్లగా మార్చుకుంటాయి. విభిన్న ప్రజల విభిన్న భాషలు వారి వారి పరస్పర వ్యవహారంలో పెంపుచెందుతాయి. ఒక భాషనుండి కొన్ని భాషలు చీలిపోతాయి. భిన్న భాషలు పరస్పర ప్రభావంతో ఒకదానినొకటి మార్చుకుంటాయి. పాతభాషల సమన్వయంలో క్రొత్తభాషలు రూపొందుతాయి. చరిత్రలో ఒక తెగప్రజలు మరొక తెగప్రజలను అణగత్రొక్కినప్పుడు వారి భాషనుకూడ నిర్మూలించడం సాధ్యమౌతుంది.

ఉదాహరణకు, వైదిక సంస్కృత భాషావ్యాకరణం కావ్యయుగం నాటికి క్రమంగా మారిపోయింది. వాడుకలో ప్రాకృతరూపం కొనసాగింది. బౌద్ధయుగంలో ప్రాకృతం పెంపొందింది. పిదప కొన్నాళ్ళకు సంస్కృత ప్రాకృత జన్యభాషలు-బెంగాలీ గుజరాతీ, మరాఠీ మున్నగునవి-రూపొందినవి. హిందీభాష పార్సీ - అరబ్బీ భాషల ప్రభావంవల్ల ఉర్దూగా రూపు దాల్చింది. ఇటీవల ఇంగ్లీషుభాష దేశభాషల పదకోశంలోను వ్యాకరణం లోను కొన్నిమార్పులు కల్గించింది. అదేవిధంగా దక్షిణదేశంలో ద్రవిడం, దాని జన్యభాషలు తెలుగు - కన్నడం - మలయాళం మున్నగునవికూడ పరిణామం చెందినవి. ఈ భాషలు భూస్వామ్య వ్యవస్థకూ నేటి నూతన సాంఘిక వ్యవస్థకూ కూడ వినియుక్తమౌతున్నాయి.

ఇక సంస్కృతి విషయం. సంస్కృతి ఉపరినిర్మాణం. ఉదాహరణకు శిల్పం, సాహిత్యం, న్యాయశాస్త్రం, రాజ్యాంగం మున్నగునవి. ఒక సమాజ విధానం మరొక సమాజవిధానంగా మారినప్పుడు పాత సంస్కృతీ రూపాలు అంతరించి నూతన సంస్కృతీరూపాలు ఉదయిస్తాయి. భూస్వామ్యంలో రాజులు వారి రాతికోటలు ప్రత్యేక వాస్తు సంప్రదాయాలను కలిగియుండేవి. ఈనాడు రాతికోటలఆవశ్యకత లేదు. రాజదర్బారులలో రోచక శృంగారసాహిత్యం కొనసాగింది. ఈనా డది అడుగున పడిపోయింది. ఆనాడు వెట్టిచాకిరీ, నిర్బంధాలే న్యాయం. ఈనాడు కొత్త సివిల్ - క్రిమినల్ ప్రొసీజర్ కోడ్డులు అమలుకు వచ్చాయి. అలాగే సైనికతంత్రం, రాజ్యాంగం ఆమూలాగ్రం మార్పుకు గురియైనవి.

అందుకని మనం భాష, సంస్కృతి ఒకటేనని తికమక పడరాదు. కొన్ని సంస్కృతులు అంతరించి పోయాయి ఉదాహరణకు భారత దేశంలో బౌద్ధం. కాని భాషలుమాత్రం నిరంతరం తమ శబ్దజాలాన్నీ, వ్యాకరణాన్నీ పెంపొందించుకుంటూ, ప్రజలందరికీ వినియోగపడుతూ నిల్చియే యున్నాయి. ప్రజల సంస్కృతిలో మార్పులు కలిగినప్పటికీ పాత - కొత్త దశల్లో ప్రజలచే వాడబడుతూ శిథిల సంస్కృతితోబాటు జీర్ణించిపోకుండా నిలిచియున్న భాషలు, నూతన సంస్కృతీనిర్మాణంలో పాత్రవహిస్తూన్న భాషలు చాల వున్నాయి.

సామ్యవాద సంస్కృతి వుంది. అది సామ్యవాద స్వభావాన్నీ, భాష రీత్యా జాతీయ స్వరూపాన్నీ కల్గియున్నదని సువిదితమే. అనేక భాషలు మాట్లాడే జాతులు, దేశాలు సామ్యవాద సంస్కృతీ నిర్మాణానికి తమతమ జాతీయ భాషలను వినియోగిస్తున్నారు. అయితే సామ్యవాదం ఎన్నడూ దేశభాషలను పెట్టుబడిదారీ భాషలంటూ నిర్మూలించాలని చెప్పదు. పెట్టుబడిదారులకూ, సామ్యవాదులకూ కూడ ఒకేభాష వినియోగపడగలదు. స్టాలిన్ యిలా అన్నాడు:

"సమాజాభివృద్ధిలో ప్రతి కొత్తదశలో సంస్కృతిస్వభావం మారిపోతుంది. కాని భాషమాత్రం అలా మారక విభిన్నదశల్లో పాత కొత్తసంస్కృతులు రెంటికి కూడ ఉపయోగపడుతుంది."

ఇక్కడ మనం భాషాభివృద్ధినీ, ఆ భాషలో ప్రకటింపబడే ఉద్దేశాలనూ కలగాపులగం చేయకుండా వేర్వేరు అంశాలుగా చూడాలి. సాంఘికాభివృద్ధి క్రమంలో విభిన్నవర్గాలు విభిన్నఅభిప్రాయాలను కలియుంటాయి. ఒకానొక సమాజపు సాధికారఅభిప్రాయాలు యుగయుగానికీ మారిపోతూ ఆర్థికపునాదికి సంబంధించియుంటాయి. ఆయా అభిప్రాయాలు ఆయా ఆర్థిక విధానాలనుండి రూపొందుతవి. అవి భాషద్వారా ప్రకటింపబడ్తాయి. ఐతే అభిప్రాయాలు మారిపోతాయి. కాని భాషలు మాత్రం నిల్చియేయుంటాయి.

ఒక వర్గపు వ్యక్తులు తమ వర్గ దృక్పథాలను ప్రకటించుటకు కొన్ని ప్రత్యేక శబ్దాలనూ, నుడికారాలనూ, ఉచ్చారణలనూ వినియోగపరచుకోవచ్చు. కాని వారు ప్రత్యేకమైన ఒక భాషను- శబ్దకోశాన్నీ, వ్యాకరణాన్నీ మాత్రం నిర్మించుకోరు. ఉదాహరణకు ఆంధ్ర వ్యావహారిక భాషా ఉద్యమం. గ్రాంథిక భాషనుకాక వ్యావహారిక భాషను వృద్ధిపరచాలని మనం కోరుతాం. కాని విశ్వవిద్యాలయాలు గ్రాంథిక భాషనే పట్టుకొని వ్రేలాడుతున్నాయి. ఐతే ఆచరణలో యిప్పటికే పత్రికలూ, పుస్తకాలూ వ్యావహారిక భాషను విరివిగా ఉపయోగిస్తున్నాయి. ఎలాగైనా, మనం ఆంధ్రభాషకు బదులు కొత్తభాష రూపొందాలని చెప్పటంలేదు. ఆంధ్ర వ్యావహారిక భాషనే ప్రోత్సహిస్తూ వున్నాం. భాషకు ...ంబం

ధించినంతవరకు మనం కోరేదీ విశ్వవిద్యాలయాధికార్లు కోరేదీ ఒకటే. భాష పరిణామం ఒక్కటే. ఐతే ఆ భాషలో ప్రకటింపబడే భావాల పరిణామాన్నిబట్టి అభిప్రాయ భేదా లేర్పడుతున్నాయి. మన భావాలు భాష ద్వారా ప్రజా సముదాయానికి సులభంగా తెలియాలన్నదే వ్యవహార భాషా ఉద్యమ లక్ష్యం. ఇది విశ్వవిద్యాలయాధికారులకు అట్టే యిష్ట మున్నట్లు కనపడదు. భేదమల్లా ఇదే.

ఎలాగైనా మనం భాష పరిణామాన్నీ, ఆ భాషలో వ్యక్తమయ్యే భావాల పరిణామాన్నీ కలగాపులగం చేయక విడివిడిగా చూడడం అవసరం.

*భాష లేకుండా ఆలోచన సాధ్యమా?*

పదాలద్వారా, పదసమన్వయం ద్వారా భావాలు రూపుదిద్దు కుంటాయి. వాస్తవికత పదాలద్వారా, పదాలతో సమన్వయంగల వాక్యాలద్వారా భావంలో ప్రతిబింబిస్తుంది. ఈ భావాలు గుర్తింపు చెంది పదాలలోను, పదసమన్వయంగల వాక్యాలలోను ఇమిడియున్నప్పుడే నిర్దిష్టరూపాన్ని చేకూర్చుకోగలవు. శరీరం లేకుండా మనస్సు ఉండనట్లే, భాషను విడిచి భావాలుకూడ ఉండవు. కనుక భాషకూ, భావాలకూ పరస్పరాధారం ఉంది.

దీన్నిబట్టి మనం ఆలోచించడమంటే మాట్లాడటం లేక మనలో మనం గొణుక్కోవటం అని అనుకోకూడదు. ఎందుకంటే మనం యే అర్థాన్నీ ఉద్దేశించకుండా కూడ ఏవో కొన్ని శబ్దాలను ఉచ్చరించ వచ్చు. జపం చేయటం అలాంటిదే. కాని అప్పుడు మనం వాడే శబ్దాల్లో అర్థం ఉండదు. అలాగే యే పదాలనూ పైకిగాని స్వగతంగాగాని ఉచ్చరించకుండానే మనం ఆలోచించగలం. అయితే ఆలోచించుటకు ముందు మనకు భాషాపరిజ్ఞానం మాత్రం అవసరం. కనుక మనం భాషను అలవరచుకున్నదశలోనే ఆలోచించగలమన్నమాట. పోతే, మన ఆలోచన లను వ్యక్తీకరించటానికి ఆ ఆలోచనకు సంబంధించిన అన్ని శబ్దాలనూ, వాక్యాలనూ యథాతథంగా ఉపయోగించే అవసరంకూడ ఉండదు.

"క్షేమమా ?" అంటే "మీరూ-మీ కుటుంబమూ వగైరా మీ స్వస్థానంలో కులాసాగా ఉన్నారా" అనిఅర్థం. ఈ ఆలోచనంతా మనం ఒక్క-మాటలో తేల్చేశాం.

ఒక జటిలమైన సమస్యను అర్థంచేసుకొనుటకు ఆ అంశంతో పూర్వపరిచయం గలవారికి కొద్ది పదాలు మాత్రమే సరిపోతాయి. అదే అంశాన్ని కొత్తవారికి వివరించాలంటే చాలమాటలు కావలసివస్తుంది. ఉదాహరణకు ఒక వంతెన నిర్మాణాన్నిగూర్చి ఇద్దరు ఇంజనీర్లు కొద్ది మాటలద్వారా ప్లాను వేసుకోగలరు. ఆ ఇరువురు ఇంజనీర్లకూ బ్రిడ్జి నిర్మాణాన్ని గూర్చిన విషయ పరిజ్ఞానం ఉంది. అందుకు చెందిన సిద్ధాంతమూ, ఆచరణా వారికీ పూర్వపరిచితం. అందువల్ల కొద్దిశబ్దాలలోనే వారికి పూర్వపరిచిత విషయం స్ఫురణకు వస్తుంది. కాని ఇంజనీర్లు కాని వారికి బ్రిడ్జి నిర్మాణాన్ని గూర్చి తెల్పాలంటే చాలామాటలు, చాలా విషయాల వివరణ అవసరమౌతుంది.

అందువల్ల ఆలోచనాక్రమంలో ఆట్టే శబ్దాలను వినియోగించనవసరం లేకుండానే మనం విషయాన్ని గ్రహించవచ్చు. దీనికి మన మానసిక సంస్కారం - అంటే విషయాన్ని గూర్చిన పూర్వపరిచయ జ్ఞానం-కారణమౌతుంది. ఐతే, దీన్ని సాగదీసి, ఎవరైనా శబ్దక్రమానికి అతీతమైన ఆలోచనాక్రమం ఉంటుందనీ, భాషద్వారా వ్యక్తీకరించలేని ఆలోచనాక్రమం ఉంటుందనీ చెప్తే అదొక అపోహ మాత్రమే.

"భాష ఉదయించకముందే మానవమేధలో భావాలు ప్రారంభమైనాయనీ, భావాలు భాష అనే భౌతిక సాధనానికి అతీతంగా విడిగా నగ్నంగా ఉదయిస్తాయనీ చెప్పడం శుద్ధ తప్పు. మానవ మేధలో ఉదయించే ఏ భావాలుకానీ, అవి పుట్టడం, అస్తిత్వం కలిగియుండటం భాష అనే భౌతిక సాధనం ద్వారానే. కాబట్టి భాషా భూమికను విడిచిన కేవల భావాలనేవి ఉండవు. 'భావంయొక్క-సూటి వాస్తవికత భాష' అని మార్క్సు అన్నాడు. అంటే భావం యొక్క- వాస్తవికత భాషలో అభివ్యక్తి చెందుతుందన్నమాట. భావ

వాదులు మాత్రమే భాషలేకుండా మానవుడు ఆలోచించటం గూర్చి కబుర్లు చెప్పగలరు." — స్టాలిన్.

ఐతే, పై వాక్యాల అర్థం ఆలోచనలకూ, శబ్దాలకూ భేదం వుండదని కాదు. భావాలు – ఆ భావాలను వ్యక్తీకరించే నిర్దిష్టశబ్దాలలో లేక వాక్యాలలో ఇమిడివుంటాయనే దీని అర్థం. కనుక భావాలు వాటి వ్యక్తీకరణకు భిన్నమైన అస్తిత్వాన్ని విడిగా కలిగియుండవు.

తెలుగులో ఎరుపు ఇంగ్లీషులో రెడ్ అని రెండు విభిన్నశబ్దాలు. ఒకానొక రంగును గూర్చిన ఒకే భావాన్నవి ప్రకటిస్తున్నాయి. కనుక అసలు భావాన్ని ఎరుపు శబ్దంతోను లేక రెడ్ శబ్దంతోను ఇటో అటో విడదీసే వీలులేదు. భావం ఒకటే కాని మాటలు వేర్వేరు. కాని అంత మాత్రాన యెరుపురంగును గూర్చిన భావం దాన్ని వ్యక్తీకరించే పై రెండు శబ్దాలనుండీ విడివడి వేరేగా వుండదు. అలాగే యెరుపురంగు ఆ రంగును కల్గిన పదార్థాలనుండికూడా విడివడి వేరేగా వుండదు. కనుక ఎరుపు అన్నా, రెడ్ అన్నా యీ రెండు శబ్దాలూ వేర్వేరు భాషల్లో ఒకే భావాన్ని వ్యక్తీకరిస్తాయి. ఎర్రవస్తువు ఇంగ్లండులోను ఎరుపే. ఆంధ్రరాష్ట్రంలోను ఎరుపే. కనుక బాహ్యపదార్థంతో మానవునికిగల సంబంధాన్ని భిన్నభావాల భిన్నశబ్దాలు ఒకే వాస్తవక్రమంలో ప్రకటిస్తాయి.

ఇలా మేధయొక్క ఆలోచనా వ్యాపారం బాహ్యపదార్థాలతో మానవునికుండే సంబంధాల వ్యక్తీకరణయే. అందువల్ల ఆలోచన భాషకు ముందే భాషతో విడివడికాకుండా భాషఅనుసాధనంద్వారా వ్యక్తీకరణ చెందగలుగుతుంది. కనుక భాషలేకుండా ఆలోచనన్నది అనూహ్యమైన విషయం.

*భాషాసంప్రదాయాలు, వాటి వ్యక్తీకరణ*

భాషలో శబ్దాలు అనియతంగా పుడతాయి. ఒక భాషలో ఎరుపు అంటాం. మరో భాషలో రెడ్ అంటాం. కాని తెలుగు మాట్లాడేవారంతా ఎరుపు" అనే పదాన్ని వాడటం సంప్రదాయం. అలాగే

ఇంగ్లీషువారంతా "రెడ్" అనే పదాన్ని వాడ్డం సంప్రదాయం. కనుక శబ్దం అనియత సాంప్రదాయ స్వభావం కలిగియుంటుంది.

శబ్దనిర్మాణంలో కంఠధ్వని నియతి వుండాలనిలేదు. ఒక వస్తువుకు లేక భావానికి ఒక ధ్వని వుండాలన్న నియతక్రమం లేదు. ఒకే పదార్థానికి లేక భావానికి భిన్నభాషల్లో భిన్న కంఠధ్వనులు గల శబ్దాలను వాడవచ్చు. అందువల్ల భాష అనియతలక్షణాన్ని కలిగియుంటుంది. కాని ఒక భాషలోగల ఒకానొక ధ్వనిగల శబ్దాన్ని అదే ధ్వనిలో ఆ భాషకు చెందినవా రంతా వాడుతారు. అందువల్లనే భాష లక్షణం 'అనియత - సాంప్రదాయకత్వం' అని పేర్కొన్నాం.

భాషయొక్క అనియత-సాంప్రదాయక లక్షణాలనుగురించిన నిర్వచనం తత్వశాస్త్రచర్చల్లో చాలా ముఖ్యమైనది. భాషయొక్క అనియతస్వభావాన్నిబట్టి భావవాదులు శబ్దానికీ, పదార్థానికీగల సంబంధాన్ని గూర్చి చాలా తికమకలు కల్గించారు. పదార్థానికీ, శబ్దానికీ గల సంబంధం అనిర్వచనీయమైనదనీ, విచిత్రమైనదనీ వారు భావించారు. ఈ సంబంధంలోని సాంప్రదాయకతను వారు శంకించారు. భౌతికమైన సాంప్రదాయలక్షణం కంటె వేరైన మరొక ఆంతరకారణం ఉందని ఊహలు సల్పారు. శబ్దాన్ని (వేదం అనే అర్థంలో) అపౌరుషేయమంటుంది మతం. అద్వైతం నామరూపాలను 'మాయ' అంటుంది. అంటే పదారానికీ, దాని పేరుకూ గల సంబంధం అనిర్వచనీయమని చెప్తుంది.

మొత్తంమీద పదార్థానికీ శబ్దానికీ గల సంబంధంలో మనస్సుకు ప్రత్యేకమైన పాత్ర కలదని భావవాదులు అనేక వాదనలు చేస్తారు. ప్రతి పదార్థానికీ ఒక పేరు వుండటం, మరోపేరు ఉండకపోవడం దైవనిర్దేశమని వారు భావిస్తారు. మంత్రశాస్త్రజ్ఞులు మనిషిపేరును ఉచ్చరిస్తూ ఆ పేరుకు చెందిన వ్యక్తిపై చేతబడి చేయవచ్చునంటారు. శ్రాద్ధాల్లో పేర్లు చెప్తూ పిండప్రదానం చేస్తారు. ఆ యా దేవతలపేర్లు ఆ యా దేవతల స్వభావాలకు 'బీజా'లని మీమాంసకులంటారు; జపతపాల్లో బీజాక్షరాలద్వారా ఆవాహనల తంతు సాగిస్తారు.

తార్కికులు దైవం అన్న శబ్దమే దేవుని ఉనికికి ప్రమాణ మంటారు. ఇలా భాషనుగూర్చి శాస్త్రచర్చల్లో అనేక తికమకధోరణు లున్నాయి.

కాని భాషకు ఆధారమైన శబ్దకోశమూ, శబ్దాల వినియోగాన్ని గూర్చిన వ్యాకరణమూ కూడ సంప్రదాయ జనితములే. విభిన్న భాషలు విభిన్న వ్యాకరణ సూత్రాల ననుసరిస్తాయి. అందుకనే వ్యాకరణ సంప్రదాయాల్లో భేదాలుంటాయి. తెలుగులో నీటిని నపుంసక లింగంగాను, ఉర్దూలో పుంలింగంగాను వాడుతారు. సంస్కృతంలోద్వివచనం ఉంటుంది. ఈ ద్వివచనం తెలుగులోలేదు. ఒకేభాషలో సైతం 'బియుటి' 'బట్'ఐతే 'పియుటి' 'పుట్' ఔతుంది. ఈ వైవిధ్యతలున్నా ప్రతిభాషకుసాంఘికమైన సాంప్రదాయక అంగీకారం వుంది. ఆ యా భాషల సంప్రదాయ భేదాలు వాటి ప్రారంభదశనుండే వుంటున్నాయి. ఐనప్పటికీ ఒక భాషలో వ్యక్తమయ్యే భావాన్ని మరొక భాషలోకి అనువదించుకోవటం సాధ్యమే. అన్నిభాషలూ ఒకే పదార్థ విజ్ఞానాన్ని ఆధారం చేసుకొని యున్నాయి. అందువల్ల భాషల శబ్దకోశ వైవిధ్యం, వ్యాకరణ సూత్రాల వైవిధ్యం ఆయా భాషల సాంప్రదాయ లక్షణాలనుబట్టి వుంటే, భాషల పదార్థ వ్యక్తీకరణ సార్వజనీనమైనదిగా వుంటుంది.

కనుక ఒకానొక భాషలో శబ్దాలుగా రూపొందే కంఠ ధ్వనులనూ, ఆ శబ్దాల సమన్వయానికి సంబంధించే వ్యాకరణ సూత్రాలనూ పరిశోధించుటకు సంప్రదాయమే ఆధారం. సంప్రదాయ మూలకం అంటే నిర్దిష్ట చారిత్రిక కారణాలవల్ల, నిర్దిష్ట ప్రజాసమూహంచే శబ్దాలు ఉపయుక్త మౌతాయన్నమాట. ఒక దేశప్రజలు తమ భావాలను ఒక భాషలో రూపొందించుకుంటే మరొకదేశప్రజలు మరొక భాషలో రూపొందించుకుంటారు. ఇది సంప్రదాయం. కాని దీని అర్థం ఆయా ప్రజలంతా కలిసి కూడ బలుక్కొని భాషాసూత్రాలనూ శబ్దాలను రూపొందించు కుంటారనికాదు. ప్రజల జీవితక్రమంలో శబ్దాలూ, వాటి వినియోగానికి చెందిన భాషా సంప్రదాయాలూ మొదట సహజంగాను, అనిర్దిష్టంగాను ఆవిష్కరణ చెందుతాయి. ఐతే జీవితం పురోగమించడంతో, పిదపటిదశల్లో నిఘంటువులూ వ్యాకరణాలూ యేర్పడి. భాషా సంప్రదాయపు చైతన్యయుత

సూత్రీకరణలు గ్రంథస్థమౌతాయి. ఇలా భాషా సంప్రదాయం శాస్త్ర బద్ధమౌతుంది.

శబ్దకోశమూ, వ్యాకరణమూ పైవిధంగా సంప్రదాయ మూలకములు. కాని పదార్థ విజ్ఞానం సంప్రదాయ జనితంకాదు. కనుక మనం ప్రకటించే వాస్తవిక జ్ఞానం యే భాషలో, యే శబ్దాలలో, యే వ్యాకరణ సూత్రాల ప్రకారం ప్రకటించినప్పటికీ, అది మానవ నిర్మిత సంప్రదాయాలకు చెందినదై ఉండదు. కనుక భాషద్వారా వ్యక్తమయ్యే పదార్థం (వాస్తవం) ఆ భాషను మాట్లాడే ప్రజల భౌతిక పరిస్థితులను జీవితావసరాల చైతన్యంచే నిర్ధరింపబడుతుంది.

ఉదాహరణకు మనం యే కంఠధ్వనుల నుపయోగించినప్పటికీ ప్రజల నిత్యజీవితాని కవసరమయే సమస్త పదార్థాలకూ, వాటి గుణ ధర్మాలు మొదలైనవాటికి వర్తించే శబ్దజాలాన్ని కల్గియుండాలి. సమాజంలో క్రమక్రమంగా ఉత్పత్తివిధానం పరిణతి చెందినకొద్దీ పదార్థ విజ్ఞానమూ, దానికిచెందిన శబ్దకోశమూ విస్తృత మవుతాయి.

శబ్దాల సమన్వయంలో వాక్యాలు రూపొందుతవి. మనం శబ్దాలను వ్యాకరణ సూత్రాల ప్రకారం సమన్వయిస్తాం. ఐతే వాక్యాలద్వారా మనం వ్యక్తీకరించే పదార్థసంబంధాలు సంప్రదాయమూలకమైనవి కావు. వ్యాకరణ సూత్రాలు సంప్రదాయమూలకమైనవి. కాని శబ్దసమన్వయంలో ప్రతిబింబించే పదార్థ సంబంధాలు సంప్రదాయానికి కాక, భౌతిక వాస్తవానికి చెందినవి. కనుక భాషకు సంప్రదాయమూలకమైన వ్యాకరణ సూత్రాలున్నప్పటికీ, ఆ భాష పదార్థాలనూ, వాటి పరస్పర ప్రభావాలనూ, వాటికీ వాటి గుణధర్మాలకూ మధ్య సంబంధాన్నీ, ఆ గుణధర్మాల మార్పులలోగల మానవ సంబంధాన్నీ వివరించాలి. ఇది జీవితక్రమానికి చెందిన వ్యక్తీకరణయే. కనుక విభిన్న భాషలు విభిన్న వ్యాకరణ సంప్రదాయాలను అనుసరించినప్పటికీ ఆ సంప్రదాయాలు అన్నిభాషలకూ సర్వసామాన్యమైన పదార్థవిజ్ఞానాన్నే ప్రతిబింబిస్తాయి.

ఈరూపంలో వివిధ భాషాభేదాలు స్వరూపంలో భేదాలే; ఆ భాష లన్నిటిస్వభావం మాత్రం ఒకటి. ప్రజలు తమ భాషా సంప్రదాయాలను

నిర్మించుకుంటారు. శబ్దకోశాన్నీ, వ్యాకరణాన్నీ నిర్ధరిస్తారు. కాని అంతమాత్రాన మానసిక జీవితపు ప్రత్యేకత ఋజువుకాదు. ఏ శబ్దకోశ వ్యాకరణ సంప్రదాయమైనా వివరించే విషయం అన్ని భాషలకూ సమానంగా వర్తించే భౌతికావసరాలే. ఈ అవసరాలను భాష పదార్థ ప్రతిబింబరూపంలో వ్యక్తంచేస్తుంది. జీవితంయొక్క ఈ అవసరాలే పదార్థవిజ్ఞానపు ఆవరణకు లేక విస్తృతికి ఆధారమౌతాయి.

*భాష, తర్కం*

"భాష ఆలోచనతో సూటిసంబంధం కలది. అంటే, భాష ఆలోచనల ఫలితాలను లేక మానవ విజ్ఞానాన్ని రిజిష్టరు చేస్తుందన్నమాట. అలా రిజిష్టరుచేసి శబ్దాలలోను, శబ్ద సమన్వయమైన వాక్యాలలోను వ్యక్తీకరిస్తుంది." — స్టాలిన్.

దీని అర్థం ఏమిటి ? మనం యే ఆలోచనాఫలితాలను వ్యక్తీకరించవలసి వచ్చినా, యేభాషలో వ్యక్తీకరించవలసివచ్చినా భౌతిక వాస్తవికత యొక్క మనోప్రతిబింబానికి అది అనుగుణ్యంగా వుండాలి. ఈ అనుగుణ్యతలోనే ఆలోచనాపద్ధతులు లేక తర్కసూత్రాలు రూపొందుతవి. అందువల్ల ఆలోచనలు, భావాలు భౌతిక వాస్తవపు ప్రతిబింబాల వ్యక్తీకరణలే. ప్రతిబింబక్రమంలో భౌతిక ప్రపంచం ఆలోచనారూపాలలో అనువదింపబడాలి. కనుక ప్రతిబింబక్రమం లేదా అనువాదవిధానం యీ అగత్యాన్ని నెరవేర్చే సాధనాలను నిర్దేశిస్తుంది. అంటే ఆలోచనాపద్ధతులను లేక తర్కసూత్రాలను నిర్ణయిస్తుంది.

ఆలోచనా పద్ధతుల లేక తర్క సూత్రాల ప్రథమ లక్షణం సుగ్రాహ్యమైన ప్రతిపాదనలను రూపొందించటం. ఇందులో సూటియైన ప్రతిపాదనలు, క్లిష్టమైనవి కూడా వుంటాయి. సూటి ప్రతిపాదనలు పదార్థపు ఉనికినీ, పదార్థ రాహిత్యాన్నీ, గుణసంబంధాన్నీ వ్యక్తీకరిస్తాయి. ఉదాహరణకు మన యెదుట ఒక పుస్తకముంది. లేక

మన యెదుట పుస్తకంలేదు. మన యెదుటగల పుస్తకం 'తత్వశాస్త్రం'. ఈ ప్రతిపాదనలు ప్రత్యక్షమైన అనుభూతి సంకేతానికి చెందినవి.

ఇక శ్లిష్ట ప్రతిపాదనలు. శ్లిష్ట ప్రతిపాదనలు సూటి ప్రతిపాదనలతో పోల్చి చెప్పే వాస్తవాలకు చెందుతవి. ఇవి అనుమాన ప్రమాణానికి చెందినవి. అంటే పదార్థాలను గూర్చిన సూటి ప్రతిపాదనలద్వారా పోల్చి చెప్పే పరోక్ష వాస్తవాలకు చెందుతవి. ఈ ప్రతిపాదనలలో మనం దృష్టాంతాలను ఉపయోగిస్తాం. "వలె", "ఐతే", "అప్పుడు", "మరియు" మున్నగు పదాలను వాడటం ద్వారా శ్లిష్ట ప్రతిపాదనలను వ్యక్తం చేస్తాం.

ఈ విషయంలో భారతీయ తర్కశాస్త్రం "తత్పూర్వకం త్రివిద మనుమానం పూర్వవత్, శేషవత్, సామాన్యతో దృష్టంచ" అని సూత్రీకరించింది.

"తత్పూర్వం" అంటే ఇదివరకు చూచిన పదార్థాన్ని గూర్చి అనుభూతి జ్ఞానం కలిగియుండడమన్నమాట. "పూర్వవత్" అంటే కార్యకారణ జ్ఞానం. మేఘమును చూచి వర్షించునని గాని, లేక పొగను చూచి దానికి కారణమగు అగ్నికలదనిగాని గ్రహించుట. "శేషవత్" అంటే ఇదివరకటి అనుభవంద్వారా తెలుసుకున్న దానినిబట్టి పరోక్షపదార్థాన్ని గ్రహించుట. ఉదా: నదిలో మురికినీరు వచ్చినప్పుడు ఆ నది పైభాగాన ఎక్కడో వర్షించియుండునని తెలుసుకొనుట. "సామాన్యవత్" అంటే పదార్థగుణీకృత - సామాన్యీకృత జ్ఞానంవల్ల ప్రమేయాన్ని గ్రహించుట. అంటే అగ్ని యొక్క గుణం సామాన్యంగా పొగను కల్గియుండుట. అందువల్ల అగ్ని యెక్కడ ఉన్నప్పటికీ పొగను చిమ్ముతుంది. ఎందుకంటే అగ్నికీ, పొగకూగల ద్రవ్య - గుణసంబంధం అలాంటిది.

తర్కశాస్త్రం పైవిధంగా వివరించి ఆ పిదప ఉపమానాన్నీ శబ్దాన్నీ కూడ వివరిస్తుంది. ఉపమానంలో సంజ్ఞ - సంజ్ఞి సంబంధ జ్ఞానం. "చలువబట్ట మల్లెపూవువలె తెల్లగా నుండును." ఇ[illegible] సంజ్ఞ

(సంకేతం) "మల్లెపూవు తెలుపు". దీన్నిబట్టి సంజ్ఞ (చలువ వస్త్రం) తెలుపును మనం గ్రహించగలం.

రాత్రైతే చీకటిపడుతుంది. తడిసినప్పుడు దూదిబరువు హెచ్చుతుంది. పులి ఘాతుకజంతువు; అది లేళ్ళను చంపుతుంది. ఈ వాక్యాలలో కూడ పరోక్షంగా ఉపమానమూలకమైన సామాన్యీకరణ వర్తిస్తూ ఉంది.

పై ప్రతిపాదనలన్నీ తర్కసూత్రాలద్వారా లేక ఆలోచనా పద్ధతులద్వారా అమలౌతూ వున్నాయి. ఈవిధంగా తర్కశాస్త్రం మన పదార్థ జ్ఞానాన్ని యే క్రమంలో సుగ్రాహ్యంగా నిర్ధరించాలో చెబుతుంది.

ఆలోచనాక్రమంలో యే ప్రతిపాదనలు యే ప్రతిపాదనలద్వారా రూపొందుతాయో కూడ తర్కశాస్త్రం వివరిస్తుంది. అంటే యే ప్రతిపాదనలకోసం యే ప్రతిపాదనలు అవసరమో చర్చిస్తుంది. ఆ సూత్రాలను మనం చర్చలలో, సిద్ధాంతీకరణలలో వినియోగిస్తాం.

కాని భారతీయ తర్కశాస్త్రం శబ్దప్రమాణాన్నికూడ గుర్తించింది. శబ్దప్రమాణం - అంటే వ్యాకరణ సమ్మతమైన వాక్యపు ప్రామాణికత - జ్ఞానానికి ఆధారమౌతుందనేవరకు ఏ పేచీలేదు. కాని శబ్దంఅంటేవేదాలు కనుక వేదాల్లో వ్రాసినదంతా ప్రమాణమే - అంటే చిక్కులోపడిపోతాం. తర్కశాస్త్రం అలాంటి చిక్కుల్లో పడిపోయిందికూడ. అందుకే "ఆప్తోపదేశః శబ్దః" అంటూ ప్రమేయాల్లో "ఆత్మను" అదృష్టార్థంలో స్వీకారం చేసింది. ఆత్మ లేక దేవుడు కనిపించని సత్యం అని అంగీకరించిందన్నమాట. ఇలాంటి ఋషిప్రోక్తసత్యాలుకూడ ఉంటాయనితర్కశాస్త్రం సూచించింది. గ్రీకు తాత్వికుడు అరిస్టాటిల్ ఒక తర్కశాస్త్రగ్రంథం వ్రాశాడు. పాశ్చాత్యదేశాల్లో ఈయనను తర్కశాస్త్ర నిర్మాతగా గుర్తిస్తున్నారు. ఆయన ఇలా సూత్రీకరించాడు :

"ఒకవేళ 'అ' మొత్తం 'ఇ' యై, 'ఇ' మొత్తంకూడ 'ఉ' ఐతే మొత్తం 'అ' కూడ 'ఉ' యే."

ఈ సామాన్యసూత్రం బాగానే వుంటుంది. కాని ఇలాంటి సూత్రం ప్రతిపా[illegible] వాస్తవికతకు మాత్రం గీటురాయికాదు. ఎందుకంటే యీ

సూత్రం పదార్థాల తార్కిక సంబంధాన్నిబట్టి యుంటుందేకాని, వాస్తవ సంబంధాన్నిబట్టికాదు. ఉదాహరణకు "ఇటలీలో నియంతృత్వం ఉండెను. జర్మనీలో నియంతృత్వం ఉండెను. రష్యాలో నియంతృత్వం ఉండెను. ఇటలీ నియంతృత్వం మంచిదికాదు. కనుక రష్యా నియంతృత్వంకూడ మంచిదికాదు." ఈ వాదన పైకి బాగానేవుంటుంది. కాని ఇటలీలోవున్నది ఫాసిజమ్, జర్మనీలో నాజీజం, రష్యాలో శ్రామిక నియంతృత్వం. ఈ మూడింటిలోనూ మౌలికమైన భేదాలున్నాయి. ఇటలీ, జర్మనీలలో జాతీయ పెట్టుబడితత్వంతో ఫాసిజం, నాజీజం యేర్పడ్డాయి. అలాగే శ్రామికవర్గ నియంతృత్వం "ఒకే సమయంలో ప్రజాపీడకులపట్ల నియంతృత్వమ"నీ, "పీడిత ప్రజలపట్ల ప్రజాస్వామ్యమ"నీ మనం అర్థం చేసుకొంటాం

పై అరిస్టాటిల్ ఉదాహరణలో మనం ముందు 'అ' మరియు 'ఇ'లను గూర్చిన ప్రతిపాదనల్లో వుండే వాస్తవాన్ని పరిశీలించినట్లయితే, మూడవ ప్రతిపాదననుగురించి మనం తిరిగి పరిశీలించే అవసర ముండదని తేలుతుంది. అంటే 'అ' మొత్తం 'ఇ'యై 'ఇ' మొత్తం 'ఉ' ఐతే- తిరిగి 'ఉ' మొత్తం 'ఇ' మొత్తం, మరియు 'అ' మొత్తం ఔతుందా అని వెనుకకు పోనక్కరలేదు. కనుక మొదటి రెండు పరిశీలనల్లో మూడవది కూడా తేలిపోతున్నదని అర్థం. అలాగే మొదటి రెండు ప్రతిపాదనల పరిశీలనలో "వాస్తవం" సరికాకపోతే, మూడవ ప్రతిపాదన వాస్తవమైనా లేక అవాస్తవమైనా కావలసియుంటుందన్నమాట. ఇలా తర్కం ఆలోచనాక్రమాన్ని చెబుతుంది. కాని అది ప్రతిపాదనల "వాస్తవాన్ని" గూర్చి సూచించయదు. కనుక ప్రతిపాదనల వాస్తవాన్ని మనం ఆచరణద్వారా తెలుసుకోవలసిందే.

అలాగే అరిస్టాటిల్ మరొక తర్కసూత్రాన్ని చెప్పాడు: "ఒకానొకగుణం ఒకే పదార్థానికి ఒకే సమయంలో ఒకే దృష్ట్యా ఉన్నదీ లేనిదీ కాజాలదు." ఈసూత్రం సరియైనదే. ఐతే ఇటీవలి తాత్వికులు ఈసూత్రంలోని "ఒకే సమయంలో ఒకే దృష్ట్యా" అన్న సంబంధాలను (Connections) తొలగించి వేశారు. ఆ సూత్రాన్ని "'అ' ఒకే సమ

యంలో 'అ'గాను – 'అ' కానిదిగాను ఉండదు" అని మార్చివేశారు. ఐతే ఈ సూత్రం అర్థరహితమే.

'తాత్వికుడు తాత్వికుడే; విజ్ఞానశాస్త్రజ్ఞుడు కాడు' అని ఒక ప్రతిపాదన. ఐతే ఇది ఎంతవరకు నిలుస్తుంది? ఒక వ్యక్తి ఒకే సమయంలో తాత్వికుడుగాను, విజ్ఞానశాస్త్రవేత్తగాను ఉండవచ్చుగదా "దాత దాతయే; దాతకానివాడుగా ఉండడు" అని మరొక ప్రతిపాదన. కాని ఒక దాత ఒకే సమయంలో కొందరికి దానం చేయనూవచ్చు; మరికొందరికి చేయకపోనూవచ్చు. అలాగే 'సజ్జనుడు సజ్జనుడే; దుర్జనుడుకాడు' అంటే ఒక వ్యక్తి ఒకే సమయంలో కొందరికి మంచివాడుగాను, మరికొందరికి చెడ్డవాడుగాను ఉండే అవకాశముంటుంది.

"ప్రజాస్వామ్యం ప్రజాస్వామ్యమే; నిరంకుశత్వం కాదు" అని ప్రతిపాదన. అయితే ప్రజాస్వామ్యం ఒకే సమయంలో ప్రజలకు ఓటు హక్కు నిచ్చేదిగాను, పరోక్ష పన్నులతో పీడించేదిగాను కూడ ఉంటుంది. అది తిండి గుడ్డల స్వామ్యాన్ని గుర్తించనిదిగాను, పెట్టుబడిదార్ల లాభాల స్వామ్యాన్ని పోషించేదిగాను ఉంటుంది. కనుక ప్రజాస్వామ్యంలో ప్రజాస్వామ్యలక్షణాలూ, నిరంకుశత్వ లక్షణాలూ రెండూ ఉంటాయి.

అందువల్ల ఒక వస్తువును దాని గుణాలను నూటికి నూరుపాళ్ళు ఒకే ప్రక్కకు లాగే ఈ తర్కసూత్రం మరో ప్రక్కకు చూడదు. అదే దాని లోపం.

అసలు అరిస్టాటిల్ సూత్రానికి అర్థం, కొన్ని ప్రతిపాదనలు మరికొన్ని ప్రతిపాదనలతో తార్కికంగా సమన్వయం కాజాలవనీ, పరస్పర విరుద్ధ ప్రతిపాదనలు యేకోద్దేశంలో సమన్వయం కారాదనీ అన్నమాట. ఇంతవరకు అంగీకారయోగ్యమే.

తర్కసూత్రాలు మన ఆలోచనక్రమానికి వర్తిస్తాయేగాని దానికి ఆలంబనయ్యే పదార్థక్రమానికి కాదు. అంటే అవి భౌతికవాస్తవక్రమానికి చెందినవికాక దాన్ని ప్రతిబింబించే మన మానసిక ప్రక్రియకు సంబంధించినవన్న మాట.

బాహ్యపదార్థం ఉంది. దాని కొక క్రమం ఉంది. ఆ క్రమం ఇంద్రియానుభూతిద్వారాను, ఆలోచనద్వారాను మన మేధలో ప్రతిబింబిస్తుంది. ఆప్రతిబింబ ఫలితమే భావాలు. భావాలను మనం వివేచనతో భాషద్వారా ప్రకటిస్తాం. కనుక భావ ప్రతిబింబంలో, వ్యక్తీకరణలో తర్కసూత్రాలు అవసరమే. అయితే ఇక్కడతర్కసూత్రాలంటే సాంప్రదాయికమైనతర్కశాస్త్రసూత్రాలుకావు. ఎందుకంటే అవి మత, తాత్విక విశ్వాసాలకుఅనుగుణ్యమైన అనేక ధోరణులను గుడ్డిగా అంగీకరించాయి. ఉదాహరణకు భారతీయ తర్కశాస్త్రం (న్యాయదర్శనం) ప్రేత్యభావాన్ని (పునర్జన్మను) అపవర్గాన్ని (ముక్తి) అంగీకృత ప్రమేయాలుగా గుర్తించింది. అభ్యుపగమ సిద్ధాంతం అంటూ "అపరీక్షితా అభ్యుపగ మాత్తద్విశేషపరీక్షణం" అంటే ఒక పదార్థాన్ని పరీక్షించకుండానే మనం అంగీకరించి ఆ పదార్థ ధర్మాలను విశేషరూపంలో పరిశీలించాలి అనిఒక సూత్రాన్ని చేసింది. దీనికి ఉదాహరణలుగా శబ్దము ద్రవ్యమనీ, జీవాత్మ జన్యమనీ, బ్రహ్మము జగత్తుకు కారణమనీ మనం పరీక్షించకుండానే అంగీకరించాలంటుంది. అలా అంగీకరించిన ప్రతిపాదనపై చర్చలు జరుపుకోవచ్చునని సూత్రీకరించింది. అంటే, శబ్దం ద్రవ్యంఅని ఒప్పుకోవాలి. ఆ పిదపనే అది నిత్యమా, అనిత్యమా అన్నది ఆలోచించడం. జీవుని పునర్జన్మను ఒప్పుకోవాలి. ఆ తర్వాత జీవుడు నిత్యమా, అనిత్యమా వగైరా ఆలోచించుకోవచ్చు. బ్రహ్మము జగత్తుకు కారణమని ఒప్పుకోవాలి. ఆ బ్రహ్మము దేని సహాయంతో జగత్తును సృష్టించాడు? లేక దేని సహాయమూ లేకుండానే సృష్టించాడా? మున్నగు అంశాలను ఆ తర్వాత ఆలోచించవచ్చు – అని భారతీయ తర్కశాస్త్రం చెప్పింది. అభ్యుపగమమంటూ, ఇలా కొన్ని విషయాలను కండ్లు మూసుకొని ఒప్పుకొనే వైఖరి అసలు తర్కశాస్త్ర మూలసూత్రాలకే విరుద్ధం. ఐతే, ఇక్కడ మనం 'తర్కసూత్రా'లని వాడుతున్నది సాంప్రదాయికమైన (ఇలాంటి) తర్కసూత్రాలను గురించికాదు. ఆలోచనాక్రమానికి చెందే తర్కసూత్రాలను మనం విశాలార్థంలో ఉద్దేశిస్తున్నామని పాఠకులు గమనించాలి.

తర్కసూత్రాలు మానవుని జీవితానుభవంలో, పదార్థప్రతిబింబ క్రమంలో రూపొందాయి. కనుక భావవ్యక్తీకరణలో తర్కసూత్ర

సంబద్ధత అనివార్యమని మనం గుర్తిస్తాం. ఒకవేళ మన భావాలు తర్కసూత్రాలకు, ఆలోచనాక్రమానికి విరుద్ధమైతే, అప్పు డవి వ్యాకరణానికి పొసగని అర్థరహిత శబ్దజాలంవలె అసంబద్ధములూ స్వవ్యాఘాతాలుగా తయారౌతాయి. కనుక భావ వ్యక్తీకరణక్రమానికి తర్కసూత్రాల ప్రామాణికత అవసరమౌతుంది.

తర్కసూత్రాల ప్రామాణికత పదార్థక్రమానికి గాక ఆలోచనాక్రమానికి వర్తిస్తుంది. మన అనుభూతులూ ఆలోచనలూ తర్కబద్ధంగా ఉన్నప్పుడే అవి వాస్తవక్రమాన్ని ప్రతిబింబించగలవు. అందువల్ల మన భావాలకూ ఆలోచనలకూ తర్కశాస్త్రం ప్రామాణికమౌతుంది. భావాల సహజ పరిణామంలో తర్కసూత్రాలు రూపొంది పెంపొందుతవి. అవి అనుభూతి సంకేతానికి కాక రెండవ సంకేతక్రమానికి చెందుతాయి. అంటే అవి పదార్థంపైగాక ఆ పదార్థాన్నిగూర్చిన మానసిక ప్రతిబింబంపై ఆధారపడియుంటాయి. ఈ దృష్ట్యా భావాలు, ఆ భావాల్లో వివరింపబడే వాస్తవక్రమానికి విడియైన అస్తిత్వాన్నీ, ప్రామాణికతనూ కలిగియుంటాయన్నమాట. కనుక భావాలకు ప్రమాణం తర్కశాస్త్రం. అందువల్ల తర్కసూత్రాలు జీవితానుభవంలో పరిశీలించి కనుగొనబడే భౌతిక-ప్రాకృతిక సూత్రాలకు విడియైన స్వయంసిద్ధ ప్రామాణికతను కలిగియుంటాయి.

తర్కసూత్రక్రమంకూడ భాషవలెనే ప్రతివారికీ వర్తిస్తుంది. మానవుడు సమాజజీవితంలో యే ఉద్దేశాలను సాధించాలన్నా అవి ఒకే ఆలోచనాక్రమానికీ, ఒకే తర్కశాస్త్రక్రమానికీ చెందియుండాలి. భాష ఎలా విరుద్ధ భావాల వ్యక్తీకరణకు సమంగా ఉపయోగపడుతుందో అలాగే తర్కంకూడ. భూస్వామి భాషను వ్యాకరణ బద్ధంగానే వాడుతాడు. సామ్యవాదికూడ అదే భాషను అవ్యాకరణంతోనే వాడుతాడు అలాగే భూస్వామి తర్కబద్ధంగానే ఆలోచిస్తాడు. సామ్యవాదికూడ అదే తర్కబద్ధతతో ఆలోచిస్తాడు. మన ఆశయాలు, అభిప్రాయాలు యేవైనా కావచ్చు; కాని మన భాషయొక్క వ్యాకరణబద్ధత, ఆలోచనయొక్క తర్కబద్ధత అన్ని ఆశయాలకూ, అన్ని అభిప్రాయాలకూ, అన్నివర్గాలకూ వర్తించేవే.

కనుక సమాజపరిణామంలో నూత్నసంస్కృతులు నూత్న తర్క సూత్రాలను లేక నూత్న వ్యాకరణాలను ఆవిష్కరించవు. సమాజ పరిణామంలో ఆ యా సమాజాల అభిప్రాయాలు మారిపోతూఉంటాయి. కాని తర్కసూత్రాలు అలా మారక, మానవుల ఆలోచనాక్రమంలోను, వాటి భాషామూలకమైన ప్రకటనల్లోనూ గర్భితమై నిరంతరం పరిణతి చెందుతాయి.

చాలమంది భావవాదులు తమ ఉద్దేశాల సాధనలో తర్కబద్ధతను విసర్జిస్తారు. వారు మత సంప్రదాయాలు విధించే నమ్మకాలను తర్కమనే గీటురాతితో పరిశీలించరు. తప్పు నమ్మకాలను దిద్దుకొనటానికి వెనుదీస్తారు. ఐతే ఇది వారి ఉద్దేశాలకే నష్టం. పైగా వారి నమ్మకాలు తర్కశాస్త్ర వికాసానికికూడ అవరోధాలౌతాయి. ఇలా అంధవిశ్వాసాలూ, ఆచారాలూ వాటిని విసర్జించటానికి వెనుదీసేవారి ఉద్దేశాల తర్కబద్ధతను ఒక వంకా, తర్కశాస్త్ర వికాసాన్ని మరొకవంకా కబళించి వేస్తుంటాయి. ఇది రెంటికీ చెడే రేవడి వైఖరిగా ఉంటుంది.

తర్కబద్ధత ఎంతో అవసరం. ప్రజలందరికీ సర్వసామాన్యంగా వర్తించే తర్కసూత్రాలే లేకపోతే ఎవరి ఉద్దేశాలూ అభిప్రాయాలు వారివే ఐతే, ఇక ఏ చర్చా ఏ నిరూపణా ఏ సిద్ధాంతీకరణా సాధ్యమే కాదు. కనుక ఎవరి తర్కం వారిదేనన్న ధోరణి అర్థరహితమైనది. అలాగే భూస్వామ్యంలో భూస్వామ్య తర్కమూ, పెట్టుబడిదారీవిధానంలో పెట్టుబడిదారీ తర్కమూ, సామ్యవాదంలో సామ్యవాదతర్కమూ అంటూ విడివిడిగా ఉంటాయని ఎవరైనా భావిస్తే అది పొరపాటు అవుతుంది. విభిన్న సమాజాల్లో విభిన్న తర్కసూత్రాలంటూ ఉండవు. అలాఉంటే, భావం భౌతిక వాస్తవపు ప్రతిబింబక్రమానికి చెందుతుందన్న పునాదికే వ్యతిరేకమౌతుంది. తర్కం భావక్రమంలో వాస్తవికత యొక్క సార్వజనీన వ్యక్తీకరణకై ఉదయిస్తుందేకాని, యెవరో కొందరి ఏవోకొన్ని ప్రయోజనాలను నెరవేర్చేందుకుగాదు. ఏవో కొన్ని ఆలోచనావిధానాల నుండి యెప్పటికప్పుడు ఉదయించేదికాదు. అందువల్ల తర్కం ఆలోచనాక్రమానికి చెందిన శాస్త్రంగా గుర్తింపబడుతుంది.

మార్క్సిస్టు భౌతికవాదం భాషవలెనే తర్కంకూడ ఉపరి నిర్మాణం కాదని చెబుతుంది. ఎవరి తర్కం వారిదేనన్న ధోరణిని ఖండిస్తుంది. భావప్రకటనకు, భావ వినిమయానికి భాష సాధనం. అలాగే ఆలోచనా సూత్రాల సమన్వయానికి తర్కశాస్త్రం సాధనం. కనుక భావానికీ, భాషకూ అనివార్యసంబంధ ముంది. ఇది అంగాంగి సంబంధంలాంటిది. భావం అంగి; దాని అంగం భాష. భావం భాష అనే పై తొడుగులో ఇమిడియుంటుంది. భాష, భావమూ అవిభాజ్యంగా కలిసియుంటాయి. ఇవి ఒకదానినొకటి విడిచి విడిగా జీవించలేవు. భావానికి భాష భౌతికసాధనం. అందువల్ల భావాలూ, ఆలోచనా పద్ధతులూ, తర్కసూత్రాలూ తమను తాము భాషలో, భాషావినియోగక్రమంలో, భాష వృద్ధిలో ఇముడ్చుకొనియుంటాయి. కనుక భాష తర్కమూ ఒకానొక సమాజపు పరిణామంలో యే దశలోనైనాసరే, యే ఉద్దేశాలనైనాసరే (వాటి ఆధారం యేదైనా) సాధించుకొనుటకు ప్రతివారికీ సాధనాలౌతాయి. ఇది తర్కంయొక్క సార్వజనీన స్వభావం.

మన అభిప్రాయాలనుబట్టి తర్కసూత్రా లుండవు. ఒక సామ్యవాదీ, ఒక రిపబ్లికనూ ఇర్వురూ ఒక సమస్యను చర్చిస్తారనుకొండి. ఈ ఇర్వురి అభిప్రాయాలూ, ప్రయోజనాలూ భిన్నంగా ఉంటాయి. ఇర్వురూ వేర్వేరు వాదనలు చేస్తారు. కాని ఉభయవాదాలు కూడ ఒకే భాషాక్రమానికి, ఒకే తర్కసూత్రక్రమానికి కట్టుబడియుంటాయి. 'రెండూ రెండు కలిసి నాలుగు' అనే విషయం పెట్టుబడిదారీ గణకునికీ, సోషలిస్టు గణకునికీ సమాన సత్యమే. అలాగే 'ఎ' అంతా 'బి' ఐనట్లయితే 'ఎ' లో కొంత భాగం 'బి' కూడ అన్న సూత్రం యజమానికీ కూలీకీ కూడ సమానమే. ఈ విధంగా తర్కసూత్రాల ప్రామాణికత సార్వజనీనమై యుంటుంది.

కాని చాలమంది చాలరకాల తత్వశాస్త్రిలు, భాష్యాలు వ్రాశారు. వీరు తమ అభిప్రాయాలనూ, తాత్విక సిద్ధాంతాలనూ బట్టి కొన్ని తర్కసూత్రీకరణలు చేశారు. ఉదాహరణకు న్యాయదర్శనంలోని అభ్యుపగమ సూత్రం మున్నగు కొన్నివాదాలను మనం చర్చించియే యున్నాం. ఇలా తమ తమ తాత్విక దృక్పథాలకు దార్శనికులు తార్కిక

ముద్ర వేశారు. అవి ఆయా సమాజదశల, వర్గాభిరుచులు మాత్రమే నన్నమాట. సాంప్రదాయిక తర్కగ్రంథాలలోని ఈ ధోరణులు ఉపరి నిర్మాణానికి చెందేవి మాత్రమే. కనుక మనం ఈ అర్థంలో కాక విశాలార్థంలో మానవ చైతన్య పరిణామానికి చెందిన తర్కసూత్రాలను ఉద్దేశిస్తున్నాం.

ఈ విధంగా, మానవుని సాంఘిక జీవితంలో, అంటే ఉత్పత్తి వ్యవహారం తదితర వ్యవహారాలలో ప్రజలు తమ భావాలను వ్యక్తీకరించుటకూ, పరస్పరం వ్యవహరించుకొనుటకూ సాధనమైన భాష రూపొంది అభివృద్ధి గాంచుతుంది. మరియు భాషద్వారా వ్యక్తమయ్యే మానవుల భావాలు తర్కసూత్రాలను ఆశ్రయించియుంటాయి. అంటే, భౌతిక వాస్తవికతను ప్రతిబింబించే భావక్రమానికి చెందియుంటాయన్నమాట. కనుక మానవుని సాంఘికాభిప్రాయాలు తర్కంద్వారా నిర్మింపబడి భాషద్వారా ప్రకటింపబడుతూ ఉత్పత్తి సంబంధాల ప్రాతిపదికపై అభివృద్ధిచెందుతాయి; వివిధవర్గాల కార్యకలాపాలపైన, ప్రయోజనాలపైన ఆధారపడి అభివృద్ధి చెందుతాయి.

ఇక భావాలు ఎలా అభివృద్ధిచెందుతాయో చర్చిద్దాం.



# 5వ అధ్యాయం

# గుణీకృత భావాలు

ఆలోచనల్లో మనం ఇంద్రియగోచర పదార్థాల ప్రాథమిక భావాలనుండి గుణీకృత భావాలకు చేరుకుంటాం. గుణీకృత భావాలు సాంఘిక సంబంధాల, ఉత్పత్తి తదితర వ్యవహారాల పునాదిని ఆశ్రయించిఉంటాయి మానవుల నిస్సహాయత, అజ్ఞానం గుణీకృత భావాల్లో భ్రాంతులకు, అభూతకల్పనలకు దారి తీస్తాయి. గుణీకృత భావాలతో భౌతిక, మానసికశ్రమల మధ్య విభజన ఏర్పడుతుంది. పిదప సిద్ధాంతం ఆచరణనుండి దూరమవుతుంది; వాస్తవికతతో తెగతెంపులు చేసుకొంటుంది. దీనినుంచి భావవాద, భౌతికవాద ధోరణులమధ్య వైరుధ్య మేర్పడుతుంది.

మానవుని భావాలు, ఆలోచనలు భాషవలెనే శ్రమనుండి ఉద్భవిస్తాయని మనం గమనించాం. అదేవిధంగా భావాలు, ఆలోచనలు సాంఘిక వ్యవహారంలో వృద్ధిచెందుతాయి.

మానవుని భావ వికాసం, చైతన్య పరిణతి కేవలం అనుభూతుల పైనే గాక ఆలోచనపై కూడ ఆధారపడుతుంది. మానవుడు తన తోటి వారితో కలిసి వ్యవహరించవలసిన అవసరం మూలంగా జ్ఞానాభివృద్ధి కొనసాగుతుంది. మార్క్స్ - ఎంగెల్స్‌లు "చైతన్యాభివృద్ధి ఆదినుంచీ

సాంఘిక ఫలితం; మానవు లున్నంతవరకు అది అలాగే కొనసాగుతుంది" అని వ్రాశారు.

భావాలు కేవలం బుద్ధివికాసానికే లేదా కేవలం బాహ్య పదార్థాల ప్రేరణకే చెందవు. బాహ్యపదార్థాల ప్రేరణ, మానసిక గ్రాహకక్రమం ఈ రెండూ సమన్వయమై యుంటాయి. మానవుని సాంఘిక వ్యవహారంలో భావాలు మానవ మేధచే నిర్మింపబడతాయి. అందువల్ల భావాలు మానవుల పరస్పర సంబంధాలనూ బాహ్య ప్రకృతితో అతనికిగల సంబంధాలనూ రెంటినీ ప్రతిబింబిస్తాయి.

> "మానవచైతన్యం ఆదిమదశలో పరిసరాలను గురించిన తక్షణ ఇంద్రియానుభూతులకూ పరిసర వ్యక్తులతో, పదార్థాలతో అతనికిగల పరిమిత సంబాంధాలకు చెందినదే. ఆ తొలిదశలో మానవుని సాంఘిక జీవితమూ చైతన్యమూ కూడ జంతుప్రాయమైన స్థితిలోనే ఉండేవి. కనుక మానవ చైతన్యపు ఆదిమరూపాన్ని మనం గణ – లేక గుంపు చైతన్యంగా పేర్కొనవచ్చు. ఆ స్థితిలో జంతుచైతన్యానికీ మానవ చైతన్యానికీ వ్యత్యాసం చాల స్వల్పం." — మార్క్స్.

మానవుని ఆదిమభావాలు పరిసర మానవులతో, పరిసర పదార్థాలతో అతనికిగల తక్షణ సంబంధాలలో సూటిగా ఉత్పన్నమయేవి మాత్రమే. ఇంద్రియ ప్రేరణల ద్వారా, అనుభూతిద్వారా గుర్తించే పదార్థాల సామాన్య ధర్మాలకు పేర్లు పెట్టుకొనడంతో తొలి భావాలు రూపొందుతవి. కనుక మార్క్స్ వ్రాసినట్లు "ఆదినుంచీ భావాల నిర్మాణం మానవుని భౌతికవ్యవహారంనుండి, యితరమానవులతో అతనికిగల భౌతిక సంపర్కం నుండి రూపు దిద్దుకుంటుంది." ఇలా ఆదిమ జీవిత వ్యాపారంలో యేర్పడే ప్రాథమిక చైతన్యంలో పదార్థాలను గూర్చిన, వాటి సంబంధాలను గూర్చిన ప్రాథమిక జ్ఞానమూ, ఇతర మానవులను గూర్చిన స్వపర జ్ఞానమూ ఇమిడి యుంటాయి. తోడ్తో విభిన్న పదార్థాల వాటి గుణధర్మాల సామాన్యజ్ఞానమూ, ఆ పదార్థాలతోడి సంబంధాల వివేకమూ ఆదిమ మానవుల ప్రాథమికచైతన్యంలో ఇమిడియుంటాయి. ఈ విధంగా

మానవుడు పదార్థ క్రమాలను, వాటి సాంఘిక వినియోగ క్రమాన్నీ గ్రహిస్తాడు.

ప్రాథమికమైన ఈ చైతన్యాన్ని మనం 'వ్యవహారజ్ఞానం' అని పేర్కొనవచ్చు. అంటే అది నిత్యజీవిత వ్యవహారంలో పదార్థాల సామాన్య లక్షణాలనూ, ఆ పదార్థాలపట్ల మానవుని వ్యవహారాన్నీ అనుభూతుల తక్షణ సంబంధంద్వారా గుర్తించటమన్నమాట. ఈ ప్రాథమిక చైతన్యానికి చెందినవే ప్రాథమిక భావాలు. ఇవే మానవుని ఆలోచనకూ, భావప్రకటనకూ పునాదులన్నమాట. ప్రాథమిక భావాలు భాష ద్వారా పరిచితపదార్థాల వాటి గుణధర్మాల, మరియు వానితోడి నిత్యజీవిత వ్యాపారాల సంబంధాలను వ్యక్తం చేస్తాయి.

ప్రాథమికమైన వ్యవహారజ్ఞానం నిత్యజీవిత వ్యవహారంలో పైవిధంగా వినియుక్తమౌతుంది. ఆదిమమానవునినాడే కాదు, ఈ నాడు కూడ మనం నిత్యజీవిత వ్యవహారంలో ప్రాథమికజ్ఞానాన్ని వినియోగిస్తూనే ఉన్నాం. పసిపిల్లల ఈడునుండే వ్యవహారజ్ఞానం ప్రారంభమౌతుంది. మనుష్యులను, కుర్చీలను, బల్లలను, చెట్లను, పూవులను, జంతువులను, పాత్రసామగ్రిని, నీటిని, నిప్పును వాటివాటి పోలికలతో, రంగులు పరిమాణాలు బరువు తేలికలు ఆకారవిశేషాలతో, వాటివాటి గుణాలతో సంబంధాలతో నడకలతో కదలికతో నిమ్నోన్నత్యాలతో – ఇలాగే పలువిధాలుగా మనం గుర్తిస్తాం. ఐతే ఈ ప్రాథమిక భావాల్లోనే గణితానికీ–యాంత్రిక శాస్త్రానికీ రూపగణితానికీ భౌతికరసాయన శాస్త్రాలకు బీజాలిమిడియున్నాయి.

ఆయా పదార్థాలకు చెందిన యీనాటి మన భావాలకూ, ఆదిమ మానవునినాటి భావాలకూ యెంతో వ్యత్యాసం వుంటుంది. నేటి సాంఘిక జీవితంలో మనం ఎన్నో నూతన పదార్థాల, వాటి సంబంధాల వినియోగక్రమాల విస్తృత చైతన్యాన్నీ, భావ సంపదనూ కలిగియున్నాం. ఉదాహరణకు నీరు. మనం త్రాగే నీటి నొక సంయోగంగా గుర్తిస్తున్నాం. కాని ఆదిమ మానవుడు నీటిని దాహంతీర్చే ఒకానొక మూలపదార్థంగా మాత్రమే భావించాడు. ఇలాంటి వ్యత్యాసా

లున్నప్పటికీ పరిసరాల సంబంధాలనుగూర్చిన ప్రాథమికజ్ఞానం (ఉదాహరణకు నీటిని త్రాగి దప్పి తీర్చుకొనడం) నాడూ, నేడూ వుంటూన్నదే. ప్రాథమికమైన ఈ వాస్తవజ్ఞానాన్ని మార్క్సు "పరిసరాలను గూర్చిన తక్షణ ఇంద్రియానుభూతికి చెందే చైతన్యం, మరియు పరిసరవ్యక్తులతో పదార్థాలతో గల పరిమితసంబంధాల చైతన్యం" అన్నాడు.

ప్రాథమికభావాల లక్షణం అవి నిర్దిష్ట ఇంద్రియానుభూతికి చెందినవై యుండటమే. ఇంద్రియాలకు గోచరమయ్యే ప్రత్యక్ష పదార్థాలకు అవి చెందుతాయి. కాని సాంఘిక వ్యవహారం పురోగమించుటతో ఇతోధిక గుణీకృత భావా లేర్పడుతాయి. అనుభూతియొక్క తక్షణ సంబంధానికే కాక పరోక్షసంబంధాలకు చెందే అనుమానజ్ఞానం, అందుకు చెందిన ఉన్నత గుణీకృతభావాలు పెంపొందుతవి.

ప్రత్యక్షానుభూతికి చెందనట్టి గుణీకరణ యెలా కొనసాగుతుంది? దిగువ విధంగా. ఉదాహరణకు మనుష్యులు. మనుష్యుల్ని ప్రత్యక్షంగా ఇంద్రియానుభూతి ద్వారా తెలుసుకోగలం. వారి ఆకార విశేషాలు, పొడుగు, పొట్టి, లావు, సన్నదనం, ముఖలక్షణాలు, రంగు ఇవవన్నీ మనం చూడగలం. కాని మనుష్యులను గూర్చిన మన భావాలు ఇంతవరకే పరిమితమై లేవు. మన మొక లావుపాటి వ్యక్తినిచూచి అదిగో "మార్వాడీ సేటు" అంటాము. అంటే బలుపెక్కిన షాహుకారు అని మన అర్థం. ఇందులో "బలుపెక్కిన" అన్నంతవరకూ ఇంద్రియానుభూతికి గోచరమయ్యే అంశమే. కాని "సేటు లేక షాహుకారు" అన్నభావానికి ఆధారం ప్రత్యక్షానుభూతి కాదు. సేటు లేక షాహుకారు అన్న మన భావం ప్రత్యక్షానుభూతి సంబంధానికి గాక అనుమానానికి చెందినది. సేటు-షాహుకారు అన్నభావం, ఆ శబ్దం మనకు సుగ్రాహ్యమైనవే. అలా అంటే, వడ్డీ వ్యాపారం చేసి అధికలాభాలు పొందే ధనికుడని మనం గుణించుకోగలం. ఈ విధంగా మనం అనుమానానికి చెందిన అనేక గుణీకృత భావాలను వినియోగిస్తాం. మనం అనేక సాంఘిక భావాలను, న్యాయశాస్త్రభావాలను, నైతిక భావాలను, మత భావాలను, విజ్ఞానశాస్త్రభావాలను, తాత్విక భావాలను అనేక శబ్దాలరూపంలో ప్రకటిస్తాం. పౌర

హక్కులు, క్రిమినల్ నేరం, విశ్వాస పాత్రత, పాపపుణ్యాలు, భూమ్యాకర్షణ మున్నగు భావాలన్నీ గుణీకరణకు చెందునట్టివే.

కనుక మన భావాలన్నీ ప్రత్యక్ష జ్ఞానానికి చెందినవి మాత్రమే కావు. భావాలు వాటి పరిణతిలో ప్రత్యక్షానుభూతి పరిమితిని అధిగమిస్తాయి. భావాలు సాంఘిక వ్యాపారావసరాలనుబట్టి యేర్పడి, పరిణామం చెందుతాయి. ఉత్పత్తియొక్క అభివృద్ధితో, తత్ఫలితంగా యేర్పడే ఉత్పత్తిసంబంధాల మరియు సాంఘిక సంబంధాల అభివృద్ధితో భావాలు కూడ "ఇంద్రియాలను ప్రేరేపించే ప్రత్యక్ష పదార్థాలను గూర్చిన సామాన్య జ్ఞాన" పరిమితిని అధిగమిస్తాయి. మానవులు తమ సాంఘిక జీవితాన్నీ ప్రపంచాన్నీ గూర్చి ఉన్నత గుణీకరణలను రూపొందించే దశ ఏర్పడుతుంది. మానవుని ఉన్నత భావాలు బాహ్య ప్రపంచంతో అతనికి గల సజీవ సంబంధంలోను, మానవుల పరస్పర సంబధాల్లోను మానవ మేధచే గుణీకరింపబడతాయి; ఆ సంబంధాల ఆధారంపై సాంఘిక వ్యాపారాభివృద్ధికి ఉపకరిస్తూ పెంపొందుతాయి.

ఇలా గుణీకృతమయే భావాలకు చెందిన ప్రత్యక్ష పదార్థాలంటూ వుండవు. ఉదాహరణకు ప్రజాస్వామ్యం. ప్రజాస్వామ్య మనే భావానికి చెందిన భౌతిక పదార్థమంటూ యేదీ వుండదు. ఇలాంటి భావాలను మనం గుణీకృత భావాలంటాం. ఇంద్రియానుభూతివల్ల యేర్పడే ప్రాథమిక భావాలతో లేక ప్రత్యక్ష వ్యవహారానికి చెందిన నిర్దిష్టభావాలతో గుణీకృత భావాలు పైవిధంగా అనుమానిత మవుతాయి. వాటి గుణీకరణ స్థాయి యెంత వున్నతమై యుంటుందో ఆ వ్యత్యాసాన్ని పరిశీలించవలసి యుంటుంది.

*గుణీకరణ దశలు*

పావ్లావ్ సిద్ధాంతాన్ని చర్చించిన సందర్భంలో మనం విభిన్న ఇంద్రియానుభూతులను గుణీకరించుటకు, సామాన్యీకరించుటకు శబ్దాలు సాధనాలని గమనించాం. ఆ అర్థంలో అన్నిభావాలు కూడ గుణీకృత భావాలే ఔతాయి. అసలు మానవ మేధలో భావాలు రూపొందే క్రమమే

గుణీకరణక్రమం. కాని మన మిక్కుడ ప్రాథమిక (వ్యవహార) భావాలనీ, ఉన్నత గుణీకృత భావాలనీ విడివిడిగా వాడుతున్నాం. ఇది సాపేక్షంగా మాత్రమే. అంటే, ఒకభావం వేరొక భావంకంటే ఎక్కువ గుణీకరణ చెందుతుందనీ, యెక్కువ ఉన్నతస్థాయికి చెందిన గుణీకరణ అవుతుందనీ గమనించాలి.

భావాల్లోనేకాక అనుభూతుల్లోకూడ మేధయొక్క గ్రాహక క్రమంవల్ల ఏర్పడే గుణీకరణ పాత్రవహిస్తుంది. భౌతిక పదార్థపు చైతన్య ప్రతిబింబం గుణీకరణ క్రమమే. చైతన్యప్రతిబింబం పదార్థవాస్తవపు సమగ్ర పునరావృత్తికాక, అందలి కొన్ని అంశాల విలోకనయే. ఉదాహరణకు మన మొక ఇంటిని చూస్తాం. దాని ముందుభాగాన్ని మాత్రమే చూచి పోల్చుకోగలం, కాని వెనుకభాగం కంటికి కనపడదు. ఈ విధంగా అనుభూతిజ్ఞానం సమగ్ర అవగాహన కాదు. ఐతే వ్యవహార జ్ఞానానికీ - గుణీకృతజ్ఞానానికీ భేదం యేమిటి? ప్రత్యక్ష వాస్తవపు నిర్దిష్టభావానికీ, అనుమాన వాస్తవపు గుణీకృతభావానికీ తేడా యేమిటి? ఈ ప్రశ్నకు సమాధానం ప్రత్యక్ష వాస్తవపు నిర్దిష్టతకూ, దాని చైతన్య ప్రతిబింబపు గుణీకరణకూ మధ్యగల 'వ్యత్యాసమే' ఆధారం ఔతుంది.

భౌతిక వాస్తవికతను గూర్చిన ఇంద్రియానుభూతిలో గుణీకరణ పాత్ర వహిస్తుంది. భౌతిక వాస్తవపు కొన్ని పార్శ్వాలు మాత్రమే చైతన్యంలో ప్రతిబింబిస్తాయి. ఉదాహరణకు మన మొక కారులో కూర్చున్నప్పుడు అందలి సీట్లను, వాటి పైభాగాన్ని మాత్రమే చూస్తాం. సీట్లలో భాగాన్నీ కారు మొత్తాన్నీ చూడలేం. ఐనప్పటికీ సీట్లను గూర్చిన మన అనుభూత్యవగాహన భావాల గుణీకరణకంటె నిర్దిష్టమైనదే. అనుభూతులు ప్రత్యేక నిర్దిష్ట పదార్థాల సంకేతాలు. కాని భావాలు ఆ సంకేతాల గుణీకరణక్రమంలో రూపొందేవి. కారును గురించిన, దాని సీట్లను గురించిన మన 'భావం' కార్ల మరియు వాటి సీట్ల నిర్దిష్టానుభూతుల గుణీకరణ. దీనిద్వారా మనం కారు లేక దాని సీట్ల మంచిచెడ్డలను గ్రహించగలం. ఈ విధంగా అనుభూతిలోని గుణీకరణ ఒకవిధమైనది; భావాలలోని గుణీకరణ మరొకవిధమైన దన్నమాట. (అ) నిర్దిష్టపదార్థపు

ప్రత్యేక ధర్మాల గుణీకరణ అనుభూతికి చెందినది (ఆ) అనేక ప్రత్యేకానుభూతుల గుణీకరణ భావానికి చెందినది.

ఉదాహరణకు బంగాళాదుంప కూర. 'బంగాళాదుంప' అన్న భావం కంటె 'కూర' అన్నభావం యెక్కువ గుణీకృతమైనది. ఇందులో మనం వండుకొని తినే కూరగాయలసామ్యం గుణీకరింపబడుతుంది.

భావాల నిర్మాణంలోఇంకా అధికమైన గుణీకరణ పాత్రవహిస్తుంది. మనం కారు, సీట్లు, బంగాళాదుంపలు, కూరగాయ లన్నప్పుడు యివన్నీ ఇంద్రియానుభూతికి గోచరమయ్యేవే. ఈ వస్తువు లన్నిటినీ మనం యితరులకు వాటిని చూపటంద్వారా వివరించవచ్చు. కాని "పౌరహక్కులు" అన్నప్పుడు యీ భావాన్ని మనం ఏ వస్తువుద్వారా కూడ వివరించలేము. ఇలాంటి భావాలను వివరించుటకు మరొక సంక్లిష్టవిధానాన్ని అనుసరించవలసియుంటుంది.

కనుక భావాల గుణీకరణకు రెండు స్థాయిలు లేదా దశలు ఉన్నాయి. ఒకటి ఇంద్రియానుభూతిద్వారా విభిన్న పదార్థాల, వాటి ధర్మాల, సంబంధాల, పరిణామాల గుణీకరణ. ఇది అనుభూత్యవగాహన. ఐతే, భావాల అభివృద్ధిక్రమంలో ఇంద్రియానుభూతియొక్క ప్రత్యక్ష సంబంధానికి అందనట్టి రెండవదశ రూపొందుతుంది. ఈ దశలో మనం అనుమానమనే నూతన గుణీకరణక్రమం ద్వారా పదార్థ ధర్మాలనూ, సంబంధాలనూ, పరిణామాలనూ గూర్చి అవగాహన పొందుతాం. పెట్టుబడిదారీవిధానం, పౌర హక్కులు మున్నగు భావాలీ రెండవదశకు చెందెడివే.

*గుణీకృత భావాల ఆధారాలు*

ఏ గుణీకృత భావానికైనాసరే ఆధారం అనుభవంలో, భౌతిక ప్రపంచంలో, పదార్థంతో మానవునికిగల సంబంధాల్లో, మరియు మానవుల పరస్పరసంబంధాల్లో ఇమిడియుండక తప్పదు. పరిసర ప్రకృతితోను, పరిసర సమాజంతోను మానవునికి గల సంబంధాల ఫలితమే నిర్దిష్టానుభవం. ఆ అనుభవంలోనే అన్ని గుణీకృతభావాలూ రూపొందు

తవి. అవి పై సంబంధాలు కొనసాగుటకూ, పెంపొందుటకూ ఉపయుక్త మౌతాయి. కాబట్టి భావాలు పదార్థాల పరస్పరసంబంధాలనూ, మానవుల పరస్పర సంబంధాలనూ, ప్రకృతి పదార్థాలతో మానవులకుండే సంబంధాలనూ ప్రతిబింబిస్తూ వుంటాయి. జీవితానుభవాన్ని నిరంతరం గుణీకృత భావాల రూపంలో మానవమేధలో అనువాదంచేస్తాయి. ఇంతకుమించి భావాలకు మరొక ఆధారమంటూ లేదు.

కాని భావవాదు లిక్కడ తిరిగి తికమకపడతారు. వారుకూడ ప్రత్యక్షజ్ఞానాన్నీ, పరోక్షజ్ఞానాన్నీ అంగీకరిస్తారు; తర్కంద్వారా ప్రత్యక్షానుమానాలను సమర్థిస్తారు. ప్రత్యక్షజ్ఞానం ప్రాథమికమైనదనీ, అనుమానం విశిష్టమైనదనీ కూడ చెబుతారు. కాని ఇది జ్ఞానంలోని వస్తుగత - స్వగతశీలతల గతితార్కిక సమన్వయమనీ, విభిన్నతల ఐక్యత అనీ వారు అంగీకరించరు. విభిన్నతల సమన్వయం వారికి సరిపడదు. కనుక వారు అనుమానప్రమాణపు ప్రత్యక్షజ్ఞాన పునాదిని తొలగించివేసి దేనికదేగా చూస్తారు. అలా చూడటంవల్ల జ్ఞానసిద్ధాంతంలో అనుమాన ప్రమాణాన్నిగూర్చి అనేక యాంత్రికవాద ఊహాగానధోరణులను కొనసాగిస్తారు. ఉపనిషత్తులు అనుమానమే వాస్తవమనీ, ప్రత్యక్షప్రపంచం మిధ్యఅనీ చెప్పుతాయి. సాంఖ్యులు దేనికదే నంటారు. మొత్తంమీద వీరు ప్రత్యక్ష, అనుమానజ్ఞానాల పరిణామాన్ని పూర్తిగా తికమకకు గురిచేశారు.

మానవుల మధ్య సాంఘిక సంబంధాల పరిణతి గుణీకృత భావాల అభివృద్ధికొక ముఖ్యమైన ఆధారం. ఉదాహరణకు ప్రాచీన (ఆర్ష) సమాజ వ్యవస్థ, దాని నియమనిబంధనలు. ఎవరు ఎవరిని వివాహమాడాలి ? ఎవరు యేగణ గోత్రాలకు చెందిన వారైయుండాలి ? ఎవరు యే పనులు చేయాలి ? ఏవి మానాలి ? మున్నగు అంశాలద్వారా గుణీకృత భావాల ఒకానొక దశను ప్రాచీన సమాజ వ్యవస్థ, దాని నియమ నిబంధనలు సూచిస్తున్నాయి. ఆ భావాలు ఆ కాలపు గణ, కుటుంబ, సంబంధాల ఫలితాలుగా, నాటి సాంఘిక వ్యవస్థకు అనుగుణ్యమైనవిగా కొనసాగాయి. అలాగే మరికొన్నాళ్ళకు గణనాయకత్వ భావాలు, సాంఘిక

హోదా. వర్ణాశ్రమాలు రూపొందాయి. ఆపైన కొంతకాలానికి ఆస్తి యాజమాన్యానికి, ఆస్తిసంబంధాలకు చెందిన గుణీకృత భావాలు పెంపొంది స్మృతులకు దారి తీశాయి.

కొందరు వ్యక్తులు భూములను తమ ఆస్తులుగా చేసుకుంటారు. దానితో భూ యాజమాన్య భావాలు, అందుకు చెందిన విధినిషేధాలు, హక్కులు, బాధ్యతలనుగురించి నిర్వచనాలు కొనసాగుతవి. ఐతే, ఇక్కడ యాజమాన్యానికి చెందిన భావాలు గుణీకరింప బడ్తాయి. ఈ యాజమాన్య మనేది ఇంద్రియ గోచరమయ్యే భౌతిక పదార్థం కాదు. భూమి, పొలం, దున్నటం, పంటలుతీయటం ఇదంతా ఇంద్రియాను భూతికి చెందే నిర్దిష్ట వాస్తవికతే కాని పంటపొలంపై భూస్వామియాజమాన్యం, ఆ పంటలను అనుభవించేహక్కు ఇవి యింద్రియ గోచరంకావు. ఇవి కేవలం అనుమానానికి చెందినవే. ఐతే, యాజమాన్యభావం అనుమానానికీ, మానసిక గుణీకరణకు చెందినదే ఐనా అది అవాస్తవం మాత్రం కాదు. భూస్వామి ఆస్తి హక్కు ఆచరణలో అమలయ్యేదే. శాసనం దాన్ని సమర్థిస్తుంది. కనుక ఇలాంటి గుణీకృత భావాలు సాంఘికోత్పత్తి పరిణామంలో ఒకానొక నిర్దిష్టదశకు చెందిన ఉత్పత్తి సంబంధాల వాస్తవికతను ప్రకటిస్తాయి.

పైవిధంగా మానవులమధ్య సాంఘిక సంబంధాలు భావాల గుణీకరణకు ఆధారమౌతాయి. ఇంతేగాక, బాహ్య ప్రకృతికి సంబంధించిన ఉత్పత్తి, తదితర వ్యవహారాలుకూడ భావాల గుణీకరణకు ఆధారమౌతాయి. ఈ ఆధారంనుండే కారణ కార్యవివేకం, స్థల కాల సంఖ్యా పరిణామాలను గూర్చిన విజ్ఞానం గుణీకరింపబడి, ప్రకృతి శాస్త్రాలకు పునాదులు పడతాయి.

భావాల గుణీకరణక్రమంలో మానవుని విజ్ఞానంతోబాటు అజ్ఞానని కూడ పాత్ర వహిస్తుంది. సాంఘిక జీవన వ్యాపారంలో మానవుం అజ్ఞాన మూలకమైన నిస్సహాయతకూడ పాత్ర వహిస్తుంది. ఉదాహానిణకు అడవి మృగాలబాధ, వరదల కరువులబాధ, రోగాలు అవయవహీనతలబాధ మున్నగు సాంఘిక ప్రమాదాలు. వీనికి కారణం తెలియవ

రోజుల్లో, నివారణోపాయం లేనిదశలో మానవుడు మూఢనమ్మకాలనూ, భ్రాంతులనూ పెంపుజేసుకుంటాడు. ప్రకృతి శక్తులను - క్రూరజంతువులను, వ్యాధులను. కరువు కాటకాలను - దివ్యశక్తులుగా ఊహించి, వాటిని ఆరాధించి సంతృప్తి పడవలసివస్తుంది. ఇందుకై అతడు వింతవింత కథలను కల్పనలనుఅల్లుకొంటాడు. ప్రార్థనలు, కొలుపులు. జాతర్లు, యజ్ఞాలు, నోములు, వ్రతాలు సాగిస్తాడు. ఇలా అజ్ఞాన అశక్తతలవల్ల కలిగేఅధీనత కూడ భావాలగుణీకరణలో-అంటే అనుమానజ్ఞానం పరిణతిచెందటంలో-ప్రత్యేకపాత్ర వహిస్తుంది.

పంటలు పండటం, పశువులు పెంపొందటం మానవునికి తెలుసు. అతడు భూమిని సాగుచేస్తాడు. పశువుల మందలను పెంచుతాడు. పంటలు పండే క్రమాన్ని, పశువులు పెంపొందే క్రమాన్ని గూర్చి ఆలోచిస్తాడు. తోడ్తో ఆ రంగాలలో యెదురయ్యే ఆటంకాలను ఎదుర్కొనుటకు కూడ మార్గాలు వెదుకుతాడు. కాని అభివృద్ధిక్రమంగాని, అవరోధాల క్రమంగాని ఆతనికి సమగ్రంగా అవగతంకావు. అందువల్ల అదృష్ట శక్తుల, దివ్యశక్తుల భావన ప్రారంభమౌతుంది. మనుష్యుల్లోను, పశుపక్ష్యాదుల్లోను అవాఙ్మానసగోచరమైన 'ఆత్మ' అనే దొకటుంటుందనీ, ఆ ఆత్మయే శారీరకవ్యవహారాని కంతటికీ సంచాలకశక్తియనీ ప్రాచీనులు నమ్మేవారు. అలాగే ప్రాపంచిక వ్యవస్థకంతటికీ ఒక సంచాలక శక్తి ఉంటుందనీ, అది దేవుడు లేక పరమాత్మ అనీ విశ్వసించేవారు. ఇలాంటి గుణీకరణలద్వారా, అనుమానాలద్వారా మతాలు, మతసంప్రదాయాలు జన్మించాయి.

భారతీయ తత్వశాస్త్రంలోని మీమాంస, యోగ, భక్తిధోరణులను మన మిక్కడ ప్రధానంగా పేర్కొనవచ్చు. ఇవి దేవుడు సర్వశక్తిసంపన్నుడనీ, కనుక మానవజీవి నిత్యనైమిత్తిక కర్మల ద్వారా. జప తపాదుల ద్వారా, పూజారాధనల ద్వారాఆ సర్వశక్తిమయుని అనుగ్రహం సంపాదించి విముక్తుడు కావాలని హేతువాద ప్రతికూలమైన మతాచార విశ్వాసాలను బలపరిచాయి. ఈ శాఖల్లో శాస్త్ర పునాదిని బలపరిచే అనేక సిద్ధాంతాలు, సంప్రదాయాలు ఉన్నాయి. కర్మవాదమైన మీమాంస

మార్గం మత విధులను ప్రోత్సహించగా, యోగం ఐహిక సౌఖ్యాలను విసర్జించే విరాగ సన్యాస పద్ధతులను అనుసరించింది. ఈ రెండిటికి మధ్యేమార్గంగా భక్తిధోరణి కొనసాగింది. తాత్వికంగా యీ ధోరణులు కొంత అప్రధానమే అయినప్పటికీ, అవి భౌతికంగా ప్రజల ఆలోచనా స్వేచ్ఛను అరికట్టాయి. పాలకవర్గం ప్రజల్ని అనేక పీడనలకు గురి చేయుటకు వినియోగపడ్డాయి. ఇవి వర్గ సామరస్యరూపంలో పాలకవర్గ మత సంప్రదాయాలను బలపరుస్తూ వ్యాప్తమైనాయి. ఈ ధోరణులు ఒకవంక పాలకవర్గంద్వారా నేరుగాను, మరోవంక వాటికి పోటీగా సామాన్య ప్రజల ఉద్యమాలద్వారాను కూడ ప్రచారం పొందాయి. ఈ వైవిధ్యం మనకు వైదిక, అవైదిక మతపీఠాల రూపంలో కనబడుతుంది.

*భౌతిక, మానసిక శ్రమల విభజన*

పై ఉదాహరణలు సాంఘికాభివృద్ధిక్రమంలో గుణీకృతభావా లెలా యేర్పడతాయో వివరిస్తాయి. దీన్ని మార్క్స్, ఎంగెల్స్‌లు సూక్ష్మంగా పరిశీలించి, గుణీకృతభావాల పరిణామానికీ, ప్రధాన సాంఘికాభివృద్ధిక్రమమైన శ్రమ విభజనకూ గల సంబంధాన్ని తెలియజేశారు.

(అ) గుణీకృతభావాల నిర్మాణం ఆ భావాలు ఏ రంగానికిచెందినవైనప్పటికీ సాంఘికాభివృద్ధియొక్క ఒకానొక దశకు చెందిన ఉత్పత్తి శక్తుల, సంబంధాల పునాదిపై ఆధారపడుతుంది. కనుక యే భావమైనా సరే అది ఒకానొక శ్రమ విభజనకు ఫలితం శ్రమవిభజనయొక్క పరిణామంలో గణసమాజపు సహకార చైతన్యం క్రమంగా ప్రత్యేక వ్యక్తుల చైతన్యంగా మారుతుంది. ఉత్పత్తిలో భాగస్వాము లయ్యే ప్రతివారూ సమానమేనన్న ఆదిమభావానికి బదులు కొందరు వ్యక్తులు సమాజ వ్యాపారంలో ప్రత్యేక స్థాయి, పాత్రగలవారుగా రూపొందటంతో వారి ప్రత్యేక వ్యవహారాలకు సాంఘిక సంబంధాలకు చెందిన గుణీకృత భావా లేర్పడుతాయి. అంతటితో గణంయొక్క సామూహిక చైతన్య భావం అంతరించి, వ్యక్తిగత వర్గగత ఆలోచనల స్థాయికి పునాది యేర్పడుతుంది.

(అ) ఈ గుణీకృతభావాల ఆవిష్కారంతో భౌతికశ్రమ, మానసిక శ్రమల మధ్య విభజన ప్రారంభమౌతుంది. కొందరు వ్యక్తులు కేవలం మానసికశ్రమపైన ఆధారపడతారు. ఋషులు. మునులు, నాయకులు, పండితులు, కవులు, పురోహితులు కేవలం భావాలనే ప్రత్యేకంగా పెంపొందించ సాగుతారు. భావాల యీ ప్రత్యేకీకరణ సాంఘిక జీవితపు అనివార్యలక్షణంగా వృద్ధిగాంచుతుంది. భావవికాసం లేకుండా శ్రమ విభజనను, దానిపై ఆధారపడే ఉత్పత్తి వ్యాపారాన్ని. సాంఘిక సంబంధాలను పటిష్ఠమొనరించటం సాధ్యంకాదు. అందువల్ల, భావాల ప్రత్యేకీకరణ ఆయా సాంఘిక వ్యవస్థలకు అనుగుణంగానే కొనసాగుతుంది. మార్క్స్ "మానసిక - భౌతికశ్రమల విభజన రూపొందిన మరుక్షణమే శ్రమవిభజన నిజమైన శ్రమవిభజన అవుతుంది" అని వ్రాశాడు.

సాధారణంగా గుణీకృతభావాలు అభివృద్ధిగాంచుతున్న నూతన సాంఘికావసరాలకు అనుగుణ్యంగా రూపొందుతాయి. అదే సమయంలో భావాలు శ్రమవిభజన యొక్క ప్రధానశాఖగా, ఒకానొక సాంఘిక వ్యాపారంగా వికసిస్తాయి. కాని, తత్ఫలితంగా రూపొందే భౌతిక మానసికశ్రమల విభజన నూతన ఫలితాలకు దారితీయటంతో, పాత భావాలు మూలబడి వాటికి నూతనభాష్యాలు మొదలౌతాయి.

భావాలు గుణీకరణచెంది శబ్దాల్లో యిమిడిపోయిన వెంటనే, ఇంద్రియానుభూతుల్లో ప్రతిబింబించే ప్రత్యేక పదార్థాలకంటె భిన్నమైన అనుమాన వస్తువులనవి వ్యక్తం చేస్తాయి. గుణీకృతభావాల వినియోగం భౌతిక శ్రమనుండి విడివడి ఒక ప్రత్యేక సాంఘిక వ్యాపారంగా ఎంతగా పరిణమిస్తుందో శబ్దాలద్వారా (ఒక ప్రత్యేక తరహాకుచెందిన) అనుమాన వస్తువులను వ్యక్తీకరించే అవకాశం అంతగా బలపడుతుంది.

ఈ విభాగం అదృష్ట శక్తులతో, అతీత ప్రాకృతిక విశేషాలతో, దేవతా కల్పనలతో ప్రారంభమౌతుంది. ఇలాంటి గుణీకృత భావాలను వినియోగించే వ్యక్తులు అనుభూతికి, ప్రాథమికమైన వ్యవహార జ్ఞానానికి అతీతమైన అభూత శక్తులను ప్రకృతికీ మానవునికీ సంక్రమింపజేస్తారు. అందుకుచెందిన భావాలను ఋషులు, పురోహితులు, మాంత్రికులు,

వేదాంతులు అనేక సిద్ధాంతాలద్వారా, దర్శనాలద్వారా, శాస్త్రాలద్వారా పెంపొందించి ప్రచారం చేస్తారు.

ఇలాంటి భ్రాంతులు అన్నీ గుణీకరణలనుండి లేక అనుమానాల నుండి పెంపొందటం సాధ్యమే. ఎందుకంటే గుణీకృతమైన భావాలకు సమన్వయించే ప్రత్యక్ష పదార్థాల ఆలంబన వుండదు. ఉదాహరణకు పెట్టుబడిదారీ విధానం. దీన్ని మనం యెలా వ్యాఖ్యానించినాసరే మన యిష్టం. ఐతే, గుణీకృత భావాలు అనుభూతి వాస్తవానికి మాత్రమే సంబంధించి యుంటాయి. ఉదాహరణకు ఒక కార్మికునికి పెట్టుబడి దారీ విధానంలోని ఘనత ప్రతికూలం. కాని ఒక మేనేజింగు యేజెంటుకు అది పూర్తిగా అనుకూలం. కనుక ఒకా[illegible] భావాన్ని వివ రించుటకు లేక ఆ భావాన్ని ప్రకటి[illegible] ఆ భావంలో ప్రతిబింబించిన నిర్దిష్ట అనుభవా[illegible]లను. సంబంధాలను మనం జాగ్ర[illegible] గుణీకరణకు ఆధారమైన[illegible] వి[illegible]

అంతగా గుణీకరణ వాస్తవికతనుండి ఎగిరిపోతుంది. పదార్థంతోడి సంబంధం విడివడ్డప్పుడు ఆలోచన (భావం) పెడమార్గం త్రొక్కే ప్రమాదం ఏర్పడుతుంది.

గుణీకృతభావాలు అభివృద్ధిచెందటంతో భావాలు ఇంద్రియానుభూతికి చెందే పదార్థాల అవగాహనకూ ఆ పదార్థాలమధ్య సంబంధాలకూ దూరమవుతాయి. అలాగే సాంఘిక జీవితానికి వర్తించే మానవ సంబంధాలకూ, ప్రకృతి పదార్థాలతో మానవునికిగల సంబంధాలకూ, వాటి ఆచరణాత్మక పరిధులకూ దూరమవుతాయి. భౌతికశ్రమనుండి వేరుపడ్డ కేవల మానసికశ్రమ రూ[illegible]తో ఆలోచనలు భావాలు దైనందిన జీవిత వ్యవహారంను [illegible]గ్యతనుండి వేరుపడిపోతాయి. ఇలాంటి దశలో ఆ[illegible]న్నిగూర్చి అనేక విధాలయిన సూ[illegible]పెంపొందిస్తాయి. అంతటితో [illegible]తలు ఒకవంకా మాటలు [illegible]యిలా కొనసాగేవేనని

[illegible] పూర్తిగా ఎగిరిపోయె అవకాశం కూడా అందులో ఉంటుంది. అంతేగాక, గుణీకృత భావం అజ్ఞాతంగాను అనిర్దిష్టంగాను కల్పనగాను మారుతుంది. తుదకు "దేవుడు"గా పరిణమిస్తుంది. ఎందుకంటే ఎంతసులభమైన సామాన్యీకరణైనా ఎంత ప్రాథమికమైన సామాన్యభావమైనా అది కల్పనలో అంతర్భాగమే"

—లెనిన్.

కనుక భౌతికశ్రమనుండి మానసికశ్రమ యెంతగా విడిపోతుందో, ఆచరణ వ్యవహారానికి సిద్ధాంత వ్యాపారం యెంతగా దూరమౌతుందో

తత్వాన్నీ, నీతినీ (ప్రత్యేకంగా) నిర్మించటం ప్రారంభిస్తుంది.

—మార్క్స్, ఎంగెల్స్.

ఉదాహరణకు యోగశాస్త్రంలో అష్టసిద్ధులుంటాయంటారు. అణిమ, గరిమ, మహిమ వగైరా. యోగుల కివన్నీ సిద్ధిస్తాయని నమ్మకం. ఒకవేళ ఈ సిద్ధులు చేకూరటమే వాస్తవమైనట్లయితే, ఈ ప్రపంచంలో అసాధ్య కార్యమనేది ఉండదు. ఐతే, అసలు చిక్కు వాస్తవంలో ఈ సిద్ధులను వశపరచుకోగలిగిన యోగులు ప్రపంచంలో అగోచరులు.

ఆలోచనావిధాన ఆఖ్యానం

మానసికశ్రమ భౌతికశ్రమనుండి విడివడటం భావాలగుణీకరణకు అవసరం. గుణీకరణలో రెండు విరుద్ధతలున్నాయి. ఒకవైపు పదార్థాల ప్రత్యక్షానుభూతి చైతన్యం కంటె విశిష్టమైన వాస్తవ సంబంధాల, సాంఘిక పరిస్థితుల వివరణద్వారా జ్ఞానాన్ని పెంపుజేయటం. మరొక వైపు లెక్కలేని కల్పనలనూ భ్రాంతులనూ పెడ మార్గాలనూ పెంపుజేయటం. ఈ విరుద్ధతల మూలంగా సాంఘిక విజ్ఞాన పరిణామంలో విరుద్ధ పార్శ్వాల మిశ్రణ మన కెదురౌతుంది. ఒకవంక వాస్తవవిజ్ఞానం అభివృద్ధిచెంది ప్రకృతికీ, సమాజానికీ, ప్రకృతితో మానవునికిగల సజీవ సంబంధానికీ చెందిన వివేకం పెంపొందుతుంది. మరోవంక నష్టదాయకమైన భ్రాంతులు, అభూతకల్పనలు, గుడ్డినమ్మకాలు ఏర్పడతాయి. ఉదాహరణకు ఆయుర్వేదంలో ఎన్నో ఉత్తమ ఓషధులు చికిత్సా విధానాలు ఉన్నాయి. కాని ఆ శాస్త్రంలో వారాలని, వర్జ్యాలని, వైద్యుని హస్తగుణమని, ఇంకా ఇలాంటి అనేక మూఢనమ్మకాలు అతిశయోక్తులు కూడా ఉన్నాయి.

ఇలా సమాజ వ్యవస్థ పెంపొందినకొద్దీ మానవులు తమనుగూర్చి తమ పరిసర ప్రపంచాన్ని గూర్చి అనేక భ్రాంతులు పెంపుజేసుకుంటారు ... కనుక సమాజాభివృద్ధియొక్క ప్రతి దశా నూతన విజ్ఞాన సంచయాన్నీ తోడ్తో నూతన భ్రాంతి పరంపరను కూడ పెంపొందిస్తుంది. ఈ విధంగా విజ్ఞాన పరిణామ మంతటిలోను భౌతిక వాదానికీ భావవాదానికీ మధ్య జరిగే సంఘర్షణకు మూలం ఆ పరిణామంలోని విజ్ఞాన అజ్ఞానాల నిరంతర వైరుధ్యమే.

భౌతికవాద, భావవాద ధోరణుల మధ్య ఏర్పడే ఈ వైరుధ్యం భావంయొక్క గుణీకరణ స్వభావంనుండే రూపొందుతుంది. భావం గుణీకరణ చెందటంతోనే యీ వైరుధ్యం ప్రారంభమౌతుంది. భౌతిక శ్రమనుండి మానసికశ్రమ వేరుపడటమే దీనికి ఆధారం. మానసికశ్రమ కేవల సిద్ధాంత వ్యాపారంగా ఆచరణనుండి విడివడగానే, ఆలోచనలు భౌతిక పునాదిని విసర్జించటంతోనే ఈ ద్వంద్వస్థితి ఏర్పడుతుంది.

ఇందులో మొదటిది పదార్థాల వాస్తవ సంబంధాలను, భౌతిక పరిణామంలో కార్య కారణాలను వివరించే భౌతికవాదం. రెండవది భౌతిక ప్రపంచాన్ని విశుద్ధ మానసిక వ్యాపారంగా, శుద్ధభావంగా, లేక భావఫలితంగా చెప్పే భావవాదం. మొదటిది, భావానికి స్థితి ఆధారమంటుంది; రెండవది, స్థితికి భావం ఆధారమంటుంది.

అందువల్ల భౌతికవాద, భావవాద ధోరణులమధ్య చెలరేగే సంఘర్షణ చాల ప్రాచీనకాలంనుండి కొనసాగుతూంది. భవిష్యత్తులోకూడ యిది కొనసాగేదే. ఈ ఘర్షణలో భౌతికవాదం ప్రకృతినీ, సమాజాన్నీ, వాటి వాస్తవిక సంబంధాన్నీ గురించిన విజ్ఞానాన్ని పెంపొందిస్తుంది; సాంఘిక పరిణామంలో పరిణతిని చేకూర్చుతుంది; ఆ జ్ఞానంతోకూడిన విశ్వాసాలను నిరంతరం వెనుకకునెట్టుతూ సజీవపాత్ర నిర్వహిస్తుంది.

సామ్యతలో కలిగేమార్పే పరిణామానికి కారణమన్నారు. పురుషుని చైతన్యస్పర్శ నిర్జీవమైన జడమైన ప్రకృతిలో పరిణామం కలిగిస్తూ ఉందనీ, తిరిగి కల్పాంతంలో ప్రకృతియొక్క త్రిగుణాలు పురుషస్పర్శను కోల్పోయి యధాపూర్వ సామ్యావస్థకు లోనవుతాయనీ, అప్పుడు ప్రకృతి పరిణామం అంతమవుతుందనీ వాదించారు. ఈ విధంగా పురుషుడు, ప్రకృతి వేర్వేరనీ, అయినా నువ్వుగింజను పిండితే నూనె వచ్చినట్లు ప్రకృతి పరిణామం కొనసాగుతుందనీ అన్నారు.

ఆపైన వేదాంతులు వివర్తవాదాన్ని ఆవిష్కరించారు. "దారాలు నేయకుండానే వస్త్రం కాలేనట్లు, నువ్వుగింజలోనుండి నూనెవచ్చినా ఆ నువ్వుగింజకూడ తెలికపిండిగా మారవలసి వస్తుంది." కనుక ఈ రెండు ఉదాహరణలు ప్రకృతి పరిణామాన్ని పురుషునికి సంక్రమింప జేసేవిగానే ఉన్నాయని చెప్పడం ద్వారా వేదాంతులు ఆరంభ సత్కార్య వాదాలను ఖండించారు. కారణమైన దేవుడు నిర్గుణుడుగావుండి, కార్యమైన ప్రకృతి మాత్రమే పరిణామ సహితమైనదని నిరూపించడానికి వివర్త వాద మొక్కటే మార్గమని వాదించారు. వీరు కారణాన్ని వాస్తవికతగాను కార్యపరిణామాన్ని మిధ్యగానూ స్వగతశీలంగా సూత్రీకరించారు. సృష్టి కారణమైన బ్రహ్మమే నిర్వికార వాస్తవమనీ, ప్రకృతీ దాని పరిణామం సర్ప-రజ్జు భ్రాంతివలె మిధ్యా జ్ఞానమనీ, ఈ మిధ్యాజ్ఞానంలో కారణ కార్య సంబంధం అనిర్వచనీయమనీ, కనుక సంయక్ జ్ఞానంద్వారా చూస్తేనే కారణమూ కార్యం కూడ పరిణామ రహితమైనవిగా రుజువవుతాయనీ చెప్పారు. అంటే మన మిధ్యాజ్ఞానం వల్ల పురుషుడే ప్రకృతిగాను, పరిణామ సహితుడుగాను కనపడు తున్నాడన్నారు. కాబట్టి మిధ్యాజ్ఞానాన్ని తొలగిస్తే సంయక్ దృష్టికి మిగిలేది నిర్గుణ బ్రహ్మము మాత్రమేనని వేదాంతులు బోధించారు. వీరి సిద్ధాంతం అద్వైతమనికూడ వ్యవహరింప పడుతోంది.

ఏది ఎలా ఉన్నా, మనమిక్కడ గమనించవలసిన విషయ మేమంటే, భారతీయ తత్వశాస్త్ర పరిణామాన్ని వివేచన చేయటంలో ఆస్తిక దర్శనాలు (1) దేవునికంటె భిన్నమైన సృష్టిని దేనికదిగా చూచే

వైశేషికం, (2) దేవుని ప్రమేయంద్వారా కలిగే సృష్టిపరిణామాన్ని సామాన్యపరంగా చూచే సాంఖ్యం, (3) దేవునిలో లేని పరిణామం సృష్టిలోకూడ ఉండదనే అద్వైతం వేర్వేరు సూత్రీకరణలద్వారా 'కార్య కారణ' నిరూపణకు పూనుకొన్నాయనే. సృష్టికారణమైన దేవుణ్ణీ, తత్కార్యమైన ప్రకృతినీ, వాటి సంబంధాన్నీ సమన్వయించే క్రమంలో ఆస్తిక దర్శనాలు కేవలం తర్కవాదాన్ని ఆశ్రయించి అనేక అవాస్తవిక ఊహాగానాలకు లోనయాయి. తర్కం ఆలోచనల నిర్దుష్టతవరకేగాని, వస్తుస్థితియొక్క నిర్దుష్టతకు గీటురాయికాదు. కనుక ప్రకృతి పరిణామ వివరణ ప్రకృతిశాస్త్ర వికాసంపై ఆధారపడుతుందేగాని, కేవలతర్కంపై కాదని మనం గమనించాలి.

ఇలాంటి క్రమబద్ధమైన అభిప్రాయాలే సిద్ధాంతాలుగా కొనసాగినవి. సాంఘిక పరిణామంలో ఆయా జాతులు, ఆయా చారిత్రక దశ లనుబట్టి తమ సాధారణాభిప్రాయాలను సిద్ధాంత రూపంలో క్రమబద్ధ మొనరుస్తాయి. సాంఘిక పరిస్థితుల అభివృద్ధినిబట్టి ఆయా సిద్ధాంతాలు కూడ మారిపోతూఉంటాయి. కనుక సిద్ధాంతాభివృద్ధి సాంఘికాభిప్రాయాల అభివృద్ధియే.

*సిద్ధాంతాభివృద్ధికి భౌతిక పునాది*

సిద్ధాంతాభివృద్ధి సమాజంయొక్క భౌతికాభివృద్ధిపై ఆధారపడుతుంది. ఉత్పత్తిశక్తుల, ఉత్పత్తి సంబంధాల వర్గాల, మరియు వర్గ సంఘర్షణల పరిణామమే సిద్ధాంత పరిణామానికి భౌతికపునాది. నేడుకూడ సాంఘికాభి వృద్ధి కొరవడ్డంవల్ల ఇంకా గణతంత్ర, బానిస, భూస్వామ్య దశలలో వెనుకబడియున్న తెగలను కొన్ని ప్రాంతాలలో మనం చూస్తున్నాం. ఆయాతెగలలో ఆయా సిద్ధాంతావశేషాలుకూడ కొనసాగుతూనేఉన్నాయి.

కనుక సిద్ధాంతాభివృద్ధి కేవలం ఆలోచనల పరిణామంపైనే కాక భౌతిక జీవన పరిస్థితుల పునాదిపై ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు ఫ్యూడల్ భూస్వామ్యంలో ప్రజల హక్కులనుగూర్చి కొనసాగిన సిద్ధాం తాలు పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి అవరోధమైనాయి. అందువల్ల

పెట్టుబడిదారీ విధానం "పౌర హక్కుల" నినాదాన్ని చేబట్టింది. పారిశ్రామికాభివృద్ధికి ఫ్యూడల్ భూస్వామ్య సంబంధాలు, "హక్కుల"ను గూర్చిన ఫ్యూడల్ భావాలు అవరోధమైనాయి. అందువల్ల పెట్టుబడిదారీ విధానం "హక్కుల"ను గూర్చి నూతన సిద్ధాంతాన్ని ఆవిష్కరించింది. ఈ నూతన సిద్ధాంతం రాజ్యాంగ రూపందాల్చి పారిశ్రామికాభివృద్ధికి. అధికోత్పత్తికి ఉపకరించింది. అలాగే ప్రకృతినిగూర్చి, దాని పరిణామకారణాలనుగూర్చికూడ నూతన ఉత్పత్తివిధానం నూతన భావాలను ఆవిష్కరించింది. దీనితో ప్రకృతి శాస్త్రరంగంలో నూతన పరిశోధనల, సిద్ధాంతాల వికాసానికి అవకాశా లేర్పడ్డాయి. ఫ్యూడల్ భూస్వామ్యసంబంధాలు పెట్టుబడిదారీ సంబంధాలుగా మారాయి. ఆ మార్పుకు అనుగుణ్యంగా సైద్ధాంతిక పరిణామం కొనసాగింది. ఈ పరిణామాన్ని మనం జాతీయ పునరుజ్జీవనలో స్పష్టంగా చూడగలం.

ఐతే,సిద్ధాంతాఅభివృద్ధి గుణీకృతభావాలఅభివృద్ధిలో ప్రత్యేకలక్షణాలను,స్వీయధోరణులనుకల్గియుంటుంది.ఐనప్పటికీ,సిద్ధాంతపరిణామ"దిశ" సమాజపు భౌతిక జీవితాభివృద్ధిచే నిర్ధారితమవుతుంది. ప్రతి సిద్ధాంతం భౌతిక సాంఘిక సంబంధాల వ్యవహారక్రమంలో నిర్దిష్ట భౌతిక ప్రయోజనాల ఆధారంపై వృద్ధిచెందుతుంది. ఐతే సిద్ధాంతం కొన్ని మానసికావసరాలను కూడ నెరవేర్చాలి. అందువల్ల సిద్ధాంతాభివృద్ధిలో మానసికావశ్యకతలుకూడ నిరంతరం నెరవేర్చబడుతుంటాయి. ఇది సిద్ధాంత వికాసంలోని స్వీయపార్శ్వం.

నిర్దిష్టమైన వర్గప్రయోజనాలు సిద్ధాంతాన్ని అభివృద్ధిచేస్తాయి. భూ వర్గాల భౌతికస్థితికి అనుగుణ్యంగా, ఆయా వర్గాల ప్రయోజనాల
కై సిద్ధాంతాలు మానసిక సాధనాలుగా నిర్మింపబడతాయి; వినియో
తాయి. కాని అవి మానసిక సాధనాలు కనుక మానసికావశ్యకతలను
వేర్చవలసివస్తుంది. అందువల్ల సిద్ధాంతాలు క్రమబద్ధమైన
నాన్ని అనగా తర్కాన్ని పాటించవలసియుంటుంది. ఒక
తిమను తయారుచేయటంలో తన పనిముట్లను

ఎలా నేర్పుతో వినియోగిస్తాడో, అదేవిధంగా ఒక తత్వవేత్త తన సిద్ధాంత నిర్మాణంలో తర్కసూత్రాలను జాగ్రత్తగా వినియోగించాలి.

సిద్ధాంత వివేచనలో నిరూపణల ఆవశ్యకత ఎలా ఉదయిస్తుంది? సిద్ధాంతం భౌతిక ప్రపంచపు గుణీకృతభావాలకు ప్రతిబింబమని తెలుసుకున్నాం. కనుక మానవులు తామునివసించే భౌతిక ప్రపంచాన్ని, లేక అందులో ఒకానొక భాగాన్ని తమ జీవితాలతో సమన్వయించుకొని వివరించుటకూ, ఆ చైతన్యాన్ని తమ జీవిత పరిస్థితుల సంబంధాలలో వినియోగించుకొనుటకు ప్రతిసిద్ధాంతం ఉద్దేశింప బడుతుంది. జీవితానుభవానికీ, దాని రూఢిజ్ఞానానికీ అనుగుణ్యంగా మానవులు తమ సిద్ధాంతాన్ని అన్వయయుతంగాను, తర్కబద్ధంగాను పెంపుజేసుకోవలసియుంటుంది. అందువల్ల మానవుల మానసికావసరాలను నెరవేర్చే లక్షణం సిద్ధాంత పరిణామంలో నిరంతరం పాత్ర వహిస్తుంది.

సిద్ధాంతాలు భావాలలో వాస్తవికతను ప్రతిబింబించ వలసియుంటుంది. అందుకై తర్కబద్ధతను అనుసరించాలి. ఆపై వాస్తవికత యొక్క ఒక్కొక్క పార్శ్వాన్ని పాక్షికంగా ప్రతిబింబించాలి. ఈ రెంటికీ సమన్వయం ఉండాలి. సిద్ధాంతస్థాయి ప్రజల అనుభవస్థాయితో, అవగాహనస్థాయితో సమానంగా కొనసాగాలి. అప్పుడే అంగీకృతి, గుర్తింపు సాధ్యమౌతుంది.

కనుక సిద్ధాంతాలు ఒకానొక సాంఘికవ్యవస్థ ఆధారంపై, ఒకానొక వర్గ ప్రయోజనానికి అనుగుణ్యంగా రూపొందుతాయి. సిద్ధాంతాభివృద్ధిలో ఒక వంక అభిప్రాయాల సమన్వయం, తర్క సంబద్ధత అవసరం. మరొకవంక ఒకానొక సాంఘికాభివృద్ధి దశలో అవసరమయే ప్రధాన వాస్తవాలను ఆవరించి వివరించవలసి యుంటుంది. ఈనిరం వైరుధ్యం సిద్ధాంత పరిణామ మంతటిలోను కొనసాగుతుంది. ఒక విభిన్నవర్గాల ప్రతినిధులు వ్యక్తీకరించే అభిప్రాయాలు తాగి స్వవ్యాఘాతానికీ, వాస్తవికంగాఅసమన్వయతకు లోనౌతుంటాయి వంక తర్కమూ, వాస్తవిక స్థితిగతులూ ఆయా సిద్ధాంతాల కతను సవాలు చేస్తుంటాయి. ఈవైరుధ్యాలుసి

విస్తృతికీ ఆధారమవుతూ, సిద్ధాంతాల స్వీయపరిణతికి వికాసం చేకూరుస్తాయి. ఈ వైరుధ్యాల మూలంగా సిద్ధాంత పరిణామం ఆయా సాంఘిక దశలకు అనుగుణ్యంగా కొనసాగుతుంది.

*సిద్ధాంతాల విమర్శ*

ఏ అభిప్రాయాలకు చెందిన సిద్ధాంతమైనాసరే వికసించాలంటే సిద్ధాంత నిరూపణ, తర్కసంబద్ధత, స్వవ్యాఘాతనివారణ పాత్ర వహిస్తాయి. తోడ్తో ఆ అభిప్రాయాలు జీవితానుభవానికి అనుగుణ్యంగా ఉంటాయి. సిద్ధాంతాల విస్తరణలో ప్రధానపాత్ర జీవిత వాస్తవికతకూ అభిప్రాయాలకూ పొత్తుకలవడం. కనుక సిద్ధాంతాల అభివృద్ధిని, అభివృద్ధి క్రమాన్ని పరిశీలించాలంటే భావాల సాధారణీకరణనుగాక, వాటి వివరాలను సూక్ష్మంగా పరిశీలించవలసియుంటుంది. మనో వ్యాపారంలో ఎగుడుదిగుడుగా కన్పించే విభిన్న వాస్తవాలను, భావాలను క్రమబద్ధమొనరించటం, స్వవ్యాఘాతాలను తర్కఅసంబద్ధతలను తొలగించటం, స్వీయాభిప్రాయాలను నిరూపించటం మున్నగు అంశాలను పరిశీలించాలి. అయితే ఆయా సిద్ధాంతాల ఈ అభివృద్ధిలో సాంఘిక పరిస్థితుల, ఆర్థిక సంబంధాల, వర్గప్రయోజనాల పునాది అప్రత్యక్షంగాను వక్రంగాను అప్రధానంగాను మారుతుందని గమనించాలి. ఎంగెల్స్ న్యాయశాస్త్ర వికాసాన్నిగూర్చి యిలా వ్రాశాడు :

> "న్యాయశాస్త్రం ఆర్థిక స్థితికీ దాని వ్యక్తీకరణకు అనుగుణ్యంగా ఉండడమేగాక, స్వీయపోషక శక్తినికూడ కల్గియుండాలి. అంటే, అది స్వవ్యాఘాతాల మూలంగా తనకు తానే కూలిపోకుండా ఉండాలి. అందుకని ఆర్థిక పరిస్థితుల యధాతధ ప్రతిబింబం అప్రధాన అరిమౌతుంది. ఈ విధంగా హక్కులు (న్యాయశాస్త్ర సమస్య) ఒక సాధనిక ఆర్థిక సంబంధాలను న్యాయసూత్రాలుగా అనువదించడంలో గింపబడే వైరుధ్యాన్నీ, అంతకంతకు అధికంగా అభివృద్ధిచెందే ఆర్థిక కూడ నెత్తు ఒత్తిడివలన న్యాయశాస్త్రం బీటలువారడంవల్ల కలిగే ఆలోచనావిరిన్ని [illegible]డానికి చేసే ప్రయత్నాల్లో అభివృద్ధి చెందు శిల్ప లోప

ఈ క్రమం న్యాయశాస్త్రానికేగాక అన్నిసిద్ధాంతాలకూ వర్తిస్తుంది. తత్వశాస్త్రం, మతం, నీతి, సాహిత్యం, ప్రకృతిని గూర్చిన అభిప్రాయాలుకూడ ఈ వైరుధ్యాల ఘర్షణలోనే పరిణామం పొందుతాయి.

సిద్ధాంతా లెల్లప్పుడూ విమర్శకు గురిఅయ్యేవే. జీవిత వాస్తవికతకు అనుగుణ్యంగా ఉండకపోవటం, తర్కసంబద్ధతకు దూరమై స్వవ్యాఘాతానికి గురికావటం ఈ రెండూ విమర్శనీయమౌతాయి. ఒక వర్గానికిచెందిన మేధావులు అన్నివర్గాలకూ వర్తించునట్లు సిద్ధాంతాలు రూపొందిస్తారు. ఆ కృషిలో చాలా క్లిష్టమైన దూరాన్వయం గల వాదనలు కొనసాగుతవి. ఇది ఒకటి. కాగా, సాంఘిక పరిస్థితులు పురోగమిస్తాయి. అందువల్ల కొత్త పరిస్థితులకు పాత సిద్ధాంతాలు సమన్వయం కావు. అందువల్ల నూతన వాదనలు, నూతన సిద్ధాంతాలు ప్రారంభమౌతాయి. ఈ విధంగా సిద్ధాంత పరిణామం వైవిధ్యంతో కొనసాగుతుంది. ఈ పరిణామం తత్వశాస్త్రంలోను కనపడుతుంది. విభిన్న దర్శనాలూ, వాటి జటిలభాష్యాలు ఇలా పెంపొందినవే. ఐతే, ఈ సిద్ధాంత విస్తృతికంతటికీ ఆధారం "విమర్శ"యే.

ఒకానొక వర్గసిద్ధాంతం పరిణతిచెందటంలో విమర్శ పైవిధంగా పాత్ర వహిస్తుంది, ఐతే సాంఘిక జీవితంలో నూతన పరిణామాలు కలిగినప్పుడు విమర్శకూడా నూతనరూపం చేకూర్చుకుంటుంది. అప్పుడు విమర్శ భిన్నవర్గాల నూతన ప్రయోజనాలను నూతనదృక్పథంతో వ్యక్తీకరించే సిద్ధాంతాలకు దారిచూపుతుంది. ఐతే భౌతికజీవితపు నూతన పునాదులు లేకుండా నూతన సిద్ధాంతాలు ఏర్పడవు. కొత్త సిద్ధాంతాలు రాగానే పాత సిద్ధాంతాలలోని అసంబద్ధతలను అవి ఎత్తిచూపి, వాటి అధికారాన్ని సవాలుచేస్తాయి. కొత్త సిద్ధాంతాలు పాత సిద్ధాంతాలను కూలద్రోయుటకు తర్కశాస్త్రాన్నీ, వాస్తవిక దృక్పథాన్నీ సాధనాలుగా, అంటే మానసిక సాధనాలుగా వినియోగిస్తాయి. ఈ విధంగా అవి సాంఘికాంగీకృతిని చేకూర్చుకుంటాయి.

సిద్ధాంతరంగంలో విమర్శకులు తరచు భావపరిణామాన్ని మాత్రమే చర్చిస్తారు. తత్వశాస్త్ర చరిత్రలో అనేకమంది విమర్శకులు భావవికాస

పరిణామాన్ని కేవలం మానసికావసరాల సాధనగా నిరూపించారు. సాంఘిక పునాదిని విడిచిపుచ్చే యీ విధానం అనేక అసమగ్రతలకు, తిక మకలకు, డొంకతిరుగుడు నిరూపణలకు దారితీస్తుంది. ఈ పద్ధతిలో భావపరిణామాన్ని సమన్వయించి నిరూపించటం సాధ్యంకాదు అందువల్ల ఒకరికొకరికి కుదరనిపరిస్థితి, లెక్కలేని అభిప్రాయభేదాలు, అయో మయం ఏర్పడుతుంది.

నిర్దిష్ట దేశకాలాల్లో నూతన భావాలెందుకు, ఏ పునాదిపై రూపొందుతాయో అవి ఆ రూపంలోనే యెందుకుంటాయో కేవలం భావపరిశీలన వల్లనే వివరించజాలం. అందువల్ల ఆయా భావాలకు ఆధారమయ్యే భౌతిక జీవిత పరిస్థితులను పరిగణించటం అనివార్యం. ఐతే, భావ పరిణామాన్ని వివరించటంలో ఆర్థిక, సాంఘిక పరిస్థితులనే గాక మానసిక ఆవశ్యకతలను, విజ్ఞాన స్థితిగతులను, వాటి స్థాయినికూడ పరిగణించటం అవసరమౌతుంది. ఈ రెండూ అనివార్యములే.

కొందరు సాంఘికవేత్తలు "ఆర్థిక నియంత్రణ" సూత్రంతో సిద్ధాంత పరిణామాన్ని కొలుస్తారు. సమాజపు విభిన్నరంగాల వికాసానికి ఆర్థిక వ్యవహారం మాత్రమే ఆధారమని వీరి ఉద్దేశం. ఇది పాక్షిక దృష్టియే. వాస్తవికప్రపంచం మానవులభావాల్లో ప్రతిబింబిస్తుందనీ, అలా ప్రతిబింబించే క్రమం సిద్ధాంతానికి ఆధారమౌతుందనీ వీరు గుర్తించరు. వీరు సిద్ధాంత రంగంలోని ప్రతి భావమూ, ప్రతి చర్య కేవలం ఆర్థిక ప్రయోజనాల సాధనకేనని వాదిస్తారు. దీనివల్ల రెండు పొరపాట్లు జరు గుతాయి. ఒకటి : ప్రతిభావమూ ఆర్థిక ప్రయోజనాల సాధనకేగనుక తమ భావాలతోబాటు యే భావంకూ అసలువాస్తవాన్ని ప్రతిబింబించజాలదని. ఉదాహరణకు నిద్ర అలసటను తొలగిస్తుందనే భావం. దీనిని ఆర్థికావ సరాలతో ముడిపెట్టటం అర్థరహితమేకదా ! రెండవ పొరబాటు: ఇతరుల భావాలన్నీ ఆర్థిక ప్రయోజనాల సాధనకే గనుక తమ భావాలు మాత్రం వర్గస్వభావానికి అతీతమై సమగ్ర నిష్పాక్షిక వాస్తవాలని. అంటే వీరు సమాజాన్ని తమనుండి వేరుచేసుకొని ఆలోచిస్తారు. కాని

ఇందులోకూడ స్వవ్యాఘాతంవుంది. ఎందుచేతంటే అలా సమాజాన్ని తమనుండి వేరుచేసుకొని ఆలోచించ గలవారెవరూ ఉండరు.

ఎలాగైనా సిద్ధాంత విమర్శకు, వివేచనకు ఆధారం తర్కమూ, అనుభవం ఈరెండే. వాస్తవాన్ని విమర్శాత్మకంగా పోల్చుకొనేకృషియే విమర్శ. వాస్తవాన్ని పోల్చుకునే ఈ కృషి సిద్ధాంత పరిణామంలో నిరంతరం అన్ని దశల్లోను ప్రేరణగా వుంటుంది. అంతేకాని సాంఘిక జీవితంనుండి విముఖులైన యే కొందరో ఋషులు, మునులు సిద్ధాంత పరిణామానికి కర్తలుకారు. ఆవిధంగా సాంఘిక జీవిత పునాదిని విసర్జించి ఆలోచించటం సాధ్యంకూడ కాదు (వెర్రివానికి తప్ప). అందువల్ల సిద్ధాంత పరిణామం మానవ జీవితానుభవంనుండి, ఉత్పత్తి విజ్ఞాన శాస్త్రం వర్గపోరాటాల ఆధారంపై రూపు దిద్దుకుంటుంది.

*సిద్ధాంతాల్లో వాస్తవికత - భ్రాంతి*

భావ ప్రతిబింబానికి భౌతిక వాస్తవికత పునాది. కాని, భౌతిక వాస్తవికతను భావంలో ప్రతిబింబించుకునే క్రమంలో విభిన్న భ్రాంతులు, వికృతులు, అభూతకల్పనలు కూడ కొనసాగుతాయి. వీటి మధ్యనుండే వాస్తవికతనుగూర్చిన చైతన్యం ముందుకు సాగుతుంది.

ఒకానొక వాస్తవం భావాల్లో ప్రతిబింబించేక్రమం భిన్నసాధనాల ద్వారా, భిన్న విధానాలద్వారా భిన్నక్రమాలద్వారా కొనసాగుతుంది. అట్టి వైవిధ్యం మూలంగానే భ్రాంతి-వాస్తవికతలమధ్య వైరుధ్య మేర్పడు తుంది.

పదార్థాలను గూర్చిన భావాలు ఆ పదార్థాలతో మనకు గల సక్రియ సంబంధంపై ఆధారపడి, అనుభవమనే గీటురాతికి గురిఅవుతాయి. అంతే గాక, ఆ పదార్థాల భౌతికధర్మాలు, సంబంధాలు, పరిణామాలు శాస్త్రీయంగా పరిశీలింపబడటంపైకూడ ఆధారపడతాయి. ఈవిధంగా యేర్పడే భావాలు సిద్ధాంతాల్లో వాస్తవిక ధోరణికి చెందుతాయి. అంటే, అవి పదార్థంయొక్క భౌతిక వాస్తవికతకు అనుగుణ్యంగా ఉంటాయన్నమాట.

కాని, భావాలు ఈ విధంగానేకాక అ_స్తవ్య_స్తంగాను, వక్రంగాను కూడ యేర్పడతాయి. సిద్ధాంతాల నిర్మాణంలో ఇలాంటి భావాలుకూడ ప్రభావం కలిగిస్తాయి. ఎలాగ ? (అ) భిన్నానుభవాల సంబంధంద్వారా గుణీకృతభావా లేర్పడతాయి. (ఇ) ఆ గుణీకృతభావాలు తమకు ఆధార మైన సంబంధాలనుండి విడిపోతాయి. (ఉ) ఆ గుణీకృత భావాల ఆధా రంపై పదార్థాలనుగూర్చిన నిర్దిష్ట నిర్ణయాలు సామాన్యీకరణలు కొన సాగుతాయి. అంటే, భౌతిక పునాదినిగూర్చిన పరిగణన లేకుండానే నిర్ణ యాలు ఏర్పడతాయన్నమాట.

ఉదాహరణకు సమాజంలో వర్గాలేర్పడి పాలకవర్గాల ఆధిపత్యం అమల్లోకి వచ్చిన తర్వాత రూపొందిన సాంఘిక సంబంధాలనుబట్టి, అనుభ వాలనుబట్టి, వ్యవహారాలనుబట్టి పాలక పాలితుల సంబంధాన్ని గురిం చిన భావాలేర్పడ్డాయి. ఈ గుణీకృత భావాలను 'పాలక – పాలిత' ఆవ రణనుండి వేరుచేసి సామాన్యీకరించగా, ప్రపంచపరంగా అన్వయించగా మొ_త్తం విశ్వానికికూడ ఒక పరిపాలకు డున్నాడనే భావం, అతడు దేవు డన్న భావం రూపొందాయి ఈ భావాన్నితీసుకొని, తిరిగి దేవుని సృష్టి ద్వారానే సాంఘిక సంబంధాలూ, ప్రకృతి పరిణామాలు కొనసాగుతున్నా యనడం ఒక సిద్ధాంతీకరణ ఔతుంది.

ఇలా పదార్థాలను గూర్చిన భావాలు రూపొంది వి_స్తరిల్లటంతో మనం ఆ భావాల ప్రభావంవల్ల ఇతర పదార్థాలకు కొలతలు పెడతాం. విభిన్న పదార్థాలనుగూర్చిన ఇలాంటి స్వీయాభిప్రాయాలు ప్రజల్లో మతం, సంప్రదాయం, అలవాటు, విద్యాభ్యాసం మూలంగా గాఢంగా నాటుకొని ఉన్నాయి. ఉదాహరణకు గోవులను ఆరాధించటం. పట్టుబట్ట కట్టు కుంటే మడి, నూలుగుడ్డ తాకితే మైల అనుకొనటం. ఇలాంటి భావాలు అప్రయత్నంగానే పనిచేస్తూఉంటాయి. ఐతే మనం విషయంయొక్క వా_స్త వికతను పరిశీలించకుండా, నిజానిజాలను విమర్శించకుండా ఇలాంటి భావాలకు లోనౌతాం. ఇలాంటి గుణీకృత భావాల్లో కొన్ని వా_స్తవాలు గాను మరికొన్ని భ్రాంతులుగాను కూడ ఉండవచ్చు. కాని, భ్రాంతులు వా_స్తవాన్ని వా_స్తవికంగా కాక వక్రంగా, అసహజంగా చిత్రిస్తాయి.

భ్రాంతులు వాస్తవికత అను భూమికనుండే రూపొందుతవి. అవి కేవల మనోజనితములు కావు. ఒకానొక పదార్థ ఆలంబనంనుండి మనం పొందిన నిర్దిష్ట భావాలను సామాన్యీకరించి, ఆ సామాన్య భావాలను విమర్శనారహితంగా, పరిశీలనారహితంగా ఇతరపదార్థాలకు సందర్భాలకు సంక్రమింప జేయటంలోనే భ్రాంతులు ఏర్పడతాయి. ఇలా భ్రాంతి తన వాస్తవికతాధారాన్ని కోల్పోతుంది.

ప్రతి భ్రాంతికీ ఆధారం వాస్తవికతయే, ప్రతి భ్రాంతి భౌతిక జీవిత పరిస్థితులను ప్రతిబింబించేదే. నిర్దిష్ట సాంఘిక ప్రాకృతిక సంబంధాల్లోను, వ్యవహారాల్లోను ఉదయించేదే. అందుకనే అనేక భ్రాంతులు సమాజవ్యాప్తంగా వేళ్ళుదన్నుకొని బలపడతాయి. వాటిని తొలగించుటకు తీవ్రకృషి అవసరమౌతుంది. అందుకని కొన్ని భ్రాంతులను ఎవరో కొందరువ్యక్తులు ప్రజల్లో నూరిపోస్తారన్నట్లు కాక, ఆయా భ్రాంతులు ఆయా సాంఘిక సంబంధాలలో ఆయా భౌతికప్రయోజనాల కొరకు ఏర్పడతాయన్న అంశాన్ని పరిగణించాలి.

భ్రాంతులు ప్రధానంగా రెండు రూపాల్లోఉంటాయి. ఒకటి వాస్తవ పదార్థాలనుగూర్చిన భ్రాంతులు. పదార్థాల వాస్తవక్రమాలకూ, అనుభవంలో వాటి సంబంధాలకూచెందిన అపోహలు ఈ విధమైనవే. ఉదాహరణకు కొన్ని సాంఘిక సంబంధాలు, సంప్రదాయాలు దైవనిర్మితములూ మానవసహజములు అన్న భావం. రెండవ విధమైన భ్రాంతులు అవాస్తవ పదార్థాలనుగూర్చిన కల్పనలు. ఉదాహరణకు స్వర్గ నరకాలు, దేవతలు దయ్యాలు మున్నగునవి. మానవుడు భౌతిక పదార్థాలకుచెందిన భ్రాంతులతోబాటు కల్పిత పదార్థాలనుగూర్చిన భ్రాంతులను కూడ కల్గి యున్నాడు. ఐతే, మనం ఒకానొక భ్రాంతిని 'ఇది తప్పు' అన్నరీతిలోనే తేల్చివేయలేం. భ్రాంతులుతప్పులే. ఐనప్పటికీ అవొక ప్రత్యేకమైన తప్పులు.

ఉదాహరణకు "మూడు మూళ్ళు తొమ్మిది". దీన్ని ఎవరైనా "మూడు మూళ్ళేడు" అని అంటే అది తప్పు. కాని ఒకరు "13 అంకె దురదృష్టకరం" అన్నారనుకొండి. ఇది సంఖ్యామానాలకూ, విలువకూ

చెందిన దోషంకాదు. కొన్ని అంకెలు అదృష్టకరమైనవీ, మరికొన్ని దురదృష్టకరమైనవన్న నమ్మకానికి చెందినది. ఇది అంకెల వినియోగంలో వచ్చిన పొరబాటుకాదు. అదృష్టాన్నీ, దురదృష్టాన్నీ గూర్చి ముందే మనలోఉన్న భావాలను అంకెలపైకి విమర్శరహితంగా ప్రసరింపజేయడంవల్ల కల్గిన భ్రాంతి.

మరొక ఉదాహరణ: "రామప్ప చెరువును నైజాము కట్టించాడు." ఇది తప్పు. ఎందుకంటే, ఆ చెరువును కాకతీయరాజులు కట్టించారని చరిత్ర చెప్తుంది. కాని కాకతీయ ప్రతాపరుద్రుడు తన నవసిద్ధుల మహిమవల్ల ఒక్కరాత్రిలో రామప్పచెరువును కల్పించాడని గాధ. పూర్వపు రాజులు దేవతల, సిద్ధుల సహాయంతో చెరువులూ, కోటలూ, గుళ్ళూ కట్టించేవారన్న నమ్మకంనుండి ఈ భ్రాంతి రూపొందింది.

ఈ విధంగా భ్రాంతి ఒక ప్రత్యేకమైన పొరబాటు. ముందే మనస్సులో ఏర్పడియున్న కొన్ని గుణీకృత భావాలను, నమ్మకాలను, అనుమానాలను, శంకలను పదార్థాలకు విమర్శరహితంగా ఆరోపించటమే భ్రాంతి.

*శాస్త్రీయ సిద్ధాంతం; భ్రాంతిజనిత సిద్ధాంతం*

సిద్ధాంతాల్లో వాస్తవికభావాలు, భ్రాంతిజనిత భావాలు రెండూ ఉన్నాయి. (1) పదార్థాల సంబంధంలోకలిగే అనుభవ పునాదిపై రూపొందిన అభిప్రాయాలు (2) అదివరకే ఏర్పడియున్న గుణీకృతభావాల న్వయంద్వారాకలిగే అభిప్రాయాలు. ఈ రెండూ భావాలగుణీకరణలో ...త వహిస్తాయి. ఇందులో ఒకటి శాస్త్రీయధోరణి, మరొకటి అశాస్త్రీయ ...ణి. కనుక ఆయా సిద్ధాంతాల్లో శాస్త్రీయభావాలు ప్రధానమా? లేక ...స్త్రీయభావాలా? అన్న ప్రశ్నపై ఆయా సిద్ధాంతాల శాస్త్రీయత ... అశాస్త్రీయత ఆధారపడుతుంది. ఉదాహరణకు ఆయుర్వేదం ... మంత్రశాస్త్రం మరొకటి. ఒకటి ప్రయోగాత్మకమైనది. మరొకటి ...క్తుల నమ్మకంపై ఆధారపడినది. ఈ రెండు శాస్త్రాలు పునాదుల్లోనే ...యి. వైద్యశాస్త్రంలో లోపాలుండవచ్చు. అవి దోషాలుగా

తొలగింపబడతాయి. కాని మంత్రశాస్త్రంలో లోపాలు, దోషాలు, తప్పుల సమస్యేలేదు. అసలా శాస్త్రమే భ్రాంతిజనితం. అది భ్రాంతులతో నిండియుంటుంది.

సిద్ధాంతాలు ఆయా వర్గాలకు చెందిన మేధావులు తమ వర్గస్థితికీ ప్రయోజనానికీ అనుగుణ్యంగా వర్గసంఘర్షణలో పెంపొందుతవి. ఆయా వర్గ సిద్ధాంతాలలో వాస్తవికత, భ్రాంతి కూడ పాత్రవహించి శ్లిష్టతలకు అవకాశం కల్గిస్తాయి. ఒకవంక వర్గప్రయోజనాల అనివార్యతమూలంగా ఆచరణాత్మక, సవిమర్శకఆలోచనలుకొనసాగుతాయి. ఇదిశాస్త్రీయధోరణి. ఉదాహరణకు పెట్టుబడిదారీవర్గం ప్రకృతి శాస్త్రాలను పెంపొందిస్తుంది. సాంఘిక సంబంధాలలో మార్పులు సాధించి సాంఘిక శాస్త్రాలను కూడ సంస్కరిస్తుంది. రెండవ వంక వర్గప్రయోజనాల అనివార్యతలోను సాంఘికోత్పత్తిలోను వర్గపాత్రను గూర్చిన భ్రాంతులు ఏర్పడతాయి. ఇది అశాస్త్రీయధోరణి. ఉదాహరణకు పెట్టుబడిదారీ విధానం తన సిద్ధాంతంలో కొన్ని సాంఘిక భ్రాంతులకు గురియౌతుంది. మాల్థస్, ఆర్థికోత్పత్తి కంటె జనాభా హెచ్చువేగంతో పెరుగుతుందనీ, కనుక కరువులు యుద్ధాలు వ్యాధులతో జనక్షయం అనివార్యమౌతుందనీ ఒక సిద్ధాంతం చేశాడు. అలాగే, గుత్తపెట్టుబడి దారులు తమ వ్యక్తి యాజమాన్యపు విశిష్టతనూ, స్వేచ్ఛావ్యాపార హక్కునూ గురించి చట్టాలను అమలులోకి తెస్తారు. ఇది పెట్టుబడిదారీ సమాజ సంబంధాలలో అభివృద్ధి నిరోధక పాత్రవహిస్తుంది.

ఇలా బూర్జువా సిద్ధాంతవేత్తలు శాస్త్రీయ, అశాస్త్రీయ ధోరణు రెంటినీ తమ సిద్ధాంతాల్లో పెంపొందించారు. కనుక పెట్టుబడిదారీ సిద్ధ అభివృద్ధిలో ఈ వైరుధ్యం అన్ని రంగాలలోను ప్రభావం వే బూర్జువావర్గం పరస్పర విరుద్ధమైన పోకడలను తన సిద్ధాంతాల్లో స యించుకోవలసివచ్చింది. ఇందుకు అనేక భ్రాంతులను ప్రోత్సహిం ఇతరవర్గాల సిద్ధాంతాల్లోకూడ ఈస్వవ్యాఘాత లక్షణాలున్నా, సాంఘి త్తిలో గుత్తపెట్టుబడిదారులకు నేడున్న ప్రాధాన్యతను బట్టి పెట్టు

సిద్ధాంతాల్లో ప్రకృతిశాస్త్రాల సాంఘిక శాస్త్రాలమధ్య వైరుధ్యం అత్యంత ప్రస్ఫుటమైన పాత్ర వహిస్తుంది.

బూర్జువా తత్వ శాస్త్ర వికాసంలో విభిన్న శాస్త్ర విజ్ఞాన పరిశోధనలను పెట్టుబడిదారీ వర్గ స్వీయాభిప్రాయాలతో సమన్వయించటం కొనసాగుతుంది. విజ్ఞానశాస్త్ర నిర్ణయాలను మతభావాలతో సమన్వయించటంలో ఈ వైరుధ్యం స్పష్టంగా కనబడుతుంది. ప్రకృతిశాస్త్ర వాస్తవాలకు గీటురాయి భౌతిక ప్రయోగాల పర్యవసానం. మతబోధలకు పునాది గుడ్డినమ్మకం. ఈ రెంటినీ జోడించుటకు అనేకమంది తాత్వికులు విభిన్నవాదాలను లేవదీశారు. ఇలా, అతుకులబొంత సిద్ధాంతాలతో అంతో ఇంతో ఆత్మ సంతుష్టిని చేకూర్చు కొనటమేకాని, సమస్యలు ఏనాటికీ పరిష్కరింపబడవు.

ఇలా పెట్టుబడిదారీ విధానం అనేక విజ్ఞానశాస్త్ర వాస్తవాలను తన వర్గ అభిప్రాయాలకు అనుగుణ్యంగా మలచి వ్యాఖ్యానించే ధోరణి సిద్ధాంత రంగంలో విరివిగా కొనసాగుతూంది. ఉదాహరణకు క్వాంటమ్ ఫిజిక్సులో పదార్థ సంఘటనలు పరిణామాలు అనిర్వాచ్యమైనవనీ, ప్రకృతియే అజ్ఞేయమనీ ఎడింగ్‌టన్ వాదన. అలాగే ప్రకృతిపదార్థాలనుగురించిన మన జ్ఞానానికి ఆధారం మన అనుమానమేనని రసెల్ సిద్ధాంతం. ఇలాగే ప్రాగ్మాటిజమ్, ఎగ్జిస్టానలిజం, [illegible] మున్నగు వివిధ ధోరణులున్నాయి. ఇవన్నీ అశాస్త్రీయ [illegible] ఎందుచేతంటే, బూర్జువా వర్గం [illegible] సంక్షోభం కారణ [illegible] తన పాత భావా [illegible] కొలతలు [illegible] తన

సామాన్యం ఏనాటికీ అందుకోలేకపోతుందనీ, పాలకవర్గ నినాదాల ప్రోద్బలం మూలంగా కొంత అభివృద్ధి జరిగినా ప్రజల అసమర్థతవల్ల ఆ అభివృద్ధి తిరిగి పతనమైపోతుందనీ, కనుక కొత్త పాలకవర్గం రూపొంది దేశాభివృద్ధికై కొత్త నినాదా లిస్తుందనీ, ప్రజానీకం వాటి సాధనలో తిరిగి విఫలత చెందుతుందనీ, ఇలా కొత్తకొత్త పాలక వర్గాలు రావటం, కొంతకొంత దేశాభివృద్ధిని సాధించటం, కాని ప్రజల అసమర్థత మూలంగా ఆ అభివృద్ధి తిరిగి విఫలమౌతూండటం జరుగు తుందని యాంత్రికపద్ధతిలో చరిత్ర పరిణామాన్ని సిద్ధాంతీకరించాడు. ఈ సిద్ధాంతంలో పాలకవర్గ ఆధిక్యతను నిరూపించటమే ప్రధాన లక్ష్యం. అంతేకాని, ఉత్పత్తిశక్తుల, ఉత్పత్తి సంబంధాల పరిణామం, సాంఘిక జీవితాభివృద్ధి ఈ సిద్ధాంతానికి సరిపడవు.

భ్రాంతులు ఈ విధంగా ఉంటాయి. సిద్ధాంతరంగంలో ఈ వాదం భ్రాంతి అనీ, ఆ వాదం వాస్తవమనీ దేనికదేగా విడదీయటం సమస్య కాదు. సిద్ధాంతరంగంలో భ్రాంతుల, సత్యాల మధ్య వైరుధ్యం, వాటి పర స్పర సంక్రమణ విభిన్ననిరూపణల్లో ఏకత్రితంగా ఎదురౌతూ ఉంటుంది. భ్రాంతులలో వాస్తవాంశ, వాస్తవాలలో భ్రాంతి అంశ సమ్మిశ్రితమై, వివిధ సమస్యలలో శ్లిష్టంగా ఎదురౌతుంది.

బూర్జువాసిద్ధాంతాలు వా[illegible]యొక్క, భ్రాంతులయొక్క సమ్మిశ్ర ణగా ఉంటాయి. ఈ సం[illegible]ంశను భ్రాంతిఅంశం కబళిస్తుం టుంది. ఉదా[illegible] జ్ఞాసా[illegible]
చింది. కాని [illegible]
కొర[illegible]

సాధనంగా ఉంటుంది. అలా ఉండాలన్న దృక్పథం కారుతో జోడింప బడియుంటుంది. బూర్జువా అర్థశాస్త్ర సిద్ధాంతాలన్నిటిలోను ఈ వైరుధ్యం మనకు కనబడుతుంది. ఇదే విధంగా బూర్జువా సిద్ధాంతాలన్నీ ఆ వర్గానికి ప్రత్యేక లక్షణమైన భ్రాంతిముద్రలకు లోనైయుంటాయి.

చరిత్రలో బానిస యజమానుల, ఫ్యూడల్ భూస్వాముల సిద్ధాంతాల్లో ఆయావర్గాల ఆధిపత్యపుముద్ర స్పష్టంగా కనపడ్తుంది. సార్వజనీన వాస్తవాన్ని వర్గప్రయోజనాల భ్రాంతి నిరంతరం అణచిపెట్టింది. ఈ వైరుధ్యం వర్గసిద్ధాంతాలలో అనివార్యం. ఐతే మార్క్సిజం సమాజంయొక్క వర్గపరిమితులకు అతీతమైనది. అది ఒక వర్గసిద్ధాంతం మాత్రమే కాక, సార్వజనీనమైన శాస్త్రదృక్పథం. కనుక మార్క్సిజం శాస్త్రీయవాస్తవపు ప్రాధాన్యతను మౌలికమైనదిగా గుర్తిస్తుంది. ఇతర అన్ని సిద్ధాంతాలకంటెమార్క్సిజం యొక్క విశిష్టత ఇదే. అందుకనే మార్క్సిజం పెట్టుబడిదారీ విధానాన్నీ. దానితోబాటు మనిషి మనిషిని దోచుకునే సామాజిక వైరుధ్యాన్నీ, తన్మూలకంగా యేర్పడే సిద్ధాంత భ్రాంతులనూ కూడ నిర్మూలిస్తుంది.

# 7 వ అధ్యాయం

# సిద్ధాంత భ్రాంతులు

సిద్ధాంత భ్రాంతులు సాంఘికోత్పత్తి సంబంధాల పునాదిపై ఏర్పడతాయి. కాని ఆ పునాదినుండి అవి చైతన్యయుతంగా కాక, అప్రయత్నంగా, యాదృచ్ఛికంగా ఏర్పడతాయి. కనుక సిద్ధాంత కర్తలు తమ భావాలలోని భ్రాంతుల వాస్తవ పునాదిని గుర్తించక, తమ భావాలు కేవల ఆలోచనలో రూపొందుతాయని భావిస్తారు. అందువల్ల సిద్ధాంతంలో విలోమక్రమం కొనసాగుతుంది; వాస్తవ సాంఘిక సంబంధాలు భావ మూలకమైనవిగా కనబడతాయి. ఈ విధంగా సిద్ధాంత భ్రాంతులు వర్గమూలకమైన అపోహలను కల్పిస్తాయి.

సిద్ధాంతాల్లో భ్రాంతులు రూపొందేక్రమాన్ని మన మీ అధ్యాయంలో చర్చిద్దాం. ఆపైన, వచ్చే అధ్యాయంలో సిద్ధాంతాభివృద్ధియొక్క వాస్తవ ధోరణులను పరిశీలించవచ్చు.

వర్గసమాజంలో భ్రాంతులు ఐదు ప్రత్యేక లక్షణాలతో పెంపొందుతాయి.

***1. ఉత్పత్తి సంబంధాల ప్రతిబింబం :***

సిద్ధాంత భ్రాంతుల మొదటిలక్షణం, అవి చారిత్రకమైన సాంఘి సంబంధాలనుండి రూపొందటం. అంటే భ్రాంతులకు ఆధారం ఉత్ప సంబంధాలన్నమాట.

పైపై దృష్టితోచూస్తే, మానవుల ఆలోచనాక్రమంనుండి, అంటే మేధనుండి కొన్ని గుణీకృత, సామాన్యీకృత భావాలు రూపొంది, అవి ఆలోచనద్వారా సమన్వయింపబడి క్రమబద్ధమొనరింపబడటంతో, సిద్ధాంత భ్రాంతులు పెంపొందుతాయని తోస్తుంది. అంటే భ్రాంతులు ఆలోచనా ఫలితాలన్నమాట. కాని మరికొంత లోతుకుపోయి మానవ మేధకు ఆయా భావాలు స్ఫురించే క్రమాన్ని, భావాల ఆలోచనల ఆధారాన్ని ప్రశ్నించు కున్నప్పుడు, మేధకు వెలుపలగల భౌతిక ప్రపంచాన్ని పరిగణించవలసి వస్తుంది. మెదడు దానంతటదే పనిచేస్తూపోయే యంత్రంకాదు. మానవుని ఆలోచనలు పుట్టుకతోనేరావుకూడ. అందువల్ల, మానవుడు ఆలోచనలను చేకూర్చుకొనటం బాహ్య ప్రపంచపు అనుభూత్యవగాహనల, వాటి గుణీ కరణల ఆధారంపై కొనసాగుతుంది. గుణీకరణ లేక అనుమాన జ్ఞానం ఎంత ప్రధానమైనప్పటికీ, దానికి ఆధారం మేధలో ప్రతిబింబించే బాహ్య పదార్థపు వాస్తవికత. కనుక, సిద్ధాంత భ్రాంతులకు కూడ భౌతిక పరి సరాల పునాదియే ఆధారం కావలసి యుంటుంది.

భౌతిక వాస్తవికతయొక్క ప్రతిబింబమే చైతన్యం. ముందు పదార్థం, దాని భౌతికస్థితి ఉండాలి. అప్పుడే చైతన్యం, లేక భావ ప్రతి బింబం ఉండగల్గుతుంది. అలాకాక, తనంత తానుగా భావాలను సృష్టించే ఏ శక్తీ మెదడులో లేదు. అందువల్ల ప్రతిభావం, ప్రతి సిద్ధాంతం ఏదో ఒక భౌతిక వాస్తవపు స్థితినుండి రూపొంది, ఆస్థితిని తప్పుగానో ఒప్పు గానో ప్రతిబింబించాలి.

కనుక సిద్ధాంత భ్రాంతులకు ఆధారం కూడ ప్రకృతి, సమాజమే. మానవులు ఎలా జీవిస్తారో అలాఆలోచిస్తారు. జీవితావసరాల ఉత్పత్తిలో నెలకొనే సంబంధాలను బట్టి సాంఘిక భావాలు, సిద్ధాంతాలు రూపు దిద్దుకుంటాయి. ఉదాహరణకు ఫ్యూడల్ భూస్వామ్యంలో ఫ్యూడల్ యాజమాన్యభావాలు, ఫ్యూడల్ భూస్వామ్య సిద్ధాంతాలు కొనసాగుతవి. అలాగే పెట్టుబడిదారీ వ్యవస్థ లోని సాంఘికసంబంధాలనుబట్టి పెట్టుబడి దారీ సిద్ధాంతాలు అమలౌతాయి.

సమాజం ముందుకు సాగేకొద్దీ సామాజిక ఆస్తి సంబంధాలను ప్రతిబింబించే భావాలు రాజకీయ, న్యాయ, మత సిద్ధాంతాలలో విపులీకరింపబడతాయి. కనుక సిద్ధాంతరంగం సాంఘిక ఉత్పత్తి సంబంధాలపై ఆధారపడేదే; ఆ సంబంధాలను ప్రతిబింబించేదే. ఉదాహరణకు, న్యాయశాస్త్రం. న్యాయశాస్త్రంలోని మంచి-చెడు, నేరం-శిక్ష మున్నగు భావాలు నిర్దిష్టవ్యక్తుల చర్యలనుగాక, నిర్దిష్ట సాంఘిక సంబంధాలలో వ్యక్తులకు గల పాత్రను ప్రతిబింబిస్తాయి. ఉదాహరణకు హత్య. ఇది నేరం. కాని, ఇందులోకూడ బ్రాహ్మణహత్య స్మార్తయుగంలో మహా పాతకం. కాని, హత్యను ఒక బ్రాహ్మణుడు చేస్తే తక్కువ పాపం. ఇంకా ఇలాగే అనులోమ విలోమ వివాహాలు, దాన పరిగ్రహణాధికారాలు మున్నగు అనేక విషయాల్లో సాంఘిక సంబంధాలు స్పష్టంగా ప్రతిబింబించాయి. తిరిగి ఆయా సాంఘిక సంబంధాలు మారిపోయినప్పుడు న్యాయశాస్త్రభావాలుకూడా మార్పుకు గురియైనాయి. ఈ విధంగా, న్యాయశాస్త్ర భావాలు సమాజవ్యవస్థకు అనుగుణ్యంగా కొనసాగినవి.

ఇదేక్రమం మతంలో కూడ కొనసాగుతుంది. మానవుడు తన ఊహతో కల్పించే స్వర్గనరకాది భావాలు సమాజంయొక్క భౌతికజీవిత వ్యవస్థనూ, ఉత్పత్తి సంబంధాలను ప్రతిబింబించేవే. మానవునికి ఐహిక జీవితంలో ఏది హాయి అనిపిస్తుందో స్వర్గంలోకూడ దాన్నే కల్పిస్తాడు. ఉదాహరణకు యజ్ఞయాగాలు చేసినా, లేక యుద్ధంలో మడిసినా రంభా సంభోగం, అమృతపానం వగైరా సౌఖ్యాలు దొరుకుతాయట। అలాగే నరకంలో లభించేవి దారుణ శిక్షలు ఈ విధంగా స్వర్గనరకాల భావాలు అభూతకల్పనలే ఐనా, ప్రచలిత సాంఘిక వ్యవస్థయొక్క సంబంధాలకు అనుగుణ్యమై, ఆయా సంప్రదాయాలను సమర్థించేవే. జన్మకర్మల, కులాచారాల రూపంలో స్మృతులు విధించిన నియమ నిషేధాలు, సిద్ధాంత నిరూపణలు ప్రచలిత సాంఘిక సంబంధాలను పాపపుణ్య భావనలద్వారా, స్వర్గ నరక కల్పనలద్వారా సమర్థించాయి.

ఈ విధంగా సాంఘిక సంబంధాలు ఉత్పత్తి సంబంధాల పునాదిపై గుణీకరణచెందే అభిప్రాయాల ప్రతిబింబాలుగా సిద్ధాంత భ్రాంతులు

పెంపొందుతవి. భ్రాంతులు కల్పనలు మిధ్యలే అయినప్పటికీ, వాటిలో ప్రతిబింబించే భౌతికవాస్తవం (అ) సాంఘిక సంబంధాలు (ఆ) ఉత్పత్తి విధానాలే.

*2. సిద్ధాంతభ్రాంతుల యాదృచ్ఛికత*

సిద్ధాంతభ్రాంతుల రెండవ లక్షణం ఏమంటే, అవి వాస్తవమైన సాంఘిక సంబంధాల ఆధారంపై కొన సాగినప్పటికీ, అవి ఆ ఆధారం నుండి ఉద్దేశ పూర్వకంగా ఉత్పన్నంకావు. ఆ సంబంధాలను సవిమర్శ కంగా విశ్లేషించవు. సిద్ధాంత భ్రాంతులు ఉద్దేశ పూర్వకంగా కాక అప్రయత్నంగా, యదృచ్ఛా స్వభావంతో వెలువడతాయి.

మేధలో రూపొందే భావాలు సాంఘిక సంబంధాలను ప్రతిబింబిస్తాయి. కాని సిద్ధాంతభ్రాంతులు సాంఘిక సంబంధాలను ప్రతిబింబించే విధం శాస్త్రీయమైనదీ చైతన్యయుతమైనదీ కాదు. ప్రయత్నపూర్వకమైనది కాదు. సవిమర్శకమైనది కాదు. అది కేవలం యదృచ్ఛా స్వభావాన్ని కలిగియుంటుంది.

మార్క్స్ ఆర్థిక శాస్త్రంలో చేసిన సిద్ధాంతాలు, సూత్రీకరణలు వాస్తవంగా అమలులోఉన్న ఉత్పత్తి సంబంధాల సవిమర్శక, ప్రయత్నపూర్వక పరిశోధనల ఫలితం. అందువల్ల ఆయన వెలిబుచ్చిన భావాలు శాస్త్రీయ స్వభావం కలిగియున్నాయి. ఐతే, సిద్ధాంతభ్రాంతులు ఆ విధంగా ఉండక ప్రచలిత సాంఘికసంబంధాలనుగురించిన భావాలను అప్రయత్నంగాను, అవిమర్శకంగాను, యదృచ్ఛాస్వభావంతోనుగుణీకరించి, సామాన్యీకరిస్తాయి. ఈ అప్రయత్న, అవిమర్శక, యదృచ్ఛా స్వభావం మూలంగా ఆయా సిద్ధాంత భ్రాంతుల వా[illegible] విషయా
లను బట్టి సూటిగా గ్రహి[illegible]
విషయాలూ చేసిన వి[illegible]
వారి భావాల[illegible]

అలా ఎందుకని ఏ భౌతికకారణాల ఆధారంపై అంటున్నారో కూడ చూడ వలసివస్తుందన్నమాట.

స్వర్గం ఒక ఊహాకల్పన. అక్కడ ఇంద్రుడు రాజు. బృహస్పతి రాజపురోహితుడు. ఆ రాజుక్రింద అష్టదిక్పాలకు లుంటారు. యముడు చంపుతాడు. వరుణుడు వానలు కురిపిస్తాడు. కుబేరుడు కోశాధిపతి. ఆటపాటలు, వినోద కాలక్షేపాలకు అప్సరసలు. విహారానికి నందనోద్యానం. ఎక్కడానికి ఐరావత మనే ఏనుగు. వైద్యానికి అశ్వినులు. నీటికి మందాకిని అనే ఒక నది కూడ. అక్కడ సిద్ధ, సాధ్య, కిన్నర, కింపురుష లనే వివిధ తెగలుకూడ ఉంటాయి. ఈ కల్పనలో మానవలోక లక్షణాలను యధాతథంగా, ప్రయత్నపూర్వకంగా, సవిమర్శకంగా స్వర్గానికిసంక్రమింపజేయాలన్న ఉద్దేశంలేకపోవచ్చు. ఈస్వర్గమూ, అక్కడ చెప్పబడిన వివరాలు అవాస్తవాలుకూడ కావచ్చు. ఐనా, పై కల్పనలో మానవలోక వ్యవహారమే కనబడుతుంది.

అలాగే భారతీయ వర్ణవిభాగం. "దేవుని తలనుండి బ్రాహ్మణుడు, భుజాలనుండి క్షత్రియుడు, పొట్టనుండి వైశ్యుడు, పాదాలనుండి శూద్రుడు జన్మించార"ని పురుషసూక్తం. ఇందులో ఒక కులంకంటె మరో కులం తక్కువ. పై కులాలవారి ఆధిక్యతకూ, విశేష హక్కులకూ హామీ లున్నాయి. క్రింది కులాలవారు కాయకష్టం చేయాలి. వైశ్యులు వర్తక వ్యవసాయాలు చూడాలి. రాజులు రాజ్యాంగాన్ని బ్రాహ్మణుల ఆదేశానుసారం నిర్వహించాలి—మున్నగు భావాలున్నాయి. ఈ శ్రమ విభజన భారతీయ ఫ్యూడల్ విధానానికీ, సాంఘిక సంబంధాల... ఈ ఆధారంపై "పూర్వజన్మ ...తుందనీ, కనుక హెచ్చు ...ల్పమనీ" అనేక సిద్ధాం... విర్ఘూషణల్లో

దేవుని శరీరంనుండి నాల్గుకులాలవారు పుట్టటం, పూర్వజన్మ కర్మ ఫలం, దైవనిర్దేశం అన్న భావగుణీకరణలన్నీ లేక కల్పనలన్నీ భ్రాంతులే. ఐనా, ఆ భ్రాంతులు నాటి సాంఘికస్థితిలో ప్రజాసముదాయంలో బాగా నాటుకొని పోయి స్థిరపడినాయి. అలా స్థిరపడిపోయిన నమ్మకాలు, వాటివలని భావాలు ప్రజలకు సంబంధించిన విభిన్న ఆలోచనా రంగాల లోకి సంక్రమించాయి. ఆభావాలు విభిన్న విషయాలను నిరూపించటం లోను, వివరించటంలోను, సమన్వయించటంలోను, క్రమీకరించటంలోను పాత్ర వహించాయి. ప్రకృతి శాస్త్రాల, సాంఘిక శాస్త్రాల, మత సంస్కృతీరంగాల విభిన్న నిరూపణల్లో ఈ భ్రాంతులు వాస్తవాలతోబాటు పాత్ర వహించాయి.

చరిత్రలో ఆయా ఉత్పత్తి సంబంధాలు చైతన్యయుతంగా కాక, ప్రయత్న మూలకంగా కాక సాంఘిక పరిణామక్రమంలో యదృచ్ఛాస్వభావంతో యేర్పడతాయి. ఈ కారణంవల్ల ఆ ఉత్పత్తి సంబంధాలకు చెందిన భావాలుకూడ యదృచ్ఛాస్వభావాన్నే కల్గియుంటాయి. కనుక సిద్ధాంతా లలో ఉత్పత్తి సంబంధాల ప్రతిబింబం యదృచ్ఛాస్వభావంతో కొన సాగుతుంది. దీన్నే మార్క్సు ఉత్పత్తిసంబంధాలు "ఇచ్ఛానిచ్ఛలకు (ఉద్దే శాలకు) అతీతమైనవీ అనివార్యమైనవీను" అన్నాడు.

ప్రకృతినీ, సమాజాన్నీ గూర్చిన సిద్ధాంతాల్లో ఉత్పత్తి సంబం ధాల ప్రతిబింబం పైవిధంగా భ్రాంతిమయమవుతుంది. ఒకానొక ఉత్పత్తి వ్యవస్థ ప్రజలచే కావాలని రూపొందింపబడదు. సమాజ పరిణామపు ఒకా నొక చారిత్రకదశకుచెందే యదృచ్ఛాక్రమం అది. ఒకవేళ చరిత్రలో ఉత్పత్తి సంబంధాలను ప్రజలు కోరితెచ్చుకున్నా, ఆ సంబంధాలను వారు యధేచ్ఛగా త్రోసిపుచ్చలేరు. ఈ కారణాలవల్ల ఉత్పత్తి సంబంధాలు నిర్దిష్ట పరిస్థితుల్లో, నిర్దిష్ట తరుణంలో నిర్దిష్ట చారిత్రకావశ్యకతవల్ల ఏవిధంగా రూపొందాయో, సాంఘిక పరిణామంతోబాటు అవి ఏవిధంగా మారగల్గవో ప్రజలు గ్రహించలేదు. వారికి ఈ ఉత్పత్తి సంబంధాలు సృష్టిక్రమంలో సహజమైన అనివార్యమైన అంతర్భాగంగా తోస్తాయి. ఈ విధంగా నిర్ధారితమయ్యే ఉత్పత్తి సంబంధాలు సిద్ధాంత గుణీకరణలలో ప్రకృతినీ,

మానవుణ్ణి గూర్చిన స్వకీయాభిప్రాయాలుగా భ్రాంతులుగా రూపొంది దేవుడు, అదృష్టం, హక్కులు, న్యాయం, సార్వకాలికస్థితి, ధర్మం మున్నగు మానసికభావాల తప్పుగుణీకరణకు పునాదులు వేస్తాయి.

3. స్వేచ్ఛాలోచనను గూర్చిన భ్రాంతి

సిద్ధాంతభ్రాంతుల మూడవలక్షణం స్వేచ్ఛాలోచననుగూర్చిన భ్రాంతి. సిద్ధాంత భ్రాంతులు వాటి భౌతికాధారంతో నిమిత్తంలేకుండా, యధేచ్ఛా స్వభావంతో ఏర్పడతాయి. కనుక సైద్ధాంతికభావాలుకూడ వ్యక్తుల స్వేచ్ఛాలోచన ఫలితంగా ఏర్పడతాయని, అంటే విశుద్ధ విశృంఖల ఆలోచనా క్రమఫలితాలని భావింపబడుతుంది.

ఎంగెల్స్ యిలావ్రాశాడు:

"తాను తాత్వికుడనని చెప్పుకొనే ప్రతివ్యక్తీ ఉద్దేశపూర్వకంగాను చైతన్య యుతంగానే తన సిద్ధాంతాన్ని (సిద్ధాంతభ్రాంతిని) ప్రతిపాదిస్తాడు. ఐనా, అతని చైతన్యం తప్పుచైతన్యమే. అతన్ని ప్రేరేపించే అసలు కారణాలు అతనికి తెలియవు. అందువల్ల అతడు లేనికారణాలను, లేదా పైపై కారణాలను ఊహించుకుంటాడు. తన స్వీయ చైతన్య ప్రేరణలనే అతడు వాస్తవిక ప్రేరణ లనుకుంటాడు. ఇలా తన స్వీయాలోచననుండి కేవలాలోచనక్రమ మూలకమైనవిగా తన సిద్ధాంతాల స్వభావాన్నీ, స్వరూపాన్నీ సమన్వయిస్తాడు. అంతేకాక, తన ఆలోచనలతోబాటు తన పూర్వీకుల, ఇతరుల ఆలోచనలను భావాలను కూడ అతడు స్వీకరిస్తాడు. కనుక అతని సిద్ధాంతమంతా కేవలాలోచనఫలితమే ననుకొంటాడు. ఇలా ఆలోచనలకూ, భావాలకూ వెలుపలగల భౌతిక ఆధారక్రమాన్ని పరిగణించకుండా సిద్ధాంతగుణీకరణలు గావించటంతో, అతడు స్వేచ్ఛాలోచనను గూర్చిన భ్రాంతికి గురియౌతాడు."

4. సైద్ధాంతిక విలోమక్రమం

సిద్ధాంతభ్రాంతుల నాల్గవ లక్షణం భావాల విలోమక్రమం. ఈ విలోమక్రమం మూలంగా భౌతికమైన సాంఘిక సంబంధాలు కేవల భావ గుణీకరణలుగా తోస్తాయి.

సిద్ధాంత భ్రాంతుల్లో ప్రతిబింబించేది వాస్తవంలో భౌతిక, సాంఘిక సంబంధాలే ఐనప్పటికీ, భావగుణీకరణ స్వతంత్రమైనదిగా భావింపబడుతుంది. అందువల్ల వాస్తవాన్ని తలక్రిందులుగాచూచే విలోమక్రమం అమలౌతుంది. గుణీకృత భావాలకు మూలం సాంఘిక సంబంధాలు కాక మనస్సు అని భావింపబడుతుంది. దీని ఫలితంగా భౌతిక సంబంధాల వాస్తవస్థితికికూడ మానసికాలోచనలే లేక గుణీకృతభావాలే ఆధారంగా కనబడుతుంది. దీనివల్ల భావమే స్థితికి ఆధారమన్న ధోరణి పెంపొందుతుంది. ఇలాపదార్థస్థితిని విలోమక్రమంలో చూడటంవల్ల తాత్వికులుసాంఘిక సంబంధాలను గురించిన చైతన్యాన్నితమ ఆలోచనలకు, ఉద్దేశాలకు అనుగుణ్యంగా నిర్మించుకుంటారేకాని, వాస్తవిక సాంఘిక స్థితి ఆధారంపై కాదు.

ఉదాహరణకు హక్కు, న్యాయం మున్నగు భావాలు. సిద్ధాంతరంగంలో ఇవి చాల ప్రధానమైనవి. ఐతే, హక్కులు న్యాయాలు సాంఘిక సంబంధాల ఆధారంపై కాక, హక్కులకు న్యాయానికి చెందే భావగుణీకరణలనుండి రూపొందుతాయని కొందరు తాత్వికులు విశ్వసించసాగారు. ఇది తలక్రింద విలోకనమే. ఈ విలోమ విలోకన వల్ల హక్కుకూ, న్యాయానికీ చెందిన భావాలు, సిద్ధాంతాలే సాంఘిక సంబంధాలను నిర్ణయిస్తాయని తోస్తుందేకాని, ఆ భావాలకుఆధారం సాంఘిక సంబంధాలన్న భౌతిక వాస్తవికతకాదు. అందువల్ల ఒకానొక సాంఘిక వ్యవస్థ హక్కులూ, న్యాయాలకు చెందిన గుణీకృత భావాలను ఎంత వరకు సమన్వయిస్తున్నదోనని చూస్తారేకాని, ఆ భావాలను వాటికి ఆధారమైన సాంఘికాభివృద్ధితో సమన్వయించి చూడరు.

"ఆర్థిక, రాజకీయ తదితర ప్రతిబింబాలు మానవ నేత్ర ప్రతిబింబాల వంటివే. అవి నేత్ర కటకము ద్వారా తలక్రిందులుగా ప్రతిబింబిస్తాయి. ఆ ప్రతిబింబాలను తిరుగ నిటారుగా నిల్పే నాడీవ్యవస్థ ఆర్థిక-రాజకీయ వ్యవస్థల్లో ఉండదు. ఈ విలోమ లక్షణం సైద్ధాంతికాభిప్రాయాలను నిర్మిస్తుంది" —ఎంగెల్స్.

"సిద్ధాంతరంగంలో మానవులూ, వారి స్థితిగతులూ కెమెరా తెరపై వలె తలక్రిందులుగా ప్రతిబింబిస్తాయి. నేత్రంయొక్క జీవ క్రమ మూలంగా ప్రతిబింబం తెరపై యేవిధంగా తలక్రిందులుగా పడుతుందో, ఆవిధంగానే చారిత్రక జీవితానుక్రమంలో విలోమక్రమం అమలౌతుంది."

—మార్క్స్-ఎంగెల్స్

ఐతే, కంటితెరపై పడే తలక్రిందుల ప్రతిబింబాన్ని మేధయొక్క గ్రాహక క్రమం యేవిధంగా తిరుగ నిటారుగా మార్చి సరిచేస్తుందో, ఫొటోగ్రఫీలో ఒక నెగెటివ్ ప్రింటింగుపోజిటివ్‌గా ఎలా మార్పు జెందుతుందో, అదేవిధంగా సిద్ధాంతరంగంలోని విలోమక్రమాన్ని కూడ మనం వాస్తవిక చైతన్యంతో సరిచేసుకోవలసి యుంటుంది.

సైద్ధాంతిక విలోమతవల్ల మానవులు ఆయా చారిత్రక సాంఘిక వ్యవస్థలలో తమ సాంఘిక సంబంధాలూ, వ్యవహారాలూ భావ గుణీకరణల మూలంగా, అంటే సిద్ధాంతాల మూలంగా యేర్పడ్డాయని భావిస్తారు. మతం, న్యాయశాస్త్రం, తత్వశాస్త్రం మున్నగు సిద్ధాంత భావాలు సాంఘిక వ్యవస్థను రూపొందిస్తాయని విశ్వసిస్తారు. బానిస యుగంలో పై వర్గాల ఆధిపత్యభావాలూ, మధ్యయుగంలో మత రాచరిక భావాలూ, పెట్టుబడిదారీ విధానంలో పార్లమెంటరీ భావాలూ సాంఘిక వ్యవస్థకు ఆధారమని భావింపబడుతుంది. ఈ విధంగా ఆయా పాలకవర్గాలభావాలు సాంఘిక వ్యవస్థను కొనసాగిస్తాయని విశ్వసింపబడుతుంది.

బానిసయుగంలో చిన్న చిన్న రాజ్యాలను కబళించే నిరంకుశ సైనిక సామ్రాజ్యాల విస్తృతి, మధ్యయుగంలో మతయుద్ధాల మూలకంగా రాజ్యాధికార విస్తృతి, ఆధునిక యుగంలో వలస సామ్రాజ్యాల విస్తృతి ఆయా పాలకవర్గాల సిద్ధాంతాల మూలంగా సంభవించాయని చారిత్రకులు తరచు భావిస్తారు. ఐతే, ఆయా సిద్ధాంతాలకు ఆధారమైన ఉత్పత్తి విధానాలనుగాని, సంబంధాలనుగాని, సాంఘిక ఆవశ్యకతల పునాదినిగాని వారు తరచు పరిగణించరు.

పరిస్థితులను పై విధంగా చూడటంతో "ప్రతి (సిద్ధాంత) సూత్రమూ తన వ్యక్తీకరణ కొక్క శతాబ్దాన్ని (ఆధారంగా) కలిగి

యుంటుంది. ఉదాహరణకు, 11 వ శతాబ్దంలో రాజాధికార భావం (Monarchy) చలామణియైనది. 18 వ శతాబ్దంలో ఉన్నత వ్యక్తుల అధికారభావం (Republic) కొనసాగినది. ఇలా ఆయా ప్రధాన భావాలకు ఆయా శతాబ్దాలు చెందియున్నాయి. కాని, ఆయా శతాబ్దాలకు ఆయా భావాలుకాదు. మరోవిధంగా చెప్పాలంటే, భావాలు చరిత్రను నిర్మించాయేకాని చరిత్ర భావాలను కాదు." అని మార్క్స్ ఉదహరించాడు. అదేవిధంగా చరిత్రలో ప్రతి నిర్దిష్టకాలమూ సిద్ధాంతరంగంలో ప్రతిబింబించే ఆయా ప్రత్యేకమైన భావాలను రూపొందిస్తుంది. ఆయా కాలాల సాంఘిక పరిస్థితులకూ, వ్యవహారాలకూ భావాలు సమన్వయ మౌతాయన్నమాట.

"ఒకానొక 'కాలం' తాను నిర్దిష్ట మత, రాజకీయ (భావ) ప్రేరణలద్వారా ఏర్పడ్డట్లు భాసిస్తుంది. కాని మతమూ, రాజకీయమూ భౌతిక ప్రేరణల (ప్రతిబింబ) స్వరూపాలు మాత్రమే. ఈ కారణం వల్ల ఆయా కాలాలనుగూర్చిన సిద్ధాంత భ్రాంతులు ఏర్పడతాయి. మానవులు జీవిత వాస్తవాన్నిగురించి ఏర్పరచుకునే భావాలు జీవిత వాస్తవాన్ని నిర్ధరించే ప్రధాన నిర్ణాయకశక్తిగా పరిణామం చెందుతాయి". — మార్క్స్.

ఇలా సిద్ధాంత భ్రాంతిలో మానసిక భావాలు అభిప్రాయాలు మానవ వ్యవహారాలను శాసించేశక్తులుగా తోస్తాయి. అందువల్ల మానసికభావాలు వాస్తవస్థితిగతుల వక్రఅవగాహనలే ఐనప్పటికీ, అవి స్వయంసత్తాక వాస్తవాలుగా తోస్తాయి. ఈవిధంగానే మత ప్రపంచానికి చెందిన అభూతకల్పనలుకూడ కొనసాగుతాయి.

"ఆ (మత) ప్రపంచంలో మానవుని మనోజనితభావాలు సజీవ, స్వతంత్రపదార్థాలుగా, పరస్పరసంబంధమూ సార్వజనీన సంబంధమూ కలవస్తువులుగా కనపడతాయి". —మార్క్స్.

"ఈ విధంగా, తమ సాంఘికవ్యవస్థ, ఆచారవ్యవహారాలు, ఆయా సిద్ధాంత భావాలవల్ల ("ధర్మం" "న్యాయం" మున్నగుభావనల

వల్ల) కొనసాగుతాయని మానవులు ఊహించటం మూలంగా, ఆయా సిద్ధాంతాలు (వాటి గుణీకరణలు) మానవునికీ భౌతికప్రకృతికీ అతీతమైన దివ్యశక్తులను కల్పనచేసి మానవుణ్ణీ అతని వ్యవహారాన్నీ ఆ శక్తులకు స్వాధీనపరుస్తాయి. ఈవిధంగా మత ప్రపంచం వాస్తవిక ప్రపంచపు ప్రతిబింబమేకాని మరేమీ కాదు."— మార్క్స్.

ఆదిమ సాంఘిక వ్యవస్థలో మానవుడు ప్రకృతి శక్తుల సత్తా ముందు నిస్సహాయుడుగా ఉంటూ జీవితంకోసం సమష్టి(గణ) గతుడుగా ఉన్నాడు. సమష్టి కృషి, ఐక్యాచరణ లేకపోతే నాటి పరిస్థితుల్లో మానవుని జీవితం అసాధ్యమే. ప్రకృతి శక్తుల భయం ఆనాటి జీవిత చైతన్యంలో మంత్రతంత్రాల, యజ్ఞయాగ బలిదానాల విశ్వాసాలకు దారి తీసింది. గణజీవితంలో ప్రతివారి భాగస్వామ్యం, ప్రతివారి భద్రతకై ఐక్యకృషి ఒక దివ్య శక్తిగా వారికి తోచింది. ఆ సమష్టి భద్రతను పోషించుకొనుటకు వారు నిత్యజీవితంలో అనేక మతాచారాలను నెల కొల్పుకున్నారు. సమష్టిగా వేట, సత్రయాగాలు, సమష్టి నాట్యాలు, సమష్టి ప్రార్థనలు (వేదగానం) సాంఘికాచారాలుగా కొనసాగాయి. ఆతర్వాత శ్రమవిభజనలో గణనాయకులు, వారి ప్రత్యేకాధికృత రూపొందాయి. వ్యక్తులకు శాపానుగ్రహ దివ్యశక్తులను ఆరోపించారు. అలాగే రాజును కూడ ఇహలోక దైవంగా ఆరాధించారు. నీటిని వరుణుడనీ, నిప్పును అగ్నిదేవుడనీ ఇలాగే విభిన్న దివ్యవ్యక్తులుగా కల్పన చేశారు. ఈవిధంగా ప్రకృతితో మానవునికిగల సంబంధాలనూ, మానవుల మధ్య అన్యోన్య సంబంధాలనూ అదృష్ట అలౌకిక దివ్యశక్తుల ఫలితాలుగా ఊహచేశారు.

ఇలా సాంఘిక సంబంధాలనుండి మతభావాల పరిణామమూ, తిరిగి ఆ భావాలను సాంఘిక జీవితంతో సమన్వయించే పరిణామం కొనసాగినది. ఈ క్రమంమానవుని సాంఘికాభివృద్ధికి అనుగుణ్యంగా సాంఘికజీవితాన్ని ప్రతిబింబిస్తూనే ముందుకుసాగింది. ఐతే,పరిస్థితులు మారటంతో పాత భావాలు, కొత్తభావాలు విడివడి భావ విభేదాల వైవిధ్యానికి దారితీసింది. ఆదిమ సమాజానికి చెందిన గణాలు శ్రమవిభజనకు అనుగుణ్యంగా

చీలిపోవటంతో. వాటి భావాలు వర్ణభేద సిద్ధాంతాలకు దారితీశాయి. తొలి దశలో వర్ణం అంటే ఆర్యగణాల "రంగు" అన్నమాట. కాని పిదప వర్ణం అంటే జన్మకర్మలను బట్టి యేర్పడే కులభేదాల హెచ్చుతగ్గులన్నమాట. ఐతే వర్ణసిద్ధాంతాలలో ఈ రెండు భావాలూ కలగా పులగమైనాయి.

సాంఘికాభివృద్ధియొక్క ప్రతిదశలోను పూర్తిగా కొత్తసిద్ధాంతాలేర్పడవు. అలాకాక ప్రతి సిద్ధాంతమూ తన అభివృద్ధిక్రమంలో సాంప్రదాయికమైన పాత భావాలను నిల్పుకుంటూనే వాటికి కొత్తభావాలను జత కూరుస్తుంది. సిద్ధాంతాల్లో పాత కొత్త భావాల కలయిక, సమ్మిశ్రణ అమలౌతుంది. ఉదాహరణకు ఆదిమసమాజపు సత్రయాగాలు. ఆ తర్వాతి వగు రాజసూయ అశ్వమేధాలతోబాటు ఇవికూడ మహాభారతకాలంలో అమలులో ఉన్నవే. తుదకు ఈనాడుకూడ యజ్ఞయాగాలు జరిపేవా రున్నారు. కనుక ప్రాచీనార్యులనాటి యజ్ఞయాగ భావాల అవశేషాలు నేటికీ చలామణిలో ఉన్నాయి. ఐతే, ఆయా యజ్ఞయాగ విధులను గూర్చిన ప్రాచీన కాల అవగాహనలు మాత్రం వివిధదశల్లో మార్పుకు గురియైనాయి. ఆర్యసమాజం మున్నగు సంస్థలు ఈనాడు యజ్ఞయాగ సిద్ధాంతాలకు సాంప్రదాయికమైన నూతన భాష్యాలను సంతరించి వ్యాఖ్యానిస్తున్నాయి.

> "మతమనేది యేర్పడ్డాక, అదెప్పుడూ సాంప్రదాయిక భావాలను, ఆచారాలను పొడిగిస్తూనే ఉంటుంది. ఇతర సిద్ధాంతాల్లోవలెనే (మతంలో) ఈ సాంప్రదాయిక స్వభావం ఒక గొప్ప 'యథాతథ' శక్తి. ఐతే, సాంప్రదాయికభావాలలో వచ్చే (కొత్త) మార్పులకు ఆధారం (నూతన) వర్గసంబంధాలు. అంటే, మార్పులను కొని తెచ్చే సాంఘికార్థిక సంబంధాలనుండి మార్పులు రూపుదిద్దుకుంటాయి."
>
> — ఎంగెల్స్

సిద్ధాంత గుణీకరణలో పాతకొత్తల మధ్య, అంటే విభిన్నతల మధ్య ఐక్యత ఈ విధంగా పెనవేసుకొనియుంటుంది.

సిద్ధాంత భ్రాంతియొక్క పై లక్షణం, అంటే భావాలను కేవల భావాలుగా వినియోగించటం, ఇతర భావాల వినియోగంద్వారా వాటిని

సమన్వయించుకొనటం సాంఘిక జీవితపునాదిని విస్మరించేటట్లు చేస్తుంది. భావ పరిణామం, సిద్ధాంత గుణీకరణ సర్వస్వతంత్ర "భావవ్యహారం" ద్వారా కొనసాగుతుందన్న నమ్మకానికి దారితీస్తుంది. అందువల్ల భావ వికాసానికి ఆధారం భావాలేనన్న ధోరణి అమలౌతుంది. హెగెల్ ఇలాగే విశ్వసించాడు.

కాని, ఇది భావవికాసపు స్వరూప నిరూపణ మాత్రమే. ఐతే, ఆ స్వరూపానికి ఆధారమైన స్వభావాన్ని మనం పరిశీలించాలి. భౌతిక పునాదిని విస్మరించరాదు. అందుకని మార్క్స్ నూతన విధానాన్ని ఆవిష్కరించాడు. ఆయన భౌతిక జీవితపరిస్థితులను, ఉత్పత్తి విధానాన్ని, సాంఘిక రాజకీయ సాంస్కృతిక జీవితక్రమాన్ని నిర్దిష్టంగా సమన్వయిస్తూ, ఆయా సిద్ధాంత పరిణామాల స్వభావ స్వరూపాలను సమన్వయించాలన్నాడు.

మానవులు ఎంతవరకైతే తమ సాంఘిక వ్యవస్థకు యజమానులు కారో అంతవరకు సాంఘిక సంబంధాలను గూర్చిన చైతన్యం భ్రాంతులకు గురిఅవుతూ ఉంటుంది. సిద్ధాంత భ్రాంతులు సాంఘిక సంబంధాల వాస్తవపరిస్థితిని అనేక ముసుగులలో కప్పిపుచ్చుతూ, వాటి స్వభావాన్ని తికమకకు గురిచేస్తూ, మానవుని సాంఘిక వ్యవహారపు శాస్త్రీయ పునాదులను నానావిధ మత, రాజకీయ, న్యాయ, తత్వశాస్త్ర స్వీయనిరూపణలతో మరుగునపడవేస్తూ ఉంటాయి. ఐతే భ్రాంతుల యదృచ్ఛా స్వభావం, సిద్ధాంత విలోమక్రమం అందుకు వినియోగపడుతుంది.

*6. సిద్ధాంతం; వర్గప్రయోజనాలు*

సిద్ధాంత భ్రాంతుల ఐదవలక్షణం, వర్గసమాజంలో వర్గస్థితివల్ల ఏర్పడే పాక్షిక చైతన్యం. ఈ భ్రాంతులమూలంగా కొన్ని వర్గాలు తమ ప్రయోజనాలకు అనుగుణ్యంగా వాస్తవ, సాంఘిక సంబంధాలను మరుగుపరుస్తాయి. ఈ భ్రాంతి వాస్తవ సాంఘిక సంబంధాలనెప్పుడూ వక్రంగానే గుణీకరిస్తుంది.

ఉదాహరణకు ఫ్యూడల్ భూస్వామ్యంలో రాజులూ, వారి పురోహితులు, సర్దారులు అధికారం చెలాయిస్తారు. వారి అధికారంలో దైవాంశ ఇమిడియున్నదనే భావం వ్యాప్తిచెందింది. దీని అర్థం భూస్వాములూ, మతాధిపతులూ రైతాంగంపండించే పంటల అదనపు విలువను కాజేసే దివ్యాధికారాన్ని కల్గియుంటారని. అందుకని ఆనాటి హక్కులు. యాజమాన్యం, అధికారం, న్యాయం మున్నగు గుణీకరణలన్నీ భూస్వామ్యవర్గ ప్రయోజనాలను పోషించేవిధంగా కొనసాగాయి. ఆ వర్గప్రయోజనాలకు ప్రతికూలమైన ప్రకృతిశాస్త్ర సిద్ధాంతాలు, సాంఘిక శాస్త్ర సిద్ధాంతాలు అనుమతింపబడలేదు.

అలాగే, పెట్టుబడిదారీ విధానంలో పెట్టుబడిదారులు కార్మికుల శ్రమయొక్క అదనపు విలువను కాజేసే నగ్నవాస్తవం ఆ సాంఘిక వ్యవస్థలోని వ్యక్తి యాజమాన్యం, శ్రమవిలువల ఒప్పందం (Contract of wage), రాజకీయ ఆర్థికాది హక్కుల సమానత మున్నగు సిద్ధాంత గుణీకరణలలో కప్పిపుచ్చబడుతూంది. పెట్టుబడిదారులు పార్లమెంటరీ రాజ్యాంగాన్ని రూపొందించి దానికి "మత స్వేచ్ఛ" అనే ముసుగు కప్పుతారు. ఈ ముసుగుతో పెట్టుబడిదారీవిధానం మతేతర విధానంతో బాటు, మతానుసరణను కూడ సర్వవిధాల ప్రబోధిస్తుంది. ఐతే, తమ పీడన విధానం సంక్షోభానికి గురియైనప్పుడల్లా మత సిద్ధాంతాలను ముందుకు త్రోసి పెట్టుబడిదారులు తమ ఉత్పత్తి విధానాన్ని రక్షించుకోటానికి తయారౌతారు.

> "వర్తకపు సరకుల ఉత్పత్తిపై ఆధారపడ్డ సమాజంలో, ఉత్పత్తిదార్లమధ్య పరస్పర సంబంధాలు రూపొంది, తమ ఉత్పత్తిని వర్తకపు సరకులుగా విలువలుగా పరిగణించే దశలో, వ్యక్తిగత శ్రమను సామాన్య శ్రమగా మార్చివేసినప్పుడు మానవ సామాన్యతను ప్రబోధించే క్రైస్తవ మతం, దాని ప్రొటెస్టెంటు శాఖల భావాలు అలాంటి సమాజానికి అనుగుణ్యంగానే ఉంటాయి." — మార్క్స్.

అలాగే పెట్టుబడిదారీ విధానం అవతరించాక ఏర్పడిన జాతీయ పునరుజ్జీవన దశలో విశ్వమానవ సోదరత్వం వంటి ఆలోచనా ధోరణులు

ప్రాచుర్యం చెందినవి. అన్ని పార్టీలకు సమానావకాశాలు మున్నగు ప్రచారా లీ కోవకు చెందినవే.

కనుక పెట్టుబడిదారీ సిద్ధాంతాలు మతంనుండి ప్రారంభమై అర్థ శాస్త్రం వరకు విభిన్నమార్గాల్లో ప్రజా పీడనను మరుగుపరుస్తాయి. ఐతే, ఈ సిద్ధాంత భ్రాంతిలోని ముసుగు, మోసం నిర్దిష్ట సాంఘిక ప్రేరణపైన, కొన్ని సాంఘిక లక్ష్యాలపైన, కొన్ని సాంఘిక ప్రయోజనాలపైన ఆధారపడి యుంటుంది.

(అ) వర్గరహిత దశలోని ఆదిమ సమాజాలలో ఆయాగణాల సామూహిక ఐక్యతను బలపరచుటకు సిద్ధాంతగుణీకరణలు తోడ్పడ్డాయి. ప్రకృతి సంఘటనల విజ్ఞానం లోపించిన ఆ కాలపరిస్థితుల్లో, ఆ శక్తులను మంత్ర తంత్రాలకు చెందిన తమ భావాలద్వారా అదుపులో పెట్టవచ్చునని ప్రజలు విశ్వసించారు. ఇలా ఆదిమ సిద్ధాంతం మొత్తం తెగయొక్క సమష్టి భద్రత ఆధారంపై కొనసాగింది. దాని ప్రయోజనం అందరు ప్రజలూ ఆ సాంఘిక వ్యవస్థను కాపాడి బలపరచుకొనటం. దానికి ప్రేరణ ఆ లక్ష్యాన్ని వాంఛించేవారందరి ఆసక్తి లేక అభిలాష.

(ఆ) తర్వాత సమాజం విరుద్ధ వర్గాలుగా విడిపోయిన దశలో, చరిత్ర వర్గసంఘర్షణల చరిత్రగా మార్పుచెందినప్పుడు సిద్ధాంతానికి వర్గ ప్రయోజనమే ప్రధాన ప్రేరణ అవుతుంది. అప్పుడు ప్రతి సిద్ధాంతమూ ఒక వర్గ సిద్ధాంతంగా ఉండి, ఆ వర్గ ప్రత్యేకతలనూ, ఇతర వర్గాలతో గల వైరుధ్యంలో ఆ వర్గ ప్రయోజనాలనూ సమర్థించ సాగుతుంది. ఈ పరిణామంలో పాలకవర్గసిద్ధాంతం మొత్తం సమాజాన్ని ఆవరించగల్గి "సాధికార సిద్ధాంతం"గా అమలౌతుంది. దాన్ని వ్యతిరేకించటమంటే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రచలిత సాంఘిక సంబంధాలను సవాలు చేయటంగా పరిణమిస్తుంది.

వివిధవర్గాలు స్వీయ ప్రయోజనాలకోసం రూపొందించే సిద్ధాంతాల ద్వారా ఆయా వర్గాలు ప్రజలను ఉద్దేశపూర్వకంగాను, చైతన్యయుతం గాను వంచిస్తాయని అపోహపడరాదు. జరిగేవంచన యదృచ్ఛాస్వభావంతో కూడ జరుగవచ్చును.

ఒక వర్గానికి చెందిన మేధావులు సాంఘిక సంబంధాల వాస్తవ స్వభావాన్ని బుద్ధిపూర్వకంగా మరుగుపరచేటందుకు కొన్ని వక్రసిద్ధాంతాలను సృష్టిస్తారనుకోవడమంటే అర్థం, సాంఘిక సంబంధాల వాస్తవ స్వభావం వారికి తెలుసుననుకోవడమే. కాని. సిద్ధాంత భ్రాంతుల అసలు లక్షణం, సాంఘిక సంబంధాలను గూర్చి తప్పుచైతన్యం కలిగియుండటం. ఈ సంబంధాలను గురించిన ఊహాజనిత భావాలు శాస్త్రీయ భావాల స్థానం ఆక్రమిస్తాయి. ఈ విధమైన తప్పుచైతన్యం ఉద్దేశపూర్వకమైన ప్రయత్నంవల్ల కాకుండా, యాదృచ్ఛికంగా అజ్ఞాత స్వభావంతో ఏర్పడుతుంది. అది వాస్తవంగా ఉద్దేశపూర్వకమైన అసత్యం కాదు; కేవలం ఒక భ్రాంతి. ఇది ఇతరుల్ని వంచించడమే అయితే, తమ్ముతాము వచించుకోవడం కూడ జరుగుతుంది.

కనుక సిద్ధాంత భ్రాంతులను ఉద్దేశపూర్వకమైన వంచనలుగా భావించేవారు మార్క్స్ నిరూపించిన "తప్పుచైతన్యస్వభావాన్ని" అర్థంచేసుకోలేదన్నమాట. ఎందుకంటే పైన చెప్పినట్లు ఒకానొక సిద్ధాంతం ద్వారా తన వర్గ ప్రయోజనాలను కాపాడుకొనే పాలకవర్గానికి సాంఘిక సంబంధాలను గురించిన వాస్తవిక చైతన్యం ఉండదు. కాని ఏ పీడకవర్గమైనా వర్గసంబంధాల వాస్తవికతను గూర్చిన చైతన్యంతో, శ్రమయొక్క అదనపు విలువను కాజేసేక్రమాన్ని గూర్చిన చైతన్యంతో వ్యవహరించదు. అందువల్ల స్వీయ వర్గప్రయోజనాలకోసం ప్రజలను ఉద్దేశపూర్వకంగా వంచించే ప్రయత్నంలో వర్గ సిద్ధాంతాలు వెలువడతాయనుకోటం మార్క్సిజానికి వక్రభాష్యం చేయటమే ఔతుంది. ఉదాహరణకు పూర్వమీమాంస. పూర్వమీమాంస, ప్రతివారూ తమ కులాచారాలను బట్టి మతవిధులను నిర్వర్తించాలని నిర్బంధించింది. సాంఖ్య వైశేషిక న్యాయదర్శనాలలోని భౌతికవాదధోరణుల్నీ, బౌద్ధదర్శనాలలోని ఆలోచనాస్వేచ్ఛనూ మీమాంసకులు తమ అంధవిశ్వాస సిద్ధాంతాలతో అణచివేశారు. "మంత్రాధీనం జగత్ సర్వమ్" అంటూ కుమారిలుడు యజ్ఞాలు, యాగాలు, నిత్య నైమిత్తికకర్మలు, విగ్రహారాధనలు, నోములు, వ్రతాలు, కీర్తనలు, భజనలను ప్రోత్సహించాడు.

మధ్యయుగ భూస్వామ్య శ్రమవిభజనలో ఈ అంధవిశ్వాసాలు వివేచనా రహితంగా అమలుచేయబడ్డాయి. మీమాంసకుల "అదృష్ట కర్మాధీన తయే" మధ్యయుగ హిందూ జీవనవిధానంగా చెలామణియైనది. ఐతే ఉత్పత్తి సంబంధాల పునాదిపైగాక, వైదికసిద్ధాంతాల పునరుద్ధరణకోసం తాము కంకణం కట్టుకున్నామని మీమాంసకులు విశ్వసించారు.

పాలకవర్గ సిద్ధాంతవేత్తలు ప్రజలను ఉద్దేశపూర్వకంగా నిరంతరం వంచిస్తూఉంటారనడంలో సందేహంలేదు కాని బుద్ధిపూర్వకమైన ఈ వంచనవిధానం వెనుక ఎల్లప్పుడూ ఆత్మవంచనకూడ కొనసాగుతూ ఉంటుంది.

ఉదాహరణకు గ్రీకు తాత్వికుడు ప్లేటో ఉన్నతమైన అసత్యం ద్వారా పాలకవర్గం సామాన్య ప్రజలను మోసం చేయవచ్చునన్నాడు. పాలకవర్గ వ్యక్తులు బంగారంలాంటివారని, బానిసప్రజలు ఇనుం-ఇత్తడి లోహాలవంటివారని ఆయన వాదించాడు ఇది 'ఉన్నత అసత్య'మేనని ప్లేటోకు తెలియకపోలేదు. అలాగే, బానిస యాజమాన్య వ్యవస్థ మహోన్నతమైన సాంఘిక విధానమనీ, దాన్ని అతిక్రమించడం అరాచకమనీ, అథఃపతనమనీ ఆయన విశ్వసించాడు. అతని వర్గంయొక్క భ్రాంతుల్లో యివి కొన్ని. అవి ఆయన దృక్పథమంతటికీ ప్రాతిపదిక. ఈ దృక్పథం నుంచే, "పాలకవర్గం ఉన్నత అసత్యాలద్వారాపీడిత ప్రజలను మోసగించవచ్చు" నన్నసూత్రీకరణ ఉత్పన్నమైంది. అదేవిధంగా, భారతదేశంలో కౌటిల్యుడు తన రాజనీతిలో రాజులు తమ ప్రాబల్య ప్రాభవాలకోసం ఏ అన్యాయంచేసినాసరే అది న్యాయమే అవుతుందనిచెప్పి పాలకవర్గ నిరంకుశాధికృతను సమర్థించాడు.

ఇలాంటి పాలకవర్గ సిద్ధాంతాల్లో అనుద్దిష్టంగా యదృచ్ఛా స్వభావంతో చేసే వంచనలూ, ఉద్దేశపూర్వకంగా చేసే వంచనలూ కూడ పోల్చవీలులేనంతగా పెనవేసుకొని ఉంటాయి. ఐతే, నేటి పెట్టుబడిదారీ సిద్ధాంతాల్లో ఈ భావసమ్మిశ్రణ మరింత జటిలంగాను,గూఢంగాను ఉంటుంది. పెట్టుబడిదారీ విధానంలో పదార్థాలు, సరుకులవలెనే భావాలు కూడ క్రయ విక్రయసాధనా లైనాయి. మేధావులు తమ భావాలను

వాస్తవ విశ్వాసాలుగా కాక మార్కెట్టులో విక్రయించే సరుకుగా వినియో గించుకుంటారు. ఈ వ్యవస్థను పత్రికలు, ప్రచురణలు పోషిస్తాయి.

వర్గ సిద్ధాంతాలు వర్గ స్వభావంతో కొనసాగుతవి. చరిత్రలో ఒక నూతన పాలకవర్గం ఉదయిస్తున్నప్పుడు పాత పాలకవర్గ సిద్ధాంతాలను అది నూతన సిద్ధాంతాలద్వారా సవాలు చేస్తుంది. పాత పాలకవర్గ సిద్ధాంతా లెలా వారివారి ప్రయోజనాలకు మాత్రమే అనుగుణ్యమై యితర వర్గాల ఆకాంక్షలకూ, ఆవశ్యకతలకూ ఆటంకమౌతున్నాయో నూతన పాలకవర్గం ప్రకటిస్తుంది. ఆ సిద్ధాంతాలు వాస్తవికతను ఎలా మభ్యపరుస్తాయో బహిరంగపరుస్తుంది. తోడ్తో వాటికి ప్రత్యామ్నాయంగా తన నూతన సిద్ధాంతాలను రూపొందించి, విస్తృతంగా పెంపొందిస్తుంది. చరిత్రయొక్క వివిధ దశలలో మనం ఇలాంటి పునరుజ్జీవన ఘట్టాలు సాంఘిక జీవితపు సిద్ధాంతరంగాలలో నూతన భావాల నెలా ప్రవేశపెట్టినవో వివరంగా చూస్తాం.

> "పాత పాలకవర్గ స్థానాన్ని ఆక్రమించే ప్రతికొత్తపాలకవర్గం తన ఆశయాన్ని సాధించుకొనుటకుగాను అనివార్యంగా తన వర్గ ప్రయోజనమే ప్రజలందరి సమష్టి ప్రయోజనమనే ఆదర్శరూపంలో ప్రాతినిధ్యం వహిస్తుంది. తన భావాలకు సార్వజనీన స్వరూపమిచ్చి అవే తార్కికంగాను, సర్వసమగ్రంగాను నికరమైనవని వాదిస్తుంది. ఇలా విప్లవోన్ముఖమైన ఒక వర్గం మరొక వర్గాన్ని వ్యతిరేకించాలి గనుక అది పుట్టుకతోనే ఒక వర్గంగా కాక, మొత్తం సమాజానికే ప్రతినిధిగా కనబడుతుంది." — మార్క్స్, ఎంగెల్స్

ఈ విధంగా, నవోదిత సిద్ధాంతం సామాన్యంగా మహోన్నత అభివృద్ధిశీలతతో సాంఘికఆకాంక్షల, అవసరాల సాధనలో నూత్న విస్తృతిని చేకూర్చే సార్వజనీనభావాలతో ఉదయిస్తుంది. స్వప్రయోజనానికి మాత్రమే కాక మొత్తం ప్రజల ఆశయాలకు అనుగుణ్యమైన రూపంలో ఉదయిస్తుంది. కాని కాలక్రమంలో నూతన పాలకవర్గం స్వీయ వైరుధ్యంలో కూరుకొని పోతుంది. అందువల్ల నూతన సిద్ధాంతం తన విప్లవశీలతను కోల్పోయి సంకుచితత్వానికి గురియై శిథిలం అవుతుంది. తుద కది వర్గ

స్వార్థప్రేరణలతో నిండిన మిథ్యావాదాల పుట్టగా తేలిపోతుంది. అప్పుడు ఆ సిద్ధాంతాన్ని సమర్థించి పోషించే మేధావులు పాలకవర్గ ప్రయోజనాలకు కొమ్ముకాసేవారుగా, అమ్ముడుపోయిన సరుకుగా సాంఘిక తిరస్కృతికి గురియౌతారు.

ఉదాహరణకు వ్యక్తియాజమాన్య సమస్య. గతశతాబ్దంలో తాతా, బిర్లాలు తమ యాజమాన్యంలో పెద్దపెద్ద పరిశ్రమలను స్థాపించారు. ఆ రోజుల్లో వారు దేశాభిమానులుగా, జాతీయాభ్యుదయ శీలురుగా పొగడ్తలు పొందారు. వారి పరిశ్రమలు నిరుద్యోగ నివారణకు, అధికోత్పత్తి సాధనకు, దేశ ఆధునికీకరణకు పట్టుగొమ్మలుగా రూపొందాయి. జాతీయోద్యమం దేశసంపదను కొల్లగొట్టే విదేశ సామ్రాజ్యవాద పరిపాలనను సవాలు చేసింది. విదేశీ గుత్తపెట్టుబడులను ద్వేషించి ప్రతివారూ స్వదేశీ పెట్టుబడులే తరణోపాయమని భావించారు. కాని ఈనాడు పెట్టుబడిదారీ విధానం, కీలక పరిశ్రమల వ్యక్తిగత యాజమాన్యం అభివృద్ధి నిరోధకమన్న భావం ప్రబలింది. కీలక పరిశ్రమలు బ్యాంకులు జాతిపరం కావాలనీ, సోషలిస్టు పునాదులపై ప్రణాళికలు కొనసాగాలనీ ఆర్థికవేత్తలు వాదనలు చేస్తున్నారు. దేశప్రజల్లో తాతా బిర్లాలపట్ల వ్యామోహం అంతరించింది. జాతీయోద్యమం ఒకనాడు విదేశీ పెట్టుబడులతో ఏ విధంగా పోరాడిందో, అదే విధంగా ఈనాడు స్వదేశీ గుత్తపెట్టుబడిదార్ల ప్రయోజనాలతో పోరాటం సాగిస్తూంది. గత అర్ధశతాబ్దంలో ఈ క్రమమంతా సిద్ధాంతరంగంలో స్పష్టంగా ప్రతిబింబించింది. ఐతే, ఈనాడు సోషలిస్టు చైతన్యమంటే అర్థం పెట్టుబడిదారీ విధానపు స్వీయ సంక్షోభమేనన్న భావం, ఆ విధానానికి కొమ్ముకాసే మేధావులు ఆత్మవంచనకు గురియైన స్వార్థపరులన్న భావం వ్యాపకమైనవి.

ఇలా సిద్ధాంతభ్రాంతులు అనుభూతిరంగానికి, ఆలోచనారంగానికి, చరిత్రయొక్క స్వీయ పార్శ్వానికి చెందుతవి. ప్రత్యక్షానుభూతిలో [redacted]లోపం. దాన్ని ప్రకటించే సందర్భంలో అనుమానక్రమానికి చెందిన ఆలోచనాలోపం ఈ రెండూ సిద్ధాంత భ్రాంతులకు ఆధారం ఔతాయి.

# 8 వ అధ్యాయం

# విజ్ఞానశాస్త్రం

ప్రజలు సిద్ధాంతభ్రాంతులకు ప్రతిగా తమ ఆచరణ వ్యవహారంలో వాస్తవికతను కనుగొంటారు. వాస్తవికత మొదట్లో సాంఘికోత్పత్తినుండి విదితమవుతుంది ఉత్పత్తి క్రమంలో రూపొందే భావాల నుండి విజ్ఞానశాస్త్రాలేర్పడతాయి. అవి శాస్త్ర పరిశోధనల రూపంలో ఉత్పత్తి క్రమంనుండి విడిపోతాయి; నిర్దిష్ట వర్గాల చేతుల్లో అవి నిర్దిష్ట వర్గాల సిద్ధాంతాలను ప్రతిబింబిస్తాయి. తోడ్తో వర్గపోరాట అనుభవ మనే పునాదిమీద సాంఘిక నిర్వహణకు, శాసనాలకు అనుగుణ్యంగా సాంఘిక శాస్త్రాలు పెంపొందుతవి. కాని అవి పీడక వర్గాల చేతుల్లో ప్రకృతి శాస్త్రాల విజ్ఞానస్థాయి నందుకోలేవు.

చరిత్రలో ఉత్పత్తి సంబంధాలకు చెందిన భ్రాంతిజనిత ప్రతిబింబాలతోపాటు పరిసర పదార్థాలకూ, వాని వినియోగానికీ, సాంఘిక సంబంధాలకూ చెందిన వాస్తవిక శాస్త్రీయ భావాలు కూడ పరిణామం చెందుతాయి.

ఉత్పత్తియొక్క అభివృద్ధీ, ఆ ఉత్పత్తినుండి రూపొందే సాంఘిక వ్యవహారమూ పదార్థాలు వాటి పరస్పర సంబంధాలను గూర్చిన, మానవులు వారి పరస్పర వ్యవహారాలను గూర్చిన వాస్తవిక భావాలకు దారి తీస్తుంది. అలాంటి వాస్తవిక భావాల అభివృద్ధి లేకుండా మానవుడు తన

ఉత్పత్తి వ్యవహారాన్నీ, సాంఘిక వ్యవహారాన్నీ కొనసాగించలేదు. కనుక ఉత్పత్తిశక్తుల స్థాయి, విస్తృతి, తోడ్తో సాంఘికవ్యవహారాల వైవిధ్యం, శ్లిష్టత యెంత పెంపుచెందితే అంతగా ప్రకృతినిగూర్చి సమాజాన్ని గూర్చి మానవులు వాస్తవిక జ్ఞానాన్ని పెంపుచేసుకోవలసి యుంటుంది. ఇలాంటి విజ్ఞానాభివృద్ధి లేకుండా మానవులు తమ ప్రయోజనాలను నెరవేర్చుకొనటం సాధ్యం కాదు.

సిద్ధాంత గుణీకరణల అభివృద్ధిలో చైతన్యం సమకాలికాచరణకు అతీతమైనదిగా కనబడుతుంది. ఇలా గుణీకరింపబడ్డ చైతన్యం ప్రచలిత ఆచరణ పరిమితులనుండి విడివడటంవల్ల అది నూత్నత్వం ద్వారా ప్రచలిత ఆచరణనేగాక, దాన్ని గురించిన చైతన్యాన్నికూడ ముందుకు తోస్తుంది. కనుక ఉత్పత్తి అభివృద్ధీ, ఉత్పత్తి సంబంధాల అభివృద్ధీ, శ్రమవిభజనా సిద్ధాంత భ్రాంతులవలెనే విలోమక్రమంలో ప్రతిబింబిస్తూ వుంటాయి. తోడ్తో జీవితవైవిధ్యానికి చెందే వాస్తవిక శాస్త్రీయభావాల వికాసానికికూడ అవి దారితీస్తాయి. భావపరిణామంలో, సైద్ధాంతికాభివృద్ధిలో వాస్తవాధారప్రేరణ చైతన్యప్రతిబింబగతమై విలోమక్రమంలో కొనసాగుతుంది.

ఐతే, నూతన వాస్తవికభావాలు తమంతతామే ఏర్పడవు. వాటి నిర్మాణం. వికాసం మానవ ప్రయత్నంద్వారా జరుగుతుంది. అవి ఆచరణరంగంలో పరీక్షకు గురియవుతాయి. సాంఘిక వ్యవహారంలో నూతన పరిశోధనలు అదివరకు కనుగొనబడిన వాస్తవాలకు ప్రాతినిధ్యం వహించి నిలుస్తాయి.

*నూతన భావానికి పునాది సాంఘికోత్పత్తి*

ఉత్పత్తిక్రమ లక్షణాల్లో, శ్రమానుక్రమంలో, మానవుడు తాను సాధించగోరే లక్ష్యాలనుగూర్చి ముందే కొన్ని భావాలను కల్గియుండి, నిర్దిష్టపథకాల్ని అనుసరిస్తాడని మన మిదివరకే గమనించాం. ఈ చైతన్యం లేకుండా ఉత్పత్తివికాసం సాధ్యంకాదు. చేపలుపట్టడం, మృగాలను వేటాడం మున్నగు ఆదిమ శ్రమ రూపాల్లోకూడ యీ చైతన్యం

వుంది. కనుక ఉత్పత్తివ్యవహారంలో మానవుడు పదార్థాలనుగూర్చిన, వాటి సంబంధాలు, వినియోగం, వినియోగ విధానాలను గూర్చిన భావాలనుకూడ నిర్మించుకుంటాడు. ఈ విధంగా పదార్థధర్మాల పరిశీలన, వాటిని సాధనాలుగా వినియోగించే విధానాల పరిశోధన యీ రెండూ భావాల వికాసమే.

"శ్రమానుక్రమపు ప్రాథమిక భాగాలు : (1) మానవుని వ్యక్తిగత వ్యాపారం-శ్రమ, (2) ఆ శ్రమయొక్క లక్ష్యం, (3) ఆ శ్రమకు సాధనాలు" అని మార్క్సు వ్రాశాడు. ఈ భాగాల్లో యే ఒకటికాని అందుకు సంబంధించిన భావాల, ఆలోచనల పరిజ్ఞానంలేకుండా సాధ్యంకాదు. కనుక, ఉత్పత్తి వ్యవస్థ శ్రమ విభజనక్రమం విస్తృతంగా పెరిగే కొద్దీ అందుకు చెందిన భావాలు, అనుభవాలు కూడ విస్తరమౌతాయి. లక్ష్యం ఉన్నతమౌతుంది. సాధనాలు పెంపుచెందుతాయి. ఈ విధంగా ఉత్పత్తి విధానంతోబాటు మానవుల భావాలు, సిద్ధాంతరంగం కూడ పురోగమిస్తుంది. సిద్ధాంత రంగపు ఈ పురోభివృద్ధిలో నూతన భావాలు రూపొందుతవి.

ఆదిమ మానవులు తమ ప్రాకృతిక, సాంఘిక సంబంధాలకు "మాంత్రిక తాంత్రిక" రూపమిచ్చి కొన్ని సిద్ధాంతాలు రూపొందించారు. ఈ దశలో మానవుడు తాను వేటాడే జంతువులనుగూర్చి, వాటి స్వభావాలనుగూర్చి. అందుకు వినియోగించే పదార్థాల ధర్మాలను గూర్చి కొన్ని భావాలను పెంపుచేసుకున్నాడు. ఆ భావాల ఉత్తేజనలో ఆదిమమానవులు వేటకు చెందిన జంతువుల శిల్పాలను తమ గుహానిలయాలలో అద్భుతంగా చెక్కుకున్నారు.

సమాజంలో వ్యవసాయం కుటీరపరిశ్రమలు పెంపుగాంచటంతో మానవుడు ప్రకృతి పదార్థాలను గురించి, వాటి ధర్మాలను గురించి, విభిన్న ఉత్పత్తి రంగాలనుగురించి అనేక నూతన భావాలను చేకూర్చుకొన్నాడు. వాటిని వినియోగ పరచుకొన్నాడు. నేడుకూడ ఈక్రమంలోనే విశ్వవిద్యాలయాల్లో విభిన్నమత, రాజకీయ, తాత్విక సిద్ధాంతాల భ్రాంతు

లతోపాటు, మహోన్నత ప్రకృతి శాస్త్ర వాస్తవాలను, వాటి వినియోగం ద్వారా ప్రకృతిపై సాధించగల యాజమాన్యవిస్తృతిని కూడ బోధిస్తున్నారు. ఐతే, ఈ విజ్ఞానం వేలాది సంవత్సరాలుగా మానవుడు జరిపిన కృషివల్ల, పెట్టుబడిదారీ విధానంలో కొనసాగిన ఉత్పత్తిశక్తుల అభివృద్ధి వల్ల సాధ్యమయింది.

ఈ విధంగా, సిద్ధాంత భ్రాంతులు సాంఘికసంబంధాల ఆధారం నుండి ఉత్పన్నమవుతున్నాయి; వాస్తవిక సిద్ధాంతాలు ఉత్పత్తిక్రమ ఆధారం నుండి రూపొందుతున్నాయి. ఐతే, ప్రకృతిశాస్త్ర విస్తృతిలో మానవుడు విభిన్న పదార్థాల ధర్మాలను గురించి, పరిణామాలనుగురించి, ఉత్పత్తి క్రమంలో వాటిని వినియోగాన్ని గురించి పొందే విజ్ఞానం సాంఘిక సిద్ధాంత భ్రాంతికీ, విలోమస్వభావానికీ, యాదృచ్ఛిక ఆజ్ఞేయతకూ అతీతంగా పెంపొందుతుంది.

ప్రకృతికీ, దాన్ని వియోగించే సాంకేతిక క్రమాలకూ చెందిన వాస్తవికభావాలు ఉత్పత్తిశక్తుల ప్రధానలక్షణాలనుండి రూపొందుతవి. ఉత్పత్తిశక్తులంటే మనుష్యులూ, వారి ఉత్పాదక అనుభవమూ, మరియు సాంకేతికనైపుణ్యం అన్నమాట. ప్రజల ఉత్పత్త్యనుభవం, శ్రమ నైపుణ్యం వారి భావాల్లో స్థగితమై సామాన్యీకరింపబడి క్రమీకరింప పడుతుంది. ఇలాంటి భావసామగ్రితో ఉత్పత్తిసాధనాలు వినియోగింపబడి అభివృద్ధిగాంచుతాయి. అంతేకాక, ఉత్పత్తిక్రమంలో వివిధ సమస్యల పరిష్కారానికి, ఉత్పత్తిసాధనాల వినియోగానికి చెందిన ప్రకృతి విజ్ఞానాభివృద్ధి ఒకానొకదశలో ఉత్పత్తివ్యవహార నిర్వహణకు, విశిష్టతరమైన ఉత్పత్తి విధానానికి దారిచూపవచ్చు. ఉత్పత్తి సంబంధాలలో నూతన విప్లవాత్మక పరిణామాన్నికల్గించి, నూతన ఉత్పత్తిశక్తుల నిర్మాణానికి అది దారివేయవచ్చు. అంటే సాంఘిక సంబంధాలవల్ల ఏర్పడే సిద్ధాంత భ్రాంతులను ప్రకృతి శాస్త్రాల అభివృద్ధి మార్చివేస్తుందన్నమాట.

*ప్రకృతిశాస్త్రాల ఆవిష్కారం*

ప్రకృతిశాస్త్రాలు ఉత్పత్తి క్రమంలో సంచితమైన భావాలనుండి, విజ్ఞానంనుండి రూపొందుతవి. "శాస్త్రం పుట్టుక, పెరుగుదల ఆదినుంచీ ఉత్పత్తి (క్రమం)చే నిర్ధారితమౌతుంద"ని ఎంగెల్స్ వ్రాశాడు.

ఆదిమ దశలో ప్రకృతిశాస్త్రాలు ఖగోళ, గణిత, యాంత్రిక విజ్ఞానానికి పరిమితమైయుండేవి. ఖగోళశాస్త్రం ఋతువులకూ, ఋతుధర్మాలకూ చెంది వ్యవసాయానికీ, పశువుల పెంపకానికీ తోడ్పడింది. ఐతే, ఖగోళశాస్త్రానికి ఆధారం గణితశాస్త్రం. గణితం లేకుండా రోజులనూ, నెలలనూ కొల్చుటకు వీలులేదు. పిదప వ్యవసాయానికి నీటి వనర్లు, పరిశ్రమలకు వేర్వేరు పరికరాలు అవసరమయాయి. ఇలాగే యాంత్రిక శాస్త్రానికి గృహనిర్మాణం అవసరమయింది. జల యానానికీ, యుద్ధానికీ కూడ యాంత్రిక పరిశోధన ఆవశ్యకమే. విల్లమ్ములు, పడవలు మున్నగు ఆదిమకాల సాధనాలు యాంత్రిక పరిజ్ఞానం లేకుండా సాధ్యపడవు. ఐతే, యాంత్రికశాస్త్రం గణితశాస్త్రంపై ఆధారపడి, తిరిగి గణితశాస్త్రాభివృద్ధికి ఉపకరిస్తుంది. పిదప ఉత్పత్తిశక్తుల పురోభివృద్ధితో ఇతరశాస్త్రాలు పెంపొందుతవి. ఐతే పెట్టుబడిదారీవిధానంలో ప్రకృతిశాస్త్రాలు (ఉదా॥ పదార్థ విజ్ఞానశాస్త్రం, రసాయనశాస్త్రం, శరీరశాస్త్రం, భూగోళశాస్త్రం మున్నగు శాఖోపశాఖలు) అపూర్వవికాసం పొందాయి.

> "విజ్ఞానశాస్త్రాలు అకస్మాత్తుగాను, అనుకోనివిధంగాను శరవేగంతో అభివృద్ధిగాంచాయంటే దానికి కారణం ఉత్పత్తియే."
>
> — ఎంగెల్స్

ప్రకృతిశాస్త్రాల వికాసాన్ని ఉత్పత్తియొక్క స్థాయి నిరూపిస్తుంది. విజ్ఞానశాస్త్రాల పరిణామంలో సంభవించే ఒడుదుడుకులకూ, ఏకపక్షస్వభావానికీ కారణం అవి ఉత్పత్తిక్రమంతో ముడివడియుండటమే. ఉత్పత్తిక్రమం స్థగితమైయున్నప్పుడు శాస్త్రాభివృద్ధి కుంటువడి చిక్కులలో కూరుకుపోతుంది. కాబట్టి ఉత్పత్తియొక్క స్వభావం, ఉత్పత్తివిధానాల విశిష్టత విజ్ఞానశాస్త్ర వికాసాన్ని నిరూపిస్తుంది. ఉదా

దాహరణకు మధ్యయుగంలో ~~ఆయుర్వేదం,~~ జీవశాస్త్రం యాంత్రికశాస్త్రం కొంత అభివృద్ధిచెందాయి. కాని రసాయనశాస్త్రం స్తగితదశలోనే వుంది. అలాగే యీనాటి గుత్తపెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యయసాయశాస్త్రం కంటె మారణాయుధాల పరిశోధనలే అధికంగా ప్రోత్సహింపబడుతున్నాయి.

*శాస్త్రవిజ్ఞానవు ప్రత్యేక స్వభావం*

విజ్ఞానశాస్త్ర పునాదులు ఉత్పత్తిక్రమంలో వుంటాయి. విజ్ఞాన శాస్త్రం ఉత్పత్తి వ్యవహారంలో వినియుక్తమౌతుంది. ఐనప్పటికీ విజ్ఞాన శాస్త్రం ఉత్పత్తిక్రమానికి భిన్నమైన ప్రత్యేక రంగాలలోనే పెంపొందుతుంది.

అంటే, శాస్త్రాలు ప్రత్యేకమైన విజ్ఞానరంగాలన్నమాట. విభిన్న శాస్త్రాలు విభిన్నరంగాలలో విభిన్నవాదాలను సూత్రీకరణలను చేస్తాయి. శ్రమవిభజన విస్తృతంగా పెంపొందటంతో, ప్రకృతి పరిణామాలను గురించిన పరిశోధన ఉత్పత్తినుండి వేరై, ప్రత్యేక కృషిద్వారా కొనసాగుతుంది. ఆయా శాస్త్రాలు ఆయా ప్రత్యేక రంగాలలో పరిశోధనలు సాగిస్తూ, ఆయా సిద్ధాంతాల నిరూపణలను, విశదీకరణలను విడివిడిగా సాగిస్తాయి.

ఉదాహరణకు, వైదిక సమాజంలో ప్రకృతి శక్తులు దివ్యశక్తులన్న భావం ఉండేది. కాని, సూత్రయుగంనాటికి ఆ పరిస్థితులు మారాయి. భాషారంగంలో పాణిని వ్యాకరణం, గణితంలో శుల్వసూత్రాలు, దశాంశ సిద్ధాంతం, ఆయుర్వేదంలో చరకసుశ్రుతాలు, తత్వశాస్త్రంలో సాంఖ్యుల జ్ఞానసిద్ధాంతం రూపొందాయి. తర్కంలో గౌతముని న్యాయదర్శనం, జ్యోతిషరంగంలో పరాశరతంత్రం, సూర్యసిద్ధాంతం మున్నగు ప్రత్యేక శాస్త్రరంగాలు ఆవిర్భవించాయి.

ఉత్పత్తి వ్యవహారంలో రూపొందే వాస్తవిక జ్ఞానం తీరికలో ఆ శ్రమయొక్క, శ్రమకు గురియయ్యే పదార్థాలయొక్క మరియు శ్రమ పరికరాలయొక్క చైతన్యంగా రూపొందినప్పుడు జ్ఞానం శాస్త్రీయస్థాయిని

విజ్ఞానశాస్త్రాలు సాంఘిక వ్యవహారమనే సామాన్యదృష్టితోను, ప్రత్యేక దృక్పథంతోను కూడ పెంపొందుతవి. పాలకవర్గాలు తమ అవసరాలను నెరవేర్చుకొనేందుకు పరికరాలుగా విజ్ఞానశాస్త్రాలు ఉపయోగపడతాయి ఉత్పత్తిక్రమాన్ని విస్తరింపజేయుటకూ తోడ్తో సాంఘిక వ్యాపారాన్ని శాసించి నడుపుటకూ అనుకూలంగా వికసిస్తాయి ఆయా పాలకవర్గాలు తమ ప్రయోజనాల సాధనకై ఏ మేరకు శాస్త్రాభివృద్ధి అవసరమనుకుంటాయో ఆ మేరకు అజ్ఞానాన్నీ భ్రాంతినీ నివారించే శాస్త్రీయ భావాలను పెంపొందిస్తాయి. కనుక శాస్త్రవికాసమూ, వ్యాప్తీ ఆ యా కాలాలలో పాలకవర్గాల ప్రయోజనాలచే నిర్ధరింపబడతాయి.

బానిస సమాజంలోను, ఫ్యూడల్ భూస్వామ్యంలోను వ్యవసాయ పారిశ్రామికవిధానాలు చాల వెనుకబడియుండేవి. అందువల్ల ఆయా కాలాల పాలకవర్గాలు శాస్త్రాభివృద్ధిలో అట్టే ఆసక్తిని కనబరచలేదు. అందువల్ల వందలాది సంవత్సరాలలో శాస్త్రవికాసం స్తంభించిపోయింది. పిదప బూర్జువావర్గం అధికారాన్ని చేపట్టింది. వారి నూతనావసరాలు శాస్త్ర వికాసానికి అపూర్వావకాశం కలిగించాయి. బ్రహ్మాండమైన పారిశ్రామికాభివృద్ధి, తన్మూలంగా నూతన సాంఘిక సంబంధాలు రూపొందాయి. ఇలా ఆధునిక విజ్ఞానశాస్త్రం బూర్జువావర్గపు వొత్తిళ్ళలో పెరిగింది. విజ్ఞాన సంస్కృతీ పునరుజ్జీవన క్రీ. శ. 15-16 శతాబ్దాల ప్రాంతంలో ఇటలీ, స్పెయిన్, ఇంగ్లండ్, నెదర్లాండ్స్ దేశాలలో వరుసగా విజృంభించినది. సాంస్కృతిక పునరుజ్జీవనం ఆర్థిక పునాది నాశ్రయిస్తూనే, యూరప్‌ఖండ మంతటా ప్రవహించి నవయుగ నిర్మాతలను కని పెంచింది. భారతదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవన 19, 20 శతాబ్దాల్లో జాతీయ పరిశ్రమల వికసన ఆధారంపై శాస్త్ర విజ్ఞాన, సంస్కృతీ రంగాలన్నిటినీ ఆవరించి విదేశాధిపత్యాన్ని సవాలుచేయ నారంభించింది.

కనుక పెట్టుబడిదారీ యుగావతరణ నూతనశాస్త్ర వికసనకు ఆధారమై, నూతన ఉత్పత్తి వ్యవస్థనూ, నూతన సాంఘిక సంబంధాలను ఆవిష్కరించింది.

*శాస్త్రవికాసంలో వర్గ దృక్పథం*

శాస్త్ర వికాసంలో వర్గాలు నిర్ణాయకపాత్ర వహించటంవల్ల ఆయా శాస్త్రాలు నిర్దిష్టమైన వర్గధోరణులకు లోనౌతాయి. పాలకవర్గాలు తమ జీవిత పరిస్థితుల చైతన్యాధారంపై శాస్త్ర సిద్ధాంతాల్లో స్వీయోద్దేశాలను ప్రవేశపెడతారు. ఇలా వర్గ దృక్పథం శాస్త్రరంగంలోనికి ప్రసరించి ఆయా శాస్త్ర సిద్ధాంతాలకు వర్గ స్వభావాన్ని చేకూరుస్తాయి. శాస్త్రకృషి కొనసాగించే మేధావులు తమ సైద్ధాంతిక వ్యవహారంలో ఆయా వర్గాల ప్రతినిధులుగా అంతో ఇంతో పాత్రవహిస్తారు. కనుక శాస్త్ర నిరూపణల్లో వర్గస్థితి మూలకమైన స్వకీయోద్దేశాలు మిళితమై ఆయా సిద్ధాంతాల్లో ప్రవేశిస్తాయి. ఈ విధంగా చరిత్రయొక్క నిర్దిష్టకాలాల్లో వర్గ దృక్పథాలు శాస్త్ర సిద్ధాంతీకరణలన్నింటినీ ఆవరించి తమ ప్రభావం కలుగజేస్తాయి.

ఉదాహరణకు బానిస సమాజంలోను, ఫ్యూడల్ భూస్వామ్యంలోను పెంపొందిన వర్గాధిక్యతల భావం. ఇది భారతదేశంలో వర్ణాశ్రమ రూపంలో కొనసాగింది. గణ-సమాజంలో వర్ణం ఆర్యుల జాతిచిహ్నం. ఆపిదప ఆర్యులు బ్రాహ్మణ క్షత్రియులుగాను, ద్రావిడజాతులు వైశ్య శూద్రులు గాను సమ్మేళన చెందారు. ఇంకా రానురాను భారతీయ ఆదివాసులు హిందూ సమాజంలో చేర్చుకొనబడి అనేక కులాలు ఏర్పడ్డాయి. మిశ్రమజాతులు, హీనకులాలు పెంపొందాయి. ఈదశలో హిందూ సాంఘిక దృక్పథం అదృష్ట కర్మవాద ఆధారంపై దేవుడు సృష్టికర్త అనీ, ఆయన చాతుర్వర్ణ్యాన్నీ ఆయా కులాలనూ పుట్టుకతో వచ్చే హెచ్చు తగ్గులుగా పూర్వజన్మ కర్మలనుబట్టి సృష్టించాడనీ, కనుక కుల భేదాలు, హెచ్చు తగ్గులు దివ్యదత్తములనీ, అవి అలాగే కొనసాగాలనీ కనుక ఏ యే కులాలవారు ఆయా కులవిధులను ఆచరించక పోవటం సంఘ వ్యతిరేకతఅనీ, నేరమనీ కఠినంగా శాసించింది. ఇంతవరకేకాదు. ప్రకృతి, జంతువులు, వృక్ష జాతులు, ధాతువులు కూడ దివ్యసృష్టిలోనే హెచ్చుతగ్గులతో కూడియున్నాయని వాదనలు సాగాయి. కనుక పదార్థ ధర్మాలు, పరిణామాలు కూడ దివ్య నిర్దేశిత మైనవేననీ, వాటిని అతిక్ర

వికాసంలో వర్గస్థితియొక్క స్వీయధోరణివల్ల ఉత్పన్నమయే వైరుధ్యం ఈ విధంగా పాత్ర వహిస్తుంది.

*పరిశోధన - స్వీయ దృక్పథం*

వర్గవిలోకనవల్ల శాస్త్రవికాసంలో శాస్త్రీయ వాస్తవికతకూ, సాంప్రదాయిక స్వీయోద్దేశాలకూ మధ్య నిరంతరవైరుధ్యం కొనసాగుతుంది. వాస్తవిక పరిశోధనలో భౌతిక పదార్థాలు, వాటి ధర్మాలు, పరస్పరసంబంధాలు విదితమౌతాయి. ఉదాహరణకు నిప్పు కాలుతుంది. నీరు దాన్ని చల్లారుస్తుంది. కనుక అగ్నిప్రమాదాన్ని నీటితో నివారించాలి. ఐతే. శాస్త్రపరిశోధనలు నిర్దిష్టోద్దేశాలతో యేర్పడే ప్రతిపాదనల రూపంలో సూత్రీకరింపబడతాయి. ఉదాహరణకు "భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, పంచభూతములు. వీటినుండి వాసన, రుచి, రంగు, స్పర్శ, శబ్దం రూపొందుతవి. వీటిని మనం ముక్కు, నోరు, కన్ను, దేహం (త్వక్కు) చెవి అనే పంచేంద్రియాలద్వారా గ్రహిస్తున్నా" మని దార్శనిక నిరూపణ. తోడ్తో కాయిక, వాచిక. మానసికప్రవృత్తులు ప్రతి జీవికీ వర్తిస్తాయనీ యీ ప్రవృత్తుల ఫలితమే జన్మ, ఆయువు, భోగము అనీ, ప్రవృత్తులలో పుణ్యపాపములే సుఖదుఃఖాలనీ ధార్మిక నిరూపణ. ఈ రెండు నిరూపణలూ కలిసే కొనసాగుతవి. ఇందులో ఒక భాగం ప్రకృతి శీలతకూ, మరొకభాగం సాంఘిక శీలతకూ చెందియున్నాయి. ఈ విధంగా శాస్త్రపరిశోధనలో నిర్దిష్టోద్దేశాలు సంక్రమించి సామాన్యీకరణలలో వినియుక్తమౌతాయి. అందువల్ల శాస్త్రసిద్ధాంతాలన్నిటిలోను మనం రెండు విభాగాలను చూస్తాం. ఒకటి. పరిశోధనలు ప్రకటించే భౌతిక వాస్తవాలు. రెండు, ఆ భౌతిక వాస్తవాల నిరూపణలో పాత్ర వహించే సాంఘిక, వర్గ, వైయక్తిక స్వీయోద్దేశాలు.

శాస్త్రపరిశోధనలో. స్వీయోద్దేశాలప్రభావం తరచు వాస్తవికతకూ, స్వీయోద్దేశాలకూ మధ్య వైరుధ్యానికి దారితీస్తుంది. ఈ వైరుధ్యం నిరంతరం కొనసాగుతుంది. ఐతే యీ వైరుధ్యాన్ని మనం స్వభావ స్వరూపాల వైవిరుధ్యంగా పోల్చుకుంటాం.

శాస్త్ర పరిణామంలో పరిశోధనల వాస్తవికత ధనాత్మకంగాను సాంప్రదాయిక స్వీయ దృక్పథం ఋణాత్మకంగాను పాత్రవహిస్తాయి. ఇందులో ధనాత్మకత ప్రధానమైనప్పుడు నూతన శాస్త్రీయ వాస్తవికత సాంప్రదాయిక స్వీయోద్దేశాలను నిర్మూలించి నూతన సిద్ధాంతీకరణకు దారి తీస్తుంది. అలాగే, ఋణాత్మకత సాంప్రదాయిక స్వీయోద్దేశాల ప్రాబల్యంవల్ల వాస్తవిక పరిశోధనలకు చెందిన నూతన భావాలను నిరోధిస్తుంది. చరిత్రలో మన కీ రెండుదిశలూ యెదురౌతాయి.

ఉదాహరణకు ఆధునిక ప్రకృతిశాస్త్ర వికాసం ప్రారంభమైనప్పుడు పాతభావాలు నూతన పరిశోధనలకు ఆటంకమైనాయి. భూగోళ చలనానికి, ఇతర గ్రహాల చలనానికీ వేర్వేరు చలన క్రమాలు, హెచ్చు తగ్గులు ఉన్నాయన్న పాతభావాలు దూరదర్శినిని కనిపెట్టిన గెలీలియో ఉరితీతకు కారణమైనవి. కాని కోపర్నికస్ సిద్ధాంతం అణగిపోలేదు. నూతన ఖగోళ చలనపరిశోధనలు ముందుకు సాగి, న్యూటన్ కనిపెట్టిన యాంత్రిక విశ్వ చలన సూత్రాల ఆవిష్కరణకు దారితీసింది. ఇలా యాంత్రిక శాస్త్ర ఖగోళశాస్త్రాలలో నూతన పరిశోధనలు పాత సిద్ధాంతాల సాంప్రదాయిక భావాలను తుదముట్టించి నూతన సిద్ధాంత దృక్పథానికి విజయం చేకూర్చినవి. అయితే తిరిగి ఈనాడు బూర్జువా ప్రకృతి శాస్త్రంలో శాస్త్ర పరిశోధనలకూ సాంప్రదాయిక యాంత్రిక అధి భౌతిక స్వీయోద్దేశాలకూ మధ్య వైరుధ్యం పరిణతమైనది. గతితర్కం, సాపేక్ష సిద్ధాంతం అనేక పాత స్వీయభావాలతో అవరోధింపబడుతున్నాయి.

లెనిన్ యిలా వ్రాశాడు :

"ఆధునిక ప్రకృతిశాస్త్ర పరిశోధనల సారాంశం ప్రకృతి గతితార్కికంగా పరిణామం చెందుతుందనేకాని, అధిభౌతికంగా అని కాదు....ఐనప్పటికీ, గతితార్కికంగా ఆలోచించ నేర్చుకున్న శాస్త్రజ్ఞులు అరుదు. (కనుక) పరిశోధనలకూ (నూతన వాస్తవాలకూ) మరియు సాంప్రదాయిక స్వీయభావాలకూ మధ్యగల వైరుధ్యం

ప్రకృతిశాస్త్ర సిద్ధాంతాల్లోని (నేటి) అంతులేని తికమకలకు ఆధార మౌతూ ఉంది."

ఈ వైరుధ్యం ఒకవంక శాస్త్రరంగంలో అంతులేని తికమకలను కలిగిస్తూ శాస్త్రవికాసానికి అవరోధమౌతూంది. ఉదాహరణకు, జీవ శాస్త్రంలో 'జీవక్రమా'నికి చెందిన ఛాందస యాంత్రికభావాల మూలంగా 'జీవశక్తి'నిగూర్చిన ఊహ యాంత్రికనిరూపణల్లోపడికొట్టుకొంటూపునాది లేని "శాక్త - యాంత్రిక" తగాదాలను సృష్టించటం వగైరా. అలాగే భౌతికశాస్త్ర నూతన పరిశోధనలను సాంప్రదాయికమైన యాంత్రిక చలన వాద సూత్రాల మూసలోపోసి, అసలు చలనక్రమం దానికదేననీ (పదార్థంతో విడదీసి), కనుక భౌతిక క్రమాలన్నీ అనిర్వచనీయమైనవనీ వాదించే ధోరణికూడ. అంటే జీవక్రమం, చలనం వగైరాలు దివ్యశక్తుల లాంటి అనిర్వచనీయ భౌతిక శక్తులని విశ్వసించాలన్నమాట. అలాగే జ్ఞానంకూడ. ఐతే, ఈ ధోరణులు జీవక్రమాన్ని, చలనాన్ని, శక్తిని, జ్ఞానాన్ని పరిశోధనలద్వారా కాక, కేవ లాలోచనద్వారానే తెలుసుకొన వీలౌతుందని చెప్తాయి. ఒకవంక శాస్త్రరంగంలో ఈ భావవాద ధోరణులు సాగుతున్నాయి. మరోవంక శాస్త్ర పరిశోధనల ఔన్నత్యం నూతన భావాలకు ఆధారమౌతూ, గతితార్కిక విధానాన్ని అనుసరించటం జరుగుతూంది. అది ప్రకృతియొక్క, ప్రకృతి పరిణామంయొక్క సూక్ష్మ విశ్లేషణద్వారా వాస్తవిక జ్ఞానపరిణామంలో నిర్దిష్టమైన క్రమోన్నత పరంపరలను సాధిస్తూ పురోగమిస్తోంది. ఇలా గతితార్కిక భౌతికవాదం నూతన విజ్ఞానశాస్త్ర విజయాలద్వారా బూర్జువా భావవాద యాంత్రికవాద ధోరణుల అనిర్వచనీయతను సవాలుచేస్తూంది. శాస్త్రాభివృద్ధి ప్రకృతి యొక్క సూక్ష్మాతి సూక్ష్మమైన ధర్మాలను మానవుని ఆధీనంక్రిందికి తెస్తూ శరవేగంతో పురోగమిస్తూంది. ఆధునిక భౌతికశాస్త్రం సంధి దశలో ఉంది. అది గతితార్కిక భౌతికవాదాన్ని ఆవిష్కరిస్తూంది అని లెనిన్ పేర్కొన్నారు.

సాంఘికశాస్త్రం

ఇంతవరకు మనం ప్రధానంగా ప్రకృతిశాస్త్రాలను గురించి చర్చించాం. ప్రకృతి శాస్త్రవికాసం పదార్థాల, వాటి ధర్మాల వినియోగానికి చెందుతుంది. వాటికి సంబంధించిన సిద్ధాంతీకరణలను వివరిస్తుంది. కాని సాంఘికశాస్త్రం అలాకాక, సాంఘికవ్యవస్థను దాని లక్షణాలను దానికి సంబంధించిన సిద్ధాంతీకరణలను వివరిస్తుంది. వర్గపోరాటంచే అది నిర్ణయింపబడుతుంది. విభిన్నవర్గాలు విభిన్న పోరాటాల్లో పొందిన అనుభవం సాంఘిక శాస్త్రానికి పునాది.

శాస్త్రాలు ఆవశ్యకతను పురస్కరించుకొని రూపొందుతవి. ప్రకృతి శాస్త్రపరిశోధనలు ఉత్పత్తియొక్క అవసరాలను పురస్కరించుకొని ఆ ఉత్పత్తిని శాసించేవర్గంద్వారా అభివృద్ధిచెందుతవి. అలాగే సాంఘిక వ్యవహారంయొక్క అవసరాలు సాంఘికశాస్త్రాన్ని నిర్ధరిస్తాయి. అందుకని సాంఘికశాస్త్ర పరిశోధనలు సమాజానికి ఆధిపత్యంవహించే పాలకవర్గాలద్వారా గాని, దాన్ని సవాలుచేసే పీడితవర్గాలద్వారాగాని అభివృద్ధిచెందుతవి.

బానిస, భూస్వామ్య, పెట్టుబడిదారీ దశలలో సాంఘిక వ్యవస్థను గూర్చి అనేక పరిశోధనలు కొనసాగాయి. విభిన్న సమాజ వ్యవస్థల స్వరూప స్వభావాలను గూర్చి, ప్రభుత్వాలు రాజ్యాంగ విధానాలను గూర్చి చారిత్రికులు అనేక పరిశోధనలు జరిపారు. అసంఖ్యాక వివరాలను సమీకరించి, ప్రపంచ చరిత్రలోని ప్రధాన ఘటనలతో వాటిని సమన్వయించి క్రమీకరించారు కాని, ఆధునిక కార్మికవర్గం రూపొందేవరకు ఈ పరిశోధనలన్నీ పీడకవర్గాల చేతుల్లోనే కొనసాగాయి. సమాజాన్ని, మానవుణ్ణి గూర్చి పాలకవర్గ చరిత్రకారులు పొందిన అనుభూతులు, అవగాహనలే ప్రధానంగా సాంఘికశాస్త్ర వివరణలో పొందుపరుపబడ్డాయి. ఈ స్వీయవిలోకన ప్రకృతి శాస్త్రాల్లో వలెకాక, సాంఘిక శాస్త్రాలలో మూల స్వభావానికే పునాది అయింది. ఈ రెండు శాస్త్రరంగాల మధ్య ప్రధాన అంతర మేర్పడుటకు దారితీసింది.

సాంఘిక శాస్త్రం మానవుల పరస్పర వ్యవహారాలకు, సంబంధాలకు చెందేది. కాని, అది పీడకవర్గాల ప్రతినిధులచే పెంపొందింపబడింది. ప్రకృతి శాస్త్రం బాహ్యప్రకృతికి, ఆ ప్రకృతిపై మానవుని చర్యకు చెందేది. బాహ్యప్రకృతిని గూర్చి మౌలికమైన వాస్తవ దృక్పథాన్ననుసరించటం సాధ్యమే. కాని, సాంఘిక శాస్త్రంలో భౌతిక వాస్తవ పునాదిని స్వీకరించటం పీడకవర్గాలకు అసాధ్య విషయం. కనుక ప్రకృతిశాస్త్రం నుండి సాంఘిక శాస్త్రం వేరుపడిపోయింది.

సాంఘికశాస్త్రం మౌలిక దృక్పథంలోనే ప్రకృతిశాస్త్రంనుండి విడిపోయింది. రెండిటిమధ్య భేదం నాలుగు విషయాల్లో మనకు కనిపిస్తుంది.

1. ప్రకృతి శాస్త్రంలోవలె గాక, సాంఘిక శాస్త్రంలో వర్గ ప్రయోజనాలు మౌలిక పరిశోధనలను నిరోధిస్తాయి. పీడకవర్గాలచే ఆ వర్గాల ప్రయోజనాలకు అనుగుణ్యంగా పెంపొందింపబడవలసి రావటంతో సాంఘికశాస్త్ర పరిశోధనలు ఆ వర్గాల ఆధిపత్యం క్రింద తీరని ఆటంకాలకు లోనౌతాయి. స్టాలిన్ ఇలా వ్రాశాడు :

> "ప్రకృతి శాస్త్రంలోవలె అర్థశాస్త్రంలో నూతన పరిశోధన, దాని వినియోగం నిరాటంకంగా సాగవు. ప్రతి నూతన సూత్రమూ దాని వినియోగం కొన్ని ప్రబలమైన సాంఘికశక్తుల ప్రయోజనాలకు అవరోధమవుతూ వాటి తీవ్ర ప్రతిఘటనకు లోనౌతాయి."

పాలకవర్గాలు తమ సైద్ధాంతిక విశ్వాసాలమూలంగా అనేక ప్రకృతిశాస్త్ర పరిశోధనల వాస్తవాలను వ్యతిరేకించినమాట నిజమే. అందువల్ల ప్రకృతిశాస్త్ర వికాసం అనేక ఒడుదుడుకుల పాలైంది. గెలీలియో, డార్విన్, లైసెంకోల సిద్ధాంతాలపట్ల వచ్చిన ప్రతికూలత దీనికి నిదర్శనం. కాని ఈ ప్రాతికూల్యతను శాస్త్రీయవాస్తవం అధిగమించింది. తుదకు పాలకవర్గం శాస్త్రీయవాస్తవాలను స్వీకరించి వినియోగపరచుకొంది. కాని సాంఘికశాస్త్రంలో ఇలా సిద్ధాంత ప్రాతికూల్యతను సరిదిద్దుకొనటం సాధ్యంకాదు. పాలకవర్గాలు సాంఘికశాస్త్రాల వాస్తవాన్ని

'నసేమిరా' గుర్తించరు. తమ పీడనను, దాని వాస్తవాన్ని వివరించే సిద్ధాంతసూత్రీకరణలను వారు మౌలికంగా ప్రతిఘటిస్తారు.

2. రెండవభేదం: మానవుడు ప్రకృతిపై సమష్టి యాజమాన్యం వహించుటకు సాధ్యమయిన ప్రకృతిశాస్త్ర విజ్ఞానాన్ని పీడకవర్గాలు పెంపొందించాయి. కాని మానవుడు సాంఘిక వ్యవస్థపై సమష్టి యాజమాన్యం వహించే రీతిలో సాంఘికశాస్త్ర విజ్ఞానాన్ని పీడకవర్గాలు పెంపొందించలేకపోయాయి. ప్రకృతి సంపదపై తమ వర్గాధిపత్యం కొనసాగించే దిశలోనే సాంఘిక శాస్త్రాలను పీడక వర్గాలు పరిమితం చేశాయి. సమాజాన్నిగూర్చి అనేక పరిశోధనలు జరిగిన మాట నిజమే. సాంఘికశాస్త్రజ్ఞులు చరిత్రలో అనేక వివరాలను సేకరించారు; సమన్వయించారు; వ్యాఖ్యానించారు; సైద్ధాంతిక వైధానిక సూత్రీకరణలు చేశారు. ఉదాహరణకు యుద్ధనివారణకు ఒక దేశ పాలకవర్గం మరొక దేశ పాలకవర్గంతో సమాన సత్తా ప్రాతిపదికను కలిగియుండాలని నిర్ధారణ చేశారు. ఇందుకు ఇరుగుపొరుగు ప్రభుత్వాలతో రాజీలు, ఒడంబడికలు కుదుర్చుకొనుటకు ఇరుదేశాలు ప్రయత్నిస్తాయని చెప్పారు. ఈ సత్తా సంతులన సిద్ధాంతం అన్ని పీడక వర్గాల ప్రాబల్యానికీ ఆధిపత్యానికీ అనుకూల మైనదే. కాని ఇలాంటి సిద్ధాంతాల్లో ప్రకృతిశాస్త్రాల వాస్తవ నిరూపణల్లోవలె, మానవుల వ్యవహారాలపైన, వాటి ఫలితాలపైన మానవుల ఆధిపత్యం నెలకొల్పాలన్న పునాది కనపడదు. వాస్తవ లక్ష్యాలకోసం మానవులంతా సహకారయుతంగా పథకాలు వేసుకొని వాటిని సమష్టిగా సాధించాలన్న దృష్టి ఉండదు.

పీడకవర్గాలు ఉత్పత్తిసాధనాలను పెంపొందించారు. ప్రకృతిపై మానవుని యాజమాన్యాన్ని నెలకొల్పే ప్రకృతిశాస్త్ర విజ్ఞానాన్ని పెంపొందించారు. కాని ఆ ఉత్పత్తి సాధనాలపై వర్గ యాజమాన్యాన్ని, తన్మూలక మైన వర్గ పీడనను కూడ పెంపొందించే వర్గ సంబంధాలను కూడ కొనసాగిస్తూ వచ్చారు. మానవులను వ్యక్తిగత యాజమాన్యానికి, సాంఘిక పీడనకు అధీనులుగా చేస్తూ వచ్చారు. ఈ పీడన కొనసాగుతున్నంత వరకూ మానవులు సాంఘిక వ్యవస్థకు యాజమాన్యంవహించి

సాంఘిక వ్యవహారాలను సహకారయుతంగా శాసించే అవకాశం యేర్పడదు. ఇదొక వైరుధ్యం. దీనికి కారణం సాంఘిక శాస్త్రవిలోకనలో పీడకవర్గ దృక్పథమే కాని భౌతికవాస్తవికతకాదు.

3. మూడవ భేదం: ఈనాడు పీడకవర్గాలు ప్రకృతి వ్యవస్థ యొక్క పై పై రూపాలనుకాక, ఆ వ్యవస్థయొక్క మూల పరిణామాలనూ, వాటి క్రమాలనూ చాలా సూక్ష్మంగా పరిశోధిస్తున్నారు. ఉదాహరణకు అణుశక్తి పరిశోధనలు, క్వాంటమ్‌థియరీ * మున్నగునవి. కాని సాంఘిక వ్యవస్థయొక్క మూల పరిణామాలనూ, వాటి కారణాలనూ మాత్రం పాలక వర్గాలు పరిశోధించలేకపోతున్నారు. అందువల్ల సాంఘికశాస్త్రం వెనుక బడిపోయింది.

సాంఘిక పరిణామాలకు కారణాలు, వాటి క్రమం ఉత్పత్తి సంబంధాలలో, ఆస్తి సంబంధాలలో, వర్గసంబంధాలలో ఉంటాయి. ఐతే, పీడకవర్గాల ఆధిక్యత అను పునాదిని కదిలించకుండా సాంఘికశాస్త్రి పరిశోధనలను ముందుకు సాగించటం దుస్తరం. పీడనవిధానంయొక్క పరిణామాలనూ, వైవిధ్యతలనూ మభ్యపెట్టుటకే పీడకవర్గాలు నిరంతరం ప్రయత్నంచేస్తాయి. కనుక, చరిత్రయొక్క పునరుజ్జీవనదశల్లో ఒకవేళ సాంఘిక శాస్త్రజ్ఞులు సమాజపు ఆర్థిక పునాదులను విస్తృతంగా పరిశీలించినప్పటికీ, వారి సిద్ధాంతాలు తిరిగి వర్గప్రయోజనాల అవరోధాలకులోనై స్థగితమైపోతాయి. ఉదాహరణకు బానిసవిధానంలోను, భూస్వామ్యంలోను పీడన హెచ్చని చెప్తారు. కాని పెట్టుబడిదారీ పీడన ఎలా అంత మౌతుందో చెప్పరు. ఈ ప్రశ్నను కప్పిపుచ్చుటకు అనేక మిధ్యాసిద్ధాంతాలను ప్రవేశపెడతారు. ఉదాహరణకు జాత్యహంకార సిద్ధాంతం. ఇందులో కొన్ని జాతులు దివ్యదత్త సహజాధిక్యత గలవిగా చరిత్రను నిర్మిస్తాయని భావింపబడుతుంది. పీడకవర్గ శాస్త్రజ్ఞులు స్వీయ ప్రయోజనాల దృక్ప

* క్వాంటమ్‌థియరీ అంటే పదార్థం శక్తిగామారే క్రమంలో లేక శక్తి పదార్థంగామారే క్రమంలో శక్తి "క్వాంటం"లలో కొలవబడుతుంది. ఒక క్వాంటంలోగల శక్తి, దాని వికిరణ (radiation) యొక్క వేగసూక్ష్మతను (frequency) బట్టియుంటుంది.

థంమూలంగా, సాంఘికార్థిక వ్యవస్థను వాస్తవికంగా విశ్లేషించి క్రమీక రించి విశదీకరించటంలో అనేక మిథ్యాప్రేరణలకులోనై వివిధ సైద్ధాంతిక భ్రాంతులను సృష్టిస్తారు.

4. నాల్గవ భేదం : ప్రకృతి శాస్త్రాలకంటె సాంఘిక శాస్త్రాలు వెనుకబడి యుండటానికి కారణం పీడకవర్గాల స్వీయప్రయోజన దృక్పథమే. సంప్రదాయ మూలకమైన స్వీయభావాలు ప్రకృతి శాస్త్రాభివృద్ధికి కూడ నిరోధాలైనవి. కాని, తుదకు పదార్థాల వాస్తవిక జ్ఞానం, ప్రకృతి వ్యవస్థయొక్క పరస్పర సంబంధాల జ్ఞానం ఆ నిరోధాల నధిగమించ గలిగింది. సాంఘికశాస్త్రాల విషయం ఆ విధంగా లేదు. ఆ సిద్ధాంతాల మూలసూత్రమే స్వీయోద్దేశాలచే నిర్ధరింపబడుతుంది. సమాజ వ్యవస్థ యొక్క వాస్తవచైతన్యానికి పీడకవర్గాల అస్తిత్వం మౌలికావరోధమై యుంది.

ఇలా, సాంఘిక చైతన్యానికి వర్గ స్థితి, వర్గ ప్రయోజనాలు ప్రతికూలం కనుకనూ, మానవుడు సాంఘిక వ్యవస్థపై యాజమాన్యం వహించేందుకు వర్గ (సాంఘిక) పీడన విరుద్ధమైనది కనుకనూ సాంఘిక శాస్త్రం సాంఘిక పరిణామంయొక్క పునాది సూత్రాలను గుర్తించుటకు వెనుదీస్తుంది కనుకనూ, సాంఘికశాస్త్ర సిద్ధాంతాలు వాస్తవిక పరిశోధనపై ఆధారపడక, వర్గ ఆధారపు భ్రాంతులకు, తప్పుచైతన్యానికి గురియై యుంటాయి. అంటే, పీడకవర్గాల చేతుల్లో సాంఘికశాస్త్రం వర్గ దృక్పథపు భ్రాంతులకు లోనై, సాంఘిక వాస్తవాలను ఆయా స్వీయభ్రాంతులకు అనుగుణ్యంగా వ్యాఖ్యానిస్తుంది. పాలకవర్గ ప్రయోజనాలకు అనుగుణ్యమైన రాజకీయ విధానాల ముసుగుతో వాస్తవాన్ని పాక్షికంగా సిద్ధాంతీకరిస్తుంది. ఉదాహరణకు చరిత్ర పరిణామంలో ఉత్పత్తి శక్తుల, సంబంధాల పాత్రనూ, అదనపు విలువ యొక్క పీడన క్రమాన్ని పెట్టుబడి దారీ విధానం నిరాకరిస్తుంది.

ఈ కారణా లన్నిటివల్ల సాంఘిక శాస్త్రం పీడకవర్గ ప్రతినిధుల ద్వారా యేనాటికీ ప్రకృతి శాస్త్రాల స్థాయిని అందుకోజాలదు.

*శాస్త్రం, దాని సాంఘిక ధర్మాలు*

శాస్త్రం యొక్క స్వభావాన్నీ, సాంఘిక జీవితంలో అది వహించే పాత్రనూ గురించిన కొన్ని నిర్ధారణలతో ఈ అధ్యాయాన్ని ముగిద్దాం.

1. పదార్థాలను గూర్చిన శాస్త్రీయ లేక మిథ్యా చైతన్యం ఆ పదార్థాలను గూర్చిన భావాలను, గుణీకరణలనుబట్టి యుంటుంది. శాస్త్రీయ భావాలు పదార్థాల సక్రియ ప్రతిచర్యలో రూపొందే భావాలపైన, వాటి క్రమబద్ధ సవిమర్శక వికాసంపైన, ఆచరణకు సంబంధించిన అనుభవంపైన ఆధారపడియుంటాయి. మిథ్యా చైతన్యం అలాకాక, సంప్రదాయ గతమైన పాతభావాల స్వీయ నిర్ధారణల మూలంగా ఏర్పడుతుంది.

2. ఐతే, శాస్త్రీయ చైతన్యమూ, మిథ్యా చైతన్యమూ దేనికదే విడిగా ఉండవు. ఈ రెండూ పరస్పర విరుద్ధతలే. కాని, అవి అన్యోన్య ప్రభావాలకు లోనౌతాయి. విరుద్ధతలమధ్య ఈ ఐక్యత సాంఘిక చైతన్యాభివృద్ధిలోకి ప్రసరించి సమాజాన్నీ, ప్రకృతినీ గూర్చిన భావాల నిర్మాణంలోను ప్రకృతి, సమాజాలలోని నిర్దిష్టపార్శ్వాల అవగాహనలోను పాత్ర వహిస్తాయి. అందువల్ల ప్రకృతికీ, సమాజానికీ చెందిన సిద్ధాంతాలు నిరంతర వైరుధ్యానికి గురియౌతాయి. ఈ వైరుధ్యంలో ప్రకృతిశాస్త్ర రంగంలో శాస్త్రీయ దృక్పథమూ, సాంఘికశాస్త్ర వికాసంలో మిథ్యా దృక్పథమూ ప్రధానంగా ప్రసరిస్తాయి.

3. శాస్త్ర పరిశోధనల ఫలితం సాంఘికాచరణతో ముడివడియుంటుంది. ఉత్పత్తి వ్యవహారం, వర్గ సంఘర్షణ ప్రకృతిశాస్త్ర, సాంఘికశాస్త్ర నూతన సత్యాన్వేషణలో ప్రధానపాత్ర వహిస్తాయి. జీవితంయొక్క ఆచరణాత్మక ఆవశ్యకతలచే శాస్త్రవికాసం నిర్ధరింపబడుతుంది. శాస్త్రం ఆ ఆచరణాత్మక ఆవశ్యకతలను నెరవేరుస్తూ, నూత్నాచరణకు సైద్ధాంతిక సాధనంగా దారిచూపుతుంది.

4. ఉత్పత్తిశక్తుల అభివృద్ధిలో శాస్త్రపరిశోధన అనివార్య పాత్ర వహిస్తుంది. మరియు ఉత్పత్తిశక్తుల అభివృద్ధి ఎంత ఉన్నతమైతే, శాస్త్రవిజ్ఞానం అంత అధికంగా అవసరమౌతుంది. ఉదాహరణకు, ప్రాచీన శిలాయుగంనాటి ఉత్పత్తి శక్తులలో విజ్ఞానశాస్త్రపు పాత్ర చాలా

తక్కువ. పిదప లోహపరిశ్రమలు, వ్యవసాయ కృషి వికసించి, విజ్ఞాన శాస్త్ర పాత్ర అభివృద్ధిజెందింది. ఈనాడు ఉత్పత్తిశక్తుల ప్రబలాభివృద్ధిలో విజ్ఞానశాస్త్రపు పాత్ర బ్రహ్మాండంగా పెరిగింది. కనుకనే ఈనాడు ఉత్పత్తిశక్తుల్లో సాంకేతికాభివృద్ధి రూపంగా విప్లవం కొనసాగుతూ ఉంది.

5. ఈ విధంగా విజ్ఞానశాస్త్రం ఉత్పత్తిశక్తుల అభివృద్ధిలో పాత్ర వహించి, సాంఘిక విప్లవశక్తిగా పెంపొందింది. విజ్ఞానశాస్త్రం ఉత్పత్తి శక్తుల అపారాభివృద్ధిలో కీలకపాత్రవహించి, ఆ అభివృద్ధి ఉత్పత్తి సంబంధాలను సవాలు చేయగా, విజ్ఞానశాస్త్రం మొత్తం సాంఘిక వ్యవస్థలోనే విప్లవాన్ని వాంఛిస్తుంది. ఉదాహరణకు ఆవిరియంత్రం, విద్యుచ్ఛక్తి, అణు పరిశోధనలు. అణుపరిశోధన లీనాడు అపూర్వమైన అణుశక్తి వినియోగానికి దార్లు వేశాయి. బ్రహ్మాండమైన అణుశక్తిని సాంఘిక వినియోగానికి కొనితెచ్చే కర్తవ్యాన్ని వ్యక్తి యాజమాన్య వ్యవస్థ నిర్వహించలేదు. అణుఉత్పత్తి సాధనాలు సాంఘిక యాజమాన్య విధానపు (సామ్యవాదపు) అనివార్యతను నిరూపిస్తున్నాయి.

6. విజ్ఞానశాస్త్రం వర్గ సంఘర్షణలో పాత్ర వహిస్తుంది. ప్రకృతి శాస్త్రాలు ఈ పాత్రను అనుషంగికంగాను. సాంఘికశాస్త్రం నేరుగాను నిర్వహిస్తాయి.

ప్రకృతి శాస్త్రాల సాంఘికలక్షణం ఉత్పత్తికి వినియోగపడటం. అలా వినియోగపడటంలో ఉత్పత్తిశక్తుల అభివృద్ధి వర్గ సంఘర్షణకు దారితీస్తుంది. నిర్దిష్టశాస్త్ర విజయాలు, సాంకేతికాభివృద్ధి, నిర్దిష్టవర్గాల ఆధిపత్యానికి ఉపకరిస్తాయి. ఉదాహరణకు ఆధునిక విజ్ఞానశాస్త్ర విజయాలు పారిశ్రామిక విప్లవంద్వారా బూర్జువావర్గంతన సంపదను పెంపొందించుకొనుటకు, సమాజంలో ప్రాబల్యం చేకూర్చు కొనుటకు సహాయపడ్డాయి. సైద్ధాంతికంగా భూస్వామ్య సిద్ధాంతాలను ఓడించి వేయుటకు కూడ అవి సాధనాలైనవి. తద్వారా బూర్జువావర్గ పరిపాలన ఏర్పడుటకు, ఆ వర్గ ఆధిపత్యాన్ని విస్తృతం చేయుటకు విజ్ఞానశాస్త్ర వికాసం ఉపకరించింది. ఈనాడుకూడ అవి గుత్త పెట్టుబడిదారీ విధానా

నికి తోడ్పడుతూనే ఉన్నాయి. కాని అదే విజ్ఞానాభివృద్ధి వలన దేశాల విమోచనకూ, కార్మికవర్గ మహోద్యమానికి కూడ సాధన మౌతూంది. ఆ లక్ష్య సాధనలో విజయం సాధించిన సామ్యవాదదేశాల్లో విజ్ఞాన శాస్త్రం వర్గరహిత సమాజ వ్యవస్థకు సాధనమైంది. వర్గ యాజమాన్య పరిమితులను అధిగమించిందికూడ. ప్రకృతిశాస్త్రాల స్థితి ఈనాడీ విధంగా ఉంది.

సాంఘిక శాస్త్రపరిశోధనలు వర్గపోరాటానికి పై విధంగా అనుషంగికంగా కాక నేరుగా ఉపకరిస్తాయి. ఆ పరిశోధనల అభివృద్ధికి వర్గపోరాటం ప్రేరణనిస్తుందికూడా. పీడకవర్గాలు స్వీయప్రయోజనాల మూలంగా సాంఘిక శాస్త్రంలో విభిన్న సాంప్రదాయిక స్వీయభావ ధోరణులను, భ్రాంతులను పెంపొందిస్తారు. ప్రకృతి శాస్త్రాల్లోకంటె సాంఘికశాస్త్రంలో ఈ భ్రాంతులను అధికంగా ప్రాకిస్తారు. విభిన్న సాంఘిక వ్యవస్థల ప్రభుత్వాల తులనాత్మక పరిశీలన, విభిన్న సాంఘిక విధానాల విశ్లేషణ, ఆర్థిక విధానాల పరిశోధన మున్నగు కర్తవ్యాలను పీడకవర్గాలు కొనసాగిస్తాయి. ఐతే, ఈ కృషియంతా ఆ యా వర్గాలు తమ వ్యవహారాన్ని నిర్దిష్ట పద్ధతుల్లో కొనసాగించుటకూ, అధికారాన్ని సాధించి పెంపొందించుకొనుటకూ, ప్రత్యర్థివర్గాలతోడి సంఘర్షణలో తమ వర్గసిద్ధాంతాలను నిర్మాణం చేసుకొనుటకూ అనుగుణ్యంగా జరుగుతుంది.

సాంఘిక శాస్త్రం వర్గసమాజంలో పై విధంగా పాత్రవహిస్తుంది. కాని కార్మికవర్గం సామ్యవాదంకొరకు జరిపే పోరాటంలో సాంఘిక శాస్త్రం తొలిసారిగా గుణాత్మక పరిణామానికిలోనై, వర్గరహిత సమాజ నిర్మాణానికి సాధనమవుతుంది. ప్రకృతిశాస్త్రాల సార్వజనీన స్థాయికి చేరుకొని సమాజాన్ని మౌలికంగా మార్చివేసేందుకు సాధనమౌతుంది.

విజ్ఞానశాస్త్రంయొక్క ప్రధాన సాంఘిక లక్షణం అది సాంఘికాచరణలో వహించే పాత్రనుబట్టి వ్యక్తమౌతుంది. మానవులు ప్రకృతి ధర్మాలను కనుగొనుటకు శాస్త్రీయ పరిశోధనలు జరపటంద్వారాను, తాము కనుగొన్న అంశాలనుబట్టి సామాన్య సూత్రాలను రూపొందించు

కొనడంద్వారాను ఉత్పత్తిశక్తులను అభివృద్ధి చేసుకుంటారు. తోడ్తో తమ సాంఘికవ్యవహారాలన్నీ వ్యక్తిగత, సాంఘిక బాధ్యతలను ఉత్పత్తి శక్తుల అభివృద్ధి కనుగుణ్యంగా, ఉత్పత్తి సంబంధాలకు అనుగుణ్యంగా కొనసాగిస్తారు ఈ విధంగా శాస్త్రాభివృద్ధి మానవజీవిత వికాసానికీ, ప్రకృతిపై మానవుని యాజమాన్యానికీ, సాంఘికోత్పత్తి పెరుగుదలకూ, మానవ వ్యవహారాల సక్రమ నిర్వహణకూ సాధనమౌతుంది.

ఇటీవల మార్క్సిస్టుసిద్ధాంత చర్చలలో శాస్త్రాభివృద్ధి ఉపరి నిర్మాణంలో అంతర్భాగంగా కొనసాగుతుందా ? లేక స్వతంత్రంగానా ? అన్న సమస్యను కొందరు లేవనెత్తారు. ఈ సమస్యను మనం ఇటో, అటో తేల్చటంగా కాక, రెండు విధాలుగా చూడవలసియుంటుంది.

ఒకటి : వర్గసిద్ధాంతభావాలు శాస్త్రంలోకి ప్రసరిస్తాయి. కనుక విజ్ఞానశాస్త్రం తన సైద్ధాంతిక పార్శ్వంలో ఉపరినిర్మాణపు ప్రభావాన్ని కలిగియుంటుంది. ఉపరి నిర్మాణంచే నిర్ధారితమయ్యే భావాలు ప్రచలిత వర్గ సంబంధాలనుండి రూపొంది ఆ సంబంధాల కనుగుణ్యంగా కొన సాగుతాయి. ఆర్థిక పునాది మారిపోవటంతో అవి అడుగున పడి పోతాయి. కనుక ఆయా సాంఘిక పరిణామ దశల్లో యేర్పడే వైరుధ్యాల స్వరూపాన్ని మనం ఆయా వర్గ సిద్ధాంతాల పాత్రద్వారా పోల్చు కుంటాం. రెండు : కాని శాస్త్రపరిశోధనల స్వభావం ఆర్థిక పునాదిచే నిర్ధారితం కాదు. శాస్త్ర పరిశోధనలు ఉత్పత్తియొక్క అవసరాలకు, ఆ ఉత్పత్తివలన ఏర్పడే సాంఘిక సంబంధాలకు నేరుగా చెందుతూనే, భౌతిక వాస్తవిక సత్యాలను ప్రతిబింబిస్తాయి. ఆర్థిక పునాది మారిపోయి నప్పటికీ అవి నిల్చియుంటాయి. అన్ని సాంఘిక విధానాల్లోను అవి సమంగానే ఉపకరిస్తాయి.

ఉదాహరణకు అణు పరిశోధనలు. ఈనాడు శాస్త్ర వేత్తలు అణువును ఛేదించ గల్గుతున్నారు. ఈ అణుపరిశోధనల్లో వారు పదార్థపు అత్యంత సూక్ష్మమైన గతి సూత్రాలను కనుగొని వినియోగిస్తున్నారు. కాని ఈ అణుశక్తి సిద్ధాంతాలు పెట్టుబడిదారీ ఆర్థిక పునాదిచే నిర్ధారిత మైనవేనా ? కాదు. అవి వాస్తవికమైనవి. కాని కొందరు అణు పరిశోధన

లను భావవాద కార్యకారణవాదంతో ముడిపెట్టి, భౌతిక కారణానికి అతీతంగానే భౌతికకార్యం సాధ్యమని వాదనలు లేవదీస్తున్నారు. కారణం అసలే దురూహ్యమని వీరి ఉద్దేశమన్నమాట. అంటే భౌతిక ప్రపంచానికి అజ్ఞేయుడైన దేవుడెలా కారణమో, అలాగే అణుశక్తి అద్భుతానికి దివ్య (అజ్ఞేయ) శక్తి కారణమని వీరి భావమన్న మాట. ఈ భావన ఉపరి నిర్మాణ మూలకమైనదే. కనుక అణుసిద్ధాంతం ఆర్థిక పునాదినీ, దాని ఉపరినిర్మాణాన్నీ ఆశ్రయించదు. కాని ఆ సిద్ధాంతపు అవగాహనల్లో, భాష్యాల్లో మాత్రం వర్గస్థితి మూలకమైన స్వీయ భావవాద ధోరణులు కొనసాగుతవి

అందువల్ల విజ్ఞానశాస్త్రం ఉపరినిర్మాణంగా పెంపొందుతుందని చెప్పవీలులేదు. కాని ఉపరినిర్మాణానికి చెందే స్వీయభావాలు శాస్త్రాభివృద్ధిలోకి ప్రసరిస్తాయి; ప్రభావం వేస్తాయికూడ. స్వీయ (వర్గ) భావాలు శాస్త్రపరిశోధనలకు సిద్ధాంతాలకు అనుకూలతనో, ప్రతికూలతనో ప్రదర్శిస్తాయి. ఈ విధంగా సాంఘిక వ్యవస్థలోని వర్గసంబంధాలపునాది శాస్త్రాభివృద్ధికి అనుకూలమైన లేక ప్రతికూలమైన పాత్రనిర్వహించవచ్చు.

సాంఘికశాస్త్ర సూత్రాలలో, వాటి వికాసంలో విజ్ఞానశాస్త్రం ప్రబలమైన పాత్రవహిస్తుందని మనమిదివరకే గమనించాం. శాస్త్రీయాభిప్రాయాలు, శాస్త్రపరిశోధనలు సిద్ధాంతరంగంలోకి ప్రసరిస్తాయి. కనుక సిద్ధాంతాభివృద్ధిలో విజ్ఞానశాస్త్రం ప్రబల ప్రేరణ ఔతుంది. కాని ఈ ప్రేరణ సిద్ధాంతరంగంలో వాస్తవిక జ్ఞానానికీ, భ్రాంతికీకూడ దారి తీయవచ్చు. ఎలాగైనా శాస్త్రాభివృద్ధియొక్క స్థాయి పెరుగుతున్నకొద్దీ సిద్ధాంతరంగంలో విజ్ఞానశాస్త్రపు పాత్ర అధికంగా వ్యక్తమౌతుంది.

ఉదాహరణకు పరిణామవాదం, సెల్లు సిద్ధాంతం, శక్తి పరివర్తన సూత్రం, అణుసిద్ధాంతం మున్నగు ఆధునిక పరిశోధనలు నేటి సాంఘిక సిద్ధాంతాల్లో నూతన శాస్త్రీయభావాలను ప్రవేశపెట్టినవి. ఈ నూతన భావాలు బూర్జువా సిద్ధాంతరంగంలోకి ప్రసరించాయి. ఈ నూతన శాస్త్రీయభావాలూ భాష్యాలలో బూర్జువావర్గం తన ప్రయోజనాలకు అను

గుణ్యమైన స్వీయధోరణులను ప్రవేశపెడుతూన్నప్పటికీ సిద్ధాంతాలు నూతనశాస్త్రీ సత్యాల ప్రభావానికి లోనౌతూనే ఉన్నాయి. ఎలాగ ?

సిద్ధాంత పరిణామంలో విజ్ఞానశాస్త్రం విమర్శక పాత్ర నిర్వహిస్తుంది. నూతన శాస్త్రీయభావాలు సాంప్రదాయికమైన పాతభావాలను సవాలుచేసి, వాటి స్వీయధోరణులను ఖండిస్తాయి. కనుక, పాత పాలకవర్గ అధిపత్యాన్ని సవాలుచేసే నూతన వర్గ శక్తులు ఉదయించినప్పుడు, నూతన వాస్తవిక భావాలు పాతనమ్మకాల అవాస్తవికతను సవాలుచేస్తున్నప్పుడు విజ్ఞానశాస్త్ర పరిశోధనలు, వాటి నిర్ణయాలు సాంఘిక విప్లవానికి విమర్శాత్మక సాధనాలుగా వినియుక్తమౌతాయి.

ఈ విధంగా విజ్ఞానశాస్త్రం సాంఘిక చరిత్రలో పురోగామిపాత్ర వహిస్తుంది. మానవులు తమ అవసరాలను నెరవేర్చుకొనే సాముదాయిక శక్తినీ, వైజ్ఞానిక ప్రగతినీ శాస్త్రపరిశోధనలు పెంపొందిస్తాయి. అవి సిద్ధాంతరంగంలో గుడ్డినమ్మకాలనూ, భ్రాంతులనూ నిర్మూలించి ప్రకృతినీ సమాజాన్నీ గూర్చిన నూతన విలోకనను రూపొందిస్తాయి. సాంఘిక విప్లవంలో ప్రబల సాధనాలుగా వినియుక్తమౌతాయి.

చరిత్రలో కొన్ని వర్గాలు, కొన్ని జాతులు శాస్త్రవికాసంలో అగ్రగామి పాత్ర వహించాయి. ఐతే ఆ వర్గాలు, జాతులు తమ శాస్త్రవిజయాల సమన్వయంలో, సిద్ధాంతీకరణలో కొన్ని స్వీయపరిమితులను విధించాయి. ఉదాహరణకు, ఆంగ్ల సామ్రాజ్యవాదుల "రంగు జాత్యాధిక్యత." వీరు ఆఫ్రికాలో నేడుకూడ "నల్ల" జాతులనే పేరుతో నీగ్రోలపై దారుణ హింసలు సాగిస్తున్నారు. అందుకని జాత్యాధిక్యతను నిరూపించే స్వీయధోరణులను తమ జీవశాస్త్ర పరిశోధనల్లో ప్రవేశపెడుతున్నారు.

సామ్రాజ్యవాదులు శాస్త్ర విజ్ఞానాన్ని తమగుప్పిటపెట్టుకొని, వలస దేశాల్లో తమ ఆధిపత్యాన్ని కొనసాగించుటకు అనేక స్వార్థ సంకుచిత విధానాలను అవలంబించారు. వారు ఆలోచనారంగంలో, సాంఘిక సిద్ధాంతాల సూత్రీకరణల్లో యెన్నో స్వీయ ధోరణులు, అవరోధాలు, తికమకలు, ఒడుదొడుకులు కల్పించారు. ఐనా, ఇతర వర్గాలు, ఇతర జాతులు కూడ శాస్త్ర విజ్ఞానవాస్తవాలను క్రమంగా గుర్తించాయి. కర్మాగారాలు కార్మి

కుల్లోను. జాతీయపెట్టుబడులు వలస దేశాల్లోను జాగృతిని కల్గించాయి. అందువల్ల అన్నివర్గాలూ, జాతులు కూడ శాస్త్రపరిశోధనల ఫలితాలను చైతన్యయుతంగా వినియోగించే సార్వజనీనక్రమం కొనసాగినది. ఇలా శాస్త్రాభివృద్ధి ఏవర్గాధిపత్యంలో, ఏ దేశంలో, ఏజాతి అధికారంలో కొనసాగినా క్రమంగా అందరు మానవులకూ అన్నిదేశాలకు కూడ వినియోగపడే సార్వజనీన స్వభావాన్ని కల్గియుంటుంది.

ముందు ఒక దేశం శాస్త్రీయంగా, సాంఘికంగా పురోగమిస్తుంది. ఐతే, ఆ దేశపు శాస్త్రాభివృద్ధి, సాంఘికాభివృద్ధి ఇతర దేశాలకు కూడ సంక్రమిస్తుంది. ఇలా శాస్త్రీయ వాస్తవపు సార్వజనీనత నిరూపణౌతుంది. కనుక విజ్ఞానశాస్త్ర చరిత్ర మానవ చైతన్యాభివృద్ధి చరిత్రయే. మానవ శక్తియొక్క అభివృద్ధి చరిత్రయే. అది ప్రకృతిపైన, సమాజం పైన మానవుని ఆధిపత్యాన్ని నెలకొల్పుటకు సాధనంగా, సాంఘికపురోగమనానికి వారసత్వంగా వినియుక్తమౌతుంది.

## 9 వ అధ్యాయం

# విజ్ఞానశాస్త్రం, సామ్యవాదం

పెట్టుబడిదారీవర్గం విజ్ఞానశాస్త్రంలో అపారోన్నతిని చేకూర్చి నప్పటికీ, వారి వర్గ సంబంధాలు శాస్త్రాభివృద్ధికి గుదిబండలుగా ఉన్నాయి. సామ్యవాద సమాజంలో ఈ వర్గపరిమితులు నివారింప బడతాయి. విజ్ఞానశాస్త్రం పురోగమిస్తుంది. సామ్యవాదం కొరకు కార్మికవర్గం జరిపే పోరాటం సాంఘిక శాస్త్రాన్ని రూఢమొనర్చు తుంది. సామ్యవాద సమాజంలో పాత సిద్ధాంత భ్రాంతులు తమ పునాదిని కోల్పోయి, సార్వజనీన శాస్త్ర దృక్పథం అమల్లోకి వస్తుంది.

*బూర్జువా శాస్త్ర విజ్ఞానం సాధించిన విజయాలు :*

**ఆ**ధునిక పెట్టుబడిదారీ యుగావతరణకు పూర్వంవిజ్ఞానశాస్త్రాలు చాలా ప్రాథమిక స్థితిలో పదార్థాల వివరణ, వర్గీకరణవరకే పరిమితమై యుండేవి. విభిన్నరంగాల్లో శాస్త్ర పరిశోధనలు ఆయా పదార్థాలను (శాఖలు) నిర్దిష్ట సూత్రాలను దేనికదేగా విడిగా పరిశీలిస్తూ ఉండేవి. ఆయుర్వేదం ఓషధులను, వాస్తుశాస్త్రం శిల్పాన్ని, జీవశాస్త్రం జంతు జాలాన్ని చర్చించాయి. కాని ఆయా శాస్త్ర పరిశోధన లన్నిటి మూల సూత్రాలు, సామాన్య సూత్రాలు యావత్తు ప్రకృతికి సర్వసామాన్యంగా సమన్వయిస్తాయని మధ్యయుగ శాస్త్రవేత్తలు స్పష్టంగా గుర్తించలేదు. కనుక ఆ రోజుల్లో శాస్త్రపరిశోధనలు వివరణల, వర్గీకరణల వరకే పరి మితమై వాటి సిద్ధాంతభాగం (గుణీకరణ–సామాన్యీకరణ)కేవల తర్కం లేక ఊహాగానంపై ఆధారపడేది. కనుక ఆ దశలో ప్రకృతియొక్క సర్వ

సామాన్య సిద్ధాంతం కేవలం తత్వశాస్త్రానికి, లేక మతానికి చెందినదిగా ఉంటూ అనేక భ్రాంతులతో కొనసాగేది.

ఆ రోజుల్లో విజ్ఞానశాస్త్రం ప్రకృతిని గూర్చిన ఆదిమయుగ భావాలకు లోనై యుండేది. మధ్యయుగంలో రసవాదులు అనేక పదార్థాలను, మిశ్రమాలను, సంయోగాలను పరిశోధించినప్పటికీ రసాయనశాస్త్రం మాత్రం ఆదిమయుగభావాలకు లోబడియున్నదే. ఉదాహరణకు రసాయనిక పదార్థాలు జడ చేతనధర్మాలు కలవనీ, వాటిల్లో పదార్థాంశా, ఆత్మఅంశా రెండూ కలవన్న నమ్మకం; ఓషధులనుగూర్చి వారాలు, వర్జ్యాలు, జపాలుకూడ ప్రభావం వేస్తాయన్న నమ్మకం ఆయుర్వేదంలో ప్రబలంగా కొనసాగింది. అలాగే జ్యోతిష శాస్త్రంలో ఆయా గ్రహాల గమనం ఆయా జాతకాలపై ప్రభావం వేస్తుందన్న సంప్రదాయం. ఇలా ఖగోళశాస్త్రం, ఆయుర్వేదం మున్నగు శాస్త్రాల్లో అనేక మత విశ్వాసాలూ, తాత్విక భ్రాంతులూ వ్యాప్తమైనాయి.

మధ్య యుగంనాటికి విజ్ఞానశాస్త్రాలు సర్వసామాన్యంగా తాత్విక, మత భావాలచే ఆవరింపబడి యుండేవి. ప్రకృతి పదార్థాలనుగూర్చి తప్పు భావాలు, తప్పు సిద్ధాంతాలు కొనసాగటంలో ఆర్థికాభివృద్ధియొక్క హీన స్థాయికూడ పాత్ర వహించింది. కాని, తుదకు మతసంప్రదాయవాదాలు విజ్ఞానశాస్త్రాభివృద్ధిని అరికట్టలేకపోయాయి. మత సంప్రదాయాలు, విశ్వాసాలు శాస్త్రాభివృద్ధికి గుదిబండలుగా ఉండేవి. ఆ గుదిబండలను తొలగించడంద్వారా ఆధునిక శాస్త్రాభివృద్ధి, ఆర్థికాభివృద్ధి ముందుకు సాగాయి.

భూస్వామ్య "ఔన్నత్య" భావం బ్రద్దలౌతూ, దాని స్థానంలో బూర్జువావర్గం రూపొందుతున్న సమయంలో, యూరపుఖండంలో ఆధునిక ప్రకృతిశాస్త్రం ఉద్గమనం చేసింది. "ఆధునిక ప్రకృతిశాస్త్రం విప్లవోద్యమంలో, విప్లవ సాధనంగా పెంపొందింది"దని ఎంగెల్స్ వ్రాశాడు. ఐతే, ఏ వర్గ శక్తులు సాంఘిక విప్లవాన్ని కొనసాగించాయో, అవే శాస్త్రాభివృద్ధిని కూడ సాధించాయి. విజ్ఞానశాస్త్రం బ్రహ్మాండమైన చైతన్యశక్తిగా

అంధ విశ్వాసాలనూ, ఛాందసాలనూ నిర్మూలించింది. ప్రయోగాత్మకమైన సూక్ష్మపరిశోధనలద్వారా శాస్త్రం పాత సిద్ధాంతాలను సవాలు చేసింది. ఆధునిక విజ్ఞానానికి పునాదులు వేసిన శాస్త్రజ్ఞులు భూస్వామ్యయుగంనాటి మతాచార్యులు, సన్యాసులు కారు. శాస్త్రజ్ఞులు క్రియాశీలురుగా పరిశ్రమల. వాణిజ్య వర్తకాల, నూతన సాంకేతిక విధానాల నిర్మాతలుగా పాత్ర వహించారు. వారి చేతుల్లో శాస్త్రపరిశోధనలు మానవజీవిత పరిస్థితులను పురోగమింపజేసే సాధనాలుగా పనిచేశాయి. ఇలా నూత్న పారిశ్రామికాభివృద్ధికి అనుగుణ్యంగా నూతన విజ్ఞానాభివృద్ధి కొనసాగింది.

"మధ్యయుగ మత యుద్ధాల అనంతరం పరిశ్రమలు పెంపొందసాగాయి. నేత, గడియారాలతయారీ. పిండిమరలు మొదలైన యాంత్రికములు, అద్దకం, లోహసామాగ్రి, సారాయాలు మొదలైన రసాయనికములు, కటకములు (Lenses) మున్నగు భౌతికములు వికసించి నూతన పరిశోధనలకు, నూతన పరికరాల నిర్మాణానికి దారితీశాయి. ఈ విధంగా ప్రాయోగిక శాస్త్రవికాసం తొలిసారి ఆవిష్కారణైంది." — ఎంగెల్స్.

ఇలా ప్రారంభమైన ఆధునిక ప్రకృతిశాస్త్ర వికాసంలో శాస్త్రీయ సామాన్యత తర్కంద్వారా కాక ఊహానిర్ధారణల ఆధారంపై కాక, ప్రయోగశాలల నిరూపణలపై ఆధారపడింది. శాస్త్రం పదార్థసామాన్యతను తత్వశాస్త్ర, మతచర్చలద్వారా నిరూపించే ఛాందసత్వ పరిమితిని అధిగమించింది. విజ్ఞానశాస్త్రకృషి నిర్దిష్టమైన పరిశోధనకూ, సంయోజిత ప్రయోగాలకూ అనుగుణ్యంగా మారింది. శాస్త్రసిద్ధాంతాలను ప్రయోగశాలల అనుభవాలద్వారా నిరూపించి సాంఘికోత్పత్తిరంగంలో వినియోగపరచే విధానం అమలుకువచ్చింది. ఈ విధంగా, ఆధునికశాస్త్ర పరిశోధనలు సాంఘికోత్పత్తిలో సాంకేతికస్థాయిని పెంపుజేశాయి; విజ్ఞానశాస్త్రాన్ని ప్రబలసాంఘికోత్పత్తి శక్తిగా వినియోగించుకొనే ఆవశ్యకతపై ముందుకు సాగాయి. ఈ నూతన గమ్యంతో బూర్జువా ప్రకృతిశాస్త్రం బ్రహ్మాండమైన విజయాలను సాధించింది. ఆ విజయాలివి :

1. విభిన్న ప్రకృతిశాస్త్రాల క్రమాభివృద్ధి ముందుకు సాగింది. ఒక్కొక్క శాస్త్రంనుండి మరొక శాస్త్రం చొప్పున విభిన్నశాస్త్రాలు తమ తమ వికాసాన్ని చేకూర్చుకున్నాయి. ఒక శాస్త్రవిజయం మరొక శాస్త్రాభివృద్ధిలోకి సంక్రమించింది. ఈ క్రమంలో పెట్టుబడిదారీ ఉత్పత్తి శక్తుల వికాసం శాస్త్రవిజయాల పరంపరకు రూపుదీర్చింది. పారిశ్రామికరంగంలో నిరంతరం నూతన సమస్యలు రూపొందుతూ వాటి పరిష్కారాని కవసరమైన నూతన సాంకేతికసాధనాల ఆవిష్కరణకు అవకాశం కలిగించింది.

2. విభిన్న శాస్త్రరంగాలలో పదార్థ విశ్లేషణ పెంపొందింది. ప్రకృతి వ్యవస్థలోని విభిన్నభాగాల లేక మూలపదార్థాల పరిశీలన కొనసాగింది. పదార్థ ధర్మాల పరిశోధన, మూలపదార్థాల పరిశీలన కూడ కొనసాగింది. విభిన్న సంయోగాలలో ఆయా పదార్థాల చలన ధర్మాల పరిశీలన ప్రాముఖ్యత పొందింది. తుదకు చలన క్రమసూత్రాల పరిశోధన రూపుదీర్చుకున్నది. ఈ విధంగా ప్రకృతి విశ్లేషణతో బాటు పదార్థాల విభిన్న ధర్మాలకూ, పరిణామాలకూ, కారణమైన సామాన్య చలనసూత్రాల నిరూపణ ప్రాధాన్యత జెంది శాస్త్రీయ దృక్పథం సామాన్యాంగీకృతి పొందింది.

3. ఆధునిక ప్రకృతిశాస్త్ర ప్రధాన విజయం ప్రకృతియొక్క పరిణామ ధర్మాల పరిశోధనలు. ఆధునిక ప్రకృతి శాస్త్రపు తొలిదశలో ప్రకృతిలోని విభిన్న పదార్థాలు విభిన్న పరిణామాలకు, మార్పులకులోనైనప్పటికీ ప్రకృతిమాత్రం యెప్పుడూ ఒకేరీతిగా ఉంటుందనీ, మారదనీ భావించేవారు. ఖగోళగతుల విషయంలో మొదట ఎలాగో (బాహ్య కారణంవల్ల) అద్భుతావహంగా ప్రారంభమైన గ్రహచలనాలు ఆయా కక్ష్యలలో అలాగే శాశ్వతకాలం కొనసాగుతుంటాయనీ. నక్షత్రాలు చలనానికి అతీతములనీ, అలాగే చలనం ఉన్నప్పటికీ భూగోళం యే మార్పు లేకుండా ఒకే రీతిగా ఉంటుందనీ, అందలి సముద్రాలు, భూఖండాలు, పర్వతాలు, నదులు మార్పులేనివనీ, అదేవిధంగా జంతుజాలమూ, వృక్షాలూ వాటివాటి నిర్దిష్టలక్షణాలతో దేనికదేగా, ఆయారీతుల్లో పరిణ

మిస్తాయనీ వాదనలు కొనసాగాయి. ఆ దశలో ప్రకృతియొక్క పరిణామాన్నీ, తన్మూలకమైన అభివృద్ధినీ వారు గ్రహించలేదు. కాని తర్వాతి శాస్త్రవికాసం, ఖగోళశాస్త్ర, భౌతికశాస్త్ర, జీవశాస్త్ర, భూగర్భశాస్త్ర పరిశోధనలు, ప్రకృతియొక్క అచలభావాన్ని ఖండించి, సామాన్య చలనాన్నీ, అభివృద్ధిక్రమాన్నీ నిరూపించాయి. ఉదాహరణకు పదార్థపు జీవక్రమం, అంగజీవి పరిణామాభివృద్ధి, మానవ మేధోవికసన మొదలైన శాస్త్ర నిరూపణలు. ఐతే, చలనసూత్రాల ఈ నూతన విలోకన మధ్యయుగంలో వలె తర్కవాదం లేక ఊహాగాన ఆధారంపై యేర్పడలేదు. ప్రకృతియొక్క అనేక క్రమాల సూక్ష్మ పరిశోధన ద్వారా అనేక ప్రాకృతిక సంబంధాల, క్రమాల పరిశోధన ద్వారా నిరూపితమైంది.

4. వివిధ ప్రకృతిశాస్త్ర పరిశోధనల ఫలితంగా ప్రకృతినిగూర్చిన సామాన్య విజ్ఞానం పెంపొందింది. ప్రకృతి స్వభావంలో, సంబంధాలలో కొనసాగే క్రమాలు సామాన్యత గాను, విభిన్న పదార్థాల నిర్దిష్ట ధర్మాల సంబంధాలక్రమం నిర్దిష్టతగాను కనుగొనబడ్డాయి. ఈ సామాన్యతను, నిర్దిష్టతనుగూర్చిన చైతన్యం ఆయాశాస్త్రాల పరిశోధనలో, వివరణలో వినియుక్తమైంది.

దీన్నే ఎంగెల్స్ ఇలా పేర్కొన్నాడు :

> "ప్రకృతి క్రమాలను ఆయా శాస్త్రరంగాలలో విడివిడిగా మాత్రమేకాక ఆయా శాస్త్రాల పరస్పర సంబంధాల (సమన్వయం) ద్వారా నిరూపించే దశకు మనం చేరుకున్నాం. కనుక ప్రకృతిలోని పరస్పర సంబంధాన్ని ప్రకృతి శాస్త్రానుభవాలద్వారా క్రమబద్ధంగాను, వివరంగాను నిరూపించగలం."

ఈ విధంగా ప్రకృతిశాస్త్ర విజ్ఞానం పదార్థాన్నిగూర్చిన తార్కిక, తాత్విక ఊహాగానాల పద్ధతిని అధిగమించింది. అంటే నిర్దిష్ట వస్తుక్రమాలు వాటి సామాన్య సంబంధాలు ప్రయోగశాలల్లోని పరిశీలనాత్మక నిరూపణల పైనేకాని కేవల తర్కవాదంపై ఆధారపడవని గుర్తింపబడిందన్నమాట.

మధ్యయుగంలో ప్రకృతి నిరూపణలు ఊహాగానంపై, తార్కిక అనుమానంపై కొనసాగాయి. పదార్థ వాస్తవాలకు, ఆ వాస్తవాల సంబంధాలకు బదులు సాంప్రదాయిక ఇష్టానిష్టాలు, భావాలు అనుసరింపబడ్డాయి. ప్రకృతినిగూర్చి తమకు తెలిసిన వాస్తవాలనూ, తెలియని ఊహాలనూ మధ్యయుగ తాత్వికులు తర్కంతో జతకూర్చారు. ఉదాహరణకు గ్రహగతులు. ఇవి వారికి తెలుసు. కాని మానవుని జాతకంపై వీటి ప్రభావ ముంటుందనీ, అది జీవితంలోని కష్టసుఖాలకు కారణమనీ చెప్పే అదృష్టకర్మవాదం. ఇది కేవలం ఊహాగానమే. ఐతే జీవితంలోని హెచ్చు తగ్గులనూ, వర్ణవర్గ విభేదాలనూ నాటి శాస్త్రజ్ఞులు గ్రహగతులతో ముడి పెట్టారు. ఇలా జ్యోతిష శాస్త్రం వాస్తవ విజ్ఞాన వికాసానికి అవరోధమైన మూఢనమ్మకాలను బలపరచి, నాటి హెచ్చుతగ్గులను సమర్థించింది.

విజ్ఞానశాస్త్రరంగంలో మనకు తెలియని అంశాలెన్నో ఉంటాయి. ఆ తెలియని అంశాలను మన ఊహాగానాలతో పూరించుకొనటంవల్ల విజ్ఞాన పరిమితులు తొలగిపోవు. కొత్త విషయాలు తెలియటంతో, పాత ఊహాగానాల స్థానే కొత్త ఊహాగానా లేర్పడుతుంటాయి. ఐతే, 19 వ శతాబ్ది మధ్యకాలంనాటికి పెంపొందిన శాస్త్ర సంచయస్థాయి ఈ ఊహాగాన పద్ధతిని సవాలు చేసింది. ప్రకృతి పరిణామాన్ని మానసిక అనుమానంద్వారా, లేక తర్కం ఆధారంపై మాత్రమే వివరించే పాత విధానాన్ని శాస్త్రీయ విజ్ఞానం మార్చివేసింది. వాస్తవిక విజ్ఞానాభివృద్ధి కేవలం శాస్త్రీయ పరిశోధనల ఆధారంపై మాత్రమే చేకూరగలదన్న చైతన్యం రూఢమైంది. ఈ విధంగా విజ్ఞానశాస్త్రం తన మధ్యయుగ తాత్వికాధీనతను అధిగమించి, నూతన శాస్త్రీయదృక్పథాన్ని స్వీకరించింది.

*పెట్టుబడిదారీ విజ్ఞానశాస్త్ర పరిమితులు*

పెట్టుబడిదారీ విధానంలో వ్యక్తిగత కుటీర పరిశ్రమలు యంత్ర పరిశ్రమలుగా మారాయి. ఈ దశలో ఉత్పత్తిశక్తుల, ఆధునిక యంత్రాల వినియోగం సాంఘిక ప్రాధాన్యతను చేకూర్చుకుంది. పెట్టుబడిదారీ విధానంలో వ్యవసాయోత్పత్తి వెనుకబడియున్నప్పటికీ, శాస్త్ర పరిశోధనలు

పారిశ్రామికోత్పత్తి పెరుగుదలకు వినియోగపడ్డాయి. ఒక్కొక్క శాస్త్ర రంగంలో అపూర్వ పరిశోధనలు జరిగాయి. నూతన శాస్త్ర విభాగాలు రూపొంది శరవేగంతో పెంపొందాయి. ప్రకృతి విజ్ఞానపు ఒక్కొక్క పుట వెలుగులోకి వచ్చింది. ప్రకృతి క్రమాలను, వాటి సూత్రాలను, పరస్పరసంబంధాలను నిర్దుష్టంగా గ్రహించే శాస్త్రీయ విధానం కూడ రూఢమైంది.

కాని సాంఘికోత్పత్తి పెట్టుబడిదారీ, వ్యక్తి యాజమాన్య, వర్గ ప్రయోజనాలకు అనుకూలంగా శాసింపబడింది. సాంఘికోత్పత్తిని నిర్వహించి శాసించే ప్రబలశక్తి ఆనాడు పెట్టుబడిదారీ వర్గానికేఉంది. ఈ స్థితిలో సాంఘికోత్పత్తి శ్రామిక సహకార లక్షణాన్ని కోల్పోయింది. కార్మికులు పెట్టుబడిదారీవర్గంచే కొనివేయబడి దోపిడీకి గురియయ్యే కూలీలుగా [illegible] స్పష్టమైపోయారు

ఈ స్థితిలో నూతన శాస్త్రపరిశోధనలు, సాంకేతిక సదుపాయాలు కార్మికుల శ్రమను తగ్గించేందుకుగాక యజమానికి అధికలాభాలు చేకూర్చేటందుకు మాత్రమే అమలుకు తేబడ్తాయి. కనుక విజ్ఞానశాస్త్రం సాంఘిక శ్రమకు అనుగుణ్యమైన సాధనమయ్యేటట్లుకాక, శ్రామికశక్తిని పీడించే సాధనంగా వినియుక్తమయ్యేటట్లు శాసింపబడుతుంది.

పెట్టుబడిదారీ సంబంధాల పరిమితుల్లో తొలుత విజ్ఞానశాస్త్రం మహోన్నతంగా పురోగమిస్తుంది. ప్రకృతిక్రమాల రహస్య భేదన పెట్టుబడిదారీ ప్రయోజనాలకు అగత్యమైన ఆ దశలో, ఆయా పరిశోధనలు వారికి సూటిగాను తక్షణమే ప్రయోజనాలు కలిగించ కున్నప్పటికీ - ప్రోత్సహింప బడతాయి శాస్త్రజ్ఞులు స్వేచ్ఛతో తమ పరిశోధనా కృషిని మానవ సంక్షేమం, కోసం విజ్ఞాన వికాసం కోసం కొనసాగిస్తున్నామన్న విశ్వాసం కలిగియుంటారు. సమాజం వారి పరిశోధనలను ఆదరించి గౌరవిస్తుంది. శాస్త్ర విజ్ఞానాన్ని సమాజం వినియోగిస్తుంది కూడ. ఇలా, బూర్జువా సిద్ధాంత స్వాతంత్ర్యం శాస్త్రజ్ఞులు తమ పరిశోధనలద్వారా కనిపెట్టిన నూతన ప్రకృతి శక్తులనూ, వాటి క్రమాల సూత్రీకరణనూ పెట్టుబడిదారీ లాభాల పెరుగుదలకు అనుగుణ్యంగా వినియోగిస్తూ ముందుకు పోతుంది.

కాని పెట్టుబడులు గుత్తపెట్టుబడులుగా మారటంతో, ఆ గుత్త పెట్టుబడుల ప్రయోజనాలకు విజ్ఞాన శాస్త్ర అధీనత నగ్నంగా బహిర్గత మౌతుంది. శాస్త్ర పరిశోధనల స్థాయి పెరిగి, శాస్త్ర కృషి యొక్క వ్యయభారంకూడ పెరిగి, ఆ కృషి గుత్తపెట్టుబడిదారుల లేక ప్రభుత్వాల పోషణలో మాత్రమే సాధ్యమయ్యేదశ ఏర్పడుతుంది. శాస్త్రపరిశోధనలు నూతన సాంకేతిక సాధనాలు మాత్రమేకాక, వ్యక్తిగతంగా శాస్త్రజ్ఞులు కూడ పెట్టుబడిదారీ వర్గాధీనతకు లోనౌతారు. కనుక శాస్త్రజ్ఞులు అదివరకటి తమ స్వేచ్ఛాశీలతను, దేశభక్తిని, మానవతాశీలతను కోల్పోయి యే పెట్టుబడి దారీ సంస్థలకో, లేక వాటి ప్రయోజనాలను రక్షించే ఏ ప్రభుత్వ సంస్థలకో ఉద్యోగులుగా లేక ఏజంట్లుగా మాత్రమే అమ్ముడు పోయేవ్యవస్థ యేర్పడుతుంది. ఇలా నేటి శాస్త్రజ్ఞుల పరిశోధనలు యజమానుల అదుపాజ్ఞలకు గురికాక తప్పటంలేదు. పాలకవర్గం శాస్త్ర పరిశోధనాకృషిని గుత్తపెట్టుబడిదారీ ప్రయోజనాలకు పూర్తిగా అధీనమయ్యే మేరకు, ఆ ప్రయోజనాల నింకా పెంపొందించేటందుకు మాత్రమే అనుమతిస్తూ వుంది. ఈనాడు మారణాయుధాల రహస్య గోపన విధులు, పోలీసు, సి. ఐ. డి. నిఘాలు, సాంఘికభద్రత పేరుతో సైద్ధాంతిక దిగ్బంధనలు శాస్త్రరంగంలో విరివిగా అమలౌతున్నాయి. శాస్త్రజ్ఞులు తమ పరిశోధనలను మానవ ప్రయోజనానికి గాక మానవ మారణానికి వినియోగించే పరిస్థితు లేర్పడుతున్నాయి. ఇలా, ప్రభుత్వాలు శాస్త్రజ్ఞుల రాజకీయ, సాంఘిక స్వేచ్ఛల నరికట్టిన నిదర్శనాలు రోజు రోజూ పెరిగిపోతున్నాయి.

ఈ విధంగా పెట్టుబడులు విజ్ఞానశాస్త్రాన్నీ, సిద్ధాంతాన్నీ శాసించటం ఈనాడు నగ్నసత్యమైంది. పెట్టుబడిదారీవర్గ దృష్ట్యా విజ్ఞానశాస్త్ర మీనాడు విభిన్న వక్రసిద్ధాంతీకరణలకు గురియౌతూంది. శాస్త్రదృక్పథం భౌతికవాద ఆధారంపై ఆ యా పరిశోధనలను మానవుని భౌతిక ప్రపంచానుభవంద్వారా నిరూపించాలంటుంది. ఈ మూలసూత్రమే సాంఘికంగా ప్రమాదకరమని పాలకవర్గం భావిస్తుంది. ఒకవేళ యెవరైనా సిద్ధాంతంయొక్క సాంఘిక పునాదినీ, పాలకవర్గ గుత్తాధిక్యతనూ సవాలు

చేస్తే అప్పుడు శాస్త్రీయ భౌతికవాద దృక్పథం పాలకవర్గ ప్రయోజనాలకు విరుద్ధమౌతుంది. ఈ విషయం పాలకవర్గానికి బాగా తెలుసు. అందుకని విజ్ఞానశాస్త్రంలో, సిద్ధాంతరంగంలో శాస్త్రీయ దృక్పథాన్ని ఎలాగో అలా అరికట్టే అనేక వక్రధోరణులను పాలకవర్గం ప్రోత్సహిస్తుంది. శాస్త్ర దృక్పథంయొక్క మౌలికస్వభావాన్ని, దాని వ్యాప్తిని, వినియోగాన్ని అరికట్టే అనేక అశాస్త్రీయ తాత్వికధోరణుల నీ నాటి పాలకవర్గం పని కట్టుకొని వ్యాప్తిచేస్తూంది.

ఉదాహరణకు, విట్‌హౌన్ "పదార్థ పరిణామానికి కారణం నిర్దిష్టపరిణామం కాక స్థలకాల ఆవరణలో గల అనంత పదార్థ సంయోగం" అన్నాడు. ఐతే, ఈ 'అనంత పదార్థం' యేమిటో నన్నది అయోమయసమస్యయే. అలాగే రసెల్ 'భౌతిక సంఘటనలు వాటి స్థలకాల నిర్దేశానికి పరిమితములనీ, కాని ఆ సంఘటనలకు మూలకారణాలు అజ్ఞేయమైనవనీ అన్నాడు. "అవి ఎంత అగోచరమైన వంటే, అసలవి ఉన్నవో లేవో ననేదీ, మన మానసిక అనుభూతులకు అనుగుణ్యంగా ఉన్నవో లేవో నన్నదీ దురూహ్య విషయం" అంటాడు. అలాగే డిరాక్ "మన పరిశీలనా శక్తియొక్క సూక్ష్మతను యెక్కడో అక్కడ పరిమితిఉంది. కనుక భౌతిక వాస్తవపు మానసిక చిత్రాలలో ఏదో ఒక అసమన్వయత్వంకూడ ఉంది. ఐనప్పుడు పదార్థక్రమపు మౌలికవిలోకనసమస్య అర్థరహితం" అని వ్రాశాడు. ఎడింగ్‌టన్ "మనకు తెలియబడని యేదో, మనకు తెలియబడనిదేన్నో జరుపుతుంది. పరిణామంయొక్క మన సిద్ధాంత పరిమితి ఇంతవరకే" అని వాదిస్తాడు. ఇలా నేటి తత్వశాస్త్రంలో అనేక ధోరణులు శాస్త్రీయ దృక్పథాన్నే సవాలు చేస్తున్నాయి.

సాంఘిక జీవితంలో అంతర్భాగమైన విజ్ఞానశాస్త్రం గుత్తపెట్టు బడుల కబంధ హస్తాల్లో బిగిసినకొద్దీ విజ్ఞానశాస్త్రం సాంఘిక వ్యవహారంలో ప్రమేయం కల్గించుకోరాదన్న ధోరణులు మరింతగా ప్రోత్సహింప బడుతున్నాయి. గొప్పగొప్ప వైజ్ఞానికులుకూడ శాస్త్రం ఎలాంటి విశ్వాసాలకైనా, యే మత సంప్రదాయాలకైనా సరిపడేదేనని

వాదనలు చేస్తున్నారు. అంటే సాంఘిక వ్యవస్థలో శాస్త్రిం కల్పించు కోరాదన్న మాట. తత్వవేత్తలుకూడ ఇదే పంథాలో వాస్తవప్రకృతి, దాని పరిణామం అజ్ఞేయ విషయమనీ, శాస్త్రి విజ్ఞానాభివృద్ధి అంతా 'దానివర కది మాత్రమే' ననీ వాదిస్తున్నారు. ఈరీతిగా వారు "అనిర్వచనీయ పరిణామం" "అచలంద్వారా చలనం", "కారణ విరుద్ధకార్యం" మున్నగు తప్పుధోరణులను ప్రోత్సహిస్తున్నారు. ఐతే ఇలాంటి తర్క వాదాలతో శాస్త్రీయ విలోకన శాస్త్ర పరిశోధనల పురోగమనం నిల్చిపోవు. పైగా గుత్తపెట్టుబడిదారీ యాజమాన్యం ఇలాంటి అశాస్త్రీయ ధోరణుల ప్రోత్సాహంద్వారా శాస్త్ర దృక్పథాన్నీ వికాసాన్నీ యెలా అరికడుతూందో శాస్త్రిజ్ఞులు గుర్తిస్తారు కూడ. కాబట్టి వారు విజ్ఞానశాస్త్ర వికాసానికీ శాస్త్రీయ దృక్పథ వ్యాప్తికీ అవరోధాలు లేని సాంఘిక వ్యవస్థను వాంఛిస్తారు. సామ్యవాద ఉద్యమాన్ని బలపరచటం ద్వారానే తమ వ్యక్తిత్వాన్ని, పరిశోధనాకృషిని అఖిల మానవాళి సంక్షేమానికి వినియోగించగల్గుతారు.

*విజ్ఞానశాస్త్రం ప్రజలకొరకే*

పెట్టుబడిదారీ ఉత్పత్తి లక్ష్యం యజమానుల లాభాలు. కాని సామ్యవాద ఉత్పత్తిలక్ష్యం యజమానుల లాభాలు కాక, మానవుని భౌతిక సాంస్కృతికావసరాలను నెరవేర్చటం. ఉన్నతసాంకేతికాభివృద్ధి ఆధారంపై సామ్యవాద ఉత్పత్తిని అభివృద్ధిచేయటంద్వారా ఈ లక్ష్యం సాధింపబడుతుంది. కనుక సామ్యవాదసమాజంలో విజ్ఞానశాస్త్ర వికాసం ఈ లక్ష్యానికి అనుగుణ్యంగా కొనసాగుతుంది.

పెట్టుబడిదారీ విధానంలో పెట్టుబడియే సాంఘికోత్పత్తికి దర్శకత్వం వహిస్తుంది. ఈ పెట్టుబడి లక్ష్యం యజమానుల లాభాలే. కాని సామ్యవాదంలో సాంఘికోత్పత్తి సాంఘికశ్రమ సూత్రంపై కొనసాగుతుంది. సమాజం యొక్క భౌతిక సాంస్కృతికావసరాల సాధనయే సాంఘికశ్రమ లక్ష్యం. ఉత్పత్తిని అభివృద్ధిపరచే శక్తుల దర్శకత్వంలో విజ్ఞానశాస్త్రం ఉంటుంది. ఐతే, పెట్టుబడిదారీ సమాజంలో

శాస్త్రం శ్రమనుండి వేరుచేయబడి ఆ శ్రమను కొల్లగొట్టుకొనే పెట్టుబడుల ఆధీనంలో బంధింపబడి యుంటుంది. సామ్యవాదంలో అలా కాక, శాస్త్రం శ్రమశక్తులతో సమన్వయమౌతుంది. కనుక సామ్యవాద సమాజంలో విజ్ఞానశాస్త్రం సాంఘికశ్రమయొక్క ఆచరణకు సిద్ధాంతశాఖగా, అంటే పరిశోధనలు నిరూపణలు కొనసాగించటంద్వారా సాంఘికోత్పత్తిని నిరంతరం పెంపుజేస్తూ మానవుని భౌతిక మానసికావసరాలను నెరవేర్చే సాధనంగా వినియుక్తమౌతుంది

విజ్ఞానశాస్త్రాన్ని గుత్తపెట్టుబడుల ఆధీనతనుండి తొలగించి ప్రజలపరం చేయటంతో శాస్త్రాభివృద్ధి ప్రణాళికాబద్ధమౌతుంది. అంటే ఏ యే పరిశోధనలు జరిపి, ఏ యే నూతన వివరాలను కనిపెట్టాలో నని ప్లానులు వేస్తారని కాదు. శాస్త్రవికాసం అలా ప్లాను ప్రకారం సాగదు కూడ. ఆ ప్రణాళికల్లో శాస్త్రపరిశోధనలకు అవకాశాలూ, సౌకర్యాలూ పూర్తిగా కల్గింపబడతవి. ఇలా ప్రణాళికా సంయోజనలో తక్షణావసరాలు సుదూరప్రయోజనాలు రెండూ పాటింపబడతాయి. అందువల్ల శాస్త్రపరిశోధనలు ఒకవంక తక్షణావసరాలను నెరవేర్చే దిశలోను, మరోవంక ఆ పరిశోధనాభివృద్ధియొక్క సైద్ధాంతిక సమన్వయానికి అవసరమయ్యే మౌలికకృషిని కొనసాగిస్తాయి.

సామ్యవాద వ్యవస్థలో శాస్త్రజ్ఞులు ఉత్పత్తి నిర్మాతలైన శ్రామికులతో సన్నిహితంగా ఉంటారు. శ్రామికవర్గంనుండి శాస్త్రజ్ఞులు రూపొందుతారు. ఈ విధంగా విజ్ఞానశాస్త్రం పీడకవర్గాల అధీనంనుండి విడివడి ప్రజల పరమౌతుంది. అందువల్ల శాస్త్ర కృషి వర్గపరిధులకు అతీతంగా అనేక నూతన రంగాలను ఆవరించుటకు అనేక పరిశోధనలను సాంఘికంగా వినియోగించుకొనుటకు అవకాశాలేర్పడతాయి; ఆ విధంగా శాస్త్ర విజ్ఞానం ద్విగుణీకృతమౌతుంది. తోడ్తో శాస్త్రీయదృష్టికి అవరోధమైన వర్గ సిద్ధాంత (స్వీయ) ధోరణులు అంతరిస్తాయి. కనుక వాస్తవిక పరిశోధనల ఆధారంపై, సాంఘికాచరణ ప్రాతిపదికపై శాస్త్రసిద్ధాంతం, శాస్త్ర పరిశోధనలు, శాస్త్ర వివరణలు అఖిల మానవాళి వినియోగాని కనుగుణ్యంగా పెంపొందుతాయి.

విజ్ఞాన శాస్త్రం వేర్వేరు శాఖలుగా విడివడని ప్రాథమిక దశలో తత్వ శాస్త్రమూ, విజ్ఞానశాస్త్రమూ ఒకటిగానే ఉండేవి. పిదప విజ్ఞాన శాస్త్రం, తత్వశాస్త్రం దేనికది విడిపోయాయి. శాస్త్ర సిద్ధాంతాలు ప్రకృతి పరిశోధనలు వివరణవరకే సీమితమైనాయి. ఐనా, తాత్విక సిద్ధాంతాలు విజ్ఞానశాస్త్ర నిరూపణల్లోకి చొచ్చుకొనిపోయి, సామాన్యీకరణల్లో ప్రభావం వేశాయి. ఈ సాంప్రదాయిక స్వీయవాద తాత్వికధోరణుల అశాస్త్రీయతనుండి విజ్ఞానశాస్త్రాన్ని విమోచన చేయటం వర్గరహిత సమాజంలోనే సాధ్యం. సామ్యవాద సమాజంలో తత్వశాస్త్రం శాస్త్రీయ దృక్పథానికి సరిపడని ధోరణులతో శాసించే పరిస్థితి అంతరిస్తుంది; తార్కిక – గతిక్రమ పునాదులపై శాస్త్రీయ సిద్ధాంతం వాస్తవికత కనుగుణ్యంగా పురోగమిస్తుంది. ఇలా శాస్త్రీయమైన గతి తార్కిక భౌతిక వాదం విజ్ఞానశాస్త్ర పరిశోధనలకు సారధ్యం వహిస్తుంది.

వైజ్ఞానిక, తాత్విక రంగాల సమన్వయాన్నిగూర్చి ఎంగెల్స్ ఇలా వ్రాశాడు :

"ప్రకృతి శాస్త్రాలు తత్వశాస్త్రాన్ని వదలివేయుటకో, దాన్ని దుర్వినియోగం చేయుటకో స్వేచ్ఛకలిగి యుంటాయని భావింపబడుతూంది. కాని ప్రకృతి శాస్త్రాల అభివృద్ధి భావాలూ, భావనిర్ధారణలు లేకుండా కొనసాగడం సాధ్యంకాదు.

"కనుక శాస్త్రజ్ఞులు శాస్త్రీయ సామాన్యతతో సైద్ధాంతిక సమన్వయం లేకుండా, తమవరకే తమ భావాలను పరిమితం చేసుకొనే భావదాస్యానికి లోనౌతారు; ఇక తత్వశాస్త్రాన్ని దుర్వినియోగం చేసేవారు. వీరు, తమ పరిశోధనలు తప్పు తాత్విక ధోరణులతో కూడుకొనియున్నాయని గ్రహించి కూడ వాటితో రాజీపడే భావదాస్యానికి గురియౌతారు. ఈ విధంగా ప్రకృతి శాస్త్రజ్ఞులు పాతభావవాద విశ్వాసాలతో రాజీపడి తత్వశాస్త్రపు నామకార్థపు అస్తిత్వాన్నలాగే నిల్పియుంచుతారు. కనుక ఎంతవరకైతే ప్రకృతి శాస్త్రం చారిత్రకదృష్టినీ గతిక్రమవిలోకనను అవలంబించదో అంతవరకు పాతతాత్వికభావాలు

- వాటికి కాలం దోషం పట్టినప్పటికీ-నిర్మాణాత్మక శాస్త్రదృక్పథంలో అంతర్లీనం కావు."

విజ్ఞానశాస్త్రంయొక్క సైద్ధాంతిక వైరుధ్యం పైవిధంగా ఉంటుంది.

ఉదాహరణకు జడపదార్థం చేతనంగా పరిణామం చెందే క్రమం, జీవరహస్యం అభేద్యమనే జేమ్సు జేన్సు వాదం, జెనిటిక్సులో (genetics) వారసత్వపు వైవిధ్యం (అనువంశిక - ఆగత లక్షణాల క్రమం) అనిశ్చితమైనదనే మెండెలిజం (mendelism) భౌతికశాస్త్రంలో పరమాణుశక్తి పరావర్తక్రమం అజ్ఞేయమనే డిరాక్ వాదం మున్నగునవి శాస్త్రరంగంలో తాత్విక వైరుధ్యాలవల్ల కలిగే సంక్షోభానికి నిదర్శనలు. ఐతే ఇవన్నీ అజ్ఞాతమైనవనీ కనుక అజ్ఞేయమైనవనీ భావించి శాస్త్రపరిశోధనలను మానుకోడం సాధ్యంకాదు. పరిశోధనలు ముందుకు సాగినకొద్దీ ప్రకృతి రహస్యాలను గూర్చిన చైతన్యం పెంపుగాంచి, అజ్ఞాన మూలకమైన అనిర్వచనీయత క్రమంగా అంతరించిపోతుంది తత్ఫలితంగా శాస్త్ర దృక్పథం వెలుగులోకి వస్తుంది. ఈ విషయాన్ని బూర్జువా శాస్త్రజ్ఞులు గమనించలేకపోతున్నారు.

సామ్యవాదంలో మాత్రమే విజ్ఞానశాస్త్రం నిరాటంకంగాను, నిష్పాక్షికంగాను అభివృద్ధిచెందగల్గుతుంది. శాస్త్రీయ దృక్పథం సమగ్ర పరిశీలనలపై ఆధారపడ్డ నిరూపణలను, సిద్ధాంతీకరణలను మాత్రమే గుర్తిస్తుంది. ఆ సిద్ధాంతీకరణలవల్ల ఎవరికి లాభమౌతుంది, ఎవరేమనుకుంటారు - అన్న భయాతంకాలుండవు. శాస్త్రపరిశోధనలు, నిరూపణలు విమర్శను ఆహ్వానిస్తాయి. విమర్శ ఆధారంపై ఇతోధికంగా పురోగమిస్తాయి.

మార్క్సు శాస్త్రకృషిలో పైదృక్పథాన్ని పదేపదే పేర్కొన్నాడు: అర్థశాస్త్రవేత్త రికార్డో రచనలలో కనపడే నిష్పాక్షికతను, శాస్త్రశీలతను పేర్కొంటూ మార్క్సు "రికార్డో కొన్ని సందర్భాల్లో బూర్జువావర్గాన్నీ, మరికొన్ని సందర్భాల్లో కార్మికవర్గాన్నీ, యింకా కొన్ని సందర్భాలలో భూస్వామ్యవర్గాన్నీ తీవ్రంగాను, నిష్పాక్షికంగాను విమర్శించాడు" అని వ్రాశాడు. కాని మాల్థస్‌నుగూర్చి "అతడు శాస్త్రదృష్టిని వంచనకు గురి

చేశాడు; పాలకవర్గపు మెప్పుకోసం వారి ప్రయోజనాలను పాక్షికంగా సమర్థించుటకు తప్పు నిర్ధారణలను చేశాడు" అని తీవ్రంగా ఖండించాడు. "గోతపుట్టించే మాల్థస్ అధికారవర్గాల మెప్పుకోసం బూర్జువా-భూస్వామ్య వర్గానికనుకూలంగా, కార్మికవర్గానికి వ్యతిరేకంగా సిద్ధాంతీకరణలు చేశా"డనీ, ఇలా "శాస్త్రాన్ని శాస్త్రదృక్పథంతోగాక అరువు తెచ్చుకున్న భావాలతో శాస్త్రబాహ్యమైన విచిత్ర ప్రయోజనాలకోసం వినియోగించా" డనీ విమర్శించాడు. ఈ మాల్థస్, జనాభా పెరుగుదలస్థాయికంటె ఉత్పత్తి పెరుగుదలస్థాయి తక్కువైనదనీ, కనుక జనక్షయం అనివార్య మనీ చెప్పి యుద్ధాలను, రోగాలను, కరువులను సమర్థించిన ప్రబుద్ధుడు!

ప్రజాపీడనపై ఆధారపడే సమాజవ్యవస్థలో నిష్పాక్షిక స్వచ్ఛంద శాస్త్రపరిశోధనలు అవరోధాలకు లోనవుతాయి. పరిశోధనలను నిష్పాక్షికంగానే ప్రారంభించినా, శాస్త్రజ్ఞుల సిద్ధాంతాలను పాలకవర్గోద్దేశాలకు అనుగుణ్యంగా మలచివ్యక్తీకరించుటకు లేదా అలా వీలుకానప్పుడు శాస్త్ర కృషిని మధ్యలోనే నిల్పివేయుటకు ప్రబలమైన సాంఘిక శక్తులు ఒత్తిడి తెస్తాయి. అందువల్ల మానవజీవితానికి సుఖసమృద్ధులను సాధించే శాస్త్ర కృషి, నిష్పాక్షిక పరిశోధన వర్గసమాజంలోకాక వర్గరహిత సమాజం లోనే సాధ్యం. సామ్యవాదసమాజంలో శాస్త్రపరిశోధనలు తుదివరకు జీవిత పురోగమనానికి ప్రేరణనిచ్చే సార్వజనీన విజ్ఞాన మహోద్యమంగా పురోగమిస్తాయి.

ఏ కొందరో కోరేవిధంగా శాస్త్రపరిశోధకులు సిద్ధాంతాలు చేసే స్థితి, లేక తప్పు దృక్పథాలను ప్రశ్నించకుండాఉండే తటస్థ వైఖరి వర్గ సమాజంలో చిరకాలంగా కొనసాగుతూంది. ఈ అలవాటు త్వరలోపోదు. శాస్త్రజ్ఞులు యిరుకున పడియుంటారు. సామ్యవాద వ్యవస్థ ఆవిష్కారం కావటంతో ఈ స్థితి మారుతుంది. సామ్యవాద సిద్ధాంతం నిష్పాక్షికమైన శాస్త్రీయ దృక్పథం కావాలంటుంది. ఎవరేమనుకున్నా సరే, ఎవరి భావాలు నమ్మకాలు ఎలా ఉన్నాసరే, శాస్త్రీయ దృక్పథం ముందుకు సాగవలసిందేనంటుంది. స్టాలిన్ ఇలా అన్నాడు :

"విమర్శా స్వాతంత్ర్యం లేకుండా, భావసంఘర్షణలేకుండా యే శాస్త్రమూ పురోగమించటం సాధ్యంకాదు. మనం శాస్త్రాన్ని శాస్త్రం అని ఎందుకంటున్నామంటే, అది గుడ్డినమ్మకాలను గుర్తించదు. కాల దోషం పట్టిన భావాలను ఖండించుటకు జంకదు. ప్రయోగాత్మకమైన అనుభవ గుణపాఠాన్ని అది గీటురాయిగా పాటిస్తుంది."

కనుక, శాస్త్ర పరిశోధనలో సైద్ధాంతిక తటస్థత సిద్ధాంత పోరాటం ద్వారానే నివారణౌతుంది.

బూర్జువా సమాజంలో "శాస్త్రం శాస్త్రంకొరకే – కళ కళకొరకే" నంటూ, శాస్త్రదృక్పథానికి పరిమితులు విధించే ధోరణి ప్రోత్సహింప బడుతుంది. తద్వారా సాంఘిక సాంస్కృతికరంగాలలో శాస్త్రదృక్పథం అరికట్టబడి సాంప్రదాయిక స్వీయభావాలు ప్రోత్సహింపబడతాయి. వర్గపీడనవల్ల శాస్త్రాభివృద్ధికి చిరకాలంగా కలిగిన అవరోధాలను సామ్యవాదం తొలగిస్తుంది. ఉత్పత్తి సాధనాలపై వ్యక్తిగత యాజ మాన్యాన్ని నిర్మూలించి, ఉత్పత్తిని సమాజపరంచేయటం ద్వారా అర్థికాభివృద్ధిలోని స్వలాభ వైరుధ్యాలను తొలగిస్తుంది. సాంఘిక ప్రయోజనానికి పునాదులు వేసే విధంగా శాస్త్రాభివృద్ధిలోని స్వీయ దృక్పథాల ఆటంకాన్నికూడ తొలగిస్తుంది. శాస్త్ర పరిశోధనలు ఆర్థికాభి వృద్ధి క్రమంపై ఆధారపడియుంటాయి. ఐతే, శాస్త్ర పరిశోధనలు నిర్దిష్ట సాంఘిక వ్యవస్థల ఫలితాలు కావు. కనుక సామ్యవాద సమాజంలోను, పెట్టుబడిదారీ సమాజంలోను కూడ శాస్త్ర పరిశోధనా పద్ధతులు ఒక్కటే. కాని శాస్త్రాభివృద్ధికి ఆటంకంగా తయారైన ఆర్థిక రాజకీయ తాత్విక అవరోధాలను అధిగమించటమే సాంఘిక వ్యవస్థ వహించగల విశిష్ట పాత్ర. ఎంగెల్స్ ఇలా వ్రాశాడు :

"సోషలిజంతో చరిత్రలో నూతన శకోదయమౌతుంది; అందులో మానవజాతి, మానవ వ్యవహార శాఖలు, ముఖ్యంగా విజ్ఞానశాస్త్ర సర్వోపరిపురోగమనం పాతకాలపు అవశేషాలను అధిగమిస్తాయి."

అంటే సోషలిజంలో శాస్త్ర దృక్పథం వర్గ అవరోధాలను అధిగమించి, సార్వజనీన స్వభావాన్ని చేకూర్చుకుంటుం దన్నమాట.

సాంఘిక శాస్త్రం

బూర్జువా పరిపాలనలో విజ్ఞాన శాస్త్రం ప్రకృతి పరిణామాలను పరిశోధించింది. కాని అది బూర్జువావర్గ ప్రయోజనాల సాధనకు అనివార్య మైనది. పెట్టుబడిదారులు విద్యుచ్ఛక్తిని గూర్చి కట్టుకథలనూ, స్వీయ భావాలనూ కోరరు. వారికి వాస్తవిక విజ్ఞానం తప్పక అవసరమౌతుంది. లేకపోతే, విద్యుచ్ఛక్తిని వారు వినియోగానికి తేగల్గేవారు కారు. ఇది ప్రకృతి శాస్త్రాల విషయం. ఇక సాంఘిక శాస్త్రాలు. సాంఘిక పరి ణామాలను గూర్చిన సిద్ధాంతాల విషయంలో కూడ బూర్జువా శాస్త్రజ్ఞులు చాలా చాలా పరిశోధనలు జరిపి దీర్ఘ చరిత్రలు, సిద్ధాంతాలు వ్రాస్తారు. కాని వారు సాంఘికాభివృద్ధికి పునాదియైన వాస్తవికతను గుర్తించలేరు. అలా గుర్తించటం వారి వర్గస్థితికే వ్యతిరేకం.

కనుక ప్రకృతిశాస్త్ర పరిశోధనల్లోవలె బూర్జువావర్గం సాంఘిక శాస్త్రాల్లో శాస్త్రీయ దృక్పథంతో వ్యవహరించదు. సమాజాభివృద్ధిని శాస్త్రీయంగా నిరూపించే కృషి సామ్యవాద ఉద్యమంతోనే ప్రారంభమవు తుంది. సామ్యవాద వ్యవస్థ నెలకొల్పబడేవరకు అందుకై పోరాడుటకూ, తర్వాత ఆ సమాజాన్ని వ్యవస్థీకరించుటకు సాంఘికశాస్త్రం సాధనమవు తుంది. కనుక సాంఘికశాస్త్రం కార్మికవర్గ పోరాటపు శాస్త్రీయ సిద్ధాం తాన్ని నిర్మిస్తుంది; కార్మికవర్గ సాంఘికాభిప్రాయాలకు సిద్ధాంత పునాదిగా రూపొంది పెంపొందుతుంది. బూర్జువా సాంఘికశాస్త్రం ఆడం స్మిత్, డేవిడ్ రికార్డోల పరిశోధనలద్వారా పెంపొందింది వీరు ఉత్పత్తిక్రమాన్నీ సాంఘికావసరాలకై దాని పంపిణీక్రమాన్నీ సూత్రీకరించి అర్థశాస్త్రా నికి పునాదులు వేశారు. సమాజ వ్యవస్థయొక్క ఆర్థిక పునాది ఈవిధంగా గుర్తింపబడింది. అప్పుడప్పుడే తలెత్తిన పెట్టుబడిదారీ వ్యవస్థకు, దాని ప్రయోజనాలకు అనుగుణ్యంగా ఆర్థిక పరిశోధనలు కొనసాగాయి. కాని త్వరలోనే పెట్టుబడిదారీవర్గ ఆధిపత్యం, పీడనాపద్ధతి శాస్త్రపరిశోధనల స్వచ్ఛందతకు, నిష్పాక్షికతకు అవరోధమైనాయి. అందువల్ల పెట్టుబడి దారీ అర్థశాస్త్రవేత్తలు పెట్టుబడిదారీ పీడనకు కీలకమైన "అదనపు విలువ"ను గుర్తించలేకపోయారు.

ఆడంస్మిత్, రికార్డోల తర్వాత బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు అనేక పరిశోధనలు చేశారు. కాని ఆ పరిశోధనలన్నీ విషయసేకరణ ధోరణిలోనే సాగాయి. గణాంక పరిశీలనలు, గణాంక సమన్వయాలుగానే ఉన్నాయి. పెట్టుబడిదారీ యంత్రాంగ మెలా ఉంటుందో, దాన్నెలా నడిపించాలో, అప్పుడప్పు డది చెడిపోతే యెలా బాగుచేయాలో నన్నదే ఆ శాస్త్రజ్ఞుల విధానంగా తయారైంది. ఇలా వారిదృష్టి వైధానిక విలోకనవరకే పరిమితమైంది. సిద్ధాంత పునాదిని, ఆర్థిక మూలతత్వాన్ని వారు పరిగణించలేదు. ఉత్పత్తి సంబంధాలలోని వాస్తవపీడనను బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు గుర్తించలేకపోయారు. వారు ఉత్పత్తి విధానపు (పెట్టుబడి) ఆధారాన్నీ, దాని పాత్రనూ, ఫలితాలనూ యథాతథంగానే చర్చించగలరు. కాని యాజమాన్య సమస్యను, పీడించే హక్కును సవాలు చేయటం వారికి సాధ్యం కాదు.

ఈ లోపం అర్థశాస్త్రం వరకేకాక, అన్ని సాంఘిక శాస్త్రాల్లోనూ కనిపిస్తుంది. కనుక సాంఘికశాస్త్ర రంగంలో బూర్జువా పరిశోధనలు ఏవో కొన్ని విషయాలను పైపై దృష్టితో వివరిస్తున్నప్పటికీ, సాంఘిక శాస్త్రంపేరిట ఏవో కొన్ని సిద్ధాంత సూత్రాలను ప్రచారం చేస్తున్నప్పటికీ ఆ వాదనలు సమాజంయొక్క మౌలిక పరిణామాలను గుర్తించలేవు. ఆ కర్తవ్యాన్ని మార్క్సిజంమాత్రమే నెరవేర్చగలుగుతుంది. మార్క్సు సాంఘిక పరిణామసూత్రాలను కనిపెట్టగలిగాడంటే, ఆయన పెట్టుబడిదారీ సాంఘిక వ్యవస్థపై తిరుగుబాటుచేసే దృక్పథాన్ని చేపట్టటంవల్లనే సాధ్యమైంది. ఆయన పాలకవర్గ స్థితిని సవాలుచేసి, కార్మికవర్గం యొక్క విప్లవపాత్రను గుర్తించాడు. తద్వారా పెట్టుబడిదారీ వ్యవస్థను సామ్యవాద వ్యవస్థద్వారా మార్చివేసే మౌలికలక్ష్యాన్ని స్వీకరించాడు. ఆ ఆధారంపైనే ఆయన చారిత్రక భౌతికవాదాన్ని ఆవిష్కారం చేశాడు. కనుక, భౌతికశాస్త్రంలో గెలీలియో, న్యూటన్‌లు, జీవశాస్త్రంలో ష్వాన్, డార్వినులు ఎలాంటి శాస్త్రీయ దృక్పథంతో కృషి చేశారో, అలాగే సాంఘికశాస్త్రంలో మార్క్సు శాస్త్రీయ దృక్పథంతో వ్యవహరించాడు.

*నూతన సిద్ధాంతోదయం*

సామ్యవాదం సమాజాన్నీ, సాంఘికసంబంధాలనూ, సాంఘిక పరిణామ సూత్రాలనూ గూర్చిన శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందిస్తుంది. అందువల్ల అది అశాస్త్రీయమైన సిద్ధాంత భ్రాంతులను నూతన శాస్త్రీయ భావాలద్వారా వ్యతిరేకిస్తుంది. పీడకవర్గ సిద్ధాంతాల సాంప్రదాయిక స్వీయోద్దేశాలను ఖండిస్తూ వాటికిబదులు శాస్త్రీయభావాలను ప్రోత్సహిస్తుంది. అంటే పాతభావాలను భ్రాంతులను నూతన శాస్త్రీయభావాలతో సవాలు చేస్తుందన్నమాట. వర్గరహిత సమాజనిర్మాణం, సార్వజనీనమైన భౌతిక మానసిక అసరాలసాధనకై సమస్త అవరోధాలను ఎదుర్కొనటం ఒక ఉద్యమంగా కొనసాగాలంటుంది. అన్నిరంగాలలోనూ సిద్ధాంతభ్రాంతులను, అశాస్త్రీయభావాలను నిర్మూలించ గోరుతుంది. జీవితంయొక్క అన్ని శాఖలలో శాస్త్రీయదృక్పథాన్ని ప్రతిష్ఠించాలంటుంది. ఈ విధంగా సామ్యవాదం సార్వజనీనమైన, శాస్త్రీయమైన మానవత్వవిలోకనను ఆవిష్కరిస్తుంది. సామ్యవాదం తప్పు చైతన్యం పెంచుకొనటానికికాక, పదార్థాల వాస్తవిక క్రమాన్ని పరిశీలించుటకు అవకాశం కల్గిస్తుంది పదార్థాలమధ్య, మానవులమధ్య ఉండే సంబంధాలను స్వీయదృక్పథంతోకాక, సాంప్రదాయిక భావాల ఆధీనతక్రింద కాక, వర్గప్రభావ పరిమితుల్లో కాక పీడనకు అతీతంగా, విశాల మానవ శ్రేయోదృక్పథంతో, నిష్పాక్షికంగా పరిశీలిస్తుంది.

ఐతే, కార్మికవర్గం అధికారాన్ని సాధించి సామ్యవాద సమాజాన్ని నిర్మిస్తున్నదశలో సాంఘిక జీవితపు కాలాతీత భావాలన్నిటినీ నిర్మూలించవలసి వస్తుంది. ఈ కర్తవ్యాన్ని నిర్వహించుట ద్వారా సమాజం సిద్ధాంత భ్రాంతులనూ, అశాస్త్రీయ భావాలనూ అధిగమించి శాస్త్రదృక్పథాన్ని చేపడుతుంది. సామ్యవాదం విజయాన్నిసాధించటంతో, పీడనపై ఆధారపడియున్న అనేక పాత సిద్ధాంతాలు, వాటివల్ల ఏర్పడే తప్పు చైతన్యం, భ్రాంతులు, శాస్త్రరంగంలోఉండే అజ్ఞేయత నిరాధారమైపోతాయి. తత్ఫలితంగా, వర్గస్థితికీ వర్గాతిశయానికీ అతీతమైన శాస్త్రీయ సార్వజనీన దృక్పథం వ్యాప్తి చెందుతుంది.

సామ్యవాద వ్యవస్థలో ఉత్పత్తిసాధనమైన ఆస్తి సమాజపరం చేయబడుతుంది. సమష్టి సహకార ఆస్తి రూపొందుతుంది. ఉత్పత్తి సాముదాయికంగాను, సంయోజితంగాను నిర్వహింపబడుతుంది. ఇలాంటి ఆర్థిక పునాదియే ఆలోచనారంగంలో శాస్త్రీయ దృక్పథాన్ని పటిష్ఠం చేయగలదు. కనుక, సామ్యవాద ఆర్థిక విధానం మానవుని గురించిన, అతని పరిసరాలను గురించిన శాస్త్రీయావగాహనను పెంపొందిస్తుంది. అలాగే రెండోవైపు శాస్త్రీయభావాల అభివృద్ధి సామ్యవాద ఆర్థిక పునాదిని బలపరుస్తుంది. ఈ అన్యోన్య సమన్వయం పెట్టుబడిదారీ సమాజంలో, వర్గ ఆర్థిక విధానంలో సంభవంకాదు. అందుకని పెట్టుబడిదారీ యాజమాన్యం ప్రజలను మభ్యపెట్టే వక్రసిద్ధాంతాలను ప్రోత్సహిస్తుంది. ఈ స్థితిని అధిగమించిన సామ్యవాదం శాస్త్రీయభావాలను పెంపొందిస్తుంది. ప్రకృతికీ సమాజానికీ గల సంబంధాన్నిగూర్చి వాస్తవిక సిద్ధాంతాలను ప్రోత్సహిస్తుంది. ఆ సిద్ధాంతాల ఆధారంపై వికసించే సాంఘిక చైతన్యాన్ని విశ్వజనీనంగా రూపొందిస్తుంది.

ఐతే సామ్యవాద వ్యవస్థ ఏర్పడగానే పాత సామాజిక పరిస్థితుల అవశేషాలు, తప్పు చైతన్యధోరణులు తక్షణమే తొలగిపోవు. ఉదాహరణకు మతవిశ్వాసాలు. ఇవి సామ్యవాద చైతన్యవికసనకూ, పటిష్ఠతకూ అవరోధాలే. కనుక వాటి నెదుర్కొని. నూతనశాస్త్రీయ చైతన్యంతో తొలగించవలసియుంటుంది.

కాని మతంనుండి రూపొందే భ్రాంతులు చాల పాతవి, చాలాకాలం నిల్చియుండేవీను. ఎంతవరకయితే ప్రజల్లో పేదతనం, అవిద్య నిల్చియుంటాయో అంతవరకు మత సంబంధమైన నమ్మకాలకు అవకాశముంటుంది. కనుక మతాన్ని బలవంతంగా నిర్మూలించే సమస్యలేదు. మతాన్ని సామ్యవాద నిర్మాణానికి అనుగుణ్యంగా వినియోగించటంకూడ సాధ్యం. సామ్యవాదదేశాల్లో సాంస్కారిత మతసంస్థలు సామ్యవాద నిర్మాణకృషిని మతరీత్యా సమర్థించే పాత్రను నిర్వహిస్తుండటం యిందుకు తార్కాణం. ఈ పాత్ర సాంఘిక కృషిలో ప్రధానం కాకున్నప్పటికీ, ఉపయుక్తమౌతుంది.

ఈ విషయంలో మార్క్స్ యిలా వ్రాశాడు :

"నిత్యజీవితాచరణకు చెందిన సంబంధాలు ప్రకృతిని గూర్చిన. తోటి మానవులను గూర్చిన సమగ్రావగాహనకు దారితీసినప్పుడే, అనగా హేతుబద్ధమైన సంబంధాలకు దారితీసినప్పుడే వాస్తవ ప్రపంచపు మతప్రతిబింబం పూర్తిగా అంతరిస్తుంది. భౌతికోత్పత్తిపై ఆధారపడియున్న సాంఘిక జీవితం, ఆ ఉత్పత్తి స్వేచ్ఛాయుతమైన మానవ ఐక్యతతో సంయోజితంగాను, చైతన్యయుతంగాను కొన సాగింపబడనంతవరకు మానవుడు తన భ్రాంతి వలయంనుండి విమోచనం చెందజాలడు."

కనుక, సాంఘిక జీవితక్రమం స్వేచ్ఛాయుతమైన ఐక్యతతో, సంయోజిత పథకం ప్రకారం కొనసాగి, తత్ఫలితంగా ప్రకృతితోను తోటి మానవులతోను గల సంబంధాలు హేతువాదయుక్తంగా గ్రహింపబడేంతవరకు భ్రాంతులూ, అంధ విశ్వాసాలూ సమూలంగా తొలగవు. కాని అందుకు అవకాశాలేర్పడి సాంఘిక జీవితం క్రమబద్ధంగా పురోగమించటం ప్రారంభమవటంతో, తప్పు సిద్ధాంతాలూ భ్రాంతులూ తమ అజ్ఞానాధారాన్ని విసర్జించి మానవుని శాస్త్రీయ చైతన్యం పెంపొందే అభివృద్ధిక్రమం ప్రారంభమౌతుంది.

### సామ్యవాద చైతన్యపు శాస్త్రీయ పునాదులు

సామ్యవాద చైతన్యం, సామ్యవాద సమాజంలో సార్వజనీన చైతన్యంగా రూపొందుతుంది. కనుక అది వర్గాధిపత్య అధీనతను అధిగమించే సహకారయుత జీవితాన్ని నెలకొల్పుతుంది. వ్యక్తిగతఆస్తి అనే సంకుచితత్వానికి లోనుగాక, సంఘ నిర్మాణంలో సారథ్యం వహించే శ్రామిక ప్రజానీక చైతన్యంగా రూపుదిద్దుకొంటుంది. ఇలాంటి చైతన్యంలో సిద్ధాంత భ్రాంతులు నిరాధారమౌతాయి. కనుక నవసమాజ చైతన్యం స్వచ్ఛందమైన, నిరాటంకమైన పరిశోధనను, విమర్శను ప్రోత్సహించి పెంపొందిస్తుంది.

సామ్యవాద చైతన్యం సాంఘికశాస్త్రాన్నీ సాంఘికాభివృద్ధిసూత్రాలనూ మానవ ప్రయోజనాలకై వినియోగిస్తుంది. అలాగే ప్రకృతి శాస్త్రాలనూ వాటి సూత్రాలనూ మానవాళికై వినియోగిస్తుంది. ఈ శాస్త్రీయ చైతన్యంలో అంతర్భాగంగా తత్వశాస్త్రాన్ని సమన్వయించి నిర్ణయిస్తుంది. కనుక సామ్యవాద సమాజంలో ప్రకృతి విజ్ఞానమూ, సాంఘిక విజ్ఞానమూ దేని కదేగా విడివడియుండవు. రెండూ ఏకోన్ముఖంగా, పరస్పర సమన్వయంతో పురోగమిస్తాయి. మార్క్స్ ఇలా వ్రాశాడు :

"శాస్త్రం ప్రకృతినుండి ప్రారంభమైతేనే నిజమైన శాస్త్రం అవుతుంది. ప్రకృతి మానవుడుగా అభివృద్ధిచెందిన చరిత్రలో మానవ చరిత్ర అంతర్భాగమే. పిదప, ప్రకృతి విజ్ఞానం మానవ విజ్ఞానాన్నెలా యిముడ్చుకుందో, అలాగే మానవవిజ్ఞానం ప్రకృతి విజ్ఞానాన్ని తనలో ఇముడ్చుకుంటుంది. ఫలితంగా శేషించేది ఏకైక విజ్ఞాన శాస్త్రం."

సామ్యవాదంలో ప్రకృతి విజ్ఞానం, మానవ విజ్ఞానం అన్యోన్యంగా విలీనమౌతాయి. ఈ విజ్ఞానశాస్త్ర యేకత్వంలో మానవుణ్ణీ సమాజాన్నీ గూర్చిన తప్పు చైతన్యం, అంటే సిద్ధాంతభ్రాంతులు, వైదొలగిపోతాయి. ప్రకృతి విజ్ఞానంవలెనే మానవ విజ్ఞానంకూడ శాస్త్రీయస్థాయిని చేకూర్చుకుంటుంది. మానవుని ఉన్నత మానసికావసరాలు, సాంస్కృతికాంక్షలు భౌతికావసరాలుగా గుర్తింపబడతాయి. ఇలా మానవుని ఉన్నత మనోవ్యాపారానికి చెందిన విభిన్నభ్రాంతులు అంతరించిపోతాయి. మానసికశ్రమ శరీరశ్రమకంటె గొప్ప అనేభావం, ఆ భావంవెనుకనున్న వర్గస్వాతిశయం తొలగిపోతాయి. వైజ్ఞానికకృషి మానవుని వాస్తవావసరాల నిరోధానికి కాక, నిర్వహణకు మార్గం చూపుతుంది. ఇలా భౌతిక జీవిత పునాదిపై పెంపొందే వాస్తవావసరాలు కేవలం శారీరకావసరాలే కావు. కనుక భౌతిక సౌకర్యాలతోబాటు మానసికావశ్యకతలగు ఉన్నతాదర్శాలు. సంస్కృతి, విజ్ఞానం, సౌభ్రాతృత్వం, సభ్యత కూడ సాధింపబడతాయి.

మానవుడు జంతుదశనుండి విడివడి మానవుడుగా రూపొందాడంటే, తన అవసరాల సాధనకు ప్రకృతిపై యాజమాన్యాన్ని నెలకొల్పడం

మూలంగానే. పీడనపై ఆధారపడే సమాజంలో ప్రజలు ఇతరులకోసం శ్రమచేసి ఉత్పత్తిచేస్తారు. కాని ఆ శ్రామికులకు పెంపుడు జంతువులకు వలె తిండి గుడ్డ మాత్రం దొరుకుతాయి. మానవులుగా ఉన్నత అవసరాలను పొందేహక్కు వారికి నిరాకరింపబడుతుంది. ఏ కొందరు వ్యక్తులో (పాలకవర్గవ్యక్తులు) భౌతిక సాంస్కృతిక సిద్ధాంతకృషిని ప్రత్యేకించుకొని ఉన్నత మానవులుగా చెలామణిఔతుంటారు. వీరు సామాన్య ప్రజలవలె శ్రమించరు. శ్రమను హీనంగా చూస్తారు. అందువల్ల భౌతిక జీవితం సాంస్కృతిక జీవితం వేర్వేరనీ ఇందులో ఒకటి సామాన్యప్రజలకూ, మరొకటి ప్రత్యేక వ్యక్తులకూ, వేర్వేరుగా వర్తిస్తాయన్నభావం కొనసాగుతుంది. కాని సామ్యవాద సమాజంలో పీడన నిర్మూలనమౌతుంది. కనుక మానవుని అన్ని అవసరాలు – అవి భౌతికమైనవేనా మానసికమైనవేనా సరే – ప్రకృతిపై మానవునికిగల సమష్టి యాజమాన్యంనుండి రూపొందుతున్నట్లు గుర్తింపబడుతుంది. ఆ యాజమాన్య విస్తృతి ద్వారా సాంఘికోత్పత్తిలో ఐశ్వర్యాభివృద్ధీ సాంకేతిక నిపుణత పురోగమిస్తున్నట్లు (సమన్వయరూపంలో) గుర్తింపబడుతుంది.

ఈవిధంగా, సామ్యవాదవ్యవస్థ అభివృద్ధిచెందడంతో, శాస్త్రరంగం మానవుల చైతన్యాన్ని సిద్ధాంతాన్ని నిర్ధరిస్తుంది. కనుక ప్రజానీకం తమ విజ్ఞానాన్ని నిర్మించుకొనుటకూ తమ జీవితాన్ని సుఖసౌఖ్యాలకై రూపొందించుకొనుటకు, తద్వారా జీవిత సంపూర్ణతను సాధించుకొనుటకు సామ్యవాద సమాజంలో విజానశాస్త్రం సాధనంగా వినియుక్తమౌతుంది.



# 10వ అధ్యాయం

## సత్యం

సత్యం భావాలకూ భౌతిక వాస్తవికతకూ మధ్య సమన్వయం. ఈ సమన్వయం సాధారణంగా పాక్షికమూ అసమగ్రమూ అయి ఉంటుంది. మనం నిర్ధరించే సత్య మెల్లప్పుడూ ఆ సత్యాన్ని మనం కనుగొని వ్యక్తీకరించే అవకాశాలపై ఆధారపడుతుంది. కాని భావాల సత్యం పాక్షికంగానైనా, అవి ప్రతిబింబించే భౌతిక వాస్తవికతమీద ఆధారపడేదే. మన మెప్పుడూ పూర్ణ సత్యాన్ని, శాశ్వత సత్యాన్ని అందుకోలేం. ఐనా, ఆ వంకకు నిరంతరం పురోగమిస్తూ ఉంటాం.

*పూర్ణసత్యం, ఖండసత్యం*

భావాల అభివృద్ధిక్రమంలో కొన్ని భ్రాంతులు, సత్యాలు ఎలా రూపొందుతాయో మనం పై అధ్యాయాల్లో గమనించాం. భ్రాంతులు సత్యాలుకావు. కనుక భౌతిక వాస్తవికతకు సమన్వయించే భావాలే సత్యాలన్నమాట. ఐతే, తత్వశాస్త్రంలో ఈ "సత్యం" విషయంలో కొన్ని తికమకలు లేకపోలేదు.

భావాలు భౌతిక వాస్తవికతతో క్రమ క్రమంగా సమన్వయం చెందుతాయి. పదార్థంతో భావాల సారూప్యం పాక్షికంగాను, అసమగ్రంగాను ఉంటుంది. ఒకానొక పదార్థాన్నిగూర్చిన మన భావం ఆ పదార్థపు సమగ్ర

సంపూర్ణతకుగాక ఒకానొక పార్శ్వానికిమాత్రమే పరిమితమైయుండవచ్చు. భావంలో ప్రతిబింబించని విశేషతకూడ పదార్థంలో శేషించియుండవచ్చు. కనుక భావం పదార్థానికి అన్వయించే సారూప్యక్రమం పాక్షికమూ, అసమగ్రమూ అయినదన్నమాట. ఉదాహరణకు రామయ్య ఒక వ్యక్తి. ఐతే రామయ్య రైతా, కూలీయా, విద్యార్థియా మున్నగు ప్రశ్నలన్నింటికీ రామయ్యనుగూర్చిన మన భావం సమాధానమీయనక్కరలేదు. అయితే ఇలాంటి సందర్భాల్లో మనం భావాలను అసత్యాలని చెప్పం. తోడ్తో భావాలు సమగ్ర సంపూర్ణములనికూడ అనం. ఈ విధంగా సత్యం ఒకానొక భావానికి వర్తించే లేక వర్తించకపోయే ధర్మంగాకాక, కొన్ని పరిమితుల్లో కొంతమేరకు సమన్వయించే ధర్మంగా ఉంటుంది. అనేక ప్రతిపాదనల్లో సత్యం ఒక సమస్యకు అన్ని విధాలాచెందే, లేక చెందకపోయే ధర్మంగాకాక కొన్ని పరిమితుల్లో, కొంతమేరకు కొన్నివిధాల వర్తించేదిగా ఉంటుంది.

కొన్ని ప్రతిపాదనలు పూర్తిగా సత్యమైనవిగాకూడ ఉంటాయి. వాటి సంపూర్ణతను మనం గుర్తిస్తాం కూడ. అనేక వాస్తవాల ప్రకటనలో ఈ సత్యం వర్తిస్తుంది. ఉదాహరణకు షాజహాన్ తాజ్‌మహల్‌ను నిర్మించాడు. ఈ ప్రతిపాదన పూర్తిగా సత్యమే. ఈ సత్యం మారిపోయేది కాని, కొందరు అంగీకరించనిదికాని కాదు. అలాగే కొన్ని సామాన్య ప్రతిపాదనలు కూడ పూర్ణసత్యాలుగా ఉంటాయి. ఉదా : "ద్రవపదార్థాలు పల్లానికి ప్రవహిస్తాయి." "ప్రజలు తిండిలేకుండా జీవించలేరు; నిష్కామ ప్రేమవల్ల సంతానం కల్గదు". ఈ వాక్యాలు పూర్తి సత్యాలే.

కాని మనం వెలిబుచ్చే అన్నిభావాలూ ఇలాంటి పూర్ణసత్యాలుకావు "రాముడు మంచివాడు" అన్నప్పుడు రాముని మంచితనం కొన్ని పరిమితుల్లోనే ఉద్దేశింపబడుతుంది. సాధారణంగా మనం భావాలను ప్రకటించటంలో సత్య నిరూపణోద్దేశంతోగాని, దృఢవాస్తవ పరిమితిలోగాని వ్యవహరించం. మనం ప్రకటించే భావాలు, వాక్యాలు – అవి నిర్దిష్ట వాస్తవాలైనా లేక సామాన్య ప్రతిపాదనలైనా – మన వ్యావహారికోద్దేశాలరీత్యా సత్యాలుగానే ఉండవచ్చు. కాని, పదార్థాన్ని దాని భావసారూ

ప్యతను నిరూపించేరీత్యా అవి పూర్ణసత్యాలు కాకపోవచ్చు. అలాంటి మన భావాలను, ప్రతిపాదనలను నూతన అనుభవానికీ, నూతన విజ్ఞానానికీ అనుగుణ్యంగా సరిదిద్దుకొని మెరుగు పరచుకోడం అవసరమవుతుంది. పూర్వం కాశీయాత్ర అంటే చావుబ్రతుకుల సమస్యఅని భావం. రైల్వే ప్రయాణం వచ్చాక ఈనాడు కాశీయాత్ర నిర్భయ ప్రయాణం మాత్రమే. ఈ విధంగా మన భావాలు అసత్యాలుకాక పాక్షిక సత్యాలుగా, సాపేక్ష సత్యాలుగా, అసమగ్రసత్యాలుగా ఉంటాయి. "బొంబాయి పెద్ద నగరం." విజయవాడతో పోలిస్తే అది పెద్దనగరమే. కాని కలకత్తాతో పోలిస్తే చిన్ననగరం. కనుక విజయవాడ పౌరుని దృష్ట్యా బొంబాయి పెద్ద నగరమూ, కలకత్తా పౌరుని దృష్ట్యా చిన్న నగరమూను. కనుక ఈ రెండూ పాక్షికంగా, సాపేక్షంగా, అసమగ్రంగా సత్యాలేగాని, అసత్యాలు కావు.

సామాన్య వ్యవహారంలోనేకాక, శాస్త్రరంగంలోకూడ సత్యంయొక్క నిర్దిష్టత సుపరిచితమే. శాస్త్రం భౌతిక క్రమాలను వాస్తవికంగానే ప్రతిబింబిస్తుంది. బాహ్యప్రకృతియొక్క చలనాన్నీ అన్యోన్యసంబంధాన్నీ శాస్త్రసూత్రాలు వివరిస్తాయి. ఐనా విజ్ఞానశాస్త్రం నిర్ధరించిన అనేక సూత్రాలు పదార్థంయొక్క పూర్ణసారూప్యతతో పూర్ణసత్యపు అధికారాన్ని చేకూర్చుకున్నవిగా లేవు.

ఉదాహరణకు, సమానాంతరరేఖలు కలియవని రేఖాగణితంలో సూత్రం. ఇది సత్యమే కాని సరళరేఖ వృత్తంయొక్క చాపమని చెప్పినప్పుడు, వృత్తకేంద్రం రెండు రేఖలకూ ఒకటేనని నిరూపించటానికి వీలులేదు. కనుక సమానాంతర రేఖలు కలియవన్న సూత్రం పూర్ణసత్యం కాదు.

అలాగే యాంత్రిక చలన సూత్రాలుకూడ. యంత్ర సంచాలనలో పదార్థ చలన ధర్మాల సంబంధాన్ని ఇంజనీరింగులో అనుసరిస్తారు. కాని ఇటీవలి అణుపరిశోధనలు యాంత్రిక చలన ధర్మాలకు భిన్నమైన నూతన చలన క్రమాన్ని ఆవిష్కరించాయి. కనుక యాంత్రికచలనం పూర్ణసత్యం కాదన్నమాట. అయితే దీని అర్థం యాంత్రిక చలన సూత్రాలు అసత్యా

లని కాదు. క్వాంటమ్ మెకానిక్సు యాంత్రిక చలనం కంటే విశేషమైన సూక్ష్మ పరిశోధనలు జరిపి పరమాణు దశలో పదార్థ చలన క్రమాన్ని వివరిస్తుంది; యాంత్రిక చలన పరిమితులను వ్యక్తీకరిస్తుంది. ఐతే ఈ క్వాంటమ్ మెకానిక్సు కూడ చలనంయొక్క పూర్ణ సత్యాన్ని కాక పరిమిత సత్యాన్నే నిరూపిస్తుందని అనేకమంది శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

ఈ విధంగా, విజ్ఞానశాస్త్రంయొక్క లక్ష్యం పూర్ణసత్య నిరూపణ కాదు. మనం ఒక విషయాన్ని పూర్ణ సత్యమని భావిస్తే, ఇక ఆ విషయంలో ఇతోధిక పరిశోధన అవసరముండదు. పూర్ణసత్యాన్ని కనుగొనటంతో పరిశోధనయొక్క ఆవశ్యకత తీరిపోతుంది. కనుక పూర్ణ సత్యాన్ని నిరూపించాలన్న ధ్యేయం శాస్త్రపరిణామానికి అనుకూలం కాక విరుద్ధమే. ఆ ధ్యేయం భావిపరిశోధనలకు, తన్మూలకమైన విజ్ఞాన వికసనకు తోడ్పడదు. సత్యంయొక్క అధిక అసమగ్రతను అల్ప అసమగ్రతగా సరిదిద్దే క్రమానికి సరిపడదు. కనుక, శాస్త్రం పదార్థం యొక్క నిర్దిష్ట జ్ఞానాన్ని ఆధారం చేసుకుని, సామాన్య జ్ఞాన అసమగ్రతను నివారిస్తూ, క్రమక్రమంగా ముందుకు సాగుతుంది.

ఐతే భావ వాదం ఈ విధంగా చూడదు. అది "యేకమేవా ద్వితీయమ్ బ్రహ్మ", "సత్య మనంతం బ్రహ్మ" మున్నగు సూత్రాలతో పూర్ణసత్య నిరూపణతో ప్రారంభమౌతుంది. అవి సత్యాన్ని తార్కిక సత్యమనీ, భౌతిక సత్యమనీ దేనికది విడదీసి, తార్కిక సత్యం పూర్ణసత్యమంటుంది. ఆ తార్కిక పూర్ణ సత్యానికి కూడ తార్కికాధారం దొరకక మతంలేక నమ్మకాన్ని ఆశ్రయిస్తుంది. ఈవిధంగా భౌతిక భూమికనుండి వైదొలగి ఆత్మజ్ఞానం, మోక్షం, సన్యాసం, జప తపాలు మున్నగు వైరాగ్య ధోరణులలో భావవాదం పడిపోతుంది.

కనుక శాస్త్రీయ విలోకనలో "సత్యం", "అసత్యం" అనేవి ప్రధానమైన గీటురాళ్ళుకావు. ఎంగెల్సు యిలా వ్రాశాడు :

> "వాస్తవంలో శాస్త్రీయ రచనలు సత్యం, అసత్యం అనే ఛాందస నైతికప్రయోగాలను పరిహరిస్తాయి ఈ పదప్రయోగాలు

సర్వాతిశయాలోచనయొక్క సర్వాతిశయ ఫలితాలను నిరూపించగోరే పదాడంబర రచనల్లో మనకు అడుగడుగునా కన్పిస్తాయి."

*సత్యం, అసత్యం*

ఏవో కొన్ని వాక్యాల్లో, ప్రతిపాదనల్లో తప్ప సత్యం సంపూర్ణంగాకాక ఖండంగా, తాత్కాలికంగా, పరిమితంగా మాత్రమే ఉంటుంది. కనుక, మనవాక్యాలను నూతనానుభవాన్నిబట్టి మార్చుకొనటం, సరిదిద్దుకొనటం అవసరమౌతుంది. నూతనానుభవాలు మనభావాలలో మార్పును కోరినప్పుడు మనం పాత భావాలను యధాతధంగానే కొనసాగించటమంటే, సత్యాన్ని అసత్యంగా మార్చటమే అవుతుంది.

ఉదాహరణకు యాంత్రిక చలనసూత్రాలు. ఇవి ఈనాడుకూడా ఇంజనీరింగులో అనుసరింపబడుతున్నాయి. అవి అసత్యాలనీ, త్రోసివేయాలనీ యెవరూ అనరు. కాని యాంత్రిక చలనసూత్రాలు తగు మార్పులు లేకుండా పదార్థచలనక్రమానికంతటికీ వర్తించవని ఈనాటి పరిశోధనలు రుజువు చేశాయి. కనుక ఈనాడు న్యూటన్ సిద్ధాంతమే పదార్థ చలన క్రమానికంతటికీ వర్తిస్తుందని భావించటమంటే, అసత్యాన్ని ధృవీకరించటమే.

దీన్నిబట్టి, ఒకానొక అసమగ్ర ఖండ సత్యాన్ని దానివాస్తవిక పరిమితులకు మించి సమన్వయించినచో అది అసత్యంగా మారిపోతుందన్న మాట. అంటే కొన్ని పరిమితుల్లోగల సత్యం ఆ పరిమితుల వెలుపల అసత్యమౌతుంది. ఆకాశంపై మెరుపు మెరుస్తుంది. "అదిగో మెరుపు" అని మన మంటాం. కాని ఆ అన్నంతలోనే మెరుపు అదృశ్యమౌతుంది. కనుక "అదిగో మెరుప"న్న వాక్యం తృటిలోనే అసత్యంగా మారిపోతుంది.

సామ్యవాద వ్యవస్థ రూపొందినతర్వాత ప్రభుత్వయంత్రం డుల్లిపోతుందని మార్క్స్, ఎంగెల్స్ చెప్పారు. ఇది సత్యమే. కాని పరిమితులకు అతీతమైన సత్యంకాదు. మార్క్స్, ఎంగెల్స్ రాజ్యాంగ యంత్రం డుల్లిపోవటానికిగల షరతులనుగూర్చి చెప్పలేను. అందుకు

చెందిన అనుభవం వారికి లేదు. కాని సోవియట్ యూనియన్‌లో సామ్య వాదాన్ని నిర్మించే అనుభవంలో ఆ షరతులు విదితమైనవి ఒకవంక సామ్యవాద దేశాలూ, మరోవంక పెట్టుబడిదారీదేశాలూ సహజీవనం సాగిస్తున్నంతవరకు సామ్యవాద దేశాల్లోకూడ ప్రభుత్వ యంత్రం అనివార్య మౌతుందనీ, సామ్యవాదం ప్రపంచవ్యాప్తంగా విజయంసాధించి నప్పుడే ప్రభుత్వయంత్రం పూర్తిగా డుల్లిపోతుందనీ అనుభవం ఋజువు చేసింది. కనుక, ఈ నా డెవరైనా సోషలిస్టుదేశాల్లో ప్రభుత్వయంత్రం డుల్లిపోవాలని నిర్నిబంధంగా వాదిస్తే అది అసత్యాన్ని బలపరచటమే. అంతేకాక, అలా వాదించే రివిజనిస్టుధోరణి నేటి సామ్యవాదదేశాల స్థితినిబట్టి ప్రమాదకరంకూడ, అలా వాదించటం సామ్యవాద ప్రభుత్వా లను బలపరచేబదులు బలహీనపరచటమే ఔతుంది. పెట్టుబడిదారీదేశాలు సామ్యవాద వ్యవస్థకు వ్యతిరేకంగా దాన్ని వినియోగించుకొనేందుకు అవ కాశం కలిగించట మౌతుంది. కనుక ఎంగెల్స్ యిలా వ్రాశాడు :

"సత్యమూ, అసత్యమూ పరస్పర వ్యతిరేక భావాలన్నిటివలె అత్యంత పరిమితరంగంలోనే పూర్ణ అన్వర్థతను కల్గియుంటాయి. ఆ పరిమితరంగానికి వెలుపల విరుద్ధతలను అన్వయించగానే ఆ విరుద్ధ తలు తమవ్యతిరేకతలుగా మారిపోతాయి. అంటే సత్యం అసత్యం గాను. అసత్యం సత్యం గాను మారిపోతుంది."

"ప్రపంచంలో ఏదీ శాశ్వతంకాదు. ప్రపంచంలో ప్రతిదీ చలనం, మార్పు కలదే ప్రకృతి మారుతుంది. సమాజం మారు తుంది. సంప్రదాయాలూ అభ్యాసాలూ మారుతవి. న్యాయాన్ని గూర్చిన భావాలు మారుతవి. 'సత్యమే మారిపోతుంది. అందుకనే గతితర్కం ప్రతిదాన్నీ సవిమర్శకంగా చూస్తుంది. అందుకే అది అఖండ శాశ్వత సత్యంయొక్క అస్తిత్వాన్నీ, నిరూపణనూ నిరాక రిస్తుంది."

— స్టాలిన్.

సత్యాలెలా పాక్షికతకు, అసమగ్రతకు లోనై అసత్యాలుగా మారే అవకాశ ముంటుందో, అలాగే అనేక అసత్యాలుకూడ పూర్ణ అస త్యాలుగా ఉండక. సత్యాంశనుకూడ గల్గియుంటాయి.

ప్రజలు వ్యక్తీకరించే భావాలన్నీ వారి అనుభవాలనుబట్టి, వారి విజ్ఞానాన్నిబట్టి ఉంటాయి. ఈ పరిమితి వారిలో పొరబాటు భావాలకు దారితీసినా, ఆ పొరబాటు భావాలు పొరబాటుగానైనా వాస్తవికతను ప్రతిబింబించుటకు కూడ దారితీయవచ్చు. ఉదాహరణకు అక్బరు ప్రతిపాదించిన 'దీనె ఇలాహి' సిద్ధాంతం. ప్రజలు యే మతానికి, యే సంప్రదాయానికి చెందినవారైనాసరే తమ ఏకైక సంరక్షకుడగు పాదుషా కోసం సర్వస్వాన్ని త్యాగం చేయుటకు సిద్ధపడటమే దివ్యాదేశమని ఈ సిద్ధాంతంయొక్క సారాంశం. ఈ సిద్ధాంతం హిందూ-ముస్లిం విభేదాలను బలహీనపరచి మొగలు సామ్రాజ్యాన్ని విస్తరించుటకు ఉపకరించింది. ఇందులో పాదుషాను బలపరచాలనడం 'దివ్యాదేశ' మన్నది పొరబాటే. కాని పాదుషాను బలపరచటంద్వారా జాతీయైక్యతను విస్తృత పరచాలన్నది మాత్రం వాస్తవం.

అలాగే బ్రిటిషు విప్లవంలో ప్యూరిటన్లు తాము "దివ్యనిర్దేశితు"లమని భావించి పోరాడారు. పాత సమాజపు జీర్ణశక్తులను కూలద్రోసి, పురోగామిక సాంఘికశక్తిగా వీరు రూపొందిన అంశం వాస్తవమే. కాని దివ్య నిర్దేశానికి చెందిన వారి భావాలు అసత్యాలు. ఐతే ఆ రోజుల్లో వారు తమ నిస్సందేహమైన అభిప్రాయాలను ప్రకటించుటలో దైవభావాన్ని వినియోగించుకొనటం జరిగింది.

ఇదేవిధంగా విజ్ఞానశాస్త్రంలోను, తత్వశాస్త్రంలోను కూడ సరిదిద్ద వీలుకాని. నిరాకరింపబడ్డ అనేక పొరబాటుభావా లున్నాయి. ఐనా, ఆ పొరబాటు భావాల్లోకూడ వక్రరూపంలోనైనా, తప్పుగానైనా ఒకానొక సత్యాంశ దాగియుండకపోదు.

సాధారణంగా ప్రత్యక్షమైన పొరబాట్లను నిరాకరించటం చాల తేలిక. పూర్తి అసత్యాన్ని, పూర్తి పొరబాటును మనం తేలికగానే కొట్టివేయవచ్చు ఉదాహరణకు "తాజ్‌మహల్‌ను అక్బర్ కట్టించా"డని ఎవరైనా అంటే "కాదు, దాన్ని షాజహాన్ కట్టించాడు; కనుక అది పొరబాట"ని మనం తేలికగాత్రోసివేయవచ్చు. ఇక్కడ మనం ఒక తప్పు భావాన్నీ, అందుకు చెందిన ఒక వాస్తవాన్నీ చెప్పటంద్వారా ఖండించాం.

కాని వాస్తవ పునాదిగల క్లిష్టమైన పొరబాట్లను మన మీ విధంగా త్రోసిపుచ్చలేము. ఉదాహరణకు వ్యక్తిగత పెట్టుబడులు అత్యుత్తమమైన వని ఒక పత్రిక చెబుతుంది. దీన్ని మనం "ఔను-కాదు" అన్న ధోరణిలో త్రోసిపుచ్చలేం. కనుక ఆ పత్రిక ఎందుకని అలా చెబుతున్నదో, ఆపత్రిక ఎవరిదో, అలా చెప్తే ఎవరికి లాభమో నన్నది మనం పరిశీలించాలి. తోడ్తో వ్యక్తిగత పెట్టుబడులకంటె జాతీయ పెట్టుబడులు ఏవిధంగా ఉత్తమమైనవో నిరూపించవచ్చు. ఈ విధంగా, సత్యం ఎలా వక్రీకరింపబడిందో చూపుతూ, దానికిగల ఆధారాన్ని సరిచేస్తూ అసలుసత్యాన్ని వెలికి లాగవచ్చు.

భావవాదాన్నిగురించి లెనిన్ ఏమన్నాడో చూదాం:

"మొరటైన, ముక్కుకు సూటియైన అధి భౌతిక దృష్టితో చూస్తే, తాత్వికభావవాదం అర్థంలేనిది. కాని, గతి తార్కిక భౌతికవాద దృష్టితో చూస్తే, భావవాదం జ్ఞానం యొక్క ఒకానొక ధర్మాన్ని, పార్శ్వాన్ని, ముఖాన్ని పాక్షికంగాను, అతిగాను, ప్రకృతితోగాని పదార్థంతోగాని సంబంధం లేనిదిగాను, పరిపూర్ణత్వం గలది గాను వృద్ధిచేస్తుంది. భావవాదం మతతత్వవాదమే. ఇది నిజం. కాని భావవాదం మానవునిగూర్చిన అనంత, సంక్లిష్ట జ్ఞానంలోని ఒక ఛాయ ద్వారా మతతత్వానికి మార్గం వేస్తుంది. అది నిరాధారమైనదికాదు. నిస్సందేహంగా అది నిర్గంధకుసుమమే; కాని జ్ఞానమనే సజీవ వృక్షంపై వికసించిన నిర్గంధకుసుమం."

కనుక, భావవాదం పొరబాటు ధోరణులు తమ తమ కాలాల్లో సత్యాన్వేషణకు తోడ్పడ్డాయని మనం గుర్తించవలసి యుంటుంది. ఒక్కొక్కసారి ఆ ధోరణులు కొన్ని వాస్తవాల ప్రథమ వ్యక్తీకరణకు ఏకైక మార్గాలుగా కూడ ఉండవచ్చు. కాని, అలాంటి పొరబాటు భావాల ఆధారాన్ని మనం విశ్లేషించగలిగినప్పుడు వాటిని అనుసరించవలసిన అగత్యం ఉండదు. ఉదాహరణకు భావవాదులు తత్వశాస్త్రాన్ని పెంపొందించారు. కాని ఈనాడు మనం భావవాదధోరణులను అనుసరించ నవసరం లేదు. ఆ యా కాలాల్లో భావవాదం ఏ సత్యాలను వ్యక్తీకరించటానికి

ప్రయత్నించిందో ఆ సత్యాలను మన మీనాడు భావవాదం లేకుండానే ఎక్కువ సమగ్రంగా వివరించగలం. అంతేగాక, భావవాద ధోరణుల లోని వక్రతనూ, పొరబాట్లనూ ఈనాడు మనం చూపగలంకూడ. కనుక ఈనాడింకా భావవాదాన్నే వినియోగించుకోవలసిన ఆవశ్యకత లేదు.

సత్యం, దాని సాపేక్షత

సామాన్యంగా సత్యం అసమగ్రంగాను, పాక్షికంగాను, ఖండం గాను ఉంటుందనీ, సత్యంలో పొరబాటూ పొరబాటులో సత్యం కను గొనబడుతుందనీ మనం పైన గమనించాం. కనుక, ఒకానొక విష యాన్నిగూర్చి మనం పూర్ణసత్యాన్నికాక ఖండసత్యాన్నే వ్యక్తీకరిస్తా మన్నమాట. ఒకానొక విషయాన్నిగూర్చి ఒకానొక నిర్దిష్టదశలో, నిర్దిష్ట విధానంలో మనం గ్రహించగల్గే సత్యం ఆ సత్యాన్ని గ్రహించుటలో అప్పటికి లభ్యమయ్యే అవకాశాలపైన, పరిమితులపైన ఆధారపడి యుంటుంది. ఈ పరిమితులు మనం సత్యాన్ని ఏ మేరకు ఏ సంబంధాల్లో వ్యక్తీకరిస్తున్నామో తెలియజేస్తాయి.

1. అందువల్ల సత్యం ఆ సత్యాన్ని గ్రహించే నిర్దిష్టావకాశా లనుబట్టి, సాధనాలనుబట్టి ఉంటుంది. పదార్థాలతో మనకుగల అనుభ వాన్ని, సంబంధాన్ని బట్టి మనం పదార్థ సత్యాన్ని వ్యక్తీకరిస్తాం.

2. కాని, ఆ సత్యం భౌతిక ప్రపంచానికి కూడా సంబంధించి యుంటుంది. వాస్తవ పదార్థాల, ధర్మాల, చలనసూత్రాల ప్రతిబింబంచే నిర్ధరింపబడుతుంది.

ఈ విధంగా సత్యాన్ని గురించిన వ్యక్తీకరణ, భౌతికవాస్తవికతతో సత్యానికిగల సంబంధం ఈ రెండూ మనపై ఆధారపడి యున్నాయి. ఐతే సత్యాన్ని గురించిన ఆ వ్యక్తీకరణ దేనినిగూర్చో యే భౌతిక వాస్త వాని కది వర్తిస్తుందో ననేది మనపై ఆధారపడదు.

ఇలా సత్యంలో సాపేక్షత -సంపూర్ణత- స్వగతశీలత, వస్తుశీలత రెండు అంశాలూ ఇమిడి యున్నాయి. ఇక్కడ మనం జ్ఞానంయొక్క- స్వగత, వస్తుగత పార్శ్వాల ఐక్యతను, స్వరూప స్వభావాల ఐక్యతను



గుర్తించాలన్నమాట. సత్యం అసత్యాన్ని గ్రహించే పరిస్థితులపైన, సాధన సంపత్తిపైన, అనుభవంపైన ఆధారపడి యున్నందున సాపేక్షమౌతుంది. తోడ్తో, అది ఏ పదార్థానికి చెందుతోందో, ఏ భౌతికవాస్తవాన్ని ప్రతిబింబించి వ్యక్తీకరిస్తుందో ఆ ఆధారం మానవుని చైతన్యానికతీతమైన పూర్ణసత్యమౌతుంది.

ఈ రెండు పార్శ్వాల్లో సాపేక్షతకు మాత్రమే ప్రాధాన్యమిస్తే స్వీయభావవాదం, సాపేక్షవాదం రూపొందుతవి. ఈ వాదాలు కేవలం స్వీయావగాహనలకూ, అనుభవాలకూ మాత్రమే పరిమితమై భౌతిక ప్రపంచాన్నీ, ప్రకృతినీ పరిగణించలేవు. కనుక ఈ ధోరణిలో వాదించేవారు భౌతిక వాస్తవికత అజ్ఞాతమనీ, కనుక అజ్ఞేయమనీ అంటారు. ఉదాహరణకు సర్ ఆర్థర్ ఎడింగ్టన్ అను ఆంగ్లతాత్త్వికుడిలా వాదించాడు: "మనకు నిజంగా భౌతికప్రపంచంలోగల అణువులనుగూర్చి ఏమీ తెలియదు. మనకు తెలిసిందల్లా మీటర్ ముల్లులూ తెరపై గుర్తులే." ఈ విమర్శ నిజమే. మన అణువిజ్ఞానం శాస్త్రపరిశోధనలపై ఆధారపడియుంది. శాస్త్రజ్ఞులు అణుధర్మాలను మీటర్ ముల్లులు, తెరపైగుర్తుల పరిశీలనద్వారానే నిరూపించారు. అందుకుతగ్గ యంత్రపరికరాలను వారు సిద్ధపరచుకొని వాడుక చేశారు. ఖగోళశాస్త్రజ్ఞులుకూడ దూరదర్శిని యంత్రాలను వినియోగిస్తారు. అలాగే ఉష్ణాన్ని, విద్యుత్తును, అయస్కాంతాన్ని మనం మీటర్లద్వారానే గ్రహిస్తున్నాం. కనుక సూక్ష్మమైన అణుపరిశోధనల్లోకూడ మీటర్లను వినియోగిస్తారు ఇలా యంత్ర సాధనాల సహాయంతో ఇంద్రియగోచరంకాని ప్రకృతి పదార్థాలనూ ధర్మాలనూ పరిశీలించటం మామూలే. కాని ఎడింగ్టన్ అణువులను, వాని ధర్మాలను ఉన్నవి ఉన్నట్లుగా కన్నులతో చూడలేకున్నాం గనుక అవి "లేనే లేవనే" వరకు విమర్శ సాగిస్తాడు.

ఇక రెండవ పార్శ్వమైన సంపూర్ణతను మాత్రమే నొక్కిచెబితే, పిడివాదం మిగులుతుంది. వాస్తవికత, దాని పూర్ణ సత్యత్వం ఈ పిడివాదానికి దారితీస్తాయి. ఉదాహరణకు వెనుకటి తరపు భౌతిక శాస్త్రజ్ఞులు తమ సూత్రాలు భౌతిక వాస్తవికతను ప్రతిబింబించాయి గనుక ప్రపంచ

మంతా చిన్నవీ, గట్టివీ అయిన గుండ్రని సూక్ష్మపదార్థాల కూడిక అనీ, అవే మూలపదార్థాలనీ, అంతకుమించి మరో పదార్థం లేదనీ సిద్ధాంతీకరించారు. బరువు కలిగియుండటం, స్థలాన్ని ఆక్రమించటం మూల పదార్థంయొక్క లక్షణమన్నారు. క్రీస్తుకు ముందు కణాదుడు కూడ ఇలాగే పదార్థం అనగా అణువనీ, అణువులు రెండు మూడుగా కలిసి యున్నప్పుడు ద్వ్యణుక్కలు, త్ర్యణుక్కల రూపంలో మన జ్ఞానేంద్రియాలకు గోచరిస్తాయనీ సూత్రీకరించాడు. ఐతే ఈ నిరూపణలు పరీక్షకు నిల్చేవికావు. కనుక వాటికి సాపేక్షాంశతో సమన్వయం లేదన్న మాట

కనుక సత్యం భౌతిక వాస్తవపు ప్రతిబింబం. కాని, ఆ ప్రతిబింబం తాను రూపొందే పరిస్థితులకు లోబడి యుంటుంది. ఇరు పార్శ్వాలనూ మనం పరిగణించవలసి యుంటుంది. దీన్నే లెనిన్ ఇలా వివరించాడు :

> "గతితార్కిక భౌతికవాద దృష్టినుంచి చూస్తే, సాపేక్ష పూర్ణసత్యాల మధ్య అధిగమించరాని అడ్డుగోడలు లేవు. మార్క్స్ ఎంగెల్సుల గతితార్కిక భౌతికవాదం సాపేక్షాంశను కలిగియున్నది నిజమే. కాని అది సాపేక్షవాదం క్రిందికి రాదు. అంటే, మన విజ్ఞాన సర్వస్వపు సాపేక్షతను అది గుర్తిస్తుందేకాని భౌతికసత్యాన్ని నిరాకరించే విధంగా కాదు. భౌతిక వాస్తవికతను గూర్చిన మన జ్ఞానం చారిత్రక పరిస్థితులచే పరిమితమవుతుందని గుర్తించే రీతిలో అది సాపేక్షతను అంగీకరిస్తుంది."

"భౌతిక సత్యం ఉంటుందా?" అని ప్రశ్నిస్తూ, లెనిన్ రెండు ప్రశ్నలనూ కలగాపులగం చేయకూడదన్నాడు ఆ రెండు ప్రశ్నలూ యివి:

"(1) భౌతికసత్యం అనేది ఒకటుందా ? అంటే మానవభావాలు కర్తపై ఆధారపడకుండా ఉండగలవా? మానవునిపై లేక మానవాళిపై అవి ఆధారపడకుండా వుండగలవా?"

"(2) ఉన్నట్లయితే భౌతికసత్యాన్ని వ్యక్తీకరించే భావాలు ఆ సత్యాలను మొత్తంగా ఒకేసారి పరిపూర్ణతతో నిర్నిబంధంగా వ్యక్తీకరించగలవా లేక అసమగ్రంగాను సాపేక్షంగానా ?"

వీటికి సమాధానం ఏమిటి ?

(1) మానవభావాలు కర్తపై అంటే నిర్దిష్టవ్యక్తిపై లేక మానవాళిపై ఆధారపడవు. ఎందుకంటే, ఆ భావాలు మానవుని మేధకు, ఆలోచనకు వెలుపలవుండే భౌతిక సత్యాన్ని ప్రతిబింబిస్తాయి. ఆ సత్యాన్ని గురించి ఒక్కొక్క వ్యక్తికిగల ఒక్కొక్క అభిప్రాయంతో ప్రమేయం ఉండదు.

(2) ఆ భావాలు భౌతికసత్యాన్ని పూర్ణత్వంతో, సమగ్రత్వంతో కాక, అసమగ్రంగా, సాపేక్షంగామాత్రమే అనగా ప్రజల విజ్ఞానావకాశాలను, పరిశీలనా పరిమితులను బట్టి వ్యక్తీకరిస్తాయి.

ఈవిధంగా సత్యం భౌతిక వాస్తవికతతో భావాలకుగల సమన్వయంపై ఆధారపడియుంటుంది. మన మీ సంబంధాన్ని యిరువైపులనుండీ చూడాలి. ఈ రీతిగా కర్త-కర్మల సమన్వయం సత్యాన్వేషణలో అనివార్య మౌతుంది. ఒకవంక మన భావాలపై ఏవిధంగానూ ఆధారపడనట్టి భౌతిక వాస్తవముంటుంది. మరోవంక భావాలు మానవ వ్యవహారంలో రూపుదిద్దుకొని ఆ వ్యవహారస్వభావంతో సంబంధించి యుంటవి. కనుక మనం ఏ విధంగా, ఏ రూపంలో, ఏ అంచనా ప్రకారం వాస్తవాన్ని ప్రకటిస్తామో అది మనపై మన వ్యవహారంపై ఆధారపడి యుంటుంది. ఇది కర్తకుచెందే స్వీయపార్శ్వం. కాని, మన భావాల్లో దేనిని వ్యక్తీకరిస్తామో అది కర్తకు చెందదు; స్వీయపార్శ్వానికి చెందదు. అది మన సాపేక్షజ్ఞానానికి ఆధారమైన మానవాళిపైగాక, ఆ పరిధి వెలుపల అస్తిత్వం గలిగి కర్మపరమై యుంటుంది.

*సాపేక్ష సత్యం, పూర్ణసత్యం : కార్యకారణ - స్థల - కాల భావాలు*

పూర్ణసత్యం ఏ విధంగా సాపేక్షసత్యంద్వారా వ్యక్తమౌతుందో కార్యకారణ – స్థల – కాల ఉదాహరణలతో నిరూపించవచ్చు.

ప్రకృతి పరిణామాన్ని గూర్చిన మన భావాలు ప్రకృతి పదార్థాలతోడి మన వ్యవహారాల ఫలితంగా, అనుభవాల ఫలితంగా రూపొందుతవి. అనుభవంద్వారానే మనం ప్రకృతిని మన ఇచ్ఛానుసారం మార్చటం నేర్చు

ఉంటాం. ఈ పునాదిపైనే పరిణామక్రమానికి చెందిన కార్యకారణ సూత్రాలనుగూర్చి కొన్ని భావాలను కల్గియుంటాం. ఇలా ప్రకృతిపరిణామపు కార్యకారణ భావాలు స్వగతశీలతతో నిర్ధారితమౌతవి. ఉత్పత్తి, సాంఘిక సంబంధాలు, సాంఘిక వ్యవహారాలతోబాటు కార్యకారణ భావం కూడ పరిణామం చెందుతుంది. వైదికయుగంలో అన్ని పదార్థాలూ సజీవమైనవనే సగుణసిద్ధాంతం, ఉపనిషత్కాలంలో ఒకే పరమాత్మ అన్ని పరిణామాలకూ మూలమనే సిద్ధాంతం, యాంత్రిక ప్రతిచర్య, ఆ పై గతి తార్కిక ప్రతిచర్య మున్నగు కార్యకారణ సిద్ధాంతాలు విభిన్నయుగాల జ్ఞానాభివృద్ధి దశలకు అనుగుణ్యంగా కొనసాగాయి.

కాని పరిణామక్రమాన్నిగూర్చిన కార్యకారణభావాలు మన అనుభవంనుండి ఉత్పన్నమైనప్పటికీ, అనుభవ స్వభావంపై ఆధారపడి యున్నప్పటికీ ప్రకృతి పరిణామం మాత్రం భౌతికసత్యమే. కనుక అసలు కార్యకారణక్రమం మనపైన, మన అనుభవంపైన ఆధారపడక స్వచ్ఛందమైన స్వతంత్రవర్తన కల్గియుంటుంది. అందువల్ల బాహ్యపదార్థాలను మార్చివేయటంలో మనం మన శక్తినీ, మనపై పదార్థాలకుగల శక్తినీ రెంటినీ అనుభవించటం ద్వారానే కార్యకారణభావాలను చేకూర్చుకుంటాం. ఆ భావాలను సాంఘికజీవితాభివృద్ధికి అనుగుణ్యంగా తాత్వికంగాను తార్కికంగాను విస్తరించి పెంపొందిస్తాం. కనుక ఆ భావాలు వాస్తవికమైనవే. ఆ భావాలకు మూలమైన పదార్థవాస్తవికత సమాజాభివృద్ధిలోరూపొందిన కార్యకారణ సూత్రాలన్నిటికీ వర్తించేదే. కాగా ఆ అసలు వాస్తవికత మనపై లేదా పదార్థంతో మనకుగల సంబంధంపై ఆధారపడదు; పదార్థమూ, దాని భౌతిక క్రమానికి చెందిన స్వచ్ఛంద వాస్తవికతగా అది ఉంటుంది. కనుక పరిణామక్రమపు కార్యకారణ సూత్రాలకూ, మానవ చైతన్యానికీ ఆధారం ప్రకృతి, దాని భౌతికక్రమమే.

ఇక భావవాదం. అది కార్యకారణాలను గూర్చిన భావాల్లో స్వగత పార్శ్వాని కెక్కువ ప్రాధాన్యం యిస్తుంది. భావవాదులు మన అనుభవంలో తార్కికక్రమాన్ని నెలకొల్పుటకుగాను కార్యకారణ సూత్రాలను ఆవిష్కరిస్తామనీ, తర్వాత ఆ సూత్రాలను మన అనుభ

వానికి వెలుపలగల ప్రకృతికి ఆపాదిస్తామనీ చెబుతారు. అంటే యీ రెండు కార్యాల్లో కర్తలమగు మనమే ప్రధానమన్నమాట. ఈ దృష్ట్యా పదార్థంయొక్క భౌతికవాస్తవికత అప్రధానమౌతుంది. ఇది వేదాంతంలో పరాకాష్టపొంది "జగత్తు మిథ్య" అనేవరకు పోయింది. ఈ భావవాదధోరణికి వ్యతిరేకంగా ఎంగెల్స్ "ప్రకృతియొక్క వాస్తవ ధర్మాన్ని గుర్తించటం, ఆ వాస్తవ ధర్మం మానవ మేధలో ఇంచుమించు వాస్తవికంగా ప్రతిబింబిస్తుందని గుర్తించటం భౌతికవాదం" అని వ్రాశాడు.

స్థలకాలాలను గూర్చిన భావాలుకూడ ఇలాంటివే. కాలగమనాన్ని గూర్చిన, స్థలావరణ ధర్మాలను గూర్చిన మన ఇంద్రియానుభవంతోను, వీటి సంబంధాలను గూర్చిన ప్రత్యక్షజ్ఞానంతోను స్థల కాలభావాలు ప్రారంభ మవుతాయి. పదార్థాల స్థలకాల ధర్మాలను, వాటి సంబంధాలను కనుగొనటంద్వారా మన సామాన్య భావాలు (స్థల కాలాలను గూర్చినవి) క్రమాభివృద్ధిగాంచి విస్తరించాయి. స్థలకాల భావాలు మానవానుభవానికి పరిమితములే కాని స్థలకాలాలు మానవానుభవానికి బాహ్యామైనవి. ఈ విధంగా స్థితియొక్క మౌలిక స్వరూపాలు స్థలకాలములే. అంతేకాదు. స్థలకాలములను గూర్చిన మన అభిప్రాయా లెప్పుడూ భౌతిక ప్రపంచపు వాస్తవ స్థలకాల స్వరూపాల ప్రతిబింబాలే. ఈ విషయమై లెనిన్ ఇలా వ్రాశాడు :

"భౌతికవాదం భౌతిక వాస్తవస్థితినీ, మన మానసికావరణ బయటఉండే పదార్థాలగతినీ గుర్తించటంతోబాటు, స్థలకాలాల భౌతికవాస్తవికతనుకూడ గమనించాలి. బాహ్యప్రపంచ వాస్తవికతకు చెందిన ఆకార-వికారాలను గూర్చిన శాస్త్రీయ విజ్ఞానం యే విధంగా భౌతిక వాస్తవికతను నిరాకరించదో, అదేవిధంగా స్థలకాలాల భౌతిక వాస్తవికతను గూర్చిన శాస్త్రీయ భావాలు స్థలకాలాల వాస్తవికతను నిరాకరించవు. మానవుడు తన ఇంద్రియజ్ఞానంద్వారా స్థలాన్ని యెలా గ్రహిస్తాడో. సుదీర్ఘమైన పరిణామంలో స్థలకాలాల నెలా గుణీకరిస్తాడోననేది ఒక విషయం. రెండవది మానవావరణకు

బాహ్యమైన పదార్థవాస్తవికత. అది మానవానుభవాలకు, అభిప్రాయాలకు సమన్వయిస్తుందా అన్నది పూర్తిగా వేరువిషయం. మన అనుభవం, అనుభూతి అధికాధికంగా భౌతిక స్థలకాలాలకు సమన్వయిస్తూ వాటిని ఉత్తరోత్తరసమగ్రతతో, నిర్దుష్టతతో ప్రతిబింబిస్తుంది."

ఈ విధంగా, మానవజ్ఞానంలోని స్వగత - వస్తుగత పార్శ్వాల సమన్వయం ద్వారా మనం సత్యాన్ని పరిగణిస్తాం.

*సత్యం, దాని పురోగతి*

మానవమేధ సత్యాన్ని ఏ మేరకు గ్రహించి నిరూపించగలదు?

సంపూర్ణమూ, అఖండమూ అయిన సత్యాన్ని మనం సాధించలేం. ప్రతిదాన్నిగూర్చి నూటికి నూరుపాళ్ళ సత్యం తెలుసుకోడం అసాధ్యం. కాని మనం నిరంతర సత్యాన్వేషణలో ముందంజ మాత్రం వేస్తున్నాం.

మనం నిర్దిష్ట వాస్తవానుభూతిద్వారానే కాక అనుమానం ద్వారా కూడ, అంటే సాపేక్ష,ఖండసత్యాల సమన్వయంద్వారాకూడ వస్తుతత్వం వంకకు సాగిపోతాం. అందువల్ల ఒకానొకవ్యక్తిగాని, ఒకానొక కాలపు మానవాళి గాని తెలుసుకొనే సత్యం ఎల్లప్పుడూ సాపేక్షంగానే అసమగ్రంగానే వుంటూ, పరిణామానికి సవరణకు లోనవుతుంది. ఐతే వ్యక్తులు ఒకరినుండి మరొకరు వారి వారి తప్పొప్పులనుండి నేర్చుకుంటారు. అదే రాబోయే సమాజానికి వర్తిస్తుంది. అందువల్ల నిర్దిష్ట, ఖండ, సాపేక్ష, అసమగ్ర సత్యం ఎల్లప్పుడూ భౌతిక వాస్తవపు అఖండ, పూర్ణ, సామాన్య సత్యాన్ని సమీపిస్తూ వుంటుంది. కాని ఆ లక్ష్యాన్ని అందుకోలేనిదిగా వుంటుంది.

మన భావాల్లో, ప్రకటనల్లో పునరావృత్తిజెందే ప్రపంచ ప్రకృతి వాస్తవిక సత్యం. అది నిజంగా వుండేదే. ఆ వాస్తవాన్ని మన భావాలుగా ఏమేరకు సమన్వయించి పునరావృత్తి చేస్తామో ఆ మేర కవి సత్యాలు. ఆ సత్యాలను మనం అనుభవం, ఆచరణలద్వారా పరీక్షిస్తాం. కాని

వస్తు-భావ సారూప్యమెప్పుడూ సమగ్రం, నిశ్చితం, శాశ్వతం కాదు. సారూప్యం పూర్ణసత్య లక్ష్యాన్ని నిరంతరం సమీపిస్తూ వుంటుంది. కాని దాని కెప్పుడూ ఎడంగానే వుంటుంది. పూర్ణ సత్యం దిగ్వలయంవలె సమీపించేకొద్దీ ఎడమౌతుంటుంది. కాని అది విశిష్టాద్వైతపు "సన్నిధి" వలె కాదు; మానవ విజ్ఞానం మానవుని ఉత్పత్తిసాధనాల వికాసంపైన, విజ్ఞానార్జనకు గల అవకాశాలపైన ఆధారపడి చారిత్రకంగా పురోగమిస్తుంది. ఎంగెల్స్ యిలా వ్రాశాడు :

"ప్రకృతియొక్క అన్ని వ్యవస్థలూ క్రమబద్ధమైన పరస్పర సంబంధం కల్గియున్నాయనే అనుభూతి కలిగిననాడు, ఆ క్రమబద్ధ సంబంధ మంతటినీ విజ్ఞానశాస్త్రం వివరంగాను, సామాన్యంగాను నిరూపించునట్లు అది ప్రోత్సహిస్తుంది. కాని ఆ సమర్థ సవివర శాస్త్రీయ నిరూపణవల్ల మనం నివసించే ప్రపంచ వ్యవస్థ అంతటినీ భావాల్లో సర్వ సమగ్రంగా చిత్రించడం అసంభవమే. అంతేకాక అది ఎప్పుడూ అసంభవంగానే వుంటుంది.

"మానవజాతి పరిణామంలో ఎప్పుడైనా ఒకవేళ ప్రపంచంలోని పరస్పర సంబంధాల వ్యవస్థను - భౌతిక, మానసిక, చారిత్రక రంగాల్లో- మానవులు పూర్తిచేయగల్గితే, దాని అర్థం మానవవిజ్ఞానం తన పరిమితి నందుకున్నట్లే. అందువల్ల మానవాళి తానొక వైరుధ్యానికి లోనైయున్నట్లు గ్రహిస్తుంది. ఒక వంక ప్రపంచ వ్యవస్థలోని అన్యోన్య సంబంధాలన్నింటినీ వివరంగా తెలుసుకోవాలి; మరోవంక మానవునియొక్క, ప్రపంచ వ్యవస్థయొక్క స్వభావాన్నిబట్టి ఈ పని ఏనాటికీ పూర్తిచేయరానిది. కాని ఈ వైరుధ్యం పై రెండు విభాగాల్లోనే ఉండక, మానసిక పురోగమనాని కంతటికీ ప్రేరణయై నిరంతరం క్రమక్రమంగా మానవజాతి పురోగమనంలో కార్యసిద్ధిని పొందుతుంది.

"ప్రపంచ వ్యవస్థయొక్క ప్రతి మానసిక చిత్రమూ వాస్తవికంగా చారిత్రకస్థాయి చేతను, స్వీయాత్మకంగా కర్తయైన మానవుని శారీరక, మానసిక నిర్మాణంచేతను పరిమితమైయుంటుంది."

ఐనప్పటికీ మానవాళి భౌతికప్రపంచపు పరిమిత మానసికచిత్రాల ద్వారా, వాటి నిరంతర పురోగమనంద్వారా సమగ్రతరసత్యాన్నీ, ఉన్నత తర జ్ఞానాన్నీ నిరంతరం పారంపర్యంగా చేకూర్చుకుంటుంది.

"మానవుని ఆలోచన సర్వోపరియేనా?" అని ఎంగెల్స్ ప్రశ్నించాడు. అంటే, మనం ఆలోచనద్వారా ప్రతిదాన్ని గూర్చిన పూర్ణసత్యాన్ని సాధించగలమా? అలా నిస్సందేహమైన సంపూర్ణజ్ఞానాన్ని సాధించటం సాధ్యమా?

ఈ సమస్యను చర్చించే సందర్భంలో మనం ఎం. సి. డోగల్ మున్నగు చరిత్రకారులను, మన స్తత్వవేత్తలను గుర్తుకు తెచ్చుకోవాలి. వీరు మానవచరిత్ర పరిణామాన్నంతటినీ మానవుల వ్యష్టి - సమష్టి ప్రవృత్తులద్వారా, తన్మూలకమైన భావాలద్వారా వివరించేందుకు ప్రయత్నించారు. అలగే దైహిక, మానసిక ప్రవృత్తుల వైవిధ్యంద్వారా సాంఘిక చరిత్ర కొనసాగుతుందని డెకార్టే, టి. హెచ్. హక్స్లీ మున్నగు వారు వాదించారు కాని ఇవేవీ వాస్తవచరిత్ర వైవిధ్యాన్ని నిరూపించ లేకపోయాయి.

"ఆలోచన సర్వోపరియేనా?" అనే ప్రశ్నకు ఎంగెల్స్ యిలా సమాధానమిచ్చాడు:

"దీన్ని ఔననో కాదనో తేల్చేముందు మనం మానవ ఆలోచన
అంటే యేమో తేల్చుకోవాలి. అది వ్యక్తిగత మానవుని ఆలోచనా?
దు. అది గతకాలపు, వర్తమానకాలపు, భావికాలపు కోటాను
మానవుల వ్యక్తిగత ఆలోచనలుగా ఉంటుంది. వేరుమాటల్లో
ఆలోచనల సర్వాధికారం మానవుల అత్యంత అనధి
పర ద్వారా చేకూరుతుంది. సత్యత్వపు నిర్నిబద్ధ
అందుకు చెందే పొరబాట్ల క్రమంలో లభ్య
ంతకాల మానవ అస్తిత్వంలేకుండా ఆలోచన
కపోవటంకాని సాధ్యంకాదు."

పై విధంగా ఎంగెల్స్ సూచించాడు.

"ఇక్కడ తిరిగి పై వైరుధ్యమే ఎదురౌతుంది. ఏమంటే, మానవ ఆలోచనయొక్క స్వభావాన్ని పూర్ణమని గ్రహించటం, తోడ్తో మానవవ్యక్తుల భావాలు అత్యంత పరిమితమై యుండటం అనే ఈ వైరుధ్యాన్ని అనంతాభివృద్ధిక్రమం ద్వారానే పరిష్కరించవచ్చు. లేక అధవా మన ఆచరణ పరిమితి రీత్యా మానవ పారంపర్యం యొక్క అంతులేని వరుసనుబట్టియైనా పరిష్కరించగలం. ఈదృష్ట్యా ఆలోచన ఎంత సాధికారికమో అంతే అనధికారికం. మరియు దాని జ్ఞానశక్తి ఎంత అపరిమితమో అంతే పరిమితం. అది తన స్వభావ రీత్యా, వృత్తిరీత్యా, అవకాశాలరీత్యా, చారిత్రక ప్రయోజనాలరీత్యా పూర్ణమూ, సాధికారమూను. కాని వ్యక్తిగత వ్యవహారంలోను, నిర్దిష్ట క్షణికజ్ఞానంలోను పరిమితమూ, అనధికారికమూను."

ఇలా ఎంగెల్స్ భావంయొక్క భౌతికస్థితినీ, మానసికస్థితినీ విశ్లేషించాడు.

ఆలోచనయొక్క సత్యాంశను, అధికారాంశను మనం పై విధంగా అంటే చారిత్రకంగాను, సాంఘికంగాను చూస్తాం. సత్యాన్ని గూర్చిన మార్క్సిస్టు సూత్రం పిడివాదాన్ని రూపుమాపుతుంది. పిడివాదం తన సామాన్య సూత్రీకరణలను - అవి ఎలా రూపొందినప్పటికీ- అతిక్రమించ వీలులేని తుది సత్యాలుగా పాటించా లంటుంది. ఆ సూత్రీకరణల ఆధారాలను పరిశీలించడానికిగాని, మార్చడానికిగాని, సంస్కరించడానికి గాని అనుమతించదు. అందుచే నూతనానుభవంలో, నూతన పరిస్థితు ఆ సూత్రీకరణలను త్రోసివేయటం అన్న ప్రసక్తి ఎక్కడిది ? వాద లక్షణాలను మార్క్సిజం ప్రతిఘటిస్తుంది.

పిడివాదంతోబాటు మార్క్సిజం సంకుచి కూడ పరిహరించాలని చెబుతుంది. అనుభవవా రించి సమన్వయిస్తుందేకాని, ఆ వాస్తవాలలో సూత్రాలను పాటించదు ; ఆ వాస్తవాలలో సంబంధాన్ని సమన్వయించదు. ఇలా కరణలనుండి, సిద్ధాంతాలనుండి త

పిడివాదం వలెనే అనుభవవాదంకూడ తాత్కాలికానుభవ పరిమితిని మించి చూడజాలదు.

అనుభవవాదం ప్రాగ్మాటిజం అనే పేరుతో నేడు బూర్జువాదేశాల్లో ప్రోత్సహింపబడుతూంది. దీన్ని "ఆచరణాత్మక భావవాదం" అని జాన్ డ్యూయీ వ్రాశాడు. భావాలు, సూత్రాలు, సిద్ధాంతాలు మన సుఖదుఃఖాల ఆధారంపై యేర్పడ్డాయని యూరపులో పాజిటివిస్టులు చెబుతున్నారు. ఇది వ్యక్తిగత భావవాద ధోరణి. ఐతే భావాలు, సూత్రాలు, సిద్ధాంతాలు మన ప్రయోజనాల ఆధారంపై యేర్పడ్డాయని అమెరికాలో ప్రాగ్మాటిస్టులు చెప్తున్నారు. కనుక ఇదికూడ వ్యక్తిగత భావవాద ధోరణియే. ఈ రెండు ధోరణులుకూడ పదార్థంయొక్క భౌతిక వాస్తవికతను, పరిణామ క్రమాన్ని శాస్త్రీయంగా గుర్తించలేవు. ప్రతిరోజూ సూర్యుడు ఉదయించటం మన సుఖదుఃఖాలకోసమనీ, మన పనిపాటల ప్రయోజనానికేననీ భావించటం స్వగతశీలతయేకాని, వస్తుశీలత కాదు.

"మతంవల్ల నీకు ప్రయోజనాలున్నాయి. మతం నీకు సుఖ దుఃఖాలలో తోడ్పడుతుంది. కనుక నీవు మతాన్ననుసరిస్తావు. కనుక భుక్తి ముక్తులకు వినియోగపడే మతం అనివార్యమౌతూంది." అనే ధోరణిలో పాజిటివిస్టులూ, ప్రాగ్మాటిస్టులూ వాదిస్తారు. ఈ విధంగా వారు భాయీ భాయీలు. ఐతే, మతం శాస్త్రీయ వాస్తవికతకు సరిపడదనేది స్పష్టం.

ఈ ధోరణులీనాడు తత్వశాస్త్ర రంగంలోను, విజ్ఞానశాస్త్రరంగం లోను విరివిగా ప్రచారంలో ఉన్నాయి. కార్మికోద్యమంలో కూడ ఇవి తరచు యెదురౌతుంటాయి. కార్మికోద్యమంలో కొన్ని సిద్ధాంత సూత్రాలను కంఠస్థం చేసి వాటినివల్లించటం ద్వారా అన్ని నూతన సమస్యలనూ పరిష్కరించవచ్చు ననే ధోరణి పిడివాదమనిపించు కుంటుంది. దీనివల్ల ప్రజలు తమ అనుభవాన్నుండి గుణపాఠం పొందలేక, నూతన పరిస్థితులలో నూతన విధానాలను రూపొందించు కొనే చొరవను కోల్పోతారు. అలాగే అనుభవ వాదం ఎప్పటికప్పుడు ప్రాప్త కాలజ్ఞతతో తక్షణ సమస్యలనే పరిష్కరించు కొంటూ, మిగిలిన సమస్య లన్నిటినీ ఉపేక్షిస్తుంది వాటిని కార్యకర్తలకు గాక, కేవల మేధావుల ఆలోచనకు వదలి

వేస్తుంది. ఇందువల్ల ప్రజలు స్వానుభవాన్నుండి గుణపాఠంపొంది నూతన కార్యవిధానాలను రూపొందించుకునే అవకాశం సన్నగిల్లుతుంది. కనుక సైద్ధాంతికంగా పిడివాదమూ, క్రియాత్మకంగా అనుభవవాదమూ ఒకే దుష్ఫలితానికి దారితీసి, కార్మిక వర్గ ఉద్యమాన్ని నష్టపరుస్తాయి. తద్వారా సోషలిజాన్ని సాధించే సక్రమమార్గాన్ననుసరించకుండా అడ్డగిస్తాయి.

మార్క్సిజం అలాకాక, విమర్శాత్మకమైనదీ, విప్లవాత్మకమైనదీ కూడ.

విమర్శాత్మకమైనది ఎందుకంటే, అది పిడివాదాన్ని వ్యతిరేకిస్తుంది; అన్నిభావాలనూ, అన్ని విధానాలనూ విప్లవాత్మక ఆచరణ ద్వారా పరీక్షించాలనీ తిరిగితిరిగి పరీక్షించాలనీ చెబుతుంది. తోడ్తో సత్యం మారుతుం...ి, ఈ నాటి సత్యాన్ని సరిదిద్ది అభివృద్ధిపరచకపోతే, రేపటికది అసత్యంగా మారిపోవచ్చుననీ హెచ్చరిస్తుంది.

కాని, కేవలం విమర్శాత్మకమైనంతమాత్రాన చాలదు. కేవలవిమర్శ ధోరణీ నకారాత్మకమై ఆచరణను స్తంభింపజేస్తుంది. కనుక మార్క్సిజం విప్లవాత్మకమైనది కూడ. ఎందుకంటే, అది కేవలం విమర్శించటమే కాక, పాతను కొత్తద్వారా మార్చివేస్తుంది. తన దృక్పథంమీద దృఢంగా నిలబడుతుంది తన లక్ష్యం సత్యమైనదనీ, న్యాయమైనదనీ దానికి తెలుసు. భావి పురోగమనంలో, తన సూత్రాల నిర్దుష్టతలో అచంచలమైన విశ్వాసం దానికుంది. తన విప్లవభావాలను విప్లవాచరణద్వారా అది నిరూపిస్తుంది.

# 11 వ అ ధ్యా య ం

# జ్ఞానం, దాని పునాదులు

జ్ఞానం భౌతిక వాస్తవికతను గూర్చిన భావాల, అభిప్రాయాల ప్రతిపాదనల సముదాయం. అవి భౌతిక సత్యాన్ని ఉన్నంతలోనే సరిగా ప్రతిబింబిస్తున్నట్లు నిరూపింపబడాలి. జ్ఞానం ప్రధానంగా సాంఘికఫలితం. సాంఘికాచరణ దానికి పునాది. నిర్దిష్టలక్ష్యాల సాధనలో, ఆచరణలో అది పరీక్షింపబడి, సరిదిద్దబడి, రూఢమవుతుంది. సమస్తమైన జ్ఞానం ఇంద్రియానుభూతుల్లో ప్రారంభమై, మానవాచరణలో నిర్ధారితమవుతుంది. జ్ఞానం ఏనాటికీ పరిపూర్ణం కాదు; దానికి అంతముండదు. అయితే నిరంతరం దాన్ని విస్తరించాలి; విమర్శించాలి.

*జ్ఞానం అంటే ఏమిటి ?*

పదార్థాలనుగూర్చి వాస్తవభావాల నేర్పరచుకొనటంలోనే మన మా పదార్థాలను గూర్చిన జ్ఞానాన్ని విస్తరించుకొంటాం. ఐతే జ్ఞానం అంటే ఏమిటి ?

మన భావా లెంతవరకు వాస్తవికతతో సమన్వయించవో అంత వరకు మనకు జ్ఞానం లేనట్లే. జ్ఞానసాధన అంటేనే అవాస్తవిక భావాల వల్ల కలిగే అజ్ఞానాన్ని వాస్తవిక భావాలద్వారా తొలగించడమన్నమాట.

కనుక మొత్తం వాస్తవ అవాస్తవ భావాల సముదాయంనుండి వాస్తవ భావాలుఅభివృద్ధిచెందినప్పుడు జ్ఞానాభివృద్ధికలుగుతుంది. అంటే, జ్ఞానాన్ని సూటిగా వాస్తవికతతో తూకంవేయాలని కాదు. ఎందుకంటే. అసలు వాస్తవభావాలు సత్యాలని మనకు దేన్నిబట్టి తెలుస్తుంది ? ఊరకే మన భావాలు సత్యాలని నమ్మటం లేక బల్లగుద్ది చెప్పటంవల్ల కాదుకదా !

ఉదాహరణకు, కొందరు శాస్త్రజ్ఞులు అంగారక గ్రహంలో జీవరాశి కలదంటున్నారు. ఒకవేళ అలా ఉంటే వారు చెబుతున్నది సత్యమే. కాని అసలు అంగారకగ్రహంలో జీవరాశి ఉన్నదీ లేనిదీ పూర్తిగా తెలియదు; అందుకు వారివద్ద సాక్ష్యాధారంలేదు. ఐనా అంగారకుడు గ్రహం అనేది సత్యమే. అలా చెప్పుటకు తగు సాక్ష్యాధారాలు వారివద్ద ఉన్నాయి.

అలాగే ప్రాచీన తాత్వికులు (కణాదుని పీలువాదం) పదార్థాలు కణసముదాయంవల్ల యేర్పడతాయని వ్రాశారు. అది సత్యమని ఈనాడు మనకు తెలుసు. కాని ఆనాడు తెలియదు. వారు ఆ విధంగా అనుమానించారు. మరి ఈనాడు పదార్థాలు అణుసముదాయమని మనమెలా తెలుసుకున్నాం ? వారేమో ప్రకృతినీ. పదార్థాన్నిగూర్చి అదృష్టవశాత్తు సరిగానే ఊహించారు. మనం దాన్ని క్రమబద్ధంగా పరిశోధించి, ఆ భావాలను శాస్త్రపరిశోధనల అధారంపై పరీక్షించి, వాటి సత్యాన్ని నిరూపించాం. అదేవిధంగా నాటి ప్రాచీనతాత్వికులకంటె మనకు అధికంగా తెలియని అనేక విషయాలుకూడ ఉన్నాయి. ఆ విషయాల్లో వారివలెనే మనంకూడ ఊహలపై ఆధారపడుతున్నాం. ఉదాహరణకు సూర్యుడు సౌరకుటుంబంతోసహా చలనం కల్గియున్నాడు. ఈ విషయం ప్రాచీన గ్రీకు తాత్వికు లేనాడో ఊహించారు. ఏవో కొన్ని దివ్యశక్తులు సౌర గతికి కారణమని వారు భావించారు. దరిమిలా కాలంలో శాస్త్రజ్ఞులు సూర్యునికి చలనం లేదనుకున్నారు. కాని యీనాడు విజ్ఞానశాస్త్రం సౌర గమనానికి ఆధారాలు కలవని చెబుతూంది. కాని ఈ గమనం ఎటో, సూర్యుడు ఏ నక్షత్రం చుట్టూ భ్రమిస్తున్నాడో నిదర్శనాలు లేవు. కనుక నేడుకూడ సౌరగమనం అనుమానజ్ఞానమే. ఐతే ఈ ఊహలు లేక

అనుమానాలు అసలు సత్యానికెంతవరకు సమన్వయిస్తాయో భవిష్యత్తులో తేలవలసిందే.

కనుక జ్ఞాన సంచయమంటే మన భావాల అభివృద్ధి వాస్తవ నిరూపణకు, పరీక్షకు నిల్చేవిధంగా కొనసాగటం. అలా జరిగినప్పుడే మనం జ్ఞానాన్ని సాధించగలం.

ఈ విధంగా జ్ఞానాభివృద్ధి మన భావాల అభివృద్ధిలో, పదార్థాలను గూర్చిన అభిప్రాయాలను గూర్చిన సిద్ధాంతీకరణలలో ఒక ప్రత్యేక లక్షణంగా వుంది. పదార్థాలను గూర్చిన, పదార్థక్రమాలను గూర్చిన అనేక భావాలు, సూత్రీకరణలు, క్రమబద్ధంగాను తార్కికంగాను అనుమానాధారంపై నిర్మింపబడి, తరచు భ్రాంతులకూ ఒక్కొక్కప్పుడు సత్యానికీ సమన్వయించే విధంగా ఉంటాయి. ఇదంతా భావాల అభివృద్ధి అన్నమాట. ఐతే, ఈభావాల అభివృద్ధిలోనే వాస్తవికతకు సమన్వయించే జ్ఞానమేగాక ఆ సమన్వయాన్ని పరీక్షించి నిరూపించే జ్ఞానంకూడ ఇమిడియుంది.

అందువల్ల, భౌతిక వాస్తవికత లేదా సత్యంయొక్క సరైన ప్రతిబింబంగా నిరూపింపబడిన ఊహల, అభిప్రాయాల, సముదాయమే జ్ఞానమన్నమాట.

*జ్ఞానం; దాని సాంఘిక స్వభావం*

జ్ఞాన మెప్పుడూ సాంఘిక ఫలితమే. అది సాంఘిక వ్యవహార ఫలితంగా, సాంఘిక స్వభావం కలదిగా నిర్మింపబడుతుంది.

జ్ఞాన మెప్పుడూ సాంఘిక ఫలితమే. అది సాంఘిక వ్యవహార ఫలితంగా, సాంఘిక స్వభావం గలదిగా నిర్మింపబడుతుంది. కొందరు తత్వవేత్తలు జ్ఞానాభివృద్ధిని వ్యక్తుల ఆలోచనలద్వారా, ఆ ఆలోచనలకు పునాదియైన వ్యక్తిగత అనుభవాల పరిశీలనద్వారా వివరించేందుకు ప్రయత్నిస్తారు. కాని ఆ కృషిలో తమకూ తమ పాఠకులకూ చాల శ్రమ కల్గిస్తారు. జ్ఞానాభివృద్ధిని యీ విధంగా నిరూపించటం సాధ్యంకాదు. జ్ఞానాభివృద్ధి ఆవిధంగా ఉండదుకూడ. ఒక వ్యక్తి, తాను ఒక్కడుగా వ్యవహరిస్తూ,

ఇతర ప్రజలతో సంబంధంలేకుండా కేవలం తనపైననే ఆధారపడితే, ఏవో కొన్ని సత్యాలను తప్ప అంతకు మించిన జ్ఞానాన్ని సాధించటం సాధ్యంకాదు. కనుక వ్యక్తులద్వారా జ్ఞానాభివృద్ధిని నిరూపించటంలో వ్యక్తి తన తాత్కాలిక అస్తిత్వాన్నే తప్ప అంతకు మించిన భౌతిక ప్రపంచాన్ని తెలుసుకోలేడని నిర్ధారితమౌతుంది. కనుక ఆ తాత్వికులు కూడ యీ నిర్ణయానికే రావలసివస్తుంది. ఐనా ఆ తాత్వికు లీ నిర్ణయాన్ని స్పష్టంగా అంగీకరించరు. ఎందుకంటే వారి ఆలోచనా విధానం లోనే, ఏ వ్యక్తి కూడ జ్ఞానాభివృద్ధిని వివరించ గల్గుతాడన్న నమ్మకం లేదు. కనుక వ్యక్తులద్వారా జ్ఞానాభివృద్ధిని నిరూపించటం నిరర్థకశ్రమ.

జ్ఞానాన్ని వ్యక్తులే నిర్మిస్తారు ఇది వాస్తవమే. మానవుడు సృష్టించినవన్నీ వ్యక్తులచే నిర్మింపబడినవే. కనుక వ్యక్తులు తమ సహకారయుత వ్యవహారంలో, పరస్పర సంబంధాలలో, పరస్పర భావప్రకటనల్లో జ్ఞానాన్ని నిర్మిస్తారు. ఏ వ్యక్తికూడ ఒక్కొక్కడుగా చేయలేనిదానిని అనేక వ్యక్తులు కలిసి చేయగలరు; అలా చేసే పనులలో జ్ఞాన నిర్మాణం కూడ ఒకటి. ప్రతివ్యక్తీ తన అనుభవంద్వారా ఎంతో జ్ఞానాన్ని చేకూర్చుకుంటాడు; కాని ఇతరులతోసంబంధం లేకుండా కాదు. ఇతరులు నేర్చుకొనియున్నదానిని తెలుసుకోకుండా అది సాధ్యంకాదు. మానవుడు భావాలను చేకూర్చుకొనేందుకు, ఆ భావాలను వ్యక్తీకరించేందుకు మూలసాధనమైన భాష సాంఘిక ఫలితం. అది సాంఘిక సాధన. కనుక జ్ఞాన సంచయానికి ఆధారంకూడ సాంఘిక వ్యవహారమే. కొందరు వ్యక్తులు నూతన జ్ఞాన నిర్మాణంలో ఇతరులకంటె అధికమైన ప్రత్యేకమైన, పాత్రనిర్వహిస్తారు కాని, వారొకనిర్దిష్ట సమాజంలో సభ్యులు కాకున్నట్లయితే, తమ సహచర మానవులతో సంబంధం కలిగియుండకపోతే, సమాజం నేర్పినదానిని నేర్చుకొని యుండకపోతే, సమాజం పారంపర్యంగా జ్ఞాన సాధనకై సమకూర్చి పెట్టిన భౌతిక మానసిక సంపదను కలిగియుండకపోతే – జ్ఞానాభి వృద్ధిలో తమ పాత్రను నిర్వహించడం అసాధ్యం.

కనుక, జ్ఞానం సమాజజీవితంలోనేసిద్ధిస్తుంది; నిర్మింపబడుతుంది. జ్ఞానానికి పునాదులు మానవుని సాంఘిక వ్యవహారంలో ఉంటాయి.

జ్ఞానం విభిన్న సాంఘిక వ్యవహారాల పరిణామంలో వ్యక్తుల అనుభవాల ద్వారా, భావాల వివిమయంద్వారా నిర్మితమవుతుంది; ఆ క్రమంలోనే పరీక్షింపబడి రూపుదిద్దుకొంటుంది.

పర్యవసాన మేమంటే, సాంఘిక జ్ఞానం సమాజంలో నిక్షేపింపబడుతుంది; సమాజానికి లభించే జ్ఞానం వ్యక్తుల జ్ఞానంకంటె ఎల్లప్పుడూ ఆధిక్యత గలదే. ఏ వ్యక్తి కూడ చేకూర్చుకొనలేనంత విస్తృతమైన జ్ఞానాన్ని అనేకమంది మానవులు, అనేక తరాలలో నిర్మించుకున్నారు. ఈ విస్తృత జ్ఞానం మొదట అనేకమంది మానవుల స్మృతిపథాల్లోను, భావాల రూపంలోను, పిదప అనేక లిఖితప్రతులు గ్రంథాల రూపంలోను సమీకృతమైయుంది. ఈ విస్తృత జ్ఞానసంచయాన్నంతటినీ ఏ ఒకవ్యక్తీ చేకూర్చుకోలేడు. ఉదాహరణకు, హైదరాబాద్ నగరంలోని టెలిఫోను నంబర్లన్నీ ఏ ఒక్కరికీ తెలియవు కాని, ఆ జ్ఞానం టెలిఫోను డైరెక్టరీలో నిక్షేపింపబడి, సాంఘికంగా ప్రతివారికి అందుబాటులోఉంటూ వినియోగపడుతూంది. ఇదే విధంగా విజ్ఞానశాస్త్రిలు కనుగొన్న ప్రతి సత్యం ఏ ఒక వ్యక్తికీ తెలియదు. అయినా, శాస్త్రవిజ్ఞాన సర్వస్వంకూడ కొంత అస్రమతతోనైనప్పటికీ గ్రంథస్థమై, ప్రతివారికి వినియోగపడుతూనే ఉంది. కనుక, సమాజంలో సాంఘిక జ్ఞానసంచయం ఉంది; ఆ జ్ఞానసంచయాన్ని వినియోగించుకొనే వ్యక్తుల పాత్రకూడ ఉంది. సాంఘిక జ్ఞానంలో వ్యక్తులు (తమ అనుభవాలనుబట్టి) నూతనాంశాలను చేరుస్తారు; మరియు (తమ అవసరాలనుబట్టి) ఉన్న అంశాలను స్వీకరించి వినియోగిస్తారు. ఈ విధంగా జ్ఞానం సాంఘిక స్వభావం గలిగి నిరంతరం పరిణామం చెందుతుంది.

*సాంఘిక ఆచరణ, సాంఘిక జ్ఞానం*

ఉత్పత్తి మూలకమైన మానవుని సంఘజీవితంనుండి మొత్తం మానవసమాజం రూపొంది అభివృద్ధి గాంచుతుంది. అందువల్ల మానవ సమాజ ఫలితమైన జ్ఞానాభివృద్ధి అంతిమ విశ్లేషణలో సాంఘికోత్పత్తి అభివృద్ధి నాశ్రయించియుంటుంది. మానవులు తమ తొలి భావాలను ఉత్పత్తిక్రమంలోనే చేకూర్చుకున్నారు. అందుకని భావాల అభివృద్ధినీ,

జ్ఞానాభివృద్ధినీ వాటి మాతృకయగు ఉత్పత్తి వ్యవహారంనుండి ఏ దశలోనూ వేరుచేయరాదు.

చరిత్ర పరిణామంలో జ్ఞానం క్రమక్రమంగా సాధింపబడి సమీకరింపబడింది. మానవులు తమ ఉత్పత్తిశక్తుల అభివృద్ధికై, ఆ అభివృద్ధిని బట్టి ఉత్పత్తి సంబంధాల అభివృద్ధికై కృషిసల్పుతారు. ఆ కృషిలో నూతన జ్ఞానంకొరకు ప్రయత్నిస్తారు. తద్వారా తమ భౌతికాభివృద్ధికి అవరోధమైన అజ్ఞానాన్ని అధిగమిస్తారు. మావో సె-టుంగ్ యిలా వ్రాశాడు :

> "మార్క్సిస్టు మానవుని ఉత్పత్తి వ్యాపారాన్ని అత్యంత ప్రాథమికమైన ఆచరణ వ్యవహారంగా గుర్తిస్తాడు. ఈ అభివ్యక్తితో మానవుడు ప్రధానంగా ఉత్పత్తివ్యాపారంపై ఆధారపడుతూ, క్రమంగా ప్రకృతి వ్యవస్థను, ప్రకృతి లక్షణాలను, ప్రకృతి సూత్రాలను ప్రకృతితోడి తన సంబంధాలను గ్రహిస్తాడు. అంతేకాక ఉత్పత్తి వ్యాపారం ద్వారానే అతడు క్రమంగా కొన్ని మానవసంస్థలనుగూర్చిన జ్ఞానాన్ని కూడ పొందుతాడు. అలాంటి ఏ జ్ఞానాన్నికూడ ఉత్పత్తి వ్యాపారానికి దూరంగా సాధించడం శక్యంకాదు."

సాంఘికాభి వృద్ధియొక్క ఏ దశలోనైనా సరే జ్ఞానసముదాయం, దాని స్వభావం ఉత్పత్తియొక్క అభివృద్ధిదశపై ఆధారపడియుంటుంది. దానికి అనుగుణ్యమైనదిగా ఉంటుంది. ఎందుకంటే, మానవులు ప్రకృతిని గూర్చి, సమాజాన్నిగూర్చి తెలుసుకోగల్గేదెప్పుడూ ప్రకృతితోను, ఒండొరులతోను పెట్టుకొనే సంబంధంపై ఆధారపడియుంటుంది. ఆ సంబంధం ఆ వ్యవహారంనుండి యేర్పడే ఆచరణాత్మక సమస్యలకు సంబంధించియుంటుంది. ఆ సమస్యల ప్రయోగాత్మక పరిష్కారంలో పరిశీలింపబడుతుంది. ఈ పునాదిపైనే వారు తమ భావసౌధాన్నంతటినీ భావవిభాగాల ద్వారా, భావసమన్వయాలద్వారా భావసంయోజనలద్వారా నిర్మించుకుంటారు.

అంతిమ విశ్లేషణలో జ్ఞానాభివృద్ధి ఉత్పత్తి అభివృద్ధిమీద ఆధారపడియుంటుందంటే అర్థం, అది కేవలం ఉత్పత్తిమీదనే ఆధారపడి

యుంటుందని కాదు. అనేక సాంఘిక వ్యాపారాలవల్ల సాంఘిక సంబంధాల వల్ల – ఇవి ఉత్పత్తినుండి బయల్దేరేవే – నిర్ధారితమవుతుంది. మావో సె-టుంగ్ యిలా వ్రాశాడు :

> "మానవుని సాంఘికాచరణ కేవలం ఉత్పత్తి వ్యాపారానికే పరిమితమై లేదు. ఇంకా అనేక వ్యవహార స్వరూపాలున్నాయి: వర్గ సంఘర్షణ, రాజకీయజీవితం, కళాత్మకకృషి. సమాజగత మానవుడు అన్ని సాంఘిక జీవితరంగాలలోను పాల్గొంటాడు. ఆ విధంగా అతని అభివ్యక్తిలో, భౌతిక ఉత్పత్తివ్యాపారంలో పదార్థాలను తెలుసుకొనడమేగాక భౌతికజీవితంలో అనేకవిధాలయిన సన్నిహిత సంబంధాలను, రాజకీయ సాంస్కృతిక జీవితంనుండి అతడు తెలుసుకొంటాడు. వీటిలో వర్గ సంఘర్షణయొక్క విభిన్నరూపాలు మానవ విజ్ఞాన వికాసంపై గొప్ప ప్రభావం కలిగిస్తాయి వర్గ సమాజంలో ప్రతి వ్యక్తి ఒక నిర్దిష్టమైన వర్గస్థితితో జీవిస్తాడు; ప్రతి ఆలోచనావిధానం ఈ వర్గ ముద్రచే అనివార్యంగా ప్రభావితమవుతుంది."

ఈవిధంగా జ్ఞాననిర్మాణం భౌతిక ఉత్పత్తివ్యాపారంపై ఆధారపడి యుంటూనే, వర్గాలపైన, వర్గ సంఘర్షణపైన కూడ ఆధారపడుతుంది. జ్ఞానసంపుటిని భద్రపరచే విస్తరించే కర్తవ్యం ప్రధానంగా వేర్వేరు వర్గాల ప్రతినిధుల ద్వారా కొనసాగుతుంది. విభిన్నకాలాల్లో విభిన్న వర్గాల ఆర్థిక, రాజకీయ, శాస్త్ర, కళావ్యాపారాలద్వారాను, విభిన్నవర్గాల మధ్య సంఘర్షణల ఫలితంగాను ప్రకృతిని గూర్చిన, సమాజాన్నిగూర్చిన నూతన జ్ఞానం నిర్మింపబడుతుంది.

*జ్ఞాన నిర్మాణంలో సిద్ధాంతమూ, ఆచరణ*

సాధారణంగా, సమాజంలో జ్ఞానసంచయం సమాజ సభ్యుల ఆచరణ వ్యవహారంలో వృద్ధిచెందుతుంది. బాహ్య ప్రకృతితోను, ఒండొరులతోను గల వ్యవహారంనుండి రూపుదిద్దుకుంటుంది. ఆచరణ వ్యవహారం లేకుండా, ఆచరణాత్మక సంబంధాలు లేకుండా మనం ఏ విషయాన్నిగూర్చి కాని తెలుసుకొనే ప్రసక్తి ఉండదు. కనుక ఆచరణ వ్యవ

హారమే భౌతిక సత్యానికి సమన్వయించే జ్ఞాన సాధనకు, ఆ సమన్వయపు ప్రయోగాత్మక పరీక్షకు ఆధారమౌతుంది. లెనిన్ యిలా వ్రాశాడు:

"జీవితం యొక్క, ఆచరణ యొక్క దృక్పథం జ్ఞాన సిద్ధాంతంలో మొదటి మౌలికాధారం కావలసియుంటుంది."

ఐతే, ఆచరణ లేదా ఆచరణ వ్యవహారం అంటే ఏమిటి?

1. మొట్ట మొదట ఆచరణ పరిసర ప్రకృతిలో మార్పులు కల్గించే శారీరకాంగ చర్యలు.

2. కాని, కేవలశారీరకాంగ చర్యమాత్రమే ఆచరణ అనిపించుకోదు; ఆచరణ వ్యవహార మనిపించుకోదు. అంగజీవి పదార్థప్రేరణలపట్ల జరిపే ప్రతిచర్యలను ఆచరణ అనం. అలాగే, సహజ ప్రవృత్తులతో పశుపక్షులు వివేచనారహితంగా గుడ్డిగా జరిపే పనులను కూడ ఆచరణ వ్యవహార మనుటకు వీలులేదు. కనుక ఆచరణ వ్యాపారం మానవుని చైతన్యయుత వ్యవహారంగా ఉంటుంది. ఉద్దిష్టప్రయోజనాల సాధనకు చెంది యుంటుంది. (అ) తాను సాధించ గోరే లక్ష్యాన్ని గురించిన చైతన్యం ముందే కల్గియుండటంపైన (ఆ) తన చర్యకు చెందిన పరిస్థితులను గూర్చి, ఆచర్యకు గురిఅయ్యే పదార్థ ధర్మాలను గూర్చి, లక్ష్యసాధనకవసరమైన సాధనాలను గూర్చి కొంత చైతన్యం కలిగియుండటంపైన ఆధారపడియుంటుంది.

3. ఆచరణ సాంఘికమైనది. ఐతే, ఒక వ్యక్తి తనంతట తాను జరిపే వ్యక్తిగతాచరణా ఉంది. అనేకమంది వ్యక్తుల సమష్టి చర్యద్వారా కొనసాగే సాంఘికాచరణా ఉంది. ఐనప్పటికీ, చైతన్యయుతాచరణ మానవుని సాంఘిక జీవితం లేకుండాను, వ్యక్తులు సమాజానికి సంబద్ధితులు కాకుండాను రూపొందదు.

సమాజంలో ప్రజలు తమ ఆచరణ వ్యవహారానికి అనేక సాధనాలను పెంపొందించుకుంటారు. పరస్పర భావవినిమయానికి ఉపయోగించే భాష అలాంటి సాధనమే. కనుక, ఆచరణ వ్యవహారంలో భాష చాల ప్రధానమైన పాత్ర నిర్వహిస్తుంది. భాష మానవ సంయోజిత చర్యకు సాధనంగా పనిచేస్తుంది.

ఆచరణ అంటే ఏమిటో పై మూడు అంశాలు నిరూపిస్తున్నాయి.

కాబట్టి, జ్ఞానం ఆచరణనుండి రూపొందుతుంది. అది మన ఆచరణ వ్యవహారానికి సంబంధించిన విభిన్న పరిస్థితులకు, సమస్యలకు, సాధనాలకు చెందియుంటుంది. ఆచరణకు అలాంటి భావాల అగత్యముంది; ఆచరణాభివృద్ధికి అనుగుణ్యంగా భావాభివృద్ధి కొనసాగుతుంది. ఆచరణను గూర్చిన, విభిన్నపదార్థాలను గూర్చిన భావాల్లో జ్ఞానంరూపొంది, ఆ భావాల ప్రయోగాత్మక పరిశీలనకు సాధనంగా రూఢమౌతుంది.

అన్ని కాలాల్లోను మానవులు తమ జ్ఞానాన్ని పెంపొందించుకొని పరిపక్వ మొనర్చుకొనుటకు సాంఘికాచరణయే సంచాలక శక్తిగా ఉంటూ వచ్చింది. ఈ జ్ఞానం ఉత్పత్తిక్రమంయొక్క అభివృద్ధికీ, వివిధ వర్గాల ప్రయోజనాల సాధనకూ అవసరమైంది. వివిధ వర్గాల ప్రజలు వారివారి ప్రయోజనాలను సాధించుకొనేందుకు ప్రకృతిని గురించి, సమాజాన్ని గురించి తమ జ్ఞానాన్ని అధికాధికంగా అభివృద్ధి చేసుకోవడం అవసరమని స్వానుభవంద్వారా తెలుసుకొంటూ వచ్చారు.

ఈవిధంగా మానవులు తమ ఉత్పత్తి సాధనాలను, ఉత్పత్తి నిపుణతను, ప్రకృతిపై యాజమాన్యస్థాయిని అభివృద్ధిపరచుకొనటంలో వారి జ్ఞానం పురోగమిస్తుంది. వృత్తులలోని మార్పులు జ్ఞానరంగంలో నూతన సమస్యలకు, వాటి పరిష్కారంకొరకు నూతన సాధనాలకు దారితీస్తాయి. ఈవిధంగా వృత్తుల విస్తృతిలో నూతన భావాలు, నూతనజ్ఞానరంగాలు ఆవిష్కారం అవుతాయి. జ్ఞానం విస్తృతమౌతుంది. ఈ నూతన భావాలు, జ్ఞానరంగాలు సాంకేతిక వికాసంద్వారా ఆచరణరంగంలో పరీక్షింపబడతాయి. ఆచరణాత్మక సమన్వయంలో ఇతోధికంగా విస్తృతమౌతాయి.

పెట్టుబడిదారీవర్గం ఆధునిక పారిశ్రామికాభివృద్ధిద్వారా ప్రకృతిశాస్త్రాల, భౌతిక రసాయనిక క్రమాల వైజ్ఞానికాభివృద్ధిని ప్రోత్సహించింది. ఐతే, కార్మికవర్గ మీనాడు సోషలిస్టు వ్యవస్థ నిర్మాణంద్వారా ఆర్థికాభివృద్ధిని సాంఘికంగా వినియోగించుకొనేందుకు ప్రకృతి శాస్త్రాల ఇతోధికాభివృద్ధికి పట్టుగొమ్మ ఔతూంది. ఇదేవిధంగా, మానవులు

తమ సంక్షేమాభివృద్ధి కృషిలో, నూతన సాంఘిక సంబంధాలను స్థాపించుటలో విజయం పొందారు. ఇలా చరిత్రలో కాలదోషం పట్టిన పాత సాంఘిక సంబంధాల స్థానంలో వాటికంటె నూతనమైన, మెరుగైన సంబంధాలను నిర్మించుకోడంద్వారా ప్రజలు సమాజాన్నిగూర్చి తమను గూర్చి తెలుసుకొన్న జ్ఞానం పెంపొందింది.

సాంఘిక పరిణామ సూత్రాలను గూర్చిన జ్ఞానం కార్మికవర్గాభివృద్ధిలో, సామ్యవాద ఉద్యమక్రమంలో రూపొందింది. ఇదేవిధంగా, ప్రతి చారిత్రక దశలోను సాంఘిక విజ్ఞానం, సాంఘిక సూత్రాలు తమ చారిత్రకాచరణ పరిమితులకు లోనైనాయి. అలాగే పెట్టుబడిదారీ విధానంలో ప్రపంచ మార్కెటు అభివృద్ధి ఫలితంగా సామ్రాజ్యవాద శక్తులు వలస దేశాలను తమలోతాముపంచుకొనటంమూలంగా, ప్రపంచచరిత్రనుగూర్చిన పరిశోధనలు, వివిధ అభివృద్ధి దశల్లో రూపొందిన సమాజాలను గూర్చిన పరిశోధనలు విరివిగా కొనసాగాయి. విపులమైన సాంఘిక – చారిత్రక జ్ఞానం పెంపొందింది. ఆ విస్తృత జ్ఞానఫలితంగా, సామ్యవాద ఉద్యమం మరొక ముందంజవేసింది. సాంఘిక సంబంధాల పునాది నధిగమించి, సాంఘికాభివృద్ధియొక్క శాస్త్రీయ సూత్రాలను ఆవిష్కరించింది.

ప్రజలు ఈ విధంగాకాక మరో తీరున జ్ఞానాన్నిపొందరు; పొందలేరుకూడ. జీవితాచరణలో పదార్థాలనుగూర్చి తెలుసుకొనే ఆవశ్యకత లేక అవకాశం లేనిదే పదార్థ విజ్ఞానసాధన సాధ్యపడదు. ఉదాహరణకు ప్రజలు చిన్నచిన్న గణసమాజాల్లో జీవిస్తూ ఆదిమకాల ఉత్పత్తి సాధనాలను వినియోగించుకొన్నదశలో భూగోళశాస్త్రాన్ని, జ్యోతిష, గణిత శాస్త్రాలను పెంపొందించలేకపోయారు. ఆ రోజుల్లో వారికి కొద్దిపాటి మాత్రమే తెలిసిన పదార్థధర్మాల భావాలన్నీ భావసముదాయమే కాని జ్ఞానం అనిపించుకోదు. అలాగే బానిస విధానంలోను, భూస్వామ్యంలోను జరిగిన శాస్త్రాభివృద్ధికూడ పరిమితమైనదే. బానిస, భూస్వామ్య యుగాల్లో ప్రకృతి వ్యవస్థను గూర్చి సాంఘిక వ్యవస్థను గూర్చి అనేక ఊహలు, అనుమానాలు ఉండేవి. కాని ఆ కాలాల్లో జ్ఞానం సాంఘికాచరణపరిమితులకులోనయ్యేయుంది. పెట్టుబడిదారీవిధానం ఆవిష్కరించ

టంతో, ప్రకృతిశాస్త్రాలు సాంఘికశాస్త్రాలు సాంఘికాచరణ ఆధారంపై నూతన శాస్త్రీయస్థాయిని చేకూర్చుకున్నాయి. ఐతే,పాలకవర్గ దమన నీతిని గూర్చీ, ఆర్థికపీడన గూర్చీ. సాంఘిక సమానతను గూర్చీ అన్ని కాలాల్లో అనేకమంది సంస్కర్తలు తమతమ భావాలను ప్రకటిస్తూవచ్చారు. కాని అవి కేవల భావాలు మాత్రమే. కాని జ్ఞానస్థాయిని లేక సాంఘికాచరణలో వినియుక్తమయ్యే సిద్ధాంతసాధనాల స్థాయిని చేకూర్చుకోలేకపోయాయి. వేదాల్లోను,ఉపనిషత్తుల్లోను,ఇతిహాస పురాణాల్లోనే గాక బౌద్ధంలోను, భాగవతంలోను, మధ్యయుగంలో శైవ-వైష్ణవ - సూఫీ-సిక్కు-సిద్ధాంతాల్లోను సాంఘిక అన్యాయాలను నిరసించి, కుల మత వర్గ శోషణలకు వ్యతిరేకంగా నిల్చిన అనేక ధోరణులున్నాయి. అవి ప్రజల్లో విరివిగా ప్రచారంకూడ పొందాయి. ఐతే, ఆ ధోరణులన్నీ దాదాపు భావవాద. వైరాగ్యపంథా ననుసరించినవే కాని, సాంఘికాచరణదిశ నవలంబించ లేకపోయాయి. ఆనాటి చారిత్రక పరిమితి నిక్కడ మనం గమనించవచ్చు.

కనుక, జ్ఞానం ఆచరణలో రూపొంది ఆచరణాత్మక పరీక్షకు గురియౌతుంది. పరిస్థితులకు, విషయాలకు, సాధనాలకు చెందిన మన భావాలు భౌతిక వాస్తవానికి సమన్వయమైనప్పుడే, ఆ భావాల ప్రేరణ వల్ల ఆచరణ ఉద్దిష్ట ఫలితాల నిచ్చినప్పుడే జానస్థాయి కవి నిదర్శనాలు కాగలవు.

మన ప్రతిచర్యా కొన్ని ఫలితాలకోసం జరుగుతుంది. ఆ చర్యను ప్రేరేపించే భావాలపై అది ఆధారపడియుంటుంది. కనుక, మన భావాల వాస్తవికతకు గీటురాయి ఆ భావాలమూలంగా జరిగే చర్యయొక్క ఫలితాలే.

అలా కాక, మన భావాలు ఉద్దిష్ట లక్ష్యాలకు, ప్రత్యక్ష ఫలితాలకు సమన్వయించనప్పుడు, అంటే ఆ భావాలను లక్ష్యసాధనద్వారా, లేక ఫలితాలద్వారా పరీక్షించ వీలులేనప్పుడు మన భావాలు భౌతికవాస్తవానికి వర్తించేదీ లేనిదీ తెలుసుకొనలేం. భావాలు "జ్ఞానం" కాకుండా కేవల ఊహలుగా, లేక భ్రాంతులుగా శేషిస్తాయి మార్క్స్ యిలా వ్రాశాడు :

"భౌతికవాస్తవికత మానవాలోచనకు సమన్వయిస్తుందా అనే ప్రశ్న సిద్ధాంత ప్రశ్న కాదు. ఆచరణకు సంబంధించిన ప్రశ్న. మానవుడు తన ఆలోచనల సత్యాన్ని, వాస్తవికతను, శక్తిని, దిశను ఆచరణలో నిరూపించాలి. ఆలోచనయొక్క వాస్తవికత, అవాస్తవికతల వివాదం (వాస్తవానికి సమన్వయించి యుంటుందా, లేదా అనే చర్చ) ఆచరణకు దూరమైనప్పుడది కేవల పాండిత్య చర్చయే ఔతుంది."

కనుక, మనం ఆచరణాత్మక సమస్యలలో రూపొందే భావాలను నిర్మించుకొని జ్ఞానం చేకూర్చుకుంటాం ఆ జ్ఞానాన్ని క్రమక్రమంగా ఉద్దిష్ట లక్ష్యాల సాధనలో, ప్రత్యక్ష ఫలితాలద్వారా పరీక్షించి నిర్ధారణ చేస్తాం. జ్ఞానం మూడు పార్శ్వాలలో తిరుగుతూ అభివృద్ధి చెందుతుంది.

(1) సాంఘికాచరణలో, ఉత్పత్తిలో, సాంఘిక సంబంధాలలో రూపొందే పరిష్కరణీయ సిద్ధాంత సమస్యలు. (2) అనుభవగత సమస్యలనుండి రూపొందే ఆ సిద్ధాంతాల విస్తరణ, వాని తార్కిక క్రమీకరణ. (3) సాంఘికాచరణలో ఆ సిద్ధాంతాల వినియోగం, తద్వారా ఆ సిద్ధాంతాల పరీక్ష, సంస్కరణ.

ఈ క్రమం ఏనాటికీ తెగదు. మన జ్ఞానం ఏదైనా సరే, నూతన అవసరాలు నూతన జ్ఞానవిస్తరణకు దారితీస్తాయి. తోడ్తో ప్రచలిత జ్ఞానం ఆచరణకు సంబంధించిన ఆ అవసరాలకు సమన్వయింపబడాలి. కనుక, నూతన జ్ఞానం చేకూరగానే, పాత సిద్ధాంతాలన్నిటినీ సరిచేసి సమన్వయించుకోవాలి. ఇలా ప్రచలితజ్ఞాన మెప్పుడూ సరిచేయబడుతూ, దృఢపరచబడుతూ ఉంటుంది.

మావో గతితార్కిక భౌతికవాదంపై పాఠాలను ముగిస్తూ, ఈ విధంగా వ్రాశాడు :

"మానవుని సాంఘికాచరణయే బాహ్యప్రపంచాన్నిగూర్చిన అతని జ్ఞానానికి ఒరపిడిరాయి. మానవుని జ్ఞానం సాంఘికాచరణలో భౌతికోత్పత్తిలో, వర్గసంఘర్షణలో, శాస్త్రపరిశోధనల్లో, ఉద్దిష్టఫలితాల సాధనలో పరీక్షింపబడుతుంది. గతితార్కిక భౌతికవాద జ్ఞానసిద్ధాంతం ఆచరణకు

ప్రథమస్థాన మిస్తుంది; మానవ విజ్ఞానాన్ని ఆచరణనుండి యేమాత్రం విడదీయరాదంటుంది; ఆచరణ ప్రాధాన్యతను నిరాకరించే, లేక సిద్ధాంతాన్నీ ఆచరణనూ వేరుపరచే అన్ని సిద్ధాంతాలనూ ఖండిస్తుంది.

"ఆచరణ, జ్ఞానం - అధికాచరణ, అధికజ్ఞానం; ఈ అనంత చక్రక్రమంలో ప్రతి వలయంలోనూ ఆచరణ, జ్ఞానం అంతకంతకు ఉన్నతస్థాయి నందుకొంటాయి. ఇదీ, గతితార్కిక భౌతికవాదం బోధించే జ్ఞాన - కర్మల ఏకత్వం."

*ఇంద్రియానుభూతి జ్ఞానసర్వస్వానికి నాంది*

ఈ జ్ఞానసంచయన నిర్మాణక్రమ మంతటిలోను మనం పదార్థాలను గూర్చిన సమాచారంకొరకు, మన లక్ష్యసిద్ధికై జరిపే పరీక్షకు దేని మీద ఆధారపడతాం ? ఇంద్రియానుభూతిపై ఆధారపడతాం.

అనేకమంది తాత్వికులు ఇంద్రియానుభూతిని నిరాకరిస్తారు. ఇంద్రియజ్ఞానం భ్రమ ప్రమాద భూయిష్టమంటారు. ఇందుకు కొన్ని ఉదాహరణ లిస్తూ వారు ఇంద్రియ జ్ఞానాన్ని నిరాకరించాలనీ, "శుద్ధాలోచన" పైనే ఆధారపడాలనీ చెప్తారు. ఉదాహరణకు శంకరాచార్యుడు ఇంద్రియ జ్ఞానాన్ని "ప్రాతిభాసికజ్ఞానం" అన్నాడు. అది తప్పు ప్రతిబింబం కనుక, మిథ్య కనుక పారమార్థిక జ్ఞానంలేక "శుద్ధజ్ఞానం" ఒక్కటే శరణ్యమన్నాడు. ఇలాగే, ప్రత్యక్షానుభూతిని మిథ్యఅంటూ. అపరోక్షమైన అనుమానజ్ఞానమే ఏకైక సాధనమని వాదించే భావవాదు లనేకు లున్నారు. ఈ ధోరణి అసలు వాస్తవాన్ని ప్రక్కబాట పట్టించేదే.

మానవ జ్ఞానం అనంత వికాస విస్తృతులను చేకూర్చుకుంటుంది: నిజమే. కాని ఆ జ్ఞానం మేధయొక్క క్రియయే. మానవునికి బాహ్య ప్రపంచంతోగల శ్లిష్ట సంబంధాల అవయవం మేధ. ఆ సంబంధాలను విస్తరించుకోవడంలో మనం మొట్టమొదట ఇంద్రియాలద్వారా లభించే సంకేతాలమీద ఆధారపడతాం. కనుక జీవిత వ్యవహారంలో మనం చేకూర్చుకునే ఇంద్రియానుభూతులే జ్ఞానమంతటికీ ప్రారంభ మన్నమాట. కనుక

ఇంద్రియ వ్యాపారం ద్వారా చేకూరే అనుభూతి. ఆ అనుభూతి ద్వారా బాహ్యపదార్థాల గుర్తింపు లేకుండా జ్ఞానాన్ని నిర్మించుకొనే ప్రశ్న లేదు.

> "కనులు మూసుకొని, చెవులు మూసుకొని బాహ్య ప్రపంచంతో పూర్తిగా దూరమైనవానికి జ్ఞానంఅన్న ప్రసక్తే లేదు. జ్ఞానం అనుభవంతో ప్రారంభమౌతుంది. జ్ఞాన సిద్ధాంతపు భౌతికవాదం ఇదే".
>
> —— మావో సె - టుంగ్.

ఈ సూత్రం లెనిన్ పదార్ధ నిర్వచనంలో స్పష్టపరుప బడింది. ఆయన యిలా వ్రాశాడు :

> "భౌతిక వాస్తవం మానవునికి ఇంద్రియానుభూతులద్వారా ప్రాప్తమౌతుంది; ఇంద్రియానుభూతులకది బాహ్యంగా ఉంటూ, వాటిలో ప్రతిబింబిస్తుంది."

దీని అర్థం భౌతిక ప్రపంచం ఇంద్రియ గోచరమయే దనియే. కనుక భౌతిక ప్రపంచాన్ని గూర్చి మనం తెలుసుకొనేవి ఇంద్రియాల వినియోగం ద్వారానే. కనుక ఇంద్రియానుభూతికి చెందని జ్ఞానం కల్పనా జ్ఞానమవుతుంది; ఇంద్రియ గోచరం కాని భౌతిక వాస్తవం ఊహాగానం ఔతుంది.

ఈ నిర్వచనాలను భావవాదులు 'పిడివాదం' అంటారు. ఇందులో పిడివాద మేమీ లేదు. పైగా మనం భౌతికవాద భూమికనుండి తొలగితే "నిరూపింపబడే" జ్ఞానమంతటి నుండీ దూరమై శుద్ధ ఊహాగానంలో పడిపోతాం. ఒకసారి మనం ఇంద్రియానుభూతి అనే గీటురాయికి అతీతమైన "వాస్తవాలను" కల్పించ నారంభించామా, ఇక మేఘాల్లో తేలిపోయినట్లే. కొందరు తత్వశాస్త్ర పండితులు ఒక సూదిమొనపై ఎందరు అప్సరసలు నాట్యం చేయగలరో చెప్పమన్నారట. ఇదీ ప్రశ్నధోరణి। ఎందరు అప్సరసలైనా నాట్యం చేస్తారని చెప్పవచ్చు. కాని ఆ సమాధానాన్ని నిరూపించటమూ, నిరాకరించటమూకూడ అసాధ్యమే. ఇంద్రియానుభూతి అనే పునాదిని విడచిపెడితే మనం ఇలాంటి ప్రశ్నల్లో పడిపోతాం. ఈ ప్రశ్నలు "జ్ఞానం" పేరుతో చెలామణియైనా, జ్ఞానం మాత్రం కావు.

ఇలాంటి ప్రశ్నలు ఊహాగానాలు ప్రజలను మోసంచేసేవే ఉదాహరణకు చతుర్దశభువనాలు, పితృలోకాలు, జన్మాంతర కర్మలు, అవతార లీలా గానాలు మున్నగు కాల్పనిక భావాలు పలురూపాల్లో కొనసాగుతున్నవే. ఆచరణయొక్క గీటురాయికి నిల్వని ఇలాంటి భావాలన్నీ జ్ఞానం కాజాలవు కదా!

"తిండి లేకుండా జీవించలేమ"న్నది ఒకవేళ పిడివాదమే అయితే, ఇంద్రియ వ్యాపారంద్వారా జ్ఞానాన్ని పొందుతామనేది కూడ అలాగే పిడివాదమౌతుంది. ఆధ్యాత్మిక జ్ఞానమనీ, పారలౌకిక జ్ఞానమనీ ప్రజలను మభ్యపెట్టటమంటే, తిండి గుడ్డలు లేకుండా వారిని చిరకాలం జీవించమని ఆశీర్వదించటంలాంటిదే. భావవాదుల బోధలు తరచు ఈ ధోరణిలోనే సాగుతాయి. మార్క్సిజం - గతితార్కిక భౌతికవాదం - ఇలాంటి మోసాలనుండి ప్రజలను కాపాడుటకు పూనుకుంటుంది.

అనుభవానికి అతీతమని చెప్పుకొనే అన్ని సూత్రాలను చాంధసాలను మార్క్సిజం ఖండిస్తుంది. ఇంద్రియానుభూతికి అతీతంగా ఏ 'శుద్ధాత్మ'నుండియో 'దివ్యశక్తి' మూలంగానో రూపొందుతాయని చెప్పుకొనే అన్ని సిద్ధాంతాలనూ అది ఖండిస్తుంది. తమ కేదో ప్రత్యేక మేధా విశేషమో, దివ్యశక్తియో, ఆధ్యాత్మికమహిమో కలదని చెబుతూ తమ అభిప్రాయాలను ప్రజలపై రుద్దే ప్రబుద్ధులను మనం విశ్వసించరాదు. ఆచరణకూ అనుభవానికీ వర్తించని మాయలు, మంత్రాల విషయంలో మనం తగు జాగ్రత్త వహించాలి. జ్ఞానేంద్రియాలచే ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని గుర్తింపబడని ఏ పదార్థమూ, పదార్థ పరిణామం వాస్తవిక జ్ఞానాన్ని కలిగియుండదు. తన ఉనికిని ధర్మాన్ని నిరూపించుకోలేని ఏ పదార్థమూ, పదార్థపరిణామం వాస్తవిక జ్ఞానాన్ని గలిగియుండదు.

*ఇంద్రియ ప్రామాణ్యం*

ఐతే, మనం ఇంద్రియాలను విశ్వసించవచ్చునా? మన జ్ఞానేంద్రియాలు మనల్ని మోసం చేయవని హామీ యేమిటి? మనకు కలలు,

అపస్మారాలు అప్పుడప్పుడు కలుగుతాయి కదా. అంతేకాక, మన ఇంద్రియానుభూతులకు సమన్వయించే పదార్థాలకు అస్తిత్వం కలదని మన కెలా తెలుస్తుంది ?

ఈ ప్రశ్నలకు సమాధాన మిచ్చేటప్పుడు ఆచరణ వ్యవహారంలోనే మనం పదార్థాలను గురించిన అనుభూతులను పొందుతామన్న విషయం విస్మరించరాదు. ఇంద్రియాలద్వారా మనకు చేకూరే అనుభూతి ఊరకే దానంత టది రాదు. చైతన్యయుత జీవితాచరణలో,భౌతిక పదార్థాలతో గల సంబంధాలనుండి మన అనుభూతి రూపొందుతుంది. ఊయెలలోని శిశువుకు తనను గూర్చి, బాహ్యప్రపంచాన్ని గూర్చి అనేక అభిప్రాయాలుంటాయి. శిశువులు క్రమంగా ఇంద్రియాల వినియోగాన్ని అలవరచుకుంటారు. తమ పరిసర పదార్థాలను తాకి, రుచిచూచి, వాసనచూచి, పరిశీలించి, క్రమక్రమంగా పదార్థ జ్ఞానాన్ని చేకూర్చుకుంటారు.

ఈ విధంగా మానవజాతికిచెందిన ప్రతివ్యక్తీ ప్రపంచాన్ని గూర్చి నేర్చుకుంటాడు. కనుక జ్ఞానసంచయానికీ, క్రోడీకరణకూ అదే మార్గమన్నమాట. అపరిచిత పదార్థాన్ని గూర్చిన మొదటి తికమక భావాలు నమ్మరానంత అత్యల్ప జ్ఞానాన్ని కల్గియుంటాయి. కనుక పదార్థ జ్ఞానాన్ని పొందుటకు దాన్ని ఇంద్రియానుభూతులతో పరీక్షిస్తాం. అలాగే ఇంద్రియానుభూతుల విశ్వసనీయతను మనం ఆచరణాత్మక సంబంధాలలో నిరంతరం పరీక్షిస్తాం.

మన ఇంద్రియానుభూతి బాహ్యపదార్థాలతోడి ఆచరణాత్మక వ్యవహారం లేకుండా ఆ పదార్థాలకు సమన్వయిస్తుందా ? లేక పదార్థాలే ఇంద్రియానుభూతులకు సమన్వయిస్తున్నాయా ? అన్న ప్రశ్నే రాదు. మనం అనుభూతుల ఆధారంపై వ్యవహరించి, పదార్థాల్లో గ్రహించే ధర్మాలను మన వినియోగంలోకి తెచ్చుకొంటాం. ఆ పైన మన అనుభూతులు ఏ మేరకు భౌతిక వాస్తవానికి సమన్వయిస్తున్నాయో, ఏ మేరకు సమన్వయించటం లేదో పరీక్షించి నిర్ధరిస్తాం. ఈ విధంగా జ్ఞానం నిర్మితమౌతుంది.

కాని, ఏకాంతంలో తీరికగా కూర్చొని, తన మనస్సులోనుండి వెలువడే జ్ఞానాన్ని అంతర్వీక్షణద్వారా నిరూపించే తాత్వికులను జ్ఞాన సమస్య చాలా తికమక గొల్పుతుంది. ఆ మహాశయులకు తమ అధ్యయనం, తమ గ్రంథాలు, భావాలు, తాము కూర్చున్న కుర్చీ, ఆ కుర్చీలో తాము వాస్తవంగా ఉన్నామా లేమా, కలగంటున్నామా, అపస్మారంలో ఉన్నామా అని అంతా అయోమయంగా తోస్తుంది. కనుక, సమస్య వారికి చాలా గడ్డు అన్నమాట. ఐతే, ఈ అంతర్వీక్షణకు వెలుపల వారికి ఏ చిక్కులూ లేవు. అందరివలెనే వారూ నిత్యవ్యవహారాలను సాగిస్తారు. ఈ అంతర్వీక్షణను గూర్చి 'గజం మిథ్య - పలాయనం మిథ్య' అన్న సుప్రసిద్ధ కథ ఇక్కడ గమనార్హం. ఎంగెల్స్ ఇలా వ్రాశాడు :

"మానవుల తెలివితేటలవల్ల కనుగొనబడకముందే, మానవాచరణ ఈ చిక్కును విడదీసింది. రొట్టెకు నిరూపణ దాన్ని తినటమే. పదార్థ ధర్మాలను గూర్చిన మన అనుభూతులు ఆ పదార్థాలను మనం వినియోగపరచుకొనటం ప్రారంభించగానే పరిశీలిస్తాం. ఇంద్రియానుభూతుల నిర్దుష్టతను, లేక భ్రాంతిని తిరుగులేని పరీక్షకు గురిచేస్తాం. ఒకవేళ మన అనుభూతులు తప్పువైనట్లయితే, ఆ పదార్థాల వినియోగాన్ని గూర్చిన అంచనా కూడ తప్పే అవుతుంది మన ప్రయత్నం విఫలమౌతుంది. కాని, మనం మన అంచనాలను సాధించినట్లయితే, అనగా పదార్థం దాన్ని గూర్చిన మన భావాలకు అనుగుణ్యమైయున్నట్లు కనుగొన్నట్లయితే, మన ఉద్దిష్ట ప్రయోజనాలు నెరవేరినట్లయితే అప్పుడా పదార్థాన్ని, దాని ధర్మాలను గూర్చిన మన అనుభూతులు ఆ మేరకు మనకు బాహ్యమైయున్న వాస్తవానికి వర్తిస్తాయని నిరూపితమౌతుంది. ఎంతవరకైతే మనం మన ఇంద్రియాలను సుశిక్షితంగా వినియోగించుకొనే జాగ్రత్త తీసుకొంటామో, సక్రమమైన ఇంద్రియానుభూతులను సక్రమంగా వినియోగపరచుకోవడం ఏ మేరకు కొనసాగిస్తామో ఆ మేరకు మన అనుభూతులు పదార్థాల భౌతిక స్వభావానికి సమన్వయించి యున్నాయని మనం ఆచరణద్వారా గుర్తిస్తాం."

భౌతిక ప్రపంచం ఉంది; అందులో మనం ఒక భాగం. మనకు బాహ్యమైయున్న పదార్థాలను గూర్చి, మన శరీరాలను గూర్చి ఇంద్రియాలద్వారా మనం తెలుసుకుంటాం. కనుక, ప్రపంచాన్ని కనుగొనుటకు లేక జ్ఞానం పొందుటకు ఇంద్రియానుభూతిని మించి వేరే మార్గం లేదు. తోడ్తో మన ఇంద్రియాలు కూడ మన నెల్లప్పుడూ వంచించుటకు, లేదా కనీసం తరచు వంచించుటకు ఏర్పడలేదు. అలాగే అయినట్లయితే, మనం జీవించటమే అసాధ్య మౌతుంది. ఎంగెల్స్ యిలా వ్రాశాడు :

> "మానవ మేధ ఫలితాలు తుది విశ్లేషణలో ప్రకృతి ఫలితాలే; కనుక పరిశేషప్రకృతికి అవి విరుద్ధములు కాక సమన్వయించి యుండేవే."

అంటే మన ఇంద్రియాలు మనకు బాహ్యంగా ఉన్న భౌతిక వాస్తవాన్ని గూర్చి అనుభూతులు కల్గించుటకే నిర్మితమైయున్నవి. ఈ అనుభూతులు జ్ఞానసర్వస్వానికి భూమికయై, ఆచరణ వ్యవహారంలో వికసిస్తాయి. తమ వాస్తవానుగుణ్యతను ఆచరణ వ్యవహారమనే పరీక్షలో రుజువు చేసుకుంటాయి.

*జ్ఞానంయొక్క విస్తరణ, అసమగ్రత, విమర్శ*

కొందరు తాత్వికులు జ్ఞానం అంటే ప్రపంచలోని ప్రతి పదార్థాన్నీ క్రమాన్నీ సర్వసమగ్రంగాను పరిపూర్ణంగాను ఆవరించే దివ్యచక్షువన్నారు, జ్ఞానం సర్వసంపూర్ణమైనదని వారి భావం. కాని, అలాంటి సర్వసంపూర్ణజ్ఞానాన్ని సాధించినవారు 'నభూతో నభవిష్యతి.'

మానవ జ్ఞానం సాముదాయికంగా కాని, ఏ ఒక ప్రత్యేక శాఖగా కాని సంపూర్ణంగా పూర్తిచేయబడేది కాదు; పరిపూర్ణం చేయబడేది కాదు. జ్ఞాన మెప్పుడూ నిరవశేషం కాదు. అది నిరంతరం విస్తరిస్తూ అభివృద్ధి చెందుతుంది. మన జ్ఞానమంతా ఆచరణనుండి రూపొంది, ఆచరణలో పరీక్షింపబడుతుందన్నప్పుడు, ఆచరణ వ్యాపారంలో రూపొందే ఇంద్రియానుభూతులనుండి రూపుదీర్చుకుంటుందన్నప్పుడుజ్ఞానపరిణామపు నిరంతరాభివృద్ధి స్పష్టమవుతుంది. ఎందుకంటే, మనం చేయగల ప్రతి

ఒక్క పనినీ చేయలేం; అస్తిత్వంగల ప్రతిదాన్నీ అందలి ప్రతిభాగాన్నీ పరిశీలించలేం. మన మింకా చేయవలసిందీ, కనుగొనవలసిందీ ఎప్పుడూ శేషించి ఉంటుంది.

ఈ విధంగా జ్ఞానం నిరంతరం విస్తృతమౌతూ ఉంటుంది. కనీసం అలా విస్తరణచెందే అవకాశం ఉంటుంది. కనుక అదెప్పుడూ అసమగ్రమే. ఐతే, విస్తరణ జ్ఞానంలో అసమగ్రత రెండు లక్షణాలూ ఉన్నాయి.

1. ఒక లక్షణం పరిమాణాత్మకమైనది. పాతజ్ఞానానికి కొత్తజ్ఞాన మెప్పుడూ చేర్చబడుతూ ఉంటుంది; మనం ఎల్లప్పుడూ అధికంగా తెలుసుకుంటూఉంటాం. ఈ విస్తరణ జ్ఞాన వైశాల్యంలోను నిమ్నత లోను రెండు కొలతల్లో కొనసాగుతుంది. ఒకటి, మన కదివరకు తెలియని కొత్తవిషయాలను తెలిసికొనటం. ఇది వైశాల్యం. రెండు, మన కదివరకే తెలిసిన పదార్థాలను గూర్చి ఇంకా ఎక్కువ తెలుసుకొనటం. ఇది నిమ్నత. ఈ విధంగా మనం నిరంతరం అధికంగా తెలుసు కొంటాం; కాని సంపూర్ణంగా కాదు.

ఉదాహరణకు ఆధునిక పదార్థ విజ్ఞాన శాస్త్రం. ఇందులో పదార్థాల సూక్ష్మరూపాలను గూర్చి మనం కొత్తగా తెలుసుకొంటాం. ఐతే, ఆ సూక్ష్మరూపాలను తెలుసుకొనటంలో మనంఅణువుల్నిగూర్చి వాటి నిర్మాణాన్ని గూర్చి ఇతోధిక వివరాలను తెలుసుకొంటాం. ఈ విధంగా మనం పదార్థ జ్ఞానపు వైశాల్య - నిమ్నతలను పెంచుతాం కాని దీని అర్థం మన పదార్థ జ్ఞానం సంపూర్ణమైనదని కాదు. మన పూర్వీకులకంటె మనం అధిక పదార్థ జ్ఞానాన్ని సాధించామనీ, దాన్ని మన మెక్కడ విడుస్తామో అక్కడనుండి మన భావితరాలు ఇతోధికంగా పదార్థ జ్ఞానాన్ని సాధించేందుకు ప్రయత్నించగలరనీ దీని అర్థం.

2. రెండవ లక్షణం గుణాత్మకమైనది. మన మొక విషయాన్ని గూర్చి ఇతోధికవివరాలను తెలుసుకొన్నప్పుడు, ఆ విషయాన్ని గూర్చిన పాతభావాలుమార్పుకు గురికాకుండా ఉండవు. నూతన పదార్థాలను గూర్చిన, పాత పరిచిత పదార్థాలను గూర్చిన మన జ్ఞానం మన మిదివరకు

తెలుసుకొన్న అంశాలనే కొత్త వెలుగులో చూచుటకు దారితీస్తుంది. ఫలితంగా, మన పాత నిరూపణలకు కొత్త అర్థాలు, కొత్త ప్రాధాన్యత చేకూరుతుంది; తోడ్తో నూతన జ్ఞానం దృష్ట్యా పాత నిరూపణల అర్థాలు కొన్ని తప్పులుగా రుజువై, వాటిని సరిదిద్దుకోవలసిన ఆవశ్యకత ఏర్పడుతుంది.

ఉదాహరణకు, పదార్థ విజ్ఞానశాస్త్రంలో నూతన పరిశోధనలు క్వాంటమ్ మెకానిక్సును కనుగొనుటకు తోడ్పడ్డాయి. ఇది పాత యాంత్రిక సూత్రాలను నూతన వెలుగులో చూచుటకు దారితీసింది. అంటే, పాతజ్ఞానాన్ని నూతనజ్ఞానందృష్ట్యా పునఃపరిశీలించుటకూ కొత్తవెలుగులో పునర్నిర్మించుటకూ దారితీసింది; పాత సూత్రీకరణలలోని ప్రతిపాదనలు కొన్ని తప్పులని తేలిపోయింది. అలాగే మార్క్సిజం కూడ. మొదట ఒకే దేశంలో, సోవియట్ యూనియన్‌లో సామ్యవాద సమాజం నిర్మింపబడింది. ఆ అనుభవపు నూతనజ్ఞానం సామ్యవాద ప్రభుత్వాన్ని గురించిన, దాని స్వభావాన్ని గురించిన, విధులను గూర్చిన పాత సూత్రీకరణలు మార్పు చెందటానికి కారణమైంది. అందువల్ల, సామ్యవాద ప్రభుత్వాన్ని గూర్చిన పాత మార్క్సిస్టు ప్రతిపాదనలు తప్పులుగా రుజువై, వాటిని సరిదిద్దవలసిన ఆవశ్యకత ఏర్పడింది. జ్ఞానాభివృద్ధియొక్క గుణాత్మక పరిణామం ఈ విధంగా ఉంటుంది.

ఐతే, దీని అర్థం పాతజ్ఞానం భ్రాంతిగా తేలిపోయి అది వాస్తవిక జ్ఞానం కాదని రుజువయిందని కాదు. అలా ఐతే, నేటి జ్ఞానం కూడ రేపటి దృష్ట్యా భ్రాంతియే కావలసివస్తుంది. కనుక అలా అర్థంతీయటం సరికాదు. అసలర్థం పాతజ్ఞానపు అసమగ్రత నూతనజ్ఞానందృష్ట్యా కొత్త వెలుగులో సవిమర్శకంగా నివారింపబడవలసియుంటుందనే. కనుక తిరిగి నూతన జ్ఞానం రూపొంది భవిష్యత్తులో పాతదికానున్న ఆ కొత్త జ్ఞానపు అసమగ్రతను కూడ సవిమర్శకంగా నివారించవలసియుంటుంది.

మావో యిలా వ్రాశాడు :

> "మానవ జ్ఞానం యొక్క చరిత్ర అనేక సిద్ధాంతాలలోని సత్యం అసగ్రమైనదనీ, ఆ అసమగ్రత ఆచరణ యొక్క పరీక్షద్వారా నివారింపబడుతుందనీ చెపుతుంది . సర్వసామాన్యంగా, ప్రకృతిని మార్చే ఆచరణలోనో సమాజాన్ని మార్చే ఆచరణలోనో ప్రజల ప్రాథమిక భావాలు, సిద్ధాంతాలు, పథకాలు, కార్యక్రమాలు ఏ మార్పుకూ గురి కాకుండా సాధింపబడవు."

జ్ఞానాభివృద్ధి జ్ఞానసంచయన క్రమం ద్వారానే కాక, ప్రచలిత జ్ఞాన నిర్మాణాన్ని సిగ్గుదీర్చి సరిదిద్దే క్రమంద్వారాకూడ కొనసాగుతుంది. ఏ రంగంలోనూ జ్ఞానం సంపూర్ణం, శాశ్వతం నిశ్చితం కాదు. కనుక, ఏ జ్ఞాన నిర్ధారణకైనా సరే, జ్ఞానం జ్ఞానంగా మారే పరిణామానికి నాందీ పాఠం. ఆచరణరంగంలో మన విజయాలెలా తుదివిజయాలుకావో, మన మింకా సాధించవలసిన దెల్లపుడూ ఎలామిగిలి యుంటుందో అలాగే జ్ఞానరంగం లోను భావిలక్ష్యాలెప్పుడూ శేషించే ఉంటాయి. దీనివల్ల మనం జ్ఞానాన్నంతటినికూడ పరిమితమైనదిగా, అసమగ్రమైనదిగా, లోపసహిత మైనదిగా గుర్తించాలని తేలుతుంది. అందుకని, జ్ఞానరంగంలో నూతన విషయసేకరణేగాక, నూతన విషయ సాధనలో విజయానికి దారితీసే విమర్శకూడ తప్పనిసరిగా అవసరమని తేలుతుంది.

# 12 వ అధ్యాయం

# జ్ఞానాభివృద్ధి

పదార్థాలతో సక్రియ సంబంధా లేర్పరచుకొనే క్రమంలో జ్ఞానం రూపొంది అభివృద్ధి చెందుతుంది ఈ క్రమంలో మనం అనుభూతుల నుండి నిర్ణయాలకు పురోగమిస్తాం. జ్ఞానాభివృద్ధి అనుభూతి జ్ఞానం నుండి హేతువాదజ్ఞానానికి. పదార్థాల బాహ్య పరిశీలన నుండి అంతర సంబంధాల, సారాంశ ధర్మాల, మూలసూత్రాల పరిశీలనకు చేసుకోవడం ద్వారా కొనసాగుతుంది. ఈ విధంగా మనం భౌతిక ప్రపంచాన్ని గురించి నమగ్రతర జ్ఞానం చేకూర్చుకుంటాం. ప్రతి దశలోనూ జ్ఞానం పరిమితమైనదే; కాని అదెల్లప్పుడూ తన పరిమితుల్ని అధిగమిస్తూ ఉంటుంది.

*అజ్ఞానం నుండి జ్ఞానానికి*

జ్ఞాన సంచయనం, జ్ఞాన నిర్మాణం స్వభావరీత్యా ఎల్లప్పుడూ అజ్ఞానం నుండి జ్ఞానానికి, పదార్థాలను గూర్చి తెలియకపోవటంనుండి తెలుసుకొనటానికి సాగేక్రమమే. జ్ఞానం యొక్క సామాన్యత రీత్యా చూచినా, ఒకానొక పదార్థపు నిర్దిష్టతరీత్యా చూచినా, మొదట మన కేమీ తెలియక పోవటం, ఆ తర్వాత క్రమంగా తెలియటం జరుగుతుంది.

లెనిన్ తన జ్ఞాన సిద్ధాంతంలో యిలాచెప్పాడు :

"అజ్ఞానం నుండి జ్ఞానానికి మార్పును మనం పరిశీలించాలి.... జ్ఞానం తయారు సరుకుకాదు; అజ్ఞానంనుండి జ్ఞానం ఎలా ఉదయిస్తుంది, ఎలా అసమగ్ర అనిశ్చిత జ్ఞానం సమగ్ర నిశ్చిత జ్ఞానమౌతుందో నిర్ణయించాలి."

కాని, అనేకమంది తాత్వికులు ఈ క్రమానికి విరుద్ధంగా, జ్ఞానం పూర్వ జ్ఞానంనుండి గ్రహింపబడుతుందని ఊహించారు. అందువల్ల వారు కొన్ని మౌలిక నిశ్చయాలుంటవనీ, వాటినుండి మొత్తం జ్ఞానం క్రమక్రమంగా గ్రహింపబడుతుందనీ వాదనలు చేశారు. ఈ ధోరణి రెండు విధాల తప్పు నిర్ణయాలకు దారితీస్తుంది. ఒకటి వారు కొన్ని మూలసూత్రాలను నిశ్చితములుగా భావించి, ఆ మూల సూత్రాల ద్వారా మొత్తం జ్ఞానాన్ని తార్కికంగా నిరూపించ పూనుకుంటారు. రెండు వాస్తవ జ్ఞానపు అనేక విషయాలను తమ నిశ్చిత సూత్రాలద్వారా నిరూపించ వీలులేక నిరాకరిస్తారు. ఉదాహరణకు వేదాంతులు స్వయంప్రకాశమగు బ్రహ్మ లేక పూర్ణజ్ఞానాన్నిగూర్చి కొన్ని సూత్రీకరణలు చేసి, ఆ సూత్రీకరణలద్వారా ప్రకృతినీ పరిణామాన్నీ వివరించ పూనుకొంటారు. అలాగే స్వయం ప్రకాశమైన ఆ బ్రహ్మ లేక సంపూర్ణ జ్ఞానానికిసరిపడని కారణాన ప్రాపంచిక జ్ఞానాన్నే నిరాకరిస్తారు. భావవాదాలన్నీ అంతో యింతో ఈ ధోరణికి చెందినవే.

కాని జ్ఞానానికి అసలు ప్రారంభం అజ్ఞానం. అనిశ్చితత నుండి జ్ఞానం నిశ్చితత్వానికి సాగుతుంది. మన జ్ఞాన నిర్మాణ మెప్పుడూ అదివరకటి అజ్ఞానస్థితినుండి ప్రారంభమయ్యేదే. కనుక, స్వయంప్రకాశితములుగా భావింపబడే సూత్రీకరణలనుండి జ్ఞానక్రమ ... రించే పద్ధతి తప్పు దృక్పథాన్నవలంబించే వ్యర్థప్రయత్నం

అజ్ఞానంనుండి జ్ఞానం యెలా నిర్మిం
మన ఇంద్రియ వ్యాపారాలకుగల సం
జ్ఞానం మేధ ద్వారా, అంటే మా
సంబంధపు అవయవ వివిధా

గల విభిన్న సంబంధాలద్వారా ఇంద్రియానుభూతి రూపొందింది. అదివరకు తెలియబడని పదార్థ వివరాలు మనకుతెలుస్తాయి పదార్థాలతో మనకుగల సంబంధాల వైవిధ్యం ఎంతగా విస్తృతిమైతే మనం పదార్థాలనుగూర్చి అంతగా వివరాలను తెలుసుకొంటాం. అందుకని జ్ఞానం పదార్థాలతో మనం నెలకొల్పుకొనే సక్రియ సంబంధాల ఫలితమన్నమాట. అజ్ఞానం నుండి జ్ఞానానికి మార్పు మానవాచరణలో ప్రారంభమవుతుంది. పదార్థాలతో సంబంధంలేని స్థితినుండి క్రమంగా సంబంధాలు నెలకొల్పు కొనటం ద్వారా కొనసాగుతుంది.

ఉదాహరణకు గోదావరి ఎక్కడ పుట్టింది? దీన్ని మనం గోదావరి జన్మస్థానాన్ని చూడటంద్వారా తెలుసుకుంటాం; అలా తెలుసుకొన్నదే నాసిక. మనకు అణువుల నిర్మాణం తెలియదు. అణు నిర్మాణాన్ని మనం శాస్త్రపరిశోధనలద్వారా తెలుసుకుంటాం. ఎలెక్ట్రానును అలాగే కనుగొన్నారు మనకు నక్షత్రాల దూరాలు తెలియవు వాటిని ఛాయాచిత్రగణిత విధానంద్వారా కనుగొంటాం, అలాగే కనుగొన్నారు. సమాజాభివృద్ధి సూత్రాలను మనం అర్థశాస్త్ర నిదర్శనలద్వారా కనుగొన్నాం. ఈ నాడా సూత్రాలను సాంఘికాభివృద్ధిలో నూతన దశను సాధించుటకు వినియోగించు కుంటున్నాం.

అనుభూతులు, నిర్ణయాలు

1. జ్ఞాననిర్మాణానికి మొదటిలక్షణం అనుభూతులను అలవరచు కొనటం; అంటే పదార్థాలతోగల అనుభూతి సంబంధాలను గుర్తించట మన్నమాట. మొదట ఒక పదార్థానికి లేక క్రమానికి సంబంధించిన గుర్తింపు ఉం... ...వ అది చేకూరుతుంది. ఇది మొదటిమెట్టు. ఇది ... ...జ్ఞానంగా ఉంటుందే గాని జ్ఞానంరాదు ఈ ... ఉంటుంది: లేక పదార్థాలనూ క్రమాలను ... ఉండవచ్చు.

...ర్థాలతో సంబంధాలను నెలకొల్పు ... పదార్థాలనూ, వాటి ధర్మా

లనూ, సంబంధాలనూగూర్చి మనం కొన్ని నిర్ణయాలు చేసుకోవాలి ఇందు కని ఆలోచనా సూత్రాలను లేక తర్కాన్ని వినియోగించాలి. అంటే, భౌతిక వాస్తవ ప్రతిబింబం మన భావాలరూపంలో సరిగా వ్యక్తమయ్యే విధానాన్ని అనుసరించాలి. అప్పుడే పదార్థాల, పదార్థక్రమాల గుర్తింపు భావాల్లో నిశ్చితం కాగల్గుతుంది.

ఈ విధంగా జ్ఞాననిర్మాణంలో అనుభూతులనుండి భావాలకు మారే క్రమం కొనసాగుతుంది ఉన్నత జంతుజాలంలో అనుభూతులు వాటిద్వారా పదార్థాలను గూర్చిన ప్రవృత్తులు ఉన్నాయి. జీవిత వ్యాపారంలో అవి తమ అనుభూతి మూలకప్రవృత్తులను పెంపొందించుకొని వినియోగిస్తాయి. ఐతే ఒక్క మానవునిలో మాత్రమే అనుభూతి మూలకమైన జ్ఞానాన్ని భావాలూ, నిర్ణయాల రూపంలో గుణీకరించి సామాన్యీకరించే ప్రత్యేకతఉందని మనం ప్రథమ భాగంలో చూచాం.

ఇక్కడ, "జ్ఞానం" అంటే మానవజ్ఞానమనే అర్థంలో వాడుతున్నాం. ఒక కుక్క తన ఇంటిత్రోవను గుర్తించే విధానానికీ, మానవుడు గుర్తించే విధానానికీ భేదముంది. మానవుని గుర్తింపు భావాల, నిర్ణయాల రూపంలో వ్యక్తీకరింపబడే ప్రత్యేకతను కలిగియుంటుంది. భావాలు, నిర్ణయాలు సాంఘికజీవితంలో ప్రజలచే వ్యక్తీకరింపబడిచర్చింపబడిస్వీకరింపబడ్డాయి. కనుక భావాల నిర్ణయాలరూపంలో వాస్తవాల వ్యక్తీకరణ జ్ఞానంయొక్క అనివార్య లక్షణం. జంతుజాలంతోపాటు మానవునికికూడ అనుభూతు లున్నాయి. ఐతే మానవు[illegible]లా అనుభూతులను భావాలు నిర్ణయాలుగా మార్చుకొని సాంఘి[illegible] [illegible]స్తారు. ఇదే వారి ప్రత్యేకత. మొదటి సంకే[illegible] [illegible]ము రెండవ సంకేతక్రమపు సామాన[illegible]
మనం పావ్లావ్ పరిశో[illegible]

గత అధ్యాయంలో ఆచరణ - జ్ఞానం, అధికాచరణ-అధికజ్ఞానం అన్న చక్రక్రమాన్ని పేర్కొన్నాం. జ్ఞానం నిరంతరం చక్రక్రమంలో పెంపొందే ప్రత్యేక గుణాత్మకకార్యాల సముదాయంలో అభివృద్ధి చెందుతుంది. అనేక పదార్థాలతో అనేక సంబంధాల నది స్థాపించు కొంటుంది. ఆ సంబంధాలలో అనుభూతులను అవగాహనలను చేకూర్చు కొంటుంది; అవగాహనలను భావాలు, నిర్ణయాలుగా మార్చుకొంటుంది. తిరిగి ఆ నిర్ణయాలను నూతన పదార్థాలతో నూతన సంబంధాలు నెలకొల్పు కొనడంద్వారా వినియోగించుకొంటుంది. ఈ విధంగా తిరిగి తిరిగి నూతన అనుభూతులను, నూతన అవగాహనలను, నూతన నిర్ణయాలను చేకూర్చు కొంటూ పోతుంది. జ్ఞానం యీ విధంగా నిరంతరం అనంతంగా అభివృద్ధి గాంచుతుంది.

*ప్రాథమిక నిర్ణయాలనుండి ఉన్నత నిర్ణయాలకు :*

ఇంద్రియానుభూతి మన జ్ఞానేంద్రియాలపై పదార్థాల తక్షణ ప్రభావాన్ని ప్రతిబింబిస్తుంది. కనుక నిర్దిష్ట పదార్థాల, నిర్దిష్ట పరిస్థితుల సమాచారాన్ని మాత్రమే ఇంద్రియానుభూతి గుర్తించగలదు.

ఇంద్రియానుభూతివల్ల లభించే సమాచారాన్ని నిర్ణయాలుగా అనువదించి వ్యక్తీకరించటంలో మనం అనేక అనుభూతుల సమన్వయం ద్వారా, పోలికద్వారా బహుముఖానుభవం సంపాదించి వ్యవహరిస్తాం.

మావో ఇలా వివరించాడు :

"జ్ఞానస [illegible] మెట్టు బాహ్యపదార్థాలతో ప్రత్యక్ష సంపర్క [illegible] దినది. రెండవమెట్టు అను [illegible] నూతన క్రమం. ఇది

మున్నగునవి. ఈ నిర్ణయాలను మావో అనుభూతుల నూతన క్రమమన్నాడు. ఈ నూతనక్రమంలో సామాన్యీకరణ లక్షణం కన్పిస్తుంది.

ఇలాంటి నిర్ణయాలు చేయుటకు ఏ ఒక వ్యక్తి యొక్క అనుభూతి సరిపోదు. అనేకమంది వ్యక్తుల అనేక అనుభూతుల సమన్వయమే నిర్ణయాలకు ఆధారం కాగల్గుతుంది. కాగా, పరిశీలనయొక్క అధిక వైవిధ్యాలు, పరిస్థితుల అధికవిభిన్నతలు, దృక్కోణభేదాలు, వివిధ పదార్థాలతో ఏర్పడే సంబంధాల వైవిధ్యం - ఇవన్నీ పదార్థ భౌతికధర్మాల, సంబంధాల, పరిణామాల ప్రతిబింబాన్నిగూర్చిన ఉన్నత నిర్ణయాలకు దారులు వేస్తాయి.

పదార్థపరిశీలన లేక వ్యవస్థా పరిశీలన రెండు విధాలుగా ఉంటుంది.

పరిశీలనకూడ ఒక వ్యవహారమే. పరిశీలింపబడే పదార్థంతోమనం సంబంధాన్ని కల్గియుంటాం. ఈ సంబంధం అనివార్యలక్షణం. మనం పదార్థంయొక్క విభిన్న పార్శ్వాలనూ, పరిణామాన్నీ పరిశీలించాలంటే, ఈ సంబంధం వైవిధ్యాలకు లోనౌతుంది. పదార్థపరిశీలన మొదట పదార్థపు ప్రభావంగా ఉన్నప్పటికీ పిదప అది పదార్థంపై ప్రభావం వేసే సక్రియ పరిశీలనగా పరిణమిస్తుంది. పదార్థపు సమగ్రతర జ్ఞానాన్ని చేకూర్చుకొనుటకు దారితీస్తుంది. కనుక పదార్థపరిశీలనలో మన సక్రియ సంబంధం ప్రముఖపాత్ర వహించి ఉన్నతజ్ఞాన నిర్మాణానికి సాధనమౌతుంది.

బాహ్యపరిశీలన పదార్థంలో మార్పులు తీసుకురాదు. ఈ దృష్ట్యా బాహ్యపరిశీలన సక్రియ వ్యవహారంకాదు. ఉదాహరణకు జనాభా లెక్కల సిబ్బంది, గణాంకపరిశీలకులు అనేక సంఖ్యలను సేకరిస్తారు. ఇది సక్రియ చర్యకాదు. కాని ఆ పరిశీలన క్రియాత్మకంగాకూడ ఉంటుంది. అది ఆయా పదార్థాలస్థితిలో మార్పులుచేయుటకూ, పరిశీలకులు తమ ప్రమేయంద్వారా పదార్థాలతో నూతన సంబంధాలను నెలకొల్పుకొనటానికీ, ఆ నూతన సంబంధాల స్థితిగతులను తిరిగి పరిశీలించి తగుమార్పులు చేసుకొనుటకూ అనుగుణ్యంగా సాగుతుంది. ఉదాహరణకు గణాంకపరిశీలకులు ఆయా వృత్తుల్లో, వ్యవసాయ పారిశ్రామిక సరకులధరల్లో ఆదాయవ్యయ వ్యత్యా

స్టాల్లో వివరాలను సేకరించి, ఆ లెక్కల ఆధారంపై సంయోజితపథకాల ద్వారా ప్రభుత్వ ప్రమేయానికి అవకాశం కల్గిస్తారు. ఏటేటా ఆ సంఖ్యా వివరాలను పోల్చిచూచి ప్రభుత్వాలు ప్లానులద్వారా సమాజాన్ని నిర్దిష్టంగామార్చే విధానాన్ని అమలుపరచుటకు పునాదులు వేస్తాయ. కనుక తుది విశ్లేషణలో, పరిశీలన సక్రియవ్యవహారమే.

1. సక్రియపరిశీలనకు ముఖ్యలక్షణాలలో ఒకటి కొలత; ఒక వస్తువును కొలిచేక్రమంలో ఆ వస్తువుకు మరొక వస్తువుతో సంబంధం కల్పిస్తాం. ఆ సంబంధంద్వారా శ్లిష్టమైన నిర్ణయాలకువస్తాం. ఐతే ఇంతవరకు మనం కొలిచే వస్తువులో మార్పుమాత్రం రాదు.

2. సక్రియ పరిశీలనయొక్క ఇతర లక్షణాలు : ఒక వస్తువును మనం అనేక భాగాల్లో విడదీసి తిరిగి అతకటం లేక ఒక పదార్థంతో ఇతర పదార్థాలను కలిపి దాని ధర్మాల్లోమార్పులు తేవటం. ఇక్కడ రెండు విధాలైన మార్పు లున్నాయి: భౌతికమార్పు, రసాయనికమార్పు వంటివి

ఇలా మనం సక్రియపరిశీలనా పద్ధతు లవలంబించడం ద్వారా పదార్థాలను గూర్చి మనం తెలుసుకొనగోరే అంశాలను తెలుసుకుంటాం. ప్రయోగాత్మక పరిశీలనద్వారా పదార్థాలధర్మాలు, సంబంధాలు, చలనాలు, చలనసూత్రాలు, కార్యకారణాలు, నిర్మాణం మున్నగు ఉన్నతపరిశోధనలకు సాగిపోతూ నిర్ణయాలు చేస్తాం.

ఈ విధంగా పదార్థాల సక్రియ పరిశీలనద్వారా చేకూరే సమాచారాన్ని నిర్ణయాలుగా అనువదించి వ్యక్తీకరిస్తాం. తర్వాత జ్ఞానంద్వారా అధికజ్ఞానాన్ని చేకూర్చుకొనే ఉన్నతక్రమం కొనసాగుతుంది. ఈ క్రమంలో నూతన పరిశోధనా రంగాలు, పదార్థాలతో నూతన సంబంధాలను నెలకొల్పుకొనే విధానాలు రూపొందుతవి. అంటే, అదివరకే నిర్మితమై రూఢమైయున్న జ్ఞానాన్ని మనం ఇతోధిక పరిశీలనకు, ఇతోధిక ఆచరణకు సాధనంగా అభివృద్ధి పరుస్తామన్నమాట. ఈప్రక్రియ మన మిదివరకే నిర్ధరించుకొనియుండిన జ్ఞానం మరింత నిశితంగానూ, వ్యాప్తితోనూ పరీక్షింపబడి, జ్ఞాన నిర్మాణం ఇతోధిక పరిణామానికి లోనౌతుంది.

ఈ క్రమంలో - పరిశీలననుండి నిర్ణయానికీ, నిర్ణయాల ఉన్నత పరిశీలనద్వారా ఉన్నత నిర్ణయాలకూ కొనసాగే పరిణామంలో - తక్షణ నిర్ణయాల అసమగ్రత నివారింపబడుతుంది. అంటే అనుభూతియొక్క లోపం నివారింపబడుతుంది.

ప్రాథమికానుభవంలోనే ఇంద్రియానుభూతికీ పదార్థ వాస్తవికతకూ గల వ్యత్యాసం విదితమౌతుంది. శుభ్రమైన ఉప్పూ, పంచదారా ఒకేలా కన్పిస్తాయి. కాని వాటిని నోటిలో వేసుకొని రుచిచూడగానే వేర్వేరని తేలిపోతోంది. మొదట ఉప్పునుచూచి పంచదారగా మనం భ్రమపడవచ్చు. కాని రుచిలో అనుకున్న ఫలితం రానప్పుడు మనం దృష్టివలని ఆ అపోహను సరిచేసుకుంటాం. ఈ విధంగా ప్రాథమికానుభవదశలో మనం పదార్థాలనుగూర్చిన అనుభూతిలో ద్యోతకమయే తాత్కాలిక అసమగ్రతను సరిచేసుకొంటాం.

సూర్యబింబం మన కంటికి చిన్నదిగా కనబడుతుంది. కనుక చాలాకాలంవరకు మానవులు సూర్యబింబం చిన్నదిగానే వుంటుందని భావించారు. కాని ఇప్పుడు శాస్త్రపరిశోధనలద్వారా సూర్యుడు భూమికంటె ఎన్నో వేలరెట్లు పెద్దగా ఉన్నట్లు తెలుసుకొన్నాం. అలాగే సూర్యుడు భూమిచుట్టూ తిరుగుతున్నట్లు కనబడుతుంది. కనుక ఆదిమ మానవులు సూర్యుడే భూమిచుట్టూ తిరుగుతున్నాడనుకున్నారు. కాని ఈనాడు సూర్యుడు కాక భూమియే సూర్యుని చుట్టూ తిరుగుతూందనీ, తనచుట్టూ తానుకూడ తిరుగుతూందనీ పరిశోధనలు వివరించాయి.

ఇక రెండవదశ, పదార్థాలను గూర్చి ఉన్నత నిర్ణయాలు చేసే క్రమం. ఇందులో మనం పదార్థాల, వాటి ధర్మాల, పదార్థ సంబంధాల ఖండ జ్ఞానాన్ని, ప్రాథమిక నిర్ణయాలను సమన్వయ పూర్వకంగా, బహుముఖ వీక్షణతో సామాన్యీకరిస్తాం.

ప్రాథమిక జ్ఞానం పదార్థాలనుగూర్చిన అనుభూతులకు చెంది విభిన్న నిర్ణయాలలో విడివిడిగా ఉంటుంది. అంతేగాని ఆదిపదార్థస్థితి క్రమాలనూ, వాటి సంబంధాలనూ ఆవరించి సమన్వయపూర్వకమైన సామాన్య నిర్ణయాలు చేయదు. అందుకని, పదార్థాల ప్రాథమికానుభూతిలో యేర్పడే

నిర్ణయాలలోని లోపాలను సవరించుకొని, ఆభాసలను నివారించుకొని, పదార్థాల వాస్తవిక ధర్మాలను, సంబంధాలను, చలనాలను గూర్చిన సామాన్య నిర్ణయాలను మనం రూపొందించుకుంటాం. అలా రూపొందించుకొనటంతో ప్రాథమిక పరిశీలనలోని నిర్దిష్ట ధర్మాల, చలనాల, సంబంధాల సామాన్య సూత్రీకరణలను గూర్చి నిర్ణయాలు చేస్తాం. అంటే, ప్రాథమిక సామాన్యతలోని ఖండ అసమగ్రతనుండ మనం సామాన్యతలోని పూర్ణ సమగ్రత వంకకు పురోగమిస్తా మన్నమాట.

ఉదాహరణకు సౌరకుటుంబానికి చెందిన కొన్ని ప్రధాన విషయాలను మనం కనుగొంటాం. భూమీ, ఇతర గ్రహాలూ సూర్యునిచుట్టూ తిరుగుతున్నాయి. సౌరకుటుంబాన్ని గూర్చి ఇలా చెప్పటం అంటే, సౌరకుటుంబ వ్యవస్థకు కారణమయిన చలన సూత్రాలను కూడ తెలియజేస్తున్నామన్నమాటే. వాటి మూలంగానే సౌరకుటుంబం ఏర్పడినట్లుగ్రహిస్తున్నామన్నమాట.

అలాగే సున్నాడిగ్రీల ఉష్ణోగ్రతలో నీరు మంచుగడ్డగా ఘనీభవిస్తుంది. ఇది సామాన్య వాస్తవం. దీన్నిబట్టీ, ఇంకా అనేక పదార్థాల పరిశీలననుబట్టీ అలా నీరు ఎందుకని గడ్డకడుతుందో, ఉష్ణోగ్రత మార్పువల్ల పదార్థాలలోని అణుసమన్వయం యెలా మార్పుచెందుతుందో మనం సూత్రీకరించి నిర్ణయిస్తాం.

ఇలా పదార్థాలనూ వాటిక్రమాలనూ మనం పరీక్షించి నిర్ణయాలు చేస్తాం. పరిశీలననుండి నిర్ణయానికి మారే జ్ఞాన వికాసం ప్రాథమిక నిర్ణయంనుండి ఉన్నత నిర్ణయానికిమారే క్రమానికి చెందుతుంది. అంటే మొదట పదార్థాల బాహ్య పరిశీలనవల్ల లభించే సమాచారాన్ని ఆధారంగా చేసుకొని చేసే నిర్ణయంనుండి క్రమంగా పదార్థాల నిర్మాణం, వాటి ఆంతర వ్యవస్థ, కార్యకారణాలు, పరస్పర సంబంధాలు, ప్రభావాలు, చలనాలను గూర్చిన ఉన్నత నిర్ణయాలకు పురోగమిస్తాం.

నిర్ణయాల పరిణామంలో ఇది గుణాత్మకమైనమార్పు. ప్రాథమిక నిర్ణయాలనుండి ఉన్నత నిర్ణయాలకు పురోగమించుటలో నిర్ణయాల స్వభావం మారిపోతుంది. ఇంద్రియ గోచరమయ్యే ప్రత్యక్ష పదార్థాలతో

సమన్వయించే నిర్దిష్ట నిర్ణయాలు ప్రాథమికమైనవి. అలాకాక అనుమానానికి చెందే నిర్ణయాలు నిర్దిష్టతకుగాక గుణీకరణలకు చెందియుంటాయి. వ్యవస్థల ధర్మాలను, కారణాలను, నిదర్శనాలను, ఫలితాలను అవి ఆవరిస్తాయి. అంటే మనం పరిశీలించే క్రమాలకు, సంబంధాలకు చెంది వాటిని వివరిస్తాయన్నమాట. ఉదాహరణకు పెట్టుబడిదారీ విధానం. ఇది ఇంద్రియగోచరం కాకున్నప్పటికీ, దానికి చెందిన జ్ఞానాన్ని మనం కల్గియుంటాం. ఈ ఉన్నతదశను మనం తార్కికజ్ఞానంగా పేర్కొంటాం.

*అనుభూతి జ్ఞానంనుండి తార్కిక జ్ఞానానికి*

జ్ఞానాభివృద్ధి నిర్ణయాలరూపంలో వ్యక్తమౌతుంది. ఇందులో ప్రాథమిక నిర్ణయాలు అనుభూతి మూలకమైన జ్ఞానం; ఉన్నత నిర్ణయాలు పదార్థ ధర్మాలను, పరస్పర సంబంధాలను గూర్చిన జ్ఞానం. ఈ రెండూ గుణాత్మకంగా వేర్వేరు దశలు. ప్రాథమిక దశలో పదార్థాల స్వరూపాలు, లక్షణాలు, బాహ్యసంబంధాలు నిర్ణయాలద్వారా వ్యక్తమౌతాయి. రెండవ దశలో పదార్థాల స్వరూపాలు, లక్షణాలు, బాహ్యసంబంధాలు కాక వాటి సారాంశం, ఏకత్వం, ఆంతర సంబంధం నిర్ణయాల్లో వ్యక్తమౌతుంది.

మొదటి దశనుండి రెండవ దశకు మార్పు సక్రియ పరిశీలనపై ఆధారపడుతుంది. పరిశీలనలో క్రియాత్మకపాత్ర లేకుంటే ఉన్నత సామాన్య నిర్ణయాలకు అవసరమయ్యే సమాచారం లభించదు; నిర్ణయాలు నిరాధారమైన ఊహాగానాలు లేక భ్రాంతులు కావలసివస్తుంది.

అంతేకాక, రెండవదశలో పరిశీలననుండి పెంపొందే ఆలోచనా క్రమంకూడ పాత్రవహిస్తుంది. పరిశీలనలను వేరుచేయటం, పోల్చటం, సమన్వయించటం, గుణీకృత భావాలను నిర్మించటం, ఆ సామాన్యతలను తర్కించటం, నిర్ణయాలు చేయటం-ఇదంతా ఆలోచనా వ్యాపారమే. ఈ విధంగా ఆలోచన సామాన్య నిర్ణయాలకు దారితీస్తుంది. ఇలా నిర్ణయాలు చేయటమేకాక వాటిని తిరిగి తిరిగి పరిశీలనల్లో పరీక్షించి పెంపొందించవలసి యుంటుంది.

ఈ విధంగా ఆలోచనద్వారా జరిపే నిర్ణయాలు ప్రాథమికమైన అనుభూతిమూలకమైన వాస్తవికతకు సమన్వయించాలి. మొదటిదశనుండి

రెండవదశకు మార్పు అనుభూతిమూలకమైన ప్రాథమిక నిర్ణయాల దశ నుండి ఆ నిర్ణయాల ఆధారంపై లభించే సమాచారాన్ని గుణీకరించి సామాన్యీకరించే దశకు చేరుకొనటమన్నమాట.

ఉదాహరణకు సూర్యుడు వేడిగా ఉన్నాడనే నిర్ణయం అనుభూతికి చెందినది. కాని సూర్యోపరితలంపై 6000 సెంటీగ్రేడు డిగ్రీల ఉష్ణోగ్రత కలదన్న నిర్ణయం సూర్యబింబానికికాక, ఉష్ణోగ్రతనిర్ణయానికి చెందిన అంశం. ఈ నిర్ణయం ఉష్ణోగ్రతనుగూర్చిన గుణీకృతభావంపైనా, ఆ గుణీకరణ ఆధారంపై జరిగే అనేక పరిశీలనల అనుభూతుల సమన్వయం పైనా ఆధారపడి, జ్ఞానంయొక్క ఉన్నత దశకు చెందినదై ఉంటుంది. సూర్యుని వేడిని గురించిన బాహ్యపరిశీలనతో ప్రారంభించి సూర్యుని ఉష్ణోగ్రతను నిర్ణయించేదశ సూర్యగోళపు అంతరక్రమజ్ఞానానికి చెందినది; దాని ఉష్ణోగ్రతనుగూర్చిచేసిన శాస్త్ర నిరూపణకుచెందినది. సూర్యగోళం లోని అణువులు, వాటి స్ఫోటన క్రమం, దానివలన కలిగే మహోన్నత ఉష్ణోత్పత్తి మున్నగు ఉన్నత శాస్త్ర సిద్ధాంతాలనది ఆవరిస్తుంది.

అలాగే ఒకానొక దేశంయొక్క ప్రభుత్వ వ్యవస్థ. మన దేశంలో ప్రభుత్వం, ఉభయ పార్లమెంటుసభలు చేసే శాసనాలద్వారా కొనసాగుతుంది. పార్లమెంటు మెజారిటీతో శాసనాలు చేస్తుంది. వాటికి రాష్ట్రపతి ఆమోదముద్ర వేస్తాడు. ఆ శాసనాలను ఆఫీసర్లు, పోలీసులు, న్యాయాధికారులు అమలు జరుపుతారు. ఇలా పార్లమెంటరీ విధానాన్నిగూర్చిన సమాచారం చాలా ఉంది. ఈ వివరాలు ప్రభుత్వాన్నిగూర్చిన బాహ్య పరిశీలనకు చెందినవి. ఐతే, మనం ప్రభుత్వాన్ని మరికొంతలోతుగా సాంఘికార్థిక పునాదిపై సాగే చారిత్రికాభివృద్ధిరీత్యా పరిశీలించినప్పుడు, ఆ పరిశోధన ఆధారంపైనిర్ణయాలు తీసుకొన్నప్పుడు మనప్రభుత్వం బ్రిటిషు పార్లమెంటరీ విధానాన్ననుసరిస్తోందనీ, పెట్టుబడిదారీవర్గం చేతిలో సాధనంగా ఉందనీ బోధపడుతుంది. బ్రిటిష్‌పాలనకు వ్యతిరేకంగా జరిగిన జాతీయపునరుజ్జీవన తత్ఫలితంగా రూపొందిన ఈప్రభుత్వ విధానం కేవలం బాహ్యలక్షణాల పరిశీలనద్వారాకాక, సారాంశాన్ని పరిశీలించే ఉన్నత దశకు చెందినది. పార్లమెంటులో పన్నులు విధిస్తారు.

ఐతే, సామాన్య ప్రజలపై విధించే కొనుగోలు పన్ను మున్నగు పరోక్షపన్నులు పెంచాలా లేక పెట్టుబడిదారులపై విధి చే ఆదాయంపన్ను మున్నగుప్రత్యక్షపన్నులు పెంచాలా అని చర్చిస్తారు. ఆచర్చల ఫలితంగా రెండురకాల పన్నులనూ పెంచుతారు ఐనా పెట్టుబడిదారుల లాభాలకు పూర్తి అవకాశాలుంటవి. పైగా పరోక్షపన్నులను ఖచ్చితంగా వసూలు చేస్తారు. పెట్టుబడిదారులు ప్రత్యక్ష పన్నులను ఎగవేయడానికి అవకాశం కల్పిస్తారు. ఈ విధంగా మనం ప్రభుత్వ వ్యవస్థను దాని ఆంతరవ్యవహారాన్ని బట్టి పరిశీలిస్తాం. ఇది జ్ఞానం యొక్క ఉన్నత క్రమానికి చెందిన పరిశీలన. మావోతన జ్ఞాన సిద్ధాంతంలో జ్ఞానం యొక్క మొదటి దశను అనుభూతి జ్ఞానం అన్నాడు. అనుభూతిజ్ఞానం బాహ్య పరిశీలనకు పరిమితమైనది. రెండవదశ హేతువాద జ్ఞానం లేక తార్కిక జ్ఞానం. ఇది భావాల గుణీకరణపైన ఆలోచనాక్రమంపైన ఆధారపడియుంటుంది. ఆయన ఇలా వ్రాశాడు:

"తార్కికజానం అనుభూతి జ్ఞానం కంటె ఎందువల్ల వేరైనదంటే, అనుభూతిజ్ఞానం పదార్థాలభిన్నలక్షణాలకు, స్వరూపాలకు, బాహ్యాసంబంధాలకు చెందుతుంది. తార్కికజ్ఞానం పరిపూర్ణతను, పదార్థసారాంశాన్ని, అంతర్గత స-బంధాలను తెలుసుకొనుటకు గొప్ప ముందంజ. పరిసర ప్రపంచపుఅంతర్వైరుధ్యాలను అది విడదీస్తుంది. కనుక అది ప్రపంచాభివృద్ధిని దాని పూర్ణతలో, అన్నిలక్షణాల అంతర్గత సంబంధాలను వివరించుటకు సమర్థమైనది."

జ్ఞానపరిణామం ఇలాఉండగా, అనేకమంది తాత్వికులు పాజిటివిస్టులు (Positivists), ప్రాగ్మాటిస్టులు(Pragmatists) అనేకతికమకలకు గురియౌతున్నారు. జ్ఞానం రెండుదశలద్వారా, గతితార్కికంగా అభివృద్ధి చెందుతుందని వారు అంగీకరించరు. ఇంద్రియప్రేరణలద్వారా జ్ఞానం చేకూరుతుందనీ, ఆ జ్ఞానాన్ని మనం పరిశీలనల్లో పోల్చి సమన్వయించి నిర్ణయాలు చేస్తామనీ వారు చెప్తారు. కనుక వారికి అనుభూతి జ్ఞానమే సర్వోపరిఅన్నమాట. వారు పదార్థాల స్వరూపాలను, విభిన్నతలను, బాహ్య సంబంధాలను మాత్రమే పరిశీలిస్తారు. అంతర్గతవైరుధ్యాన్ని

నిరూపించటం వీరిదృష్టిలో భ్రాంతి. అంటే, సమాజవ్యవస్థ యానా దెలా కన్పిస్తుందో అలాగే ఉంటుందనీ, ఉండాలనీ వీరు అంటారు. సమాజంలోని అంతర్వైరుధ్యత, వర్గపోరాటం, మార్పుకొరకు సాగేకృషి ఇదంతా అనవసరమయిన కల్పన అని వీరి ఉద్దేశం.

ఈ ధోరణికి వ్యతిరేకంగా మార్క్సిజం జ్ఞానాభివృద్ధియొక్క ప్రాథమిక దశనూ, ఉన్నతదశనూ రెంటినీ నిరూపిస్తుంది. ముందు ఇంద్రియప్రేరణలద్వారా మనం సమాచారాన్ని గ్రహిస్తాం. ఇంద్రియానుభూతినుండి అనుభూతిదశకు మనం చేరుకుంటాం. వేర్వేరు ఇంద్రియానుభూతి సంకేతాల సమన్వయంలో అనుభూతి ఏర్పడుతుంది. ఆ పిదప భావాలలో, నిర్ణయాలలో వ్యక్తీకరింపబడే జ్ఞానం అభివృద్ధి చెందుతుంది. స్వరూపాల బాహ్యసంబంధాలనుండి, అంటే అనుభూతి జ్ఞానంనుండి అంతస్సంబంధాల, సారాంశ నిర్ణయాల హేతువాద జ్ఞానానికి చేరుకుంటాం.

*స్వరూపం, సారాంశం*

ప్రాథమిక భావాలనుండి గుణీకృత భావాలకు, బాహ్యపరిశీలన నుండి ఉన్నత పరిశీలనకు, అనుభూతిజ్ఞానంనుండి హేతువాదజ్ఞానానికి చేరుకొనటంలో స్వరూపజ్ఞానం సారాంశజ్ఞానంగా పరిణమిస్తుంది. జ్ఞాన నిరూపణలో స్వరూప–సారాంశాల భేదాన్ని మనం గుర్తించాలి. బాహ్య పరిశీలనలో పైకి కన్పించే బాహ్యలక్షణాల చైతన్యం స్వరూపజ్ఞానం; ఆ బాహ్య లక్షణాలకు కారణమైన అంతర సంబంధాల చైతన్యం, అంటే సక్రియ పరిశీలనా చైతన్యం సారాంశజ్ఞానం. మన మొక విషయాన్ని గురించి తెలుసుకుంటున్నామంటే, స్వరూపంనుండి సారాంశానికి పురోగమిస్తున్నా మన్నమాటే. పైకి కన్పించే లక్షణాలతో ప్రారంభించి, ఆ లక్షణాల స్వభావాన్ని, అవి అలా కనపడే రీతిని, అందుకు కారణాలను, అంతరసంబంధాలను క్రమక్రమంగా తెలుసుకుంటాం.

"స్వరూపానికి చెందిన తక్షణజ్ఞానం సారాంశపరిశీలనగా పరిణామం చెందాలి.....పైకి కనబడే స్వరూపాలకు ఆధారమైన

అనివార్య ఆంతర సంబంధాలను, సూత్రాలను పరిశీలించటంద్వారా స్వరూపాలను నిర్ణయించటం శాస్త్రీయ పద్ధతి.

"పరిశీలన పదార్థాన్ని వివరంగా తెలుసుకొని, దాని అభివృద్ధి రూపాలను విశ్లేషించి, ఆ రూపాల ఆంతర సంబంధాలను నిరూపించాలి. ఈ క్రియ జరిగినప్పుడే అసలు గమనాన్ని సరిగా వివరించటం సాధ్యం. దీన్ని సరిగా సాధిస్తే, పరిశీలింపబడుతున్న వస్తుతత్వం అద్దంలోవలె భావంలో ప్రతిబింబిస్తుంది." —మార్క్స్.

ఈ విధంగా మార్క్స్ శాస్త్రీయ పరిశీలనకు చెందిన మూల స్వభావాన్ని, సూత్రాలను వివరమైన విశ్లేషణద్వారా కనుగొనాలనీ, ఆంతరసంబంధాలను, వాస్తవ చలనాన్ని నిరూపించి వివరించేదిగా ఉండాలనీ అన్నాడు.

మార్క్స్ తన సాంఘిక పరిశోధనల్లో ఇదే పద్ధతి నవలంబించాడు. "కేపిటల్"లో అశిక్షిత అర్థశాస్త్రజ్ఞులు పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థల పైపై స్వరూపాలను మాత్రమే పరిశీలిస్తారనీ, కాని శాస్త్రీయ పరిశీలన ఆ స్వరూపాలలో దాగియుండే ఆంతరసంబంధాలను విశదీయటానికి ప్రయత్నిస్తుందనీ, ఆ ఆధారంపైనే స్వరూపాలను వివరిస్తుందనీ వ్రాశాడు. ఐతే ఒకవేళ ఆంతరసంబంధాలు బాహ్య పరిశీలనకే గోచరించినప్పుడు ఇక నిశిత (ఉన్నత) పరిశీలన యొక్క ఆవశ్యకతే ఉండదు. కనుక పదార్థాల, వ్యవస్థల సారాంశం బాహ్యలక్షణాల్లో గోచరించదు; ప్రయత్నపూర్వకమైన, సవిమర్శకమైన విశ్లేషణద్వారానే విదితం కాగలదు.

"అశిక్షిత ఆర్థికవేత్తలు 'తక్షణ సంబంధాల రూపమే' మనస్సులో ప్రతిబింబిస్తుందన్న ధోరణిలో ఆలోచిస్తారు. వారి ఆలోచనా ధోరణి ఆంతరక్రమాలను సంబంధాలను చూడదు. అదే నిజమైతే ఇక శాస్త్రంయొక్క అగత్యమే ఉండదు." - మార్క్స్

మార్క్స్ ఒక లేఖ ముగింపులో "భూమికి అద్దెవస్తుంది; పెట్టుబడిమీద వడ్డీ వస్తుంది; శ్రమకు కూలి దొరుకుతుంది" మున్నగు పైపై స్వరూపాల సూత్రీకరణలను పేర్కొన్నాడు. ఈ సూత్రాలు ఆర్థిక వ్యవస్థ

లోని ఆంతరవైరుధ్యాన్ని పాటించవు. కాని మనం "మన దృక్పథంతో సమస్యలను వేరువిధంగా చూస్తాం. పైకి కనబడే ఈ చలనాన్ని మనం విశ్లేషించి చూస్తాం" అని వ్రాశాడు.

వారి విమర్శ పాజిటివిస్టు (Positivist) ధోరణులకు చెందినది. ఎలాగో అలా బండి ముందుకు సాగటమే వారి దృక్పథం. 'పదార్థాలు వ్యవస్థలు పైకి ఏరూపంలో కనిపిస్తున్నాయో అంతవరకే వాటినిగూర్చిన చర్చ' అనే ఈధోరణి పై అర్థశాస్త్ర సూత్రీకరణలకు సరిపోతుంది. మనం సమాజ వ్యవస్థను మార్చనవసరం లేదనీ, అది అలాగే కొనసాగాలనీ చెబుతూ ప్రచలిత విధానాన్ని సమర్థించుటకే యీ ధోరణి ఉపకరిస్తుంది. ఉదాహరణకు సాహిత్యరంగంలో ఎగ్జిస్టెన్షియలిజం (Existentialism) అని ఒక ధోరణి ఉంది. అది ఎలాగో అలా కిక్కురు మనకుండా కాలాన్ని వెళ్ళదీయటమే జీవితంఅంటుంది. అలాగే ప్రాగ్మాటిజం (Pragmatism) జీవితంలో ఏది అనుకూలపడితే అదే వాస్తవమైనది అని చెబుతుంది. సర్రియలిజమ్ (Surrealism) జీవితాన్ని వాస్తవంగాకాక ఒక కలగా మాత్రమే చూస్తుంది. ఈ తాత్విక ధోరణులన్నీ ప్రచలిత సాంఘిక వ్యవస్థతో రాజీవిధానాలుగా రూపొంది, సాంఘిక పరివర్తనా వశ్యకతను బలహీనపరచేవి మాత్రమే.

మరొక ఉదాహరణ వేతనాల సమస్య. బాహ్యాపరిశీలనాదృష్టితో, పై పై సంబంధాలనుబట్టి వేతనం అంటే శ్రమకు ఫలితంగా ఇవ్వబడే డబ్బు. "ఒక మనిషి ఇన్ని గంటలు పని చేయాలి; అతనికి ఇంత వేతనం ఇవ్వాలి," అని అవగాహన. ఈ దృష్ట్యా చూస్తే, సామ్యవాద సమాజంలో ఇవ్వబడే వేతనం, పెట్టుబడిదారీ యాజమాన్యంలో ఇవ్వబడే వేతనం రెండూ ఒకటే; భేదం కనపడదు. ఏ సమాజంలోనైతేనేం ఇన్ని గంటల శ్రమకు ఇంత వేతనం అన్నదే దృష్టి. కాని వాస్తవంలో పెట్టుబడిదారీ యాజమాన్యంలోని వేతనానికీ సామ్యవాద సమాజంలోని వేతనానికీ చాలా భేదం ఉంది. వేతనం యొక్క బాహ్యరూపమిక్కడ వేర్వేరు సమాజవ్యవస్థలకు చెందియుంటూ వేర్వేరు సాంఘిక సంబంధాల ప్రయోజనాలను వ్యక్తీకరిస్తుంది.

పెట్టుబడి దారీ సమాజంలో వేతనం కార్మికుని శ్రమశక్తికి విలువ. ఆ శ్రమశక్తి పెట్టుబడిదారుకు విక్రయింపబడుతుంది. కాని సామ్యవాదసమాజంలో వేతనం శ్రమశక్తియొక్క విలువకానేకాదు. అక్కడ కర్మాగారాలు సమాజ యాజమాన్యంలో ఉంటాయి. కార్మికుడు తన శ్రమను తనకే అమ్ముకునే ప్రసక్తి రాదు కదా. కనుక సామ్యవాద సమాజంలో ఒక కార్మికుడు తన పనిద్వారా ఉత్పత్తిచేసిన విలువలో పొందే భాగస్వామ్యం వేతనం అనబడుతుంది. పెట్టుబడిదారీ సమాజంలో వేతనం హెచ్చాలంటే యజమానితో పోరాడి సమ్మెచేయాలి. కాని కమ్యూనిస్టు సమాజంలో ఉత్పత్తిని పెంపొందించటంవల్ల వేతనం దానంతటదే పెరుగుతుంటుంది. సమర్థతకొద్దీ పని - అవసరాలనుబట్టి సౌకర్యాలు అన్న సూత్రం అమలౌతుంది. పెట్టుబడిదారీ విధానంలో అధికోత్పత్తి ఆర్థిక మాంద్యానికి సంక్షోభాలకు దారితీస్తే సామ్యవాద విధానంలో ధరల తగ్గింపుకు ప్రజాబాహుళ్య సంక్షేమానికి ఉపయోగపడుతుంది. ఫలితాలలోని ఈ తేడాలు ఉభయ వ్యవస్థలలో ఏటేటా నిరూపితమౌతున్నవే. ఈ విధంగా వేతనాన్ని నిర్వచించే దృక్పథాలు వేర్వేరుగా ఉన్నాయి. ఈ భేదమెందువల్ల కల్గిందనే సమస్యను మనం పైకికనబడే లక్షణాలద్వారా బాహ్య పరిశీలనద్వారా కాక, ఆ యా సాంఘిక వ్యవస్థల ఆంతర సంబంధాలను పరిశోధించటం ద్వారా లేక బాహ్యలక్షణాల మూలకారణాలను విశ్లేషించి చూడడంద్వారా మాత్రమే గ్రహించ సాధ్యమౌతుంది.

*విప్లవసిద్ధాంతం, విప్లవాచరణ*

ప్రాథమిక నిర్ణయంనుండి ఉన్నత నిర్ణయానికి మారే క్రమాన్ని మనం పదార్థాల, వ్యవస్థల బాహ్యస్వరూప జ్ఞానంనుండి ఆంతర సారాంశ జ్ఞానానికి కొనసాగే పరిణామంగా గమనించాం. జ్ఞానపరిణామంలో యీ మార్పు గుణాత్మకమైది. ఈ గుణాత్మక పరిణామం విప్లవయుతమైనదిగా పదార్థంయొక్క వినియోగంలో పాత్రవహిస్తుంది.

పదార్థాల బాహ్యరూపజ్ఞానం ఆ పదార్థాలను ఇచ్ఛానుసారంగా మార్చి వినియోగించుకొనుటకు తోడ్పడదు. అది కేవల పరిశీలనవరకే. పదార్థాలను, క్రమాలను సంయోజిత విధానంలో మార్చి వినియోగిచు

కొనటం ఉన్నత జ్ఞానసాధన ద్వారానే సాధ్యం. కేవల పరిశీలనలో, మన చర్యపైన పదార్థక్రమంపైన కాక పదార్థ పరిణామంపై ఆధారపడవలసి యుంటుంది. అందువల్ల పదార్థాన్ని మనం వినియోగించుకునే క్రమంలో పదార్థ పరిణామపు సహజ పరిమితులు మన ఆచరణలో ఒడుదొడుకులకు, చిక్కులకు, అవాంతరాలకు దారితీస్తాయి. కాని పదార్థాల ఆంతర క్రమాలనుగూర్చి సారాంశజ్ఞానాన్ని చేకూర్చుకున్న దశలో మనం పదార్థానికి యాజమాన్యం వహించి వ్యవహరించగలం; అప్పుడు పదార్థాన్ని మన అవసరాలకు అనుగుణ్యంగా మలచి వినియోగించుకోగల్గుతాం.

ఉదాహరణకు, రసాయనిక క్రమాలను గూర్చి ఇటీవలివరకూ బాహ్యస్వరూప లక్షణాలు మాత్రమే గుర్తింపబడ్డాయి. కనుక, ఉత్పత్తి రంగంలో ఆ క్రమాల వినియోగ సంయోజన ముందుకు సాగలేదు. కాని, ఈనాడు రసాయనశాస్త్రం పదార్థాలలోని మూలద్రవ్యాలను విడదీసి తిరిగి కలిపివేయగలదు. ఉదాహరణకు, విద్యుత్తు సహాయంతో నీటినుండి ప్రాణవాయువునూ, ఉదజనినీ సులభంగా వేరుచేయగలం. అలాగే, ఈనాడు శాస్త్రజ్ఞులు పరమాణువులను సైతం భేదించగలుగుతున్నారు. ఆ పరమాణు విదళనవలని శక్తిని మానవ ప్రయోజనాలకు వినియోగించే పరిశోధనలు పురోగమిస్తున్నాయి. ఇదేవిధంగా మానవుడు నేడు ప్లూటోనియం. కృత్రిమ రబ్బరు, ప్లాస్టిక్, రేయాన్ మున్నగు అనేక పదార్థాలను సృజించి వినియోగిస్తున్నాడు.

ఇదేవిధంగా మొదటి దశలో భావనాత్మక సామ్యవాదులూ, వారి కార్మికోద్యమ నినాదాలూ సమాజాన్ని మార్చలేకపోయాయి. వారు కేవల స్వరూపజ్ఞానంతో మాత్రమే వ్యవహరించారు కాని, పిదప మార్క్సిస్టు సిద్ధాంతం సాంఘికక్రమాల సారాంశాన్ని ఆకళించి సోవియట్ రష్యా మున్నగుదేశాల్లో నూతన సమాజాన్ని నెలకొల్పుటకు కార్మికోద్యమం సాధనమైనది. కనుక, ప్రకృతిని గూర్చిగాని, సమాజాన్ని గూర్చిగాని సారాంశ జ్ఞానం చేకూరే దశ విప్లవకర అభివృద్ధిగా, విప్లవకర ఆచరణకు మార్గదర్శక మౌతుంది.

విజ్ఞానరంగంలో ఈ పురోభివృద్ధి - ఆ జ్ఞానాన్ని సాధించే వ్యక్తులు తమ చైతన్యయుతాచరణను రుజువు చేసుకోకున్నప్పటికీ-తుది విశ్లేషణలో సాంఘికాచరణ యొక్క విప్లవశీలతకు వర్తించేదే. భౌతిక శాస్త్రవేత్తల పరిశోధనలవలెనే సాంఘిక శాస్త్రజ్ఞుల పరిశోధనలుకూడ సాంఘికాచరణ లోనికి సంక్రమిస్తాయి. మానవులు సాంఘిక వ్యవహారంలో నూత్నత కోసం కృషి చేసినప్పుడే, ఆ కృషిలో తమ పరిస్థితులనూ, శక్తులనూ, అవకాశాలనూ కూడదీసుకొని అభివృద్ధి పరచుకునే దాశలోనే వారు తమ జ్ఞానాన్నికూడ వృద్ధిచేసుకుంటారు. అప్పుడే పదార్థాల, వ్యవస్థల క్రమాలను వాటి సారాంశాన్ని కనుగొంటారు. ఈ జ్ఞాన సాధన లేకుండా విప్లవయుతాచరణ సాధ్యంకాదు. లక్ష్యసిద్ధికి సక్రమ పథకాలు వేసుకొనటం దుర్లభమవుతుంది. అందువల్ల జ్ఞానరంగంయొక్క ముందంజ విప్లవాచరణకు అనివార్య లక్షణమౌతుంది.

అలాగే ప్రచలితాచరణకు సమన్వయించని జ్ఞానవికాసం, లేక హేతువాద అభివృద్ధి కూడ సాధ్యంకాదు. ఆచరణ జ్ఞానంపై ఆధారపడియున్నట్లే జ్ఞానంకూడ ఆచరణపై ఆధారపడియుంటుంది. ఆచరణతో సమన్వయం లేకుండా వాస్తవిక జ్ఞానాభివృద్ధి ముందుకు సాగదు. అలా, అధవా బలవంతంగా సాగదీస్తే రూపొందేవి కేవల ఊహాపోహాలూ, కల్పనలే. వాల్మీకి పుష్పక విమానాన్నిగూర్చి ఊహించాడు. అది కల్పనమే. కాని ఈనాటి శాస్త్రవిజ్ఞానం ఆ కల్పనను వాస్తవికతగా మార్చింది. ఇలా ఆచరణమాత్రమే భావనల వాస్తవికతకు గీటురాయి ఔతుంది. కనుక వాస్తవిక జ్ఞానం ఆచరణనుండి రూపొంది, ఆచరణలో పరీక్షింపబడి, అభివృద్ధి చెందవలసి యుంటుంది. ఇలా సిద్ధాంతానికీ ఆచరణకూ గల సమన్వయం ఆచరణకూ జ్ఞానానికీ వర్తిస్తుంది. కాని, ఒక పరిశోధన ఆ పరిశోధనవల్ల కల్గే అన్ని ఆచరణాత్మక ఫలితాలను ముందే నిర్ధరిస్తుందని కాదు; ఐనా ఆ ఫలితాల భవిష్యత్తుకు బీజావాపన కావిస్తుంది. పిదప ఆ పరిశోధనా బీజాలు వాటి ప్రయోగాత్మక దిశలో, విభిన్న రంగాల్లో విభిన్న శాఖోపశాఖలలో సాంఘికాచరణగా విస్తరిస్తాతాయి.

కనుక, వాస్తవ ప్రపంచపు అంతస్సంబంధాల సూత్రాల పరిశోధనకు, సారాంశ నిరూపణకు, వాస్తవ పదార్థాలతో క్రమాలతో ఆచరణాత్మక సంబంధాలను నెలకొల్పుకోవలసి యుంటుంది; ఆపదార్థాలకూ క్రమాలకూ యాజమాన్యం వహించవలసి యుంటుంది; వాటిని సంయోజిత విధానంలో మార్చివేసి వినియోగిస్తూపోవాలి; ఆ అనుభవంపై నూత్నోద్దేశాలను, సిద్ధాంతాలను నిర్మించుకొని వాటిని తిరిగి తిరిగి ఆచరణలో పరీక్షించాలి. ఇది తప్ప జ్ఞానసాధనకు మరో మార్గమంటూ ఉండదు.

జ్ఞానమంతటి వలెనే పదార్థాలను గూర్చిన సారాంశ జ్ఞానం కూడ అనుభవంలో పరీక్షింప బడుతుంది, విప్లవయుత జ్ఞానం విప్లవాచరణలో విప్లవ విజయానికి సాధనంగా వినియోగింప బడుతుంది. తద్వారా అది పరీక్షింపబడి రూఢి చెందుతుంది. కనుక ఆచరణరంగం ముందుకు సాగిన కొద్దీ సిద్ధాంతంకూడ పెంపొంది విమర్శద్వారా సరిచేయబడుతూ నూత్నాచరణకు దారిచూపుతుంది. ఆ ఆచరణలో అది పరీక్షింపబడుతూ అభివృద్ధి గాంచుతుంది.

> "జ్ఞానం ఆచరణతో ప్రారంభమై, ఆచరణద్వారా సిద్ధాంత స్థాయిని చేకూర్చుకుంటుంది. తిరిగి ఆచరణకు సమన్వయిస్తుంది. జ్ఞాన లక్షణం అనుభూతి జ్ఞానంనుండి హేతువాదజ్ఞానానికి ముందంజయే కాక అంతకంటె ప్రధానమైన విప్లవాచరణకు ముందంజకూడ. ప్రపంచ సూత్రాలనుగూర్చిన మనజ్ఞానం ఆ ప్రపంచాన్ని మార్చుటకు అంటే ఉత్పత్తి వ్యవహార నిర్వహణలో, విప్లవ వర్గ పోరాట ఆచరణలో, విప్లవయుత జాతీయపోరాటంలో మాత్రమేగాక, శాస్త్రీయ పరిశోధనలోకూడ సాంధ్యం వహించాలి. సిద్ధాంతాన్ని పరీక్షించి పెంపొందించుటకూ, జానసర్వస్వ పరిణామానికీ విధానం ఇదే."
>
> —మావోసె-టుంగ్.

అందువల్ల సామాన్యజ్ఞానస్థాయిని సారాంశ జ్ఞానస్థాయికి పెంపొందించటమంటే, మానవాచరణలో (మానవుడు ప్రకృతిపై యాజమాన్యం వహించి దాన్ని మార్చి వినియోగించుకొనటంలోను, తన జీవితాన్నికూడ

సరిదిద్దుకొని మార్చివేసుకొనడంలోను) విప్లవాన్ని సమకూర్చటమే. ఈ విధంగా, అనుభూతిజ్ఞానంనుండి సక్రియహేతువాద జ్ఞానం పెంపొంది తిరిగి హేతువాదజ్ఞానం విప్లవాచరణకు మార్గదర్శనంచేసి, స్వగత వస్తుగత ప్రపంచాన్ని పునర్నిర్మించటమే జ్ఞానంయొక్క ప్రయోజనమూ అన్వర్థత యూను.

*పదార్థమూ , పదార్థత్వం*

పై వివరణ భౌతికప్రపంచంయొక్క మానవచైతన్యపు వాస్తవిక వికాసాన్ని నిరూపిస్తుంది.

కాని అనేకమంది తాత్వికులు 'మన పదార్థజ్ఞానం ఆయా పదార్థాలు మన మనస్సుకెలా తోస్తాయో ఆ అవగాహనపై ఆధారపడియుంటుంద'నీ కనుక పదార్థపు పదార్థత్వం, లేక పదార్థత్వసారాంశం అజ్ఞేయమనీ వాదిస్తారు. ఈ ధోరణిలో మన అనుభూత్యవగాహనల్లోని ప్రతిబింబాలు వేరూ, వాటికి చెందే పదార్థాల పదార్థత్వంవేరూ అనే దృక్పథం పని చేస్తుంది. ఈ ధోరణిలో కొందరు పదార్థాల సారాంశం అజ్ఞేయమనీ మరి కొందరు పదార్థాల సారాంశం అసలే లేదనీ తర్కవాదం సాగిస్తారు. ఇది అర్థరహిత తర్కమే. అసలు పదార్థాలను గూర్చిన ఇంద్రియానుభూతిదశలోనే మనం పదార్థాల వాస్తవిక స్థితిని గ్రహించడం ప్రారంభిస్తాం. అనుభూతులద్వారా పదార్థపు సారాంశజ్ఞానాన్ని కాకపోయినా కొన్ని ధర్మాల, బాహ్యసంబంధాల జ్ఞానాన్నైనా చేకూర్చుకొంటాం. అందువల్ల మనం అనుభూతులద్వారా గ్రహించేది పదార్థాలు పదార్థాలుగానే. ఆ తర్వాత పదార్థాన్ని పరిశీలిస్తాం. పదార్థ ధర్మాలను, సంబంధాలను, చలనాలను హేతువాదంద్వారా సమన్వయించి, పదార్థాలు పదార్థాలుగానే సారాంశాన్ని గుర్తిస్తాము. ఇలా మొదట పదార్థాల బాహ్య లక్షణాలవరకే పరిమితమైన మనజ్ఞానం రెండవ దశలో మరికొంత లోతుగాను వ్యాప్తంగాను పదార్థాన్ని గుర్తిస్తుంది. ఇది పదార్థత్వాలను గుర్తించటమే.

కనుక, పదార్థాలు పదార్థత్వ రూపంలోను మానసిక ప్రతిబింబాల రూపంలోను దేనికదిగా. విడివడలేవు. పదార్థాలు పదార్థాలుగా యెలా

ఉన్నాయో వాటి బాహ్య స్వరూపాలద్వారా చూస్తాం. తోడ్తో ఆ స్వరూపాలను ఎంత సూక్ష్మంగా పరిశోధిస్తే అంతగా వాటి పదార్థత్వం మనకు విదితమౌతుంది. అందుకే మనం పదార్థాలను ఇచ్ఛానుసారం వినియోగించగల్గుతున్నాం. మనం రొట్టెను తిని ఆకలి తీర్చుకుంటున్నామంటే, మన మానసిక ప్రతిబింబమైన రొట్టెనుగాక, నిజమైన రొట్టెనే తింటున్నాం. కనుక మన మనస్సులో ప్రతిబింబించే బాహ్యరూపమూ తద్భిన్నమైన ఆంతరరూపమూ అంటూ రెండు రూపాలు పదార్థాలకు లేవు. పదార్థత్వ వ్యక్తీకరణమే బాహ్యరూపం. ఈ బాహ్యరూపాన్ని విడిచిపెట్టి మనం వేరే ఆంతర రూపాన్ని చూడలేము. స్వరూపమనే సాధనం ఆధారంపై స్వభావ సారాంశాన్ని పరిశోధిస్తాం ఎంగెల్స్ వ్రాసినట్లు "పదార్థంయొక్క అన్నిలక్షణాలనూ తెలుసుకొన్నావంటే, నీవు పదార్థాన్ని తెలుసుకొన్నట్లే." ఈ విధానంలోనే మనం పదార్థత్వాన్ని స్థూలరూపం నుండి సూక్ష్మరూపాన్ని, బాహ్యస్వరూపంనుండి ఆంతరసారాంశాన్ని పరిశీలనద్వారా తెలుసుకుంటాం. పదారాలనుగూర్చిన ఈ వాస్తవిక జ్ఞానం ఆ పదార్థాల వినియోగం ద్వారాను, విభిన్నావస్థలలో విభిన్నరూపాల లక్షణాల పరిశీలన ద్వారాను, అధికాధికంగా విస్తరిల్లుతుంది. అంతేకాని బాహ్యంవేరు ఆంతరంవేరు, స్థూలంవేరు సూక్ష్మంవేరు. స్వరూపంవేరు సారాంశంవేరు దేని కదేనన్న వాదం నిరాధారమే.

కనుక మనపదార్థ జ్ఞానం పదార్థత్వ జ్ఞానమే. పదార్థం ఉంటుందా అనే సందేహానికి తావులేదు. పదార్థం ఉంటుంది. అది మనచే తెలుసుకోబడుతుంది కూడ. లెనిన్ అన్నట్లు "భౌతికవాది పదార్థాలున్నాయనీ, వాటినితెలుసుకోడం సాధ్యమేననీ రూఢిగా చెబుతాడు." పదార్థం తెలియరానిదికాదు. మొదట మనం పదార్థాలను పదార్థాలుగా అనుభూతులద్వారా స్థూలంగా తెలుసుకుంటాం. తర్వాత ఆ అనుభూత్యవగాహన పునాదిపై ఆలోచనద్వారా సూక్ష్మంగా తెలుసుకుంటాం. కాగా, మనకు తెలిసిన పదార్థాలకూ, తెలియని పదార్థాలకూగల భేదం పదార్థాలలోని భేదం కాదు; మన జ్ఞానం యొక్క తరతమభేదమే అది. అందువల్ల పదార్థాల పదార్థత్వాన్ని తెలుసుకొనటం మనపైనే ఆధారపడుతుంది.

*జ్ఞానం పరిమితము, అపరిమితము :*

ఇక మన జ్ఞానం పరిమితమా, అపరిమితమా అన్న ప్రశ్న వస్తుంది.

1. సమాజ పరిణామంలో ఆయాదశలనుబట్టి జ్ఞానం నిర్దిష్టానుభవానికీ, ఆయాదశల్లోని జ్ఞాన సాధనావకాశాలకూ పరిమితమై యుంటుంది.

2. కాని సాంఘిక పరిణామం ఈ పరిమితులను అధిగమిస్తుంది. నూతన భావాలు పాతఅనుభావాల పరిమితులను దాటిపోతుంటాయి. నూతన సాంకేతికవిజయాలు పాతజ్ఞాన సాధనకున్న పరిమితుల నధిగమించి నూతన జ్ఞానసాధనకుగల అవకాశాలను నిర్మిస్తాయి.

3. ఈవిధంగా జ్ఞానం నిరంతరం అభివృద్ధి చెందుతుంది అతే, పాత పరిమితులు తొలగి పోగానే నూతన పరిస్థితులు, నూతనావకాశాలు తిరిగి నూతన పరిమితులను విధిస్తాయి. ఈ నూతన పరిమితులు కూడ భవిష్యత్తులో అధిగమింప బడేవే. కనుక ఏ పరిమితులూ శాశ్వతాలు కావు. ఎప్పటికప్పుడు యేవోకొన్ని పరిమితులు తప్పకుండా ఉంటాయి. వర్తమాన పరిమితులు శాశ్వతమైన వని చాలమంది భావిస్తారు. కాని చరిత్రలో ఎవరో ఒకరా పరిమితులను దాటి నూతన పరిస్థితులను కల్పించుటకు, నూతన పరిమితులు విధించుటకు మేలిబాటలు వేస్తారు. ఇలా జ్ఞానం పరిమితమైనదీ, అపరిమితమైనదీ కూడ.

చరిత్రలో ఎవరో ఒకరు నూతన పరిస్థితులు రూపొందుటకు నూతన మార్గం చూపుతారన్నప్పుడు దీన్ని అవతారతత్వంగా భావించరాదు. అవతార పురుషులు జన్మించి చరిత్రను నిర్మిస్తారన్న ధోరణి సరియైనదికాదు. నిర్దిష్ట చారిత్రక దశయొక్క పరిపక్వతలో మాత్రమే మహాపురుషులు, ఉద్యమ కారులైన మేధావులు ఉదయిస్తారు. సమాజాన్ని తమ నూత్న భావాలతో ఉత్తేజపరచి పునరుజ్జీవింప జేస్తారు. ఒకానొక సాంఘికదశ మరొకదశకు మార్పుచెందే సంధికాలంలో ఇది ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. కనుక వ్యక్తుల నాయకత్వపాత్రను మనం చారిత్రక సాంఘికావశ్యకతల దృష్ట్యా పరిగణించవలసి యుంటుంది.

జ్ఞానం పరిమితమూ, అపరిమితమూ అంటే ఏమిటి? మనకు ప్రస్తుతం తెలిసినది ముమ్ముందు తెలుసుకోవలసిన దాని దృష్ట్యా పరిమితం.

మున్ముందు తెలుసుకోవలసినది ఏనాటికీ తెలియరానిది మాత్రంకాదు. దాన్ని మనం భవిష్యత్తులో తెలుసుకోగలం. కనుక అజ్ఞాతమంతా అజ్ఞేయ మన్న ధోరణి సరికాదు.

ఈ సమస్యను ఒక ఉదాహరణద్వారా పరిశీలిద్దాం.

ఈ నాడు మనం సామ్యవాదాన్ని గుర్తిస్తున్నాం. భూస్వామ్యంలో సామ్యవాదాన్ని గుర్తించటం అసాధ్యమైన పని. పెట్టుబడిదారీ విధాన అభివృద్ధిలో మాత్రమే సామ్యవాదాన్ని గూర్చి వాస్తవికమైన గ్రహింపు రూపొందింది. అందుకు సాంఘికవ్యవస్థ తగు అవకాశా లేర్పరచింది. వాస్తవికమైన సామ్యవాదచైతన్య రూపొందగల్గిందంటే కారణం యిదే.ఇకకమ్యూనిజం. సోషలిస్టుదశతర్వాతకమ్యూనిస్టుదశవస్తుంది ఐతే పరిపక్వత చెందిన కమ్యూనిస్టు సమాజమేర్పడిన తర్వాత మానవాభివృద్ధి ఏ విధంగా ఉంటుందోనన్నది మనకు నేడు తెలియదు. కాని ఆవిషయం అజ్ఞేయమేం కాదు; భావిమానవుడాసమాజక్రమాన్నీ దాని సూత్రాలను గ్రహించగలడు.

అలాగే, ఆధునిక విద్యుత్పరిశోధనలు పెంపొందని స్థితిలో పరమాణువునుగూర్చి తెలుసుకొనటం అసాధ్యమైనపని. కాని నూతన విద్యుత్పరి శోధనల మూలంగా, అది వరకు అజ్ఞేయంగా భావింపబడిన పరమాణు రహస్యా లీనాడు శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. ఐతే ఎలెక్ట్రాన్ నిర్మాణ రహస్య మీనాడు అజ్ఞేయమని భావింపబడుతూంది.కాని ఈ పరిమితినికూడ అధిగమించే సాంకేతికాభివృద్ధి భవిష్యత్తులో సాధింపబడకుండా ఉండదు. కనుక మానవుని జ్ఞానపరిమితులను శాశ్వతమైనవిగా భావించే ధోరణి శుద్ధపిడివాదం, సంకుచిత దృష్టియే.

"నిన్నటి జ్ఞానావరణ పరమాణువును దాటలేదు. నేడు ఎలెక్ట్రానును దాటిపోలేదు. మానవుని ప్రకృతి విజ్ఞానాభివృద్ధిలో ఈ మైలురాళ్ళన్నీ తాత్కాలికమైనవనీ, సాపేక్షమైనవనీ అసమగ్రమైన వనీ మాత్రమే గతితార్కిక భౌతికవాదం చెబుతుంది.... పరమాణువు నెలా అధిగమించామో, అదే విధంగా ఎలెక్ట్రానునుకూడ అధిగమిస్తాం." —లెనిన్

అన్ని దశల్లోను, అన్ని పరిస్థితుల్లోను జ్ఞానం ఆయా చారిత్రక పరిస్థితులకు పరిమితమై యుంటుంది. జ్ఞానసాధనకై అవలంబింపబడే సాధనాలకూ, జ్ఞాన వివరణలో అవలంబింపబడే విధానాలకూ లోనై యుంటుంది. ఆ మేరకు అది అసమగ్రమూ, తాత్కాలికమూను; సాపేక్షమూ, సీమితమూను.

కాని, ప్రతి దశలోను ఇలా సాపేక్షంగా కొనసాగే జ్ఞానాభివృద్ధి భౌతిక ప్రపంచాన్ని గురించిన జ్ఞానాభివృద్ధియే. అది ప్రకృతిక్రమాల, సాంఘిక క్రమాల పరస్పర సంబంధాలను, చలన సూత్రాలను పరిశీలించడంవల్లకలిగే ఫలితమే. విజ్ఞాన సీమలనిరంతర విస్తరణద్వారా [redacted] భౌతిక వాస్తవికతకు చెందిన భావాల నిర్ణయాల సారూప్యతను అది క్రమంగా పెంపొందిస్తూ ఉంటుంది. మెట్టుమెట్టుగా అనిశ్చితత్వాన్నీ, అనుమానాన్నీ పరీక్షించి వాస్తవికతను రూఢిగా నిర్ధారణ చేస్తుంది.

ఇలా జ్ఞాన పరిణామం సమకాలిక జ్ఞాన పరిమితుల నెప్పుడూ ఎదుర్కొంటుంది. ఆ పరిమితులను అధిగమిస్తుంది. అలా అధిగమించే విధానాన్ని కనుగొనడంలో జ్ఞానం పెంపు జెంది పురోగమిస్తుంది. కనుక జ్ఞానానికి తీరని పరిమితులుగాని, అజ్ఞేయ సమస్యలంటూ గాని, అందరాని విశ్వరహస్యాలంటూ గాని ఉండవు. మానవ విజ్ఞానం అన్నిపరిమితులను అధిగమించి నిరంతరం ముందుకు సాగుతూ ఉంటుంది.

# 13 వ అధ్యాయం

# ఆవశ్యకత, స్వాతంత్ర్యం

హేతువాద జ్ఞానం పదార్థాల ఆవశ్యకతను ప్రకటిస్తుంది. ఐతే, ఆవశ్యకత ఎల్లప్పుడూ యాదృచ్ఛిక సంఘటనలద్వారానే గ్రహింపబడుతుంది. కనుక మనం జ్ఞానసాధన ద్వారా మనపైన, బాహ్య ప్రకృతిపైన ఆవశ్యకతను గూర్చిన జ్ఞానాన్ని ఆధారం చేసుకొని, క్రమశిక్షణను విధించుకుంటాం అదే స్వాతంత్ర్యం. మన లక్ష్యసిద్ధికై జ్ఞానయుతంగా పరిస్థితులను శాసించగల్గటమే స్వాతంత్ర్యం.

*ఆవశ్యకత యాదృచ్ఛికత.*

అనుభూతిజ్ఞానం హేతువాదజ్ఞానంగా వృద్ధిచెంది. పదార్థాల అంతరసంబంధాలను గ్రహించగానే ఆవశ్యకతకు చెందిన చైతన్యం రూపొందుతుంది. ఆవశ్యకత ఒక లక్షణంగా ప్రకృతికీ సమాజానికీ వర్తిస్తుంది.

ఆవశ్యకతంటే ఏమిటి? ఒకానొక సంఘటన ఫలానావిధంగా కాక ఫలానావిధంగా జరగటం అవసరమనే చైతన్యమే ఆవశ్యకత. ఒక పదార్థం ఒకానొక ధర్మంతో ఒకానొక క్రమంలో పరిణమించటం, యితర ధర్మాలతో యితర క్రమాల్లో పరిణమించకపోవటమే ఆవశ్యకత.

ఉదాహరణకు మామిడిచెట్టు మామిడికాయలే కాస్తుంది; ఇతరకాయలు కాయదు.

అవశ్యకతనుగూర్చిన భావమెప్పుడూ అనివార్యతను తెలియ జేస్తుంది; మనమొక పదార్థంయొక్క లేక వ్యవస్థయొక్క సారాంశ లక్ష ణాన్నీ ఆంతర సంబంధాన్నీ అభివృద్ధి క్రమాన్నీ గుర్తించిన తర్వాత, దాని పరిణామాన్ని ఏవో కొన్ని ఘటనలుగా కాక నిర్దిష్టమైన ఘటన లుగా అర్థం చేసుకొంటాం. వాటికిగల కారణాలను వాటి ఫలితాలతో సమన్వయించి అర్ధంచేసు కుంటాం.

న్యూటన్ యాంత్రిక గతిసూత్రాలు ప్రకృతిశాస్త్రంలో అనేక వ్యవస్థల ఆవశ్యకతను వివరించాయి ఉదాహరణకు ఒక చెట్టునుండి నేల మీదికి పడే పండు గురుత్వాకర్షణ ప్రభావానికి అనివార్యంగా లోనౌతుంది. అలాగే న్యూటన్ సూత్రాలు సౌరకుటుంబపు కొన్ని లక్షణాల అనివార్యత ద్వారా గ్రహాల చలనక్రమాన్ని వివరించాయి. గ్రహాలు పూర్తిగా వల యాకారంలో గాక కోలగా కోడిగుడ్డులాంటి వృత్తాలలో సూర్యునిచుట్టూ తిరుగుతాయి. కెప్లర్ కనుగొన్న ఈవిషయాన్ని న్యూటన్ తగు నిదర్శ నలద్వారా వివరించాడు గ్రహచలన వృత్తాలు కోలగా ఎందుకుం టాయో సకారణంగా నిరూపించాడు. సౌరకుటుంబ గమనం కోలవృత్తా లలో సాగటం యాదృచ్ఛిక సంఘటన కాదు. అది సౌరకుటుంబ సహజ లక్షణాలమూలంగా, సౌరకుటుంబ పరిణామంలో ఆంతర క్రమాల మూలంగా జరిగే సహజావశ్యకత.

ఇలాగే సాంఘిక జీవితం కూడ, పెట్టుబడిదారీ దేశాల్లో పోలీసు లెప్పుడూ కార్మికులకు వ్యతిరేకంగా యజమానులకు అండగా పని చేస్తారు. బాహ్య పరిశీలనలో ఇదొక సంఘటన మాత్రమే, కాని వాస్త వంలో ఇది యాదృచ్ఛికంకాదు. పెట్టుబడి దారీ ప్రభుత్వాల స్వభావాన్ని మనం గుర్తించినప్పుడు పోలీసులు కార్మికులకు వ్యతిరేకంగా యజ మానుల పక్ష మవలంబించటాన్ని మనం సకారణంగా నిరూపించగలం. ఆ ప్రభుత్వ వ్యవస్థలో ఆవిధానపు సహజ అనివార్యతను ఋజువు పరచగలం.

పదార్థాల కొన్ని లక్షణాలను, కొన్ని సంఘటనలను పరిశీలించ గానే ప్రతి సంఘటనను ఆవశ్యకత అను ప్రాతిపదిక పైనే అర్థం చేసు కొంటున్నామనుకో కూడదు. పదార్థ క్రమంలో యాదృచ్ఛిక సంఘటనలు కూడా ఉంటాయి. నిర్దిష్ట ఘటనలు తరచుయదృచ్ఛా స్వభావంతో జరిగేవే. కనుక అవశ్యకత గుర్తింపుతో బాటు యాదృచ్ఛిక సంఘటనల గుర్తింపు కూడ అవసర మౌతుంది.

ఉదాహరణకు, పెట్టుబడిదారీ దేశాల్లో పోలీసు లెప్పుడూ పెట్టు బడి దారుల పక్షం వహిస్తారు కాని వారు పెట్టుబడిదారులవలె దుస్తులు వేసుకోరు. ఖాకీ నిక్కర్లు హాఫ్‌షర్టులు ఎర్రటోపీలు వేసుకొంటారు. వారు ఏ దుస్తులు తొడిగినా పెట్టుబడిదారుల పక్షంగా కార్మికులకు వ్యతి రేకపాత్ర వహిస్తూంటారు. అయితే ఇక్కడ పోలీసులు వేసుకునేదుస్తుల సమస్య యాదృచ్ఛిక సంఘట నన్నమాట.

భూమి సూర్యుని చుట్టూ కోలవృత్తంలో పరిభ్రమిస్తుంది. ఇది సౌరకుటుంబక్రమ ఆవశ్యకత. కాని భూమియొక్క పరిమాణం అలాంటి ఆవశ్యకతపై ఆధారపడిలేదు. సూర్యగోళ పరిణామంలో సంఘటిల్లిన ఒక తాకిడిలో భూమీ ఇతర గ్రహాలు చీలిపోయి, ఆయా పరిమాణాల్లో ఘనీభవించాయి. కనుక యీపరిమాణాలు యాదృచ్ఛిక సంఘటన ఫలి తాలే. ఈవిధంగా శాస్త్రం ఆవశ్యకతనూ యాదృచ్ఛిక సంఘటననూ వేర్వేరుగా పోల్చుకొంటుంది.

బాహ్య పరిశీలనలో ప్రతీ ఘటన యాదృచ్ఛిక సంఘటనగానే ఉంటుంది. మనం పదార్థాల బాహ్య సంబంధాలనే చూస్తాం. కనుక బాహ్య పరిశీలనలో పదార్థాల ఆంతర సంబంధాలు, వాటి చలనసూత్రాలు మనకు బోధ పడవు; పదార్థక్రమాన్ని మనం హేతుబద్ధంకాని కార్యంగా, లేక కేవల సంఘటనగా మాత్రమే చూస్తాం. ఈ దృష్టిలో ఒక ఘటన ఇలా జరగటం, అలా జరగక పోవటంగా కాక, ఏదో ఒకలా జరిగటం గానే ఉంటుంది. "ప్రతి వాస్తవమూ ఈ విధంగానో లేక ఆ విధంగానో ఉండవచ్చు; ఏ వాస్తవమైనా ఒకటే" అని ఎంగెల్స్ పేర్కొన్నాడు. ఈ విధంగా బాహ్య పరిశీలన వల్ల లభించే జ్ఞానం పరిమితికి లోనౌతుంది.

కాని అంతర పరిశోధన పదార్థ పరిణామాన్ని నిర్దిష్టంగా చూడ గలదు. "ఇలా జరిగి అలా జరగక పోవటా"న్ని సహేతుకంగా వివరించగలదు. దీని అర్థం యాదృచ్ఛిక సంఘటనలుండనే ఉండవని కాదు; పైగా పదార్థపు అనివార్య లక్షణాలు యాదృచ్ఛిక సంఘటనల పరంపరకు ఆధారమౌతాయి. కనుక యాదృచ్ఛిక సంఘటనలు ఆ లక్షణాల ఆవశ్యకతచే నిర్ధారితమౌతాయి.

సమాజాభివృద్ధిలో సామ్యవాదం పెట్టుబడి దారీ విధానాన్ని త్రోసి వేయటమొక చారిత్రకావశ్యకత. పెట్టుబడి దారీ విధానాన్ని ఏరోజున ఏవిధంగా కూల్చివేసే విప్లవం జరుగుతుందనేది అనేక యాదృచ్ఛిక సంఘటనలపై ఆధారపడుతుంది. ఆ యాదృచ్ఛిక సంఘటనల పరంపర కూడ చారిత్రకావశ్యకతచే నిర్ధారితమయ్యేదే.

ఇదే విధంగా ప్రకృతిలో కూడ పదార్థాభివృద్ధి ఒక క్రమమార్గంలో కొనసాగుతుంది. కాని ఎప్పుడు యే రూపంలో ఏ యేదశల్లో యే మార్పులు వచ్చాయన్నది యాదృచ్ఛిక సంఘటనకు లేక బాహ్య పరిస్థితులకు చెందిన అంశం. ఒకటి ఆవశ్యకత; మరొకటి యాదృచ్ఛిక సంఘటన. ఉదాహరణకు మామిడిపిందెమామిడిపండుగా మారాలి.అలా మారుతుంది. కాని అనేక పిందెలు గాలికి రాలిపోవచ్చుకూడ. అలా కొన్నిపిందెలు రాలి పోవటం వల్ల మామిడిపిందె పండుగా మారదని మనం చెప్పలేం; సహజాభివృద్ధి క్రమాన్ని నిరాకరించలేం. పైగా మామిడి పిందెలు గాలికి రాలిపోకుండా మనం తగు యేర్పాట్లు చేయటానికి ప్రయత్నిస్తాం.

ప్రకృతియొక్క ఆవశ్యకతకూ యాదృచ్ఛిక సంఘటనకూ గల సంబంధాన్ని ఎంగెల్స్ ఇలా వివరించాడు :

"సౌరకుటుంబం పదార్థపు సహజచలన ధర్మాలరీత్యా, చలన సంక్రమణల మూలంగా సహజక్రమంలోనే రూపొందింది. కనుక లక్షోపలక్షలయేండ్లు గడచి పోయినప్పటికీ. దాదాపు యాదృచ్ఛికంగానైనా ఆ సంఘటన వెనుకగల ఆవశ్యకతరీత్యా పదార్థం ఆ (సహజ) చలన ధర్మాలను పునరావృత్తిచేయాలి.....చైతన్యావిష్కరణ పదార్థ గతియొక్క మహోన్నత లక్షణం. పరిణామాన్ని ఆలోచనాజీవుల

స్థాయికి వృద్ధిచేయటం పదార్థ లక్షణమే. కనుక అనుకూల పరిస్థితులున్నప్పుడల్లా అది సహజక్రమంలో కొనసాగేదే"

విశ్వప్రకృతిలోని పదార్థ చలనన్నీ, జడంనుండి చేతనావిష్కరణనూ, జీవన పరిణామంలో మానవస్థాయినీ గూర్చిన భౌతికవాద నిరూపణగా 'ఆవశ్యకతయొక్క అనుసరణకు' పై వాక్యాలు సమన్వయిస్తున్నాయి.

"ఏది ఆవశ్యకతగా ఉంటుందో అది యాదృచ్ఛిక సంఘటనల చేతనే నిర్మింపబడుతుంది. కనుక యాదృచ్ఛికమైనవిగా భావింపబడే రూపాల వెనుక ఆవశ్యకత తన్ను తాను దాచుకొంటుంది."

—ఎంగెల్స్

ఆవశ్యకతకు, యాదృచ్ఛికతకు భేదమేమిటి? సంఘటనల్లో ఆవశ్యకత నిర్దిష్ట రూపంలో నిర్దిష్ట ఫలితం కల్గిస్తుంది. యాదృచ్ఛికత ఒక సంఘటనలో ఒక ఫలితాన్నైనా మరొక ఫలితాన్నైనా కల్గించవచ్చు. ఐతే ప్రతి పదార్థ పరిణామంలోను ఆవశ్యకత, యాదృచ్ఛికత అనే రెండు అంశాలూ ఉంటాయి. ఇందులో సంఘటనల సాముదాయిక లక్షణాలూ ఫలితాలూ సామాన్యతకు చెందినవి. అంటే ఆవశ్యకతకు చెందినవి. కాగా ప్రతి సంఘటనయొక్క నిర్దిష్ట లక్షణాలు, ఫలితాలు యాదృచ్ఛికతగా గాఉంటవి. అంటే ఒకటి సామాన్యత, మరొకటి ప్రత్యేకత అన్నమాట. కనుక అవశ్యకత సంఘటనలచే నిర్మింపబడుతుందన్న నిర్వచనాన్ని మనం ఈ అర్థంలో గుర్తించాలి. సహజావశ్యకత ఎప్పుడూ యాదృచ్ఛిక సంఘటనల్లోనే వ్యక్తమౌతుంది; మరియు సంఘటనల అంతర్యమెప్పుడూ ఆవశ్యకత చేతనే నిర్ధరింప బడుతుంది.

*యాదృచ్ఛికత, ఆవశ్యకత, కార్యాకారణత్వం*

ప్రకృతిలోను సమాజంలోను ఆవశ్యకతను గుర్తించటం కార్య కారణ సూత్రాల గుర్తింపుతో కూడుకొని యుంటుంది. ఆవశ్యకత కారణ క్రియ మూలంగా అవసర మౌతుంది. పొగ ఉంటే దరిదాపుల్లో అగ్ని ఉండాలి. అగ్నియొక్క కారణక్రియవల్లనే పొగ యేర్పడుతుంది. అలాకాక ఒకవేళ పదార్థాలు-కార్యాలు కారణరహితంగానే కొనసాగే టట్ల

యితే, కేవలం యాదృచ్ఛికతయే సంఘటనల్లో పాత్రవహించి నట్లయితే, అప్పుడు కారణక్రమ ప్రశ్న కాని, తన్మూలకమైన అవశ్యకత ప్రశ్న కాని రాదు, పరిణామం క్రమరహితం కావలసియుంటుంది. ఆస్థితిలో మనం దేన్నీ నిరూపించే ప్రశ్నరాదు

కనుక, కొన్ని కార్యాలంటూ ఉండి, వాటికి కొన్ని అవశ్యక లక్షణాలున్నప్పుడు, ఒకానొక కార్యం ఒకానొక ఫలితానికి దారితీసినప్పుడు భౌతిక పరిణామం కార్యంలో అంతర్గతమై యున్న కారణాలవల్ల జరుగుతూందనీ, కారణక్రమం వల్లనే నిర్దిష్టఫలితం కల్గుతూందనీ అంగీకరించవలసి యుంటుంది. అందుచేత కార్యాల అవశ్యకతలో నిహితమైయున్న కారణక్రమాల గుర్తింపు.ఆ కార్యాల ఫలితాలను నిర్ధరించే కారణ క్రమపు గుర్తింపుగా ఉన్నత జ్ఞానానికి చెందుతుంది.

ఉదాహరణకు, సామ్యవాదం పెట్టుబడిదారీ విధానాన్ని అంతం చేస్తుంది. దీని అర్థమేమిటి? పెట్టుబడిదారీ విధానం నుండి సామ్యవాదం పరిణమించగల కారణాలు పెట్టుబడిదారీ వ్యవస్థనుండే రూపొందుతాయన్న మాట. ఆ కారణాల అనివార్య స్వభావంపై అది ఆధారపడ్తుందని మనం గుర్తిస్తాం. ఐతే పెట్టుబడిదారీవిధానపు అంతర క్రమాన్నీ సారాంశాన్నీ మనం సూక్ష్మంగా గ్రహించగల్గినప్పుడే అందులో ఆ కారణాలున్నాయనీ, అవి అలా వుండక తప్పదనీ, వాటి నిర్దిష్టపాత్ర అనివార్యమనీ తెలుసుకోగల్గుతాం.

అదే విధంగా కారణ జ్ఞానం పదార్థాల యాదృచ్ఛికతను కూడ గుర్తిస్తుంది. ఉదాహరణకు సామ్యవాదానికి గల కారణాలు పెట్టుబడిదారీ విధానంలోనే రూపొంది పాత్ర వహిస్తాయి. కనుక సామ్యవాదం రూపొందటం అవశ్యక మౌతుంది. కాని ఆ కారణాల ప్రత్యేకతలు యదృచ్ఛా శీలమైనవిగా ఉంటాయి. అలాంటి ప్రత్యేకతలకు అవశ్యకత వర్తించదు. పెట్టుబడిదారీ అభివృద్ధి క్రమంలో కార్మికులూ వారి నిర్మాణ శక్తి పెరగటం అవశ్యకత. ఇది జరగటం అనివార్యమూ, సామ్యవాదం యొక్క భవిష్యత్తుకు కారణమూకూడ. ఐతే పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిలో కార్మికులు, వారివ్యవస్థా నిర్మాణం పెంపొంది ఉద్యమాలు

ముందుకు సాగినప్పటికీ కొందరు నిర్దిష్ట కార్మికులు ఆ పోరాటంలో పాల్గొనక పోవచ్చు. వారు సమ్మె విచ్ఛిన్నకులే కావచ్చు. అలాగే, కార్మిక నాయకు లేర్పడటం కూడ. ఏ వ్యక్తి నాయకుడుగా రూపొందుతాడో, యే కారణాలవల్లనో నన్నది యాదృచ్ఛిక అంశం. ఈ విషయంలో మనం ఇదమిద్ధంగా చెప్పలేం. ఐనా, ఈ యదృచ్ఛా పాత్రాలుకూడ సామాన్యతలో ఆవశ్యకతలకు అనుగుణ్యంగానే ఉంటవి. మొత్తంమీద కార్మికోద్యమం పెరుగుదల కార్మికనాయకు లేర్పడటంలోకూడ ఉంటుం దనేది అనివార్యమే కదా.

ఈ విధంగా ప్రకృతిలో ఆవశ్యకత, యాదృచ్ఛికత రెండూ ఉన్న వనీ, ఆవశ్యకత యెప్పుడూ యాదృచ్ఛిక సంఘటనల ద్వారానే బహిర్గత మౌతుందనీ కార్య కారణక్రమం నిరూపిస్తుంది.

కార్యకారణ క్రమాన్ని గూర్చి తత్వశాస్త్రంలో అనేక తికమక లున్నాయి. ఒకానొక క్రమం ఒకానొక విధంగా ఉన్నట్లు చూడగానే, ఆలా ఉండటం కేవలావశ్యకత మూలంగా నని కొందరు భావించారు. ఆలాగే యాదృచ్ఛిక సంఘటన అనగా దానికి కారణమే ఉండదని మరి కొందరు భావించారు. ఈ రెండూ తప్పు ధోరణులే. నిజంలో ఆవశ్యక తకుగాని యాదృచ్ఛిక సంఘటనకు గాని కారణాలుండి తీరుతాయి. ఒకా నొక కార్యం వెనుకగల కారణాలను తెలుసుకొనటమే ఆవశ్యకతను గ్రహించటం కాదు. ఆకారణపరంపర కేవలం యాదృచ్ఛిక సంఘటనల పరంపరగా ఉండటమూ సాధ్యమే. కనుక ఆవశ్యకతను గుర్తించట మంటే, నిర్దిష్ట కారణాన్ని కాక కారణంయొక్క సామాన్యతను, అంటే సామాన్య సూత్రాలను గుర్తించటమన్నమాట.

ఈ విధంగా మనం యాదృచ్ఛికతను ఆవశ్యకతను వాటి పర స్పర సంబంధాన్ని గుర్తించటమంటే అర్థం, పదార్థాల బాహ్యసంబం ధాలనుండి ఆంతర సంబంధాలకు పురోగమించటమన్నమాట. స్వరూప జ్ఞానంనుండి సారాంశ చైతన్యానికి, బాహ్య పరిశీలననుండి లేక వివరాల సంచయంనుండి పదార్థపు గతితార్కిక విశ్లేషణకు పురోగమించట మన్న మాట. కనుక, మనం గతితార్కిక విలోకనద్వారా, పదార్థాల సాముదాయిక

స్థితిగతులద్వారా వ్యక్తంచేసే సహజావశ్యకతను వాస్తవికంగా గుర్తించాలి. ఆవశ్యకతయొక్క ఫలసిద్ధికై యాదృచ్ఛిక సంఘటనల పరంపర ఆంతర అగత్యాలచే యెలా శాసింపబడ్తుందో నిశితంగా పరిశీలించాలి. అప్పుడే మనం ఆవశ్యకత - యాదృచ్ఛికతల పరస్పర సంబంధాన్ని సమన్వయించగలం.

*మానవాచరణలో ఆవశ్యకత, స్వాతంత్ర్యం*

పైన మనం ఆవశ్యకత-యాదృచ్ఛికతల సంబంధం కారణ కార్య క్రమంలో ఎలా రూపొంది అన్ని పదార్థాలకూ, జీవకోటికీ, సమాజానికీ వర్తిస్తుందో చూచాం. ఇక మానవుని జీవితాచరణలో ఆ క్రమం ఎలా ఉంటుందో చూదాం.

ఆచరణలో మనం స్వతంత్రులంగా వ్యవహరిస్తున్నామా? లేక మన నిశ్చయానికీ, ఇచ్ఛకూ అతీతమైన నియతికి లోబడి పనిచేస్తున్నామా? ఈ ప్రశ్నకు సమాధానంచెప్పే విషయంలో అనేకమంది తాత్వికులు అనేక తికమకలకు గురియైనారు. కొందరు మానవుడు అదృష్టకర్మాధీనుడన్నారు. మరికొందరు అదృష్టశక్తికి ఆధీనుడన్నారు. ఇంకా కొందరు జగత్తుయొక్క బంధనలనుండి విముక్తుడైన మానవుడే స్వతంత్రుడన్నారు. కర్మలో స్వాతంత్ర్యం ఉండదనీ భావనలోనే అది సాధ్యమనీ మరికొందరు అన్నారు. కొందరు మానవునిలోగల ఈశ్వరాంశ —అంటే ఆత్మ— మాత్రమే స్వతంత్రమన్నారు. వీరి దృష్టిలో ఆవశ్యకత, యాదృచ్ఛికత రెండూ పరస్పర విరుద్ధములు. అలాగే అగత్యమూ స్వాతంత్ర్యం కూడ పరస్పర వ్యతిరేకమైనవని వారు భావిస్తారు. అంటే, 'అగత్యంవల్ల పనిచేయాలి; లేదా స్వాతంత్ర్యంతో పనిచేయాలి; ఈ రెంటిలో మనం యే ఒక దాన్నైనా ఎన్నుకోవాలి' అన్న విధంగా వారీ సమస్యను చూస్తారు. కనుక ఈ సమస్య యేనాటికీ తెగదు.

పై దృక్పథమే సరియైనదైతే, జీవిత ఆవశ్యకతలకు బద్ధుడైన యే మానవుడుకూడ స్వతంత్రుడు కాజాలడు. అంటే మానవ స్వాతం

త్ర్యానికి అర్థం ఉండదన్నమాట। మానవ వ్యవహారాలన్నీ ప్రకృతి పరిణామాలవలెనే కార్యకారణ సూత్రాలకు లోబడియున్నవే. కార్య కారణక్రమం ప్రతి పనియొక్క అవశ్యకలక్షణాలను, ఫలితాలను నిర్ధ రిస్తుంది. మానవవ్యవహారం ప్రాకృతిక సాంఘిక అనివార్యధర్మాలకు లోబడ యుండేదే. కనుక మానవునికి స్వాతంత్ర్యం లేనట్లేనా? కనుక మనం ఆవశ్యకతనూ స్వాతంత్ర్యాన్నీ దేనికదేగా పరస్పర విరుద్ధాలుగా చూడరాదు. అసలు ఆవశ్యకతలోనుండే స్వాతంత్ర్యం రూపు దీర్చు కుంటుందన్న విషయాన్ని మనం గమనించాలి.

ప్రకృతిక్రమాలు, సాంఘిక నియమాలు, వాటి ఆవశ్యకతలు మన ఇచ్ఛపై ఆధారపడవు. అవి బాహ్యావరణకు చెందినవి; మానసిక ఆవరణ కవి పరిమితమైనవికావు. కనుక మనం ఎలా ఆలోచించినా, ఎలా సిద్ధాంతీకరించినా మన ఆచరణ మాత్రం సామాన్యతరీత్యా ప్రకృతి సూత్రాలకు అనుగుణ్యంగాను, ప్రత్యేకతరీత్యా మన స్వభావానికి అను గుణ్యంగాను నిర్ధారితమౌతుంది. అంతేకాక, ఆచరణయొక్క పరి ణామం ఫలితాల్లో ఆవశ్యకతను నిరూపిస్తుంది. కనుక తుది విశ్లేషణలో, ఆవశ్యకత యాదృచ్ఛికతను శాసిస్తుంది.

మానవుడు ప్రకృతిలో అంతర్భాగమే. అందులో ప్రాకృతికావ శ్యకత ప్రాథమికం; మనస్సూ ఇచ్ఛా ద్వితీయం. కనుక "ద్వితీయం అని వార్యంగాను అగత్యంగాను ప్రాథమికాన్ననుసరించ వలసియుంటుంది" అని లెనిన్ వ్రాశాడు.

మరి మానవ స్వాతంత్ర్యం ఏమిటి? మానవాచరణ యొక్క విశేషత ఏమంటే, మానవులు సాంఘికాచరణలో ఆవశ్యకతను గుర్తి స్తారు. ముందు ప్రకృతియొక్క ఆవశ్యకతలను వారు గుర్తిస్తారు. ఆ జ్ఞానంతో వ్యవహరిస్తారు. ఆ జ్ఞానాన్ని ఉద్దిష్టలక్ష్యాల సాధనకై వినియోగించుకొని ప్రయోజనాలను సాధిస్తారు. ఈ చైతన్యయుత వ్యవ హారయే మానవ స్వాతంత్ర్యం.

ఇది ఉత్పత్తిక్రమంతో ప్రారంభమౌతుంది. ఉత్పత్తిక్రమంలో మానవుడు తన శారీరకశక్తులలో చలనాన్ని కల్గిస్తాడు. వాటిని తన

జీవితావసరాలకు అనుగుణ్యంగా వినియోగించుకొంటాడు. ప్రకృతిని స్వాధీన పరచుకొనే లక్ష్యాన్ని నెరవేర్చుకొనడం ప్రారంభిస్తాడు. ఇక్కడ నుండే చైతన్యయుత వ్యవహారం ప్రారంభమౌతుంది.

జంతుజాలం తన సహజప్రవృత్తుల పరిమితుల్లో మాత్రమే వ్యవహరిస్తాయి. అవి యెప్పుడూ ప్రకృతి ప్రభావానికిలోనైనవిగానే ఉంటాయి. మానవు డలాకాదు. పరిసరాల ప్రభావానికి మాత్రమే అతడు లోనుకాడు. తన ఇచ్ఛానుసారం ప్రకృతినిమార్చి వినియోగించుకొంటాడు. మానవులు తమ లక్ష్యాలను తాము రూపొందించుకునే పథకాలద్వారా సాధించుకొంటారు. ఇదే వారి ప్రత్యేకత. ఈ విశేషవ్యవహారంలో మానవులు ప్రకృతి పదార్థాలనేకాక తమ్ముతాము కూడ మార్చుకొనగలరు.

సహజ ప్రవృత్తి అంటే : మిడత దీపాన్ని చూచి ఏదో అంకమైన వస్తువనే భ్రమతో ఆ దీపంపైకి దూకుతుంది. రెక్కలుకాలి చనిపోతుంది. చేపలు ఎరల ఆశతో గాలాలకు తగులుకొని చిక్కుతాయి. ఎలుకలు ఎరకోసం బోనుల్లో పడతాయి. మిడతలు తిరిగి తిరిగి దీపాలపై దూకి చనిపోతూనే ఉంటాయి. చేపలుకూడ తిరిగి తిరిగి గాలాలలో చిక్కు పడతాయి. ఎలుకలు కూడ, బోనులు తమను పట్టుకొని చంపుటకేనని గ్రహించలేవు. అవి తిరిగి తిరిగి బోనుల్లో పడుతూనే ఉంటాయి. మానవుని చైతన్యం ఇలాంటిదికాదు. అది విచక్షణతో, ఆలోచనతో కూడినది. మానవుడు ప్రకృతి శక్తులను స్వాధీన పరచుకొని తన లక్ష్యసిద్ధికై వాటిని సాధనాలుగా వినియోగించుకోగలడు.

ప్రకృతిపై యాజమాన్యం వహించడమంటే అర్థం, మానవుడు ప్రకృతి ధర్మాలకు భౌతికావశ్యకతలకు వ్యతిరేకమైన స్వాతంత్ర్యం కల్గియుంటాడనికాదు. ప్రకృతియొక్క సహజావశ్యతకు మానవుడు బద్ధుడే. కనుక మానవ స్వాతంత్ర్యమంటే ప్రకృతిధర్మాల, ఆవశ్యకతల నిరాకరణకాదు. ఆ ధర్మాల, సూత్రాల గుర్తింపును కల్గి ఆ గుర్తింపువలని చైతన్యాన్ని ఉద్దేశపూర్వకంగా వినియోగించుకొనటమే మానవ స్వాతంత్ర్యం.

ఇలాగే, మానవులు తమ సాంఘిక జీవితాన్ని వ్యవస్థీకరించుకొని, సాంఘిక వ్యవహారాన్ని సంయోజిత మొనర్చుకొని, తద్వారా తమ భౌతిక మానసిక అవసరాలను నెరవేర్చుకొనటమంటే అర్థం, సాంఘికావశ్యకత నుండి లేక ప్రాకృతిక ధర్మాలనుండి స్వాతంత్ర్యం పొందుతాడనికాదు. పైగా, భౌతిక సాంఘికావశ్యకతలను, అందుకు చెందిన క్రమాలను, ఆ క్రమాల చైతన్యాన్ని నిర్దిష్ట ప్రయోజనాల సాధనకై వినియోగించుకొనే నేర్పే స్వాతంత్ర్యమౌతుంది. కనుక స్వాతంత్ర్యానికి లక్షణం సాంఘికావశ్యకతల నిరాకరణకాదు; వాటి గుర్తింపు; ఆ గుర్తింపుతోడి సాంఘిక వ్యవహార వ్యవస్థీకరణ; తద్వారా నిర్దిష్ట లక్ష్యాలసాధనద్వారా జీవితంలో పురోగమనం.

"మార్క్సిజం శాస్త్రసూత్రాలను, అవి ప్రకృతి శాస్త్రాలకు చెందినవైనా, సాంఘిక ఆర్థికాలకు చెందినవైనా మానవుని ఇచ్ఛకు అతీతంగా కొనసాగే భౌతికక్రమాలకు ప్రతిబింబాలుగా గుర్తిస్తుంది. మానవుడా సూత్రాలను తెలుసుకోవచ్చు. పరిశోధనద్వారా నిత్య వ్యవహారంలో సమన్వయించుకొని సాంఘిక ప్రయోజనాల సాధనకై వినియోగించుకోనూవచ్చు. కాని వాటిని అతిక్రమించలేడు."

—స్టాలిన్

ఈ సూత్రం సాంఘిక పరిణామపు అన్నిదశలకూ వర్తిస్తుంది.

కనుక, మానవులు తమ వ్యవహారంలో ఎప్పుడూ ఏ విధంగాను ప్రాకృతిక సాంఘిక సూత్రాల, వాటి ఫలితాల ప్రభావానికి విరుద్ధమైన స్వాతంత్ర్యంతో వర్తించరు. వసనాభి తింటే యే మానవుడైనా చని పోతాడు. నిప్పు యే మానవదేహాన్నైనా కాలుస్తుంది. ఐతే, వసనాభి విషమనీ, నిప్పుకు కాలేగుణం కలదనీ తెలుసుకోవాలి. కనుక ప్రకృతి సూత్రాలనుగూర్చిన అజ్ఞానం, ఫలితాలను గూర్చిన అజ్ఞానం అస్వాతంత్ర్యమే. ప్రాకృతిక సాంఘికావశ్యకతలు,వాటి ఫలితాలు తెలియని స్థితిలో ఉన్నప్పుడు మానవుడు తన శక్తి కతీతమైన, తన చైతన్యానికి బాహ్యమైన ప్రతికూలతలు సాంఘిక ప్రయోజనాలను భంగపరుస్తున్నట్లు భావిస్తాడు. అంటే తాను అస్వతంత్రుడనని భావిస్తాడన్నమాట. ఐతే

మానవు డాక్రమాల నెంతవరకు గుర్తిస్తాడో యే మేరకు ఆవశ్యక పరిణామాలను అర్థం చేసుకొంటారో ఆ మేరకు తన చైతన్యాన్ని ఉద్దిష్ట ప్రయోజనాల సాధనకు వినియోగించుకోగలడు. అంటే మానవులు ప్రకృతి యొక్క- సమాజంయొక్క- ఆవశ్యకక్రమాల గుర్తింపును చైతన్యయుతంగా సమన్వయించడం ద్వారానే, వాటిని సాంఘిక ప్రయోజనాల సాధనకై సంయోజితవిధానంలో వినియోగించుకొనటం ద్వారానే ప్రకృతి శక్తులపై యాజమాన్యం సాధించగలరు.

కనుక స్వాతంత్ర్యం ప్రకృతియొక్క- కార్యకారణక్రమాన్ని తొలగించటంలో ఉండదు; ఆ క్రమాన్ని గుర్తించటంలో ఉంటుంది. స్వాతంత్ర్యం సహజాగత్యాలను త్రోసివేయటంలో కాక. వాటిని చైతన్యయుతంగా అర్థం చేసుకొని వినియోగించుకొనటంలోనే నిహితమై యుంటుంది.

అందువల్ల ఆవశ్యకతకూ మానవ స్వాతంత్ర్యానికీ పొసగదనే తాత్వికధోరణులు అవాస్తవికమైనవి. అలా కాక, ఆవశ్యకత స్వాతంత్ర్యానికి దారి చూపుతుంది. కనుక మానవులు ఆవశ్యకతను గుర్తించటం ఆ గుర్తింపుద్వారా తమ ఆలోచననూ ఆచరణనూ చైతన్యయుతంగా రూపొందించుకొనటం స్వతంత్ర వ్యాపారమౌతుంది. ఐతే మనం ఆవశ్యకతను స్వాతంత్ర్య మనే కార్యానికి గల కారణక్రమంగా గుర్తించాలి. ఆవశ్యకత అనే కారణంవల్ల లభించేదే స్వాతంత్ర్యమనే కార్యం. ఇలా ఆవశ్యకత, స్వాతంత్ర్యం కారణకార్యక్రమం.

ఒకవేళ ప్రకృతి పరిణామంలోను, సాంఘిక పరిణామంలోను కారణ కార్యక్రమం లేదనుకుంటే, అప్పుడు నిర్దిష్టావశ్యకతలు నిర్దిష్ట ఫలితాలను కల్గించే క్రమమే ఉండదు. ఆ స్థితిలో ఏది యేమైనా కావచ్చు. ఏది యెలాగైనా జరగవచ్చు. అప్పుడు మనం ఏ ఒక్క-పనీ మనం అనుకున్న విధంగా నిర్వహించలేం. ఏ ఫలితాన్నీ సాధించలేం. అందుకు ప్రయత్నంకూడ చేయం. ఉదాహరణకు అన్నం వండుకొనేలాంటి మామూలు పనికూడ సాధ్యంకాదు. నీళ్ళు కాగుతాయని కాని, బియ్యం అన్నంగా మారుతుందని కాని హామీ లేదుకదా. కాగా అన్నంతింటే ఆకలి తీరాలనికూడ లేదు! ఇలాంటి స్థితిలో సాంఘిక జీవనం గందర

గోళంపాలై, అరాచక మేర్పడి. మానవుని అస్తిత్వమే సందేహాస్పద మౌతుంది.

కనుక పదార్థాలు వాటి వాటి క్రమాలకూ, సూత్రాలకు లోబడి యుంటాయి. అలాగే ప్రకృతికీ సమాజానికీ కొన్ని భౌతికావశ్యకతలు అనివార్యంగా వర్తిస్తాయి. ఆ పునాదిపైనే మనం నిర్దిష్ట అచరణను నిర్ణయించుకొనే స్వేచ్ఛను కలిగియుంటున్నాం. మానవ స్వాతంత్ర్యపు ప్రధాన లక్షణం ఇదే. కనుక మానవుని స్వాతంత్ర్య స్థాయి అతని జ్ఞానావరణపై ఆధారపడి యుంటుంది. జ్ఞానసాధనం ద్వారానే మనం నిర్ణయాలుచేసి వాటిని ఉద్దిష్ట ఫలితాల సాధనకై ఆచరణలో పెడతాము.

అంతేకాక, పదార్థ పరిణామాలను శాసించే సూత్రాలను తెలుసుకొన్నప్పుడే ఆ పదార్థాలతో మనం ఆచరణాత్మకమైన సంబంధాలను కొనసాగించగలం. జ్ఞానాధారం లేకుండా ఆ సంబంధాలు రూఢం కాజాలవు. ఉదాహరణకు పురాణయుగంలో కవులు 'దివ్యదృష్టిని' గూర్చి కల్పనలు చేశారు ఇటీవలివరకూ అవి కల్పనలేకాని వాస్తవాలు కాజాలవని భావింపబడింది. కాని ఈనాడు మనం నిజంగానే టెలివిజన్ - రేడియోలద్వారా దూరదృష్టిని, దూరశ్రవణాన్ని వాస్తవంగా వినియోగిస్తున్నాం. అలాగే ఇంకా మరికొన్ని శాస్త్ర పరిశోధనలు అసంభవాలను సంభవాలుగా మార్చివేస్తున్నాయి. అంటే భౌతికక్రమాలనుగూర్చిన అజ్ఞానం ఆచరణపై విధించిన పరిమితులను నూతన జ్ఞానం నివారించిన దన్నమాట. జ్ఞానాభివృద్ధి ఈ విధంగా పరిణామం పొందుతూ, సాంఘికాచరణ పరిమితులను నివారించి కొత్తబాట వేస్తుంది.

*మానవ స్వాతంత్ర్యా సాధనం జ్ఞానం*

మన ఆచరణ నిర్దిష్టమైన కారణాలచే నిర్ధరింపబడుతుంది. అనివార్యమైన భౌతికక్రమాల ఆవశ్యకతకు లోనైయుంటుంది. కాని, మనం స్వతంత్రులం. ఎలాగ?

మానవుడునిర్దిష్టపరిస్థితుల పరిణామంవల్లనే జీవిస్తున్నాడు. ప్రాకృతిక పరిస్థితులు మరోవిధంగా ఉంటే, మానవులు వేరేవిధంగా ఉండే

వారు. ఉదాహరణకు, అంగారక గ్రహపరిస్థితులనుబట్టి అక్కడి జీవ రాశికీ, మన భూలోక జీవరాశికీ తేడా లున్నాయని శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. కనుక, మనం ప్రాకృతి కావశ్యకతలకూ, సాంఘిక పరిణామాల ఆవశ్య కతకూ లోబడియే వ్యవహరిస్తాం. ఐనప్పటికీ, మానవ వర్తనలో స్వాతంత్ర్యం కూడ ఉంది.

మనం ఏ పనిచేసినా, అందుకు కారణా లుంటాయి. ఐతే, ఆ కార ణాలు బాహ్యప్రకృతికిచెంది, అనుల్లంఘ్యమై దానికి మనం పూర్తిగాలోబడ వలసియుంటే, మనం అస్వతంత్రులమే. ఉదాహరణకు, జనసమ్మర్దంలో మనల్ని కొందరు వెనుకనుండి నెట్టితే, మనం ముందుకు త్రోసుకొని పోతాం. అలాగే ముందునుండి నెట్టితే, వెనుకకు త్రోసుకొనిపోతాం. ఇది అస్వతంత్రత ఇక స్వాతంత్ర్య మేమిటి? మన నిర్ణయానుసారం వ్యవహరించినప్పుడు స్వాతంత్ర్య సమస్య వస్తుంది. అంటే, మన మొకానొక పనిని చేయుటకు వెనుకగల కారణమూ, ఆ పని చేయటంలో ఉద్దేశమూ - ఈ రెండూ సమన్వయం చెందాలి. అప్పుడే మనం స్వతం త్రులంగా వ్యవహరించగలం.

మన ఇచ్ఛ ఉద్దేశమూ ఎలా నిర్ధిరింపబడ్తాయి? ఒకవేళ బాహ్య ప్రాకృతిక కారణాల ఒత్తిడివల్ల మనలో ఉద్దేశం కోరికా యేర్పడి, మన వ్యవహారంవల్ల కలిగే ప్రయోజనాలనుగురించి ఎట్టి జ్ఞానంలేకుండా ప్రవర్తిస్తే, మనం అస్వతంత్రులమే. ఆ విధంగా వ్యవహరిస్తూ, మనం స్వతంత్రులమని భావించటం భ్రాంతి మాత్రమే. ఏ పరిస్థితులలో, ఏ ప్రయోజనాల సాధనకై, ఏ విధంగా మనం వ్యవహరించాలోనన్న జానం ఆచరణకు సంబంధించిన జ్ఞానం. అట్టి జ్ఞానంచే నిర్ధరింపబడే ఇచ్ఛ మన స్వాతంత్ర్యానికి చిహ్నం. ఇది బాహ్యపరిస్థితిపై ఆధారపడే ఇచ్ఛకాదు; మన స్వాతంత్ర్యం అది.

మన వ్యవహారం యొక్క ఈ 'స్వేచ్ఛా' లక్షణం భావంలో ఇమిడి యున్న సహజ మనోధర్మం కాదు. స్వేచ్ఛ సాంఘిక జీవిత పరి ణామంలో పుట్టి పెరుగుతుంది. కనుక స్వాతంత్ర్య పరిణామం సాంఘిక పరిణామంలో అంతర్గతమై కొనసాగేదె.

మానవ పరిణామ సూత్రాల ప్రభావం వల్ల, తన ప్రాకృతిక ఆవశ్యకతల వల్ల మానవుడు ప్రకృతి వ్యవస్థనూ, తన స్వభావ ప్రయోజనాలనూ తెలుసుకొంటాడు; ఆ భౌతికజ్ఞానాన్ని ఆధారంచేసుకొని వ్యవహరిస్తాడు. అందువల్ల మానవాచరణను గూర్చిన, మానవావశ్యకతలను గూర్చిన, వాటి సాధనకై అనుసరించాల్సిన విధానాలను గూర్చిన జ్ఞానంచే స్వాతంత్ర్యం నిర్ధరింపబడుతుంది. అందువల్ల మానవుడు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో వ్యవహరిస్తాడు. అంతేకాని అస్వతంత్రుడుగా కాదు. ఇదే మానవ స్వాతంత్ర్యం. ఇంతకు మించిన స్వాతంత్ర్య మంటూ ఉండదు.

ఈ విషయాన్ని ప్రఖ్యాత జర్మన్ భౌతికవాద తత్వవేత్త స్పినోజావిడాడో చెప్పాడు. ఆయన మానవ వ్యవహారాలన్నీ ఇతర భౌతిక పరిణామక్రమాలవలెనే పూర్వకారణాలచే నిర్ధారితమౌతవని చెప్పాడు. కనుక మానవుడు కారణజ్ఞానం లేకుండా వ్యవహరించటంలో స్వేచ్ఛ ఉండదనీ, ఆకారణాలను గూర్చిన చైతన్యంతో, అంటే తన ఆవశ్యకతల గుర్తింపుతో, వాటినిసాధించడాని కనుసరించ వలసిన విధానాల చైతన్యంతో వ్యవహరించడంలోనే స్వేచ్ఛ ఉంటుందనీ అతడు వ్రాశాడు.

"స్వాతంత్ర్య మెప్పుడూ ప్రకృతి సూత్రాలను గురించి స్వతంత్రంగా కలలు గనటంలో ఉండదు ఆ సూత్రాలనుగూర్చిన జ్ఞానంలో, నిర్దిష్ట ప్రయోజనాలకోసం ఆ సూత్రాల వినియోగంలో ఉంటుంది. ఆ సూత్రాలను మనం ఆలోచనలో బాహ్యప్రకృతి సూత్రాలుగాను, మానవులు తమ భౌతిక మానసిక జీవితాన్ని నిర్వహించే సూత్రాలుగాను రెండుగా విడదీసినప్పటికీ, వాస్తవంలో అవి ఒకటే కనుక ఇది అమలౌతుంది. కనుక ఇచ్ఛాస్వాతంత్ర్యమంటే, మనం విషయాన్ని గూర్చిన వాస్తవిక జ్ఞానంతో నిర్ణయాలు చేయటం... కనుక స్వాతంత్ర్యం అంటే మనం మనపైన, బాహ్యప్రకృతిపైన ఆవశ్యకతా జ్ఞానంతో విధించుకొనే శిక్షణయే." —ఎంగెల్స్.

ఇదే విధంగా మానవజ్ఞానం మానవ స్వాతంత్ర్యానికి ప్రధాన సాధనం. జ్ఞానం ఆచరణపై ఆధారపడి యుంటూ, ఆచరణను అభివృద్ధి చేస్తుంది. ఆచరణ రెండు విధాలు. ఒకటి జ్ఞానంపై ఆధారపడని ఆచరణ.

మరొకటి జ్ఞానయుతమైన ఆచరణ. ఐతే, మనం పదార్థక్రమ సూత్రాలను ఏ మేరకు గ్రహిస్తామో ఆ మేరకు వాటిపై యాజమాన్యం వహించగలం. అంటే పదార్థక్రమ సూత్రాలకు మనం అధీనులమై యుండక, వాటిని స్వాధీన పరచుకొని వ్యవహరిస్తామన్నమాట. ఈ విధంగా మానవుడు ప్రకృతిపై యాజమాన్యం వహించి తన సాంఘిక జీవితాన్ని చైతన్యయుతంగా వ్యవస్థీకరించు కుంటాడు. ఈ విధంగా జ్ఞానాభివృద్ధి ప్రకృతిపై తన యాజమాన్యం విస్తరించుటకు ఉపయుక్తమౌతుంది. క్రమక్రమంగా అది ఉన్నతతర సాంఘిక వ్యవస్థ నిర్మాణానికి దారి తీస్తుంది. తద్వారా ప్రతివారి జీవితపు సాంఘిక సంపూర్ణత స్వేచ్ఛా సాధనకు మార్గం సుగమ మొనర్చుతుంది.

*స్వాతంత్ర్యం, యాదృచ్ఛిక సంఘటనలు*

ప్రకృతిలోను, సమాజంలోను ఆవశ్యకతకూ యాదృచ్ఛికతకూగల సంబంధాన్ని మనం పైన చర్చించాం. ఆవశ్యకత యాదృచ్ఛిక సంఘటనల పరంపరద్వారా వ్యక్తమౌతుందని గమనించాం. కనుక మనం జ్ఞానాధారంపై స్వతంత్రంగా వ్యవహరించటమంటే అర్థం, యాదృచ్ఛిక సంఘటనలపై చైతన్యయుతంగా అదుపు విధించి, ఉద్దిష్ట ఫలితాల సాధనకు అవి ప్రతికూలంగా కాక, ఆవశ్యకతను నెరవేర్చే విధంగా విని యుక్తమయేటట్లు చూడ్డం. నిర్దిష్టలక్ష్యాల సాధనకు, పదార్థక్రమంయొక్క ఆవశ్యకతలకు అనుగుణ్యంగా స్వాతంత్ర్యాన్ని వినియోగించి, యాదృచ్ఛిక సంఘటనల ప్రతికూలత నెదుర్కొనట మన్నమాట.

యాదృచ్ఛిక సంఘటనల అనుకూలతను సాధించటమంటే ప్రతికూలతను నిరోధించుటయే. ఉదాహరణకు ఆధునిక వైద్యశాస్త్రం హృదయ శస్త్రచికిత్సలను జయప్రదంగా జరుపుతు ది. శస్త్రచికిత్సకుడు హృదయస్పందన క్రమాన్నీ దాని జీవితావశ్యకతలను తెలుసుకొని యుండాలి. ఆ ఆవశ్యకతలకు అవరోధాలైన యాదృచ్ఛిక సంఘటనలను, వాటి క్రమాన్ని తెలుసుకొని యుండాలి. ఎక్కడ ఏ భాగం ఏ విధంగా చెడిపోయిందో సహేతుకంగా గుర్తించాలి. చెడిపోయిన భాగాన్ని జీవ

క్రమ ఆవశ్యకతలకు అనుగుణ్యంగా బాగుచేయాలి. ఈలోగా కృత్రిమ హృదయాన్ని ఉపయోగించి, దానిద్వారా రక్తప్రసరణ జరిపించాలి. ఇలా హృదయ శస్త్రచికిత్స అత్యంత జాగరూకతతో నిపుణతతో కొనసాగాలి. శస్త్రచికిత్సకుడు జీవక్రమావశ్యకతల చైతన్యంతో. ఆ ఆవశ్యకతలకు ప్రతికూలమైన యాదృచ్ఛిక సంఘటనల క్రమాన్ని (వ్యాధిని) నివారిస్తాడు. ఇదే అతని స్వాతంత్ర్యం. జీవక్రమావశ్యకతలకు యేమాత్రం ప్రమాదం కల్గినా రోగి జీవించటం సాధ్యంకాదు; శస్త్రచికిత్స జయప్రదమవటం సాధ్యంకాదు.

ఈ విధంగా మానవాచరణయొక్క స్వాతంత్ర్యం ఆవశ్యకతల నిరోధంగాకాక, వాటిని నెరవేర్చే ప్రక్రియగా ఉంటుంది. సంఘటనాత్మక అవరోధాలను తొలగించటంలో ఆ స్వాతంత్ర్యం ఉంటుంది. వైద్యుడు రోగిని బాగుచేయాలంటే రోగినికాక రోగాన్ని నిర్మూలించాలి. ఇదే వైద్యశాస్త్రంయొక్క స్వాతంత్ర్యం.

మన మొక బాధ్యతను నెరవేర్చపూనుకుంటే, ఆ బాధ్యతా నిర్వహణలో గల అవరోధాల నెదుర్కొని, వాటిని నివారిస్తాం. లేకపోతే అవరోధాలు బాధ్యతానిర్వహణలో అడ్డుపడతాయి. ఒకవేళ కనులు మూసుకొని పనిచేసినప్పుడు యాదృచ్ఛికంగా అనుకున్న ఫలితాలు వాటంతటవే నెరవేరినా, అదొక యాదృచ్ఛిక సంఘటన మాత్రమే; పురుషకారం ద్వారా కార్యసిద్ధి పొందటంకాదు. అలా యాదృచ్ఛిక సంఘటనలపై ఆధారపడి "గాలిలో దీపంపెట్టి" ప్రార్థించడానికెవరూ సిద్ధపడరు. ఆ విధానంలో విజయం చేకూరుతుందన్న నమ్మకం యెవరికీ ఉండదు. కనుక, మానవాచరణ సక్రియతతో, చైతన్యయుతంగా అవరోధాలను నివారిస్తూ అనుకున్న విధంగా అనుకూలతలను సాధిస్తూ, బాధ్యతాయుతంగా కొనసాగుతుంది.

ఉదాహరణకు, మన మొక బహిరంగసభ పెడతాం అందుకు మనం వేదికతయారుచేసుకోవాలి. స్పీకర్లు అద్దెకు తెచ్చుకోవాలి. ఉపన్యాసకుల నెన్నుకోవాలి. ఉపన్యాసాంశాలు, అధ్యక్షుడు, వాలంటీర్లు మున్నగు అన్ని యేర్పాట్లను బాధ్యతతో నిర్వహించాలి. అప్పుడే సభ జయప్రద

మౌతుంది. ఇందులో యే ఒక్క అంశాన్నీ మనం అదృష్టానికి వదలి వేసి కూర్చోలేము. ఐతే, బహిరంగసభ జరగటం మన మాశించే ప్రయోజనాల సాధనకే గనుక ఈ ప్రయత్నమంతా అస్వతంత్రవ్యవహారం కాక, స్వతంత్రాచరణయే ఔతుంది.

మానవ శ్రమానుక్రమమనే పునాదినుండి ఆవశ్యకతల గుర్తింపు ద్వారా యాదృచ్ఛిక సంఘటనలలోని ప్రాతికూల్యాన్ని నిరోధిస్తాం; అనుకూల్యాన్ని సాధిస్తాం. శ్రమానుక్రమంలో మానవుడు ఉత్పత్తి పరికరాల ద్వారా పదార్థాలను మార్చి వినియోగిస్తాడు. అందు కతడు పదార్థంయొక్క ఆవశ్యక ధర్మాలను, అందు కడ్డుపడే యాదృచ్ఛిక సంఘటనల క్రమాన్ని గుర్తించి వ్యవహరిస్తాడు. అలా వ్యవహరించటం ద్వారానే అతడు అవరోధాలను తొలగించి తాను అనుకున్నవిధంగా అనుకున్న ఫలితాలకొరకు పదార్థాన్ని మార్చి వినియోగించటం సాధ్యమౌతుంది. ఉదాహరణకు కర్రతో నాగలి చేస్తాడు. దానికి ఇనుముతో చేసిన కర్రును బిగిస్తాడు. అప్పుడు భూమిని దున్నటం సుకరమౌతుంది. అలాకాక, ఇనుముతో నాగలి చేసి కర్రతోచేసిన కర్రును బిగించి భూమినిదున్నటం సాధ్యపడదు. అలా చేస్తే నాగలి బరువూ, కర్రు పెళుసుదనమూ భూమిని దున్నటకు అవరోధాలౌతాయి. కనుక, పనిముట్ల నిర్మాణంతో పదార్థ పరిజ్ఞానమూ, ప్రయోజన పరిజ్ఞానమూ కూడ ఉంటాయి. ఐతే శ్రమానుక్రమం యెంత ముందుకు సాగితే, మానవుని లక్ష్యాలు ఎంత విస్తృతమైతే అంతగా అవరోధాలను నివారించే బాధ్యత కూడ పెంపుజెందుతుంది. లక్ష్యం సిద్ధించే పరిణామంలో జ్ఞానంకూడ అభివృద్ధిగాంచుతుంది.

ఉదాహరణకు కడెండామ్ కట్టారు. నీటి ఒత్తిడి యొక్క అంచనాలతో డామ్ నిర్మాణానికి పునాది వేశారు. కాని, 1959 లో వర్షాలు అధికంగా కురిసి కడెం డామ్ కొట్టుకొని పోయింది. దాని స్థానంలో తిరిగి ఒకమట్టికట్టపోశారు. కాని నీటిఒత్తిడికి అదికూడ కొట్టుకొనిపోయింది. డామ్ బలాన్ని గూర్చిన అంచనాతోబాటు నీటి ఒత్తిడి అంచనా కూడ సరిగా ఉన్నప్పుడే, డామ్ నిర్మాణం జయప్రదమౌతుంది. దీన్నే మనం ఆవశ్యకత - యాదృచ్ఛికతల సంబంధంగా చూడవచ్చు.

మానవులు బాధ్యతలను నిర్వహించుటలో శీతోష్ణ స్థితులు ప్రధానమైన ప్రభావం కలిగిస్తాయి. వ్యవసాయం వర్షాలపై ఆధారపడియుంటుంది. వర్షాలు అదనులో కురవక లేదా అధికవర్షాలు కురిసి పంటలు దెబ్బతింటాయి అందువల్ల వ్యవసాయంకోసం చెరువులు, కుంటలు, ప్రాజెక్టులు నిర్మింపబడతాయి. శాస్త్రవిజ్ఞానం అభివృద్ధిచెందినకొద్దీ నీటివనరుల సంయోజనకూడ పెంపుజెందుతుంది. ఈనాడు పెద్దపెద్దనదీప్రవాహాలకుమనం ఆనకట్టలు వేస్తున్నాం. ఆదినుంచీ ఆహారావశ్యకతకొరకు భౌగోళిక పరిస్థితులనుమార్చివేసే మానవకృషియే నీటివనర్ల వ్యవస్థీకరణ. ప్రాజెక్టులు వ్యవసాయాభివృద్ధికి ఉపకరిస్తాయి. వీటివల్ల వర్షాభావం, అధిక వర్షాలవల్ల కలిగే నీటికొరత, వరదల అవరోధాలు తొలగింపబడతాయి. ఇలా మానవుడు తనజ్ఞానాన్ని అభివృద్ధిచేసుకోటంద్వారా సాంఘికావశ్యకతలకు అనుగుణ్యంగా ప్రకృతిని మార్చివేసే క్రమం అమలౌతుంది. ఐతే ప్రాజెక్టులీనాడు కేవలం వ్యవసాయ ప్రయోజనాన్నే కాక విద్యుదుత్పాదనద్వారా పారిశ్రామికాభివృద్ధికి కూడ తోడ్పడేందుకు గొప్ప అవకాశాలున్నాయి.

*చైతన్యాయుత సారథ్యం*

పై ఉదాహరణలు స్వాతంత్ర్య వ్యవహారంలోని ఆవశ్యకతను, యాదృచ్ఛిక సంఘటనల సంబంధాన్ని రుజువు చేస్తున్నాయి.

స్వాతంత్ర్యం యాదృచ్ఛికతను మార్చివేస్తుంది. ఆవశ్యకతకు అనుగుణ్యంగా యాదృచ్ఛిక సంఘటనలను మారుస్తుంది. కాని దీని అర్థం ఆవశ్యకతకూ యాదృచ్ఛికతకూ గల సంబంధాన్ని మనం ఎలాగో అలా, అనిర్దిష్టంగా తొలగిస్తామనిగాని మారుస్తామనిగాని కాదు. యాదృచ్ఛికతకు ఆవశ్యకతతో గల సంబంధం ప్రకృతికీ సమాజానికీ వర్తించే భౌతిక వాస్తవం అది సామాన్య సంబంధం. మనం ఆ సంబంధాన్ని గుర్తించి, దానికి అనుగుణ్యంగా ఆచరణను రూపొందించుకొంటాం. ఆ సంబంధం మన మానసిక ఆచరణకు చెందినది కాదు; బాహ్య వాస్తవం. కనుక మనమా సంబంధాన్ని తొలగించే ప్రశ్న గాని, ఎలాపడ్తే అలా మార్చివేసే ప్రశ్నగాని రాదు. కనుక

మనం ఆవశ్యకతాక్రమాన్ని, అందుకు సంబంధించిన యాదృచ్ఛిక సంఘటనల క్రమాన్ని గుర్తించి, మన ఉద్దిష్ట ప్రయోజనాల సాధనకు అనుగుణ్యంగా, ఆ గుర్తింపు ఆధారంపై వ్యవహరించవలసి వస్తుంది. కనుక యాదృచ్ఛికతను అనుకూలతగా మార్చటమంటే, మనం యాదృచ్ఛిక సంఘటనలకు చైతన్యయుతంగా సారథ్యం వహించటమన్నమాట. మన సారథ్యంలో అనుకోని ఫలితాలు అనుకున్న ఫలితాలుగా మారాలి. మరి అనుకోని ఫలితాలు ఉద్దిష్ట ఫలితాలుగా మారేదెట్లు? ఇవి యాదృచ్ఛిక సంఘటనల లక్షణాలను నేరుగా మలచటం ద్వారాను, దూరదృష్టితో ప్రతికూలతలను నివారించుటకు తగు భద్రతలను యేర్పరచుకొనటం ద్వారాను సాధ్యమౌతుంది. కనుక మన తక్షణ కార్యక్రమంలో భావిభద్రతకు చెందే సుదూర కార్యక్రమం కూడ ఇమిడియుంటుంది. సామ్యవాద సంయోజనల సారథ్యంలో ఈ లక్షణాన్ని మనం ప్రస్ఫుటంగా చూస్తాం. ప్లానింగ్‌లో ఎప్పటికప్పుడు తక్షణ అవాంతరాల నెదుర్కొనటమే కాకుండా, భావి అవాంతరాలను ముందే యెదుర్కొనేందుకు సంయోజన కూడ ఉంటుంది. అందుకే సామ్యవాద ఆర్థిక విధానంలో, పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలోవలె అనివార్యమైన మార్కెట్ సంక్షోభాలుండవు.

ఉదాహరణకు, నీటివనరులకోసం ప్రాజెక్టులను నిర్మిస్తాం. కాని, అంతమాత్రాన్నే సరిపోదు. వ్యవసాయ తెగుళ్ళ నిరోధానికి మందులు, భూసారక్షీణత నెదుర్కొనుటకు ఎరువులు, అధిక పంటలకు అనువైన విత్తనాలు, మంచి పశువులు, వీటితోబాటు అందరికీ భూసౌకర్యం, మేలి వ్యవసాయ పరికరాలను వినియోగించగల స్తోమత మున్నగు యేర్పాట్లన్నీ జరిగినప్పుడే, ప్రాజెక్టుల లక్ష్యం పూర్తిగా జయప్రదమౌతుంది. ఇలా ఆవశ్యకతకోసం అన్ని అవకాశాలనూ మనం ప్రణాళికల్లో పొందుపరచాలి అప్పుడే ప్రాజెక్టులు ప్రజల అందుబాటులోకి రాగలవు. ఈ విధంగా మనం యాదృచ్ఛిక సంఘటనలను అనుకూలపరచుకొనేందుకు ప్లానులు నిర్మించటంలో సారథ్యం వహించాలి. ఈ విధంగా, ప్రకృతి శక్తులపై మానవ ఆధిపత్యాన్ని విస్తరించేందుకు సంయోజన, లేక సారథ్యం దూరదృష్టితో కూడుకొని యుంటుంది.

ఆవశ్యకత అనేక యాదృచ్ఛిక సంఘటనలద్వారా నెరవేరుతుంది. యాదృచ్ఛిక సంఘటనలు అనుకూలమైనవిగాను, ప్రతికూలమైనవిగాను ఉంటాయి. ఇది వాటి ఆంతరక్రమం. కనుక, మనం ఆవశ్యకతయొక్క ఆంతరక్రమాన్నేకాక, యాదృచ్ఛిక సంఘటనల ఆంతరక్రమాన్నికూడ గుర్తించాలి. అలా గుర్తించినప్పుడే, వాటి సహజ ప్రతికూలతల అవరోధాన్ని నివారించే బాధ్యతను జయప్రదంగా నిర్వహించగలుగుతాం. యాదృచ్ఛిక సంఘటనల ఆంతరక్రమాన్ని గుర్తించనిచో ఇది సాధ్యం కాదు. కనుక, మానవుడు సంఘటనల సారాంశ జ్ఞానంద్వారా వాటి యదృచ్ఛా స్వభావాన్ని మార్చి, ఆవశ్యకతకు చెందిన తన నిర్ణయానికి అనుగుణ్యంగా యాదృచ్ఛిక సంఘటనలను మలచుకొని, దూరదృష్టితో వ్యవహరిస్తాడు. ఆవశ్యకతల సాధనకై మానవుని చైతన్యయుత సారధ్యమంటే యిదే

ఉదాహరణకు మనమొక మొక్కను నాటుతాం. మొక్క యెదిగి పెద్ద వృక్షంగా మారుతుంది. అది దాని సహజక్రమం. ఇది ఆవశ్యకత. ఈ ఆవశ్యకత యొక్క కారణక్రమాన్ని గుర్తించి మనం మొక్కకు తగు విధంగా నీరుపోసి పెంచాలి కాని మొక్కను పశువులు మేసిపోవచ్చు. అందుకని మనం మొక్క చుట్టూ కంచెవేయాలి. భూసారం సరిపడకపోవచ్చు. అప్పుడు ఎరువులు వేయాలి. అలాగే పురుగు పట్టవచ్చు. అప్పుడు తగు మందులు చల్లాలి. ఇలా అనేక యాదృచ్ఛిక సంఘటనల క్రమాలనూ, వాటికి కారణాలను గుర్తించి మనం తగు చర్యలు గైకొనటం అవసరం. కేవలం తక్షణదృష్టితోనేకాక దూరదృష్టితోకూడ వ్యవహరించాలి. మొక్క ఎదిగేక్రమంలో యేదశల్లో ఏ యే దోహదక్రియలు చేయాలో తెలుసుకొని వ్యవహరించాలి. ఇలా ఆవశ్యకతయొక్క కారణక్రమాన్ని, దానికి సంబంధించిన యాదృచ్ఛిక సంఘటనల కారణాల్నీ గుర్తించి అన్ని యేర్పాట్లూ సరిగాచేస్తే, మొక్క తప్పక పెరిగి వృక్షమౌతుంది.

కాని కొందరు తత్వవేత్తలు భవిష్యత్తుకు చెందే యాదృచ్ఛిక సంఘటనలను, వాటి అవరోధాలను నివారించే చర్యలను సరిగా గుర్తిం

చరు వారు దీన్ని 'భవిష్య నిర్ణయం' అని హేళన చేస్తారు. ఇది స్వీయ ధోరణి అనీ, వట్టికల్పన అనీ అంటారు. ఆవశ్యకతను వారు యాదృచ్ఛికతగా భావించి ఈ విధంగా చెప్పవచ్చు. లేక ఆవశ్యకతకు యాదృచ్ఛిక సంఘటనలు అనివార్యమైన అవరోధాలనియైనా భావించవచ్చు. లేక యాదృచ్ఛిక సంఘటనల అవరోధాన్ని నివారించే యత్నంపై నమ్మకం లేకపోవచ్చు. ఎలాగైనా ఈ ధోరణులన్నీ యాంత్రిక వాదనలే.

ఉదాహరణకు, మొక్కలను పెంచే పూర్వజ్ఞానం లేకనే భావిసంఘటనల ప్రమాదాన్ని శంకిస్తున్నామను ధోరణి ఒకటి ఉంది. ఇది భావవాద ధోరణి. ఆవశ్యకత యే ఇతర ప్రతికూల కార్యకారణక్రమాలు లేకుండా ఒకే కార్యకారణక్రమంగా నెరవేరుతుందన్న ధోరణి యిది. కాని ఆవశ్యకత వైరుధ్యానికి అతీతంకాదు. ఒకానొక కార్యకారణక్రమం అనేక కార్యకారణక్రమాల ప్రభావానికి లోనైయుంటుంది. ఆవశ్యకతవలెనే యాదృచ్ఛిక సంఘటనలుకూడ భౌతికక్రమాలే. మొక్కలకు రోగాలు వస్తాయి; వాటిని మందులతో తొలగిస్తాం. మొక్కవలెనే దాని రోగాలు, మందులు కూడ భౌతికక్రమాలే. అలా ఏ దశలో ఏ రోగం వస్తుందో తెలుసుకొని ఆ రోగం రాకుండా ముందే నిరోధకౌషధాలను ఉపయోగించవచ్చు. కనుక భావి యాదృచ్ఛిక సంఘటనలకు చెందిన నిర్ణయజ్ఞానం కూడ ఆవశ్యకత యొక్క భావి పరిణామాన్ని ప్రయోగాత్మకంగా నిర్ధరించగలదు.

కనుక, ఆవశ్యకతా జ్ఞానంలో ఆవశ్యకతయొక్క కారణజ్ఞానం ఎలా వాస్తవమైనదో, అలాగే ఆవశ్యకతకు సంబంధించిన భావి యాదృచ్ఛిక సంఘటల కార్యకారణజ్ఞానం కూడ వాస్తవమైనదే. ఈ రెండూ చేకూరినప్పుడే లక్ష్యం సిద్ధిస్తుంది. ఆ లక్ష్యసిద్ధి మానవుని అనుభవు లోనై తుదివరకూ నిశ్చితమైన గమనం సాగించగలుగుతుంది. ఈ విధంగా భావి యాదృచ్ఛిక సంఘటనలకు మానవుడు చైతన్యయుతంగా సారధ్యం వహిస్తాడు. ఐతే ఈ చైతన్యం క్లిష్టస్వభావంతో, ఒడుదొడుకులతో ముందుకు సాగుతుంది. ఆ ఒడుదొడుకులను అధిగమిస్తూ ముందుకు సాగే విజ్ఞానయాత్రగా అది నిరంతరం ముందుకు సాగిపోతుంది. తుది

విశ్లేషణలో. ఈ జ్ఞానం ఒక పదార్థక్రమాన్ని మొత్తంగా ఒక నిర్దిష్ట దశకు మారుస్తుంది; అంటే సారధ్యంగా పరిణతిచెందుతుంది.

సారాంశమేమంటే :

స్వాతంత్ర్యం అనగా మనం మనపైనా, బాహ్య ప్రకృతిపైనా ఆవశ్యకత జ్ఞానంతోగూడిన అదుపును విధించుకొనటమన్నమాట. ఆవశ్యకతా జ్ఞానం ఒకానొక పరిణామక్రమంలో సంభవించగల యాదృచ్ఛిక సంఘటనలక్రమాన్నీ, వాటిపట్ల మనం అవలంబించవలసిన నిరోధ చర్యలనూ ఆవరించి యుంటుంది. అందువల్ల మనం పరిణామంలోని సంఘటనాత్మక యాదృచ్ఛికతను శాసిస్తాం. అలా శాసించ వీలుకానిచో తగు ప్రతిక్రియలకు పూనుకుంటాం. ఇలా పరిణామాన్ని మొత్తంగా మన ఉద్దిష్ట లక్ష్యాలకు అనుగుణ్యంగా శాసిస్తాం. ఎంగెల్స్ యిలా వ్రాశాడు :

"యాదృచ్ఛికత సంబంధంలోని ఒక ధృవం మాత్రమే; మరొక ధృవం ఆవశ్యకత అనబడుతుంది. మానవుని సాంఘిక వ్యవహారం, సాంఘికక్రమాల పరంపర మానవుని చైతన్యయుత సారధ్యానికి ఏ మేరకు మించిపోతాయో, తలకుమించినవిగా పెరుగుతాయో, ఏ మేరకు అవి యాదృచ్ఛిక సంఘటనలుగా అగుపిస్తాయో ఆ మేరకు వాటిలో అంతర్గతమై యుండే సూత్రాలు సహజావశ్యకత మూలంగా బహిర్గత మవుతున్నట్లు తోస్తుంది."

కనుక, మానవునికి సంబంధించిన యాదృచ్ఛికసంఘటనలు,వాటిపై మానవుని చైతన్యయుత సారధ్యంలేకుండా జరిగినప్పుడు, వాటి ఫలితం అనేక యాదృచ్ఛిక సంఘటనల ద్వారా బహిర్గతమయ్యే సహజావశ్యకత వల్ల నిర్ధరింపబడుతుంది. కాని, ఆ యాదృచ్ఛికసంఘటనలపై ఏ మేరకు మానవుడు చైతన్యయుతంగా సారధ్యం వహిస్తాడో, ఆ మేరకు యాదృచ్ఛిక సంఘటనల దిశను ఉద్దేశపూర్వకంగాను, స్వేచ్ఛగాను నిర్ధరిస్తాడు. అందుచేత మానవుడు యాదృచ్ఛిక సంఘటనల క్రమానికీ, ఫలితాలను నిర్దేశించే అంశాలకూ చెందిన జ్ఞానాన్ని వినియోగిస్తాడు. చరిత్ర నిర్మాణంలో మానవుని చైతన్యయుత పాత్ర, స్వతంత్ర పాత్రఅంటే యిదే.

# 14 వ అధ్యాయం

# స్వాతంత్ర్య సాధన

మానవులు పుట్టుకతోనే స్వతంత్రులు కారు. స్వాతంత్ర్యాన్ని వారు క్రమ క్రమంగా సాధిస్తారు. ప్రకృతిపై తమ ఆధిపత్యాన్ని విస్తరించటం ద్వారాను, వర్గపోరాటం ద్వారాను స్వాతంత్ర్యం సాధింపబడి అభివృద్ధి చెందుతుంది. వర్గ సమాజంలో విభిన్నవర్గాలు సాధించే స్వాతంత్ర్యం, దాని పరిమితులు ఆయా వర్గాల స్థితిపైన, లక్ష్యాలపైన ఆధార పడతాయి ప్రజలు తమ అవసరాలను నెరవేర్చు కొనేందుకు జరిపే పోరాటమే స్వాతంత్ర్య పోరాటం. మానవులు జంతుజీవితంతో ప్రారంభించి, క్రమంగా స్వాతంత్ర్య సాధన మార్గంలో నిరంతరం పురోగమిస్తారు. ఈ మార్గం కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి దారి తీస్తుంది. స్వాతంత్ర్య పరిణామదశలు నైతిక పరిణామ దశలుగా ఉంటాయి.

### స్వాతంత్ర్య సంపాదన

పై అధ్యాయాల్లో మనం స్వాతంత్ర్య మంటే ఏమో చూశాం. సిద్ధాంత రంగంలో అనేకులు స్వాతంత్ర్యం ఇచ్ఛనుండి లేక మనస్సు నుండి రూపొందుతుందనే ధోరణిలో ఆలోచించారు. కాని, వాస్తవంలో స్వాతంత్ర్యం ఇచ్ఛచేతగాని, అంతరాత్మ మున్నగు దివ్యశక్తులచేగాని నిర్ధరింపబడదు; అది మానవునిచే సాధింపబడుతుంది. సాంఘిక వ్యవ

హారంలో క్రమక్రమంగా, మెట్టు మెట్టుగా సాధింపబడి విస్తృత మౌతుంది.

రూసో "సాంఘిక ఒప్పంద"మనే తన గ్రంథాన్ని "మానవుడు స్వతంత్ర జన్ముడు" అంటూ ప్రారంభించాడు కాని, మానవుడు జన్మచేత స్వతంత్రుడా ? కాదు; జన్మచేత మానవుడు అస్వతంత్రుడే. మనుష్యుడు తన పుట్టుకకు గల కారణాలను తానే నిర్ణయించడు. తనకు బాహ్యమైన కారణాల మూలంగా జన్మిస్తాడు. కాని, సాంఘిక జీవితంలో, సాంఘిక పరిణామక్రమంలో మానవుడు జ్ఞానవిస్తరణ ద్వారా క్రమక్రమంగా స్వతంత్రుడవుతాడు. ఈ స్వాతంత్ర్యసాధన ప్రకృతితోడి పోరాటంద్వారా, వర్గ సంఘర్షణల ద్వారా, వ్యక్తిగత సంఘర్షణల ద్వారా రూపుదిద్దు కుంటుంది. కనుక, మానవుడు తన స్వాతంత్ర్యాన్ని తానే రూపొందించు కొని, తానే సాధిస్తాడు. అలా తాను రూపొందించుకొని సాధించుకొన్న స్వాతంత్ర్యంకంటె వేరైన మరొక స్వాతంత్ర్యం ఉండదు.

స్వాతంత్ర్యం సహజగుణం కాదు. అది పూర్తిగా ఉండేదీ కాదు, అసలే ఉండనిదీ కాదు. తార్కికులు తరచు 'స్వతంత్రుడా, లేక అస్వ తంత్రుడా ? ఏదో ఒకటి తేలిపోవా'లంటారు. కాని, వాస్తవం అలా ఉండదు. మనుష్యుడు కొన్ని విషయాల్లో స్వతంత్రుడుగాను, మరికొన్ని విషయాల్లో అస్వంత్రుడుగాను ఉంటాడు. లేదా ఒకే విషయంలో పాక్షి కంగా స్వతంత్రుడు, పాక్షికంగా అస్వతంత్రుడుగా ఉంటాడు.

తత్వశాస్త్రంలో ఇచ్ఛ స్వయం సిద్ధమా ? లేక సాపేక్షమా? అన్న చర్చ తరచు కొనసాగుతుంది. ఇందులో ఇచ్ఛ స్వయంసిద్ధమనే ధోరణి భావవాదానికిచెందినది. బ్రహ్మము లేక ఆత్మ లేక జ్ఞానం స్వయం సిద్ధమైన పూర్ణసత్యమనీ. అలాగే ఇచ్ఛకూడా అనీ ఈ ధోరణి భావిస్తుంది. కాని మార్క్సిజం ఇచ్ఛను సాపేక్షమైనదిగా చూస్తుంది. ఇచ్ఛావ్యవహార మెప్పుడూ కారణబద్ధమైనదే. కాని సమస్య ఇంతసూటిగా ఉండదు. మన ఇచ్ఛను నిర్ధరించే కారణాలేమిటి ? అవి బాహ్యప్రకృతికి చెందేవా ? లేక మన అవసరాల గుర్తింపుకు, లక్ష్యసాధనకై అనుసరించవలసిన విధానాల గుర్తింపుకు చెందేవా ? సమస్యను ఇలా విశ్లేషించినప్పుడు

స్వాతంత్ర్యంయొక్క సాపేక్షత విదితమౌతుంది. ఒక పదార్థానికి లేక విషయానికి చెందిన వాస్తవిక జ్ఞానం, దాని ఆధారంపై రూపొందే మన కార్యవిధానం ఈ రెండూ ఇచ్ఛా స్వాతంత్ర్యాన్ని నిర్ధరిస్తాయి. ఇలా జ్ఞానానికి, ఆచరణకు సంబంధించని ఇచ్ఛా స్వాతంత్ర్యం భ్రాంతిమాత్రమే. ఈ దృష్ట్యా స్వాతంత్ర్య మెప్పుడూ పరిపూర్ణం కాజాలదు. కనుక అది పరిమితమైనది. ఐతే, మన జ్ఞానయుతమైన నిర్ణయం ఏ మేరకు మన కార్యవిధానాన్ని ఫలితాన్ని నిర్ధరించగలదో, ఏ మేరకు ఇతర కారణాల పాత్ర ఉండదో ఆ మేరకు మన స్వాతంత్ర్యం సాధింపబడి రూఢ మవుతుంది.

*వ్యక్తిగత స్వాతంత్ర్యం : సమాజంలో స్వాతంత్ర్యం*

స్వాతంత్ర్యాన్ని సాధించేది వ్యక్తి. సామాన్యార్థంలో సమాజం కాదు. వ్యక్తులు స్వతంత్రులు. ఐతే. ప్రధానంగా వ్యక్తిసాధించే స్వాతంత్ర్యం సమాజంద్వారానే సాధింపబడుతుంది. స్వాతంత్ర్యానికి సాధనమైన జ్ఞానం సాంఘికమైనది. కనుక వ్యక్తి స్వాతంత్ర్యం సమాజంయొక్క సాధనసంపత్తిపైన, ఆ వ్యక్తికిగల విద్యాసౌకర్యాది అవకాశాలపైన ఆధారపడుతుంది. అంతేకాదు. ఆ వ్యక్తి ఇతరులనుండిపొందే సహకారం ఇతరులపట్ల అతని సహకారం కూడ స్వాతంత్ర్య నిర్ధారణలో పాత్ర వహిస్తాయి.

ద్వితీయంగా వ్యక్తి సమాజంయొక్క విజ్ఞానస్థాయినిబట్టి ఆ సమాజం అతనికి అనుమతించే మేరకు స్వాతంత్ర్యం కల్గియుంటాడు. స్వాతంత్ర్యం పొందడానికి అతనికి గల [illegible]శం సాంఘిక విజ్ఞాన స్థాయిని బట్టి, దాన్నతడుచేకూరు[illegible] [illegible]శక్తి నిర్ధారిత మౌతుంది. ఒకటి స[illegible]
అవకాశాలు. రెండు వ్యక్తియొ[illegible]
విధి నిషేధాలు. ఈ రె[illegible]
పాత్ర వహిస్తాయి.

కనుక[illegible]
సంప[illegible]

పడుతుంది. అందువల్ల వ్యక్తులు విడిగానూ వర్గాలుగానూ పరస్పర సంఘర్షణకు గురియౌతారు; ఉన్నతతర స్వాతంత్ర్యంకొరకు ఉద్యమిస్తారు. ఈ విధంగా వారు వ్యక్తులందరికీ చెందిన స్వాతంత్ర్యస్థాయిని సాధిస్తారు. సాంఘికంగా వినియుక్తమయ్యే ఉన్నతతర స్వాతంత్ర్యాన్ని సాధిస్తారు. ఈవిధంగా స్వాతంత్ర్య పరిణామం ముందుకు సాగుతుంది.

ఒకానొక వ్యక్తి, అతనికి సమాజం కల్గించే విద్య తదితర అవకాశాలనుబట్టి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో వృద్ధిచెందుతాడు సమాజగతులైన వ్యక్తులు ఇదేవిధంగా మానవ స్వాతంత్ర్యాన్ని అభివృద్ధి చేశారు. ఇలా మానవ సముదాయం క్రమక్రమంగా స్వాతంత్ర్య పథంలో పురోగమిస్తుంది కనుక సాంఘికాభివృద్ధికి కొలతబద్ద ఆచరణకు సంబంధించిన స్వాతంత్ర్యమేనని మార్క్సిజం నిర్దేశిస్తుంది.

*స్వాతంత్ర్యంకొరకు పోరాటం*

ఆదిమ సమాజాలలో మానవుని స్వాతంత్ర్యం ప్రకృతి శక్తుల ఆధీనంచే పరిమితమైనది. నాటి మానవులు ప్రకృతిపై యాజమాన్యం వహించలేక పోయారు. ప్రకృతి దయాధర్మాలపై వారు ఆధారపడ్డారు. ఆ దశలో జంతుజాలం వలెనే వారిజీవితం బాహ్యపరిస్థితుల ప్రభావంచే శాసింప బడింది.

తర్వాత నాగరికత పెంపొందింది. ప్రకృతిపై మానవ యాజమాన్యం విస్తరిల్లింది. కనుక మానవ స్వాతంత్ర్యానికి గల పరిమితులు తగ్గిపోయి, క్రమంగా స్వాతంత్ర్యం విస్తృతమైంది. కాని ఈసారి మరొక అవరోధం యేర్ప[illegible] మానవ స్వాతంత్ర్యం సాంఘిక పరిమితుల[illegible] [illegible]జంలో ఒక వర్గం మరొక

[illegible]లో తరతమాలను కల్పిం

[illegible]ధీనతకు లోనైనాడు. పాలక

[illegible]ధి. సమాజానికి వర్తి[illegible]ం

[illegible]ంచుకోకుండా అనేక

[illegible] ఈనాడుకూ[illegible]

ప్రజలకు స్వాతంత్ర్యమే ఉంటే, వారు తమ ప్రయోజనాలకు వ్యతిరేకమైన, తమ అవసరాలకు వ్యతిరేకమైన పనులను ఇతరుల ఒత్తిడి వల్ల నిర్బంధంగా చేయవలసిన అవసరం ఉండదు. అంతేకాక, ప్రజలు తమ ఆవశ్యకతలను నెరవేర్చుకునేందు కవసరమైన సాంఘిక సాధన సంపత్తి వారికి నిరాకరింపబడదు. కాని ఈనాటివరకు వర్గ సమాజ మీపరిమితులకు లోనైయుంది; అందుకు కారణం పీడక - పీడిత వర్గాల విభజన అని వేరే చెప్పవలసిన పనిలేదు మనిషి మనిషిని పీడించే సమాజంలో స్వాతంత్ర్యం సామాన్య స్థాయిని పొందదు.

భావవాదులు మానవుని ఇచ్ఛాస్వాతంత్ర్యాన్నీ రాజకీయార్థిక స్వాతంత్ర్యాన్నీ దేనికదిగా విడదీశారు; అందువల్ల ఇటు రాజకీయార్థికాలు, అటు ఇచ్ఛాస్వాతంత్ర్యం రెండూ తికమకకు గురిఅయినాయి. ఇది స్వాతంత్ర్యాన్ని ఆచరణనుండి విడదీయట మన్నమాట. తిండిగుడ్డలులేని పీడితుడుకూడ స్వతంత్రుడేనని భావవాదులు చెస్తారు. ఐతే, తిండి గుడ్డలు కరవైన వ్యక్తి స్వాతంత్ర్యం, ఇచ్ఛాస్వాతంత్ర్యం కేవల భావనే కాని ఆచరణకురాదు. వాస్తవంలో ఇవి వేర్వేరు ప్రశ్నలుకావు; మానవుని స్వాతంత్ర్య సాధనయొక్క విభిన్న పార్శ్వాలు మాత్రమే. ఒక వర్గాన్ని మరొకవర్గం పీడించే సమాజంలో, స్వాతంత్ర్య పోరాటపు ప్రధాన భాగం ప్రచలిత నిర్బంధ విధానాన్నీ పీడననూ ప్రతిఘటించడమే. కనుక ఆ పోరాటంలో వ్యక్తులు స్వేచ్ఛతో వ్యవహరిస్తారు; వారు స్వతంత్రులై మానవ స్వాతంత్ర్యపు మేరలను విస్తరింప జేస్తారు. అణగి మణగియుండే బానిస బానిసయే. అతడింకా నిగళాల్లోఉన్న బానిసయే ఐనా, తిరుగుబాటు చేసినప్పుడతడు స్వాతంత్ర్యంతో వ్యవహరిస్తాడు. మార్క్స్ స్పార్టకస్ జీవితాన్ని ఆదర్శంగా తీసుకున్నాడు. తమ దాస్య నిగళాలను త్రెంచివేసుకొనే అలాంటి వ్యక్తులే స్వాతంత్ర్య నిర్మాతలు.

వర్గ సమాజంలో స్వాతంత్ర్యం, స్వాతంత్ర్య సాధన వర్గ భూమికను కల్గియుంటుంది. అందువల్ల స్వాతంత్ర్యాన్ని గూర్చిన అభిప్రాయాలు వర్గ ప్రాధాన్యతను కల్గియుంటాయి ఒకానొక దశలో సాధింపబడిన స్వాతంత్ర్యం అదే సమయంలో పారతంత్ర్యంగా కూడ ఉంటుంది.

అంటే స్వాతంత్ర్యం ఒక వర్గానికి స్వాతంత్ర్యంగాను, మరొక వర్గానికి పారతంత్ర్యంగాను ఉంటుందన్నమాట. ఒకటి, స్వాతంత్ర్యమూ ఆ స్వాతంత్ర్యం లేకపోవడం ఆయా వర్గాలకు చెందియుంటుంది. రెండు, ఒక వర్గానికి స్వాతంత్ర్యంగాతోచే విషయం మరొక వర్గానికి స్వాతంత్ర్యంగా తోచకపోవచ్చు. ఇలా వర్గ సమాజంలో స్వాతంత్ర్యం రెండు విధాలుగా వైరుధ్యాలకు లోనౌతుంది.

మానవ స్వాతంత్ర్యం విభిన్న వర్గాలద్వారా, ఆయా వర్గాలు తమ లక్ష్యాలను గుర్తించటం వాటి సాధనకై స్వతంత్రులై పోరాడటం ద్వారా దశలు దశలుగా సాధింప బడుతుంది. ప్రతిదశలోను ఒకానొక వర్గ పరిపాలన స్వాతంత్ర్యంపై విధించే పరిమితులను అధిగమించటంగాను, ఆ అధిగమించటంలోనే తిరిగి నూతన పరిమితులకు లోనవటంగాను మానవ స్వాతంత్ర్యం పరిణామం చెందుతుంది.

ఉదాహరణకు పెట్టుబడిదారీవిధాన ఆవిష్కరణలో భూస్వామ్య పరిపాలన అంతమవుతుంది. స్వాతంత్ర్య పరిణామంలో ఇదొక ముందంజ. కాని పెట్టుబడిదారీపాలన తిరిగి నూతన నిర్బంధాలనూ పీడననూ అమలుపరుస్తుంది. అది విస్తృత సాంఘిక వ్యవస్థీకరణ, విజ్ఞాన శాస్త్రవికాసం మున్నగు వాటితోబాటు, పెట్టుబడిదారీ రాజకీయ స్వత్వాలను విస్తృత మొనర్చటంతోబాటు, సాంఘికవ్యవస్థను ఉన్నత స్థాయికి అభివృద్ధిచేయటంతోబాటు, శాస్త్ర విజ్ఞానాన్ని ప్రోత్సహించటంతో బాటు వర్గ ఆధిపత్యానికి అవకాశం కలిగిస్తుంది. తద్వారా అధికపీడనకు వీలుకల్గిస్తుంది. కనుక పెట్టుబడిదారీ సమాజంలో పాలకవర్గం తన ఆధిపత్యాన్ని నిల్పుకొనుటకు, తద్వారా స్వీయప్రయోజనాలను నెరవేర్చుకొనుటకు ప్రయత్నిస్తుంది. కార్మికవర్గం తద్వ్యతిరేకంగా ఆ పరిపాలనా విధానాన్ని అంతంచేయుటకూ, దోపిడీని అరికట్టుటకూ ప్రయత్నిస్తుంది. అందుకై తన స్వాతంత్ర్యాన్ని వినియోగపరుస్తుంది. తద్వారా ఉన్నత తర స్వాతంత్ర్యాన్ని సాధించుటకు ముందంజవేస్తుంది.

ఈ విధంగా విభిన్న వర్గాలు స్వాతంత్ర్య పరిమితులను విభిన్న విధాలుగా చూస్తాయి. ప్రతి పీడనావిధానం పీడితులపై విభిన్న రూపా

లలో నిర్బంధాన్నీ, పీడననూ అమలుపరుస్తుంది. ఉదాహరణకు పెట్టుబడిదారీ విధానంలో కార్మికవర్గం ఈ నిర్బంధానికీ పీడనకు గురియౌతుంది. అలాగే ప్రతి పాలకవర్గమూ, ఇతరుల కనులుగప్పి తాను సాధించాననుకునే స్వాతంత్ర్యాన్ని త్వరలోనే భ్రాంతిగా గుర్తింపవలసివస్తుంది. ఉదాహరణకీనాడు పెట్టుబడిదారీవర్గం తన వ్యవస్థయొక్క క్రమసూత్రాలకు తానే అధీనమైంది. పెట్టుబడుల సమీకరణకోసం అది తుదివరకూ పోటీలకు, సంక్షోభాలకు గురి అవుతోంది. అంతకంటె గత్యంతరం దానికి లేదు.

ఒక బీదకుటుంబీకుడు తన ఆదాయాన్ని అద్దెకొరకు వినియోగించాలా లేక తిండి గుడ్డల కొరకా? అని ఆలోచిస్తాడు. ఆదాయాన్ని వినియోగించే స్వేచ్ఛ తనకంటె ధనిక కుటుంబాలకు అధికంగా ఉన్నట్లు అతడు భావిస్తాడు. కాని వాస్తవంలో ధనిక కుటుంబానికిచెందిన వ్యక్తులు తమ డబ్బును వ్యయపరచే విషయంలో పడే యాతన అతనికి బోధపడదు. ధనవంతుడు తన వ్యాపారానికీ వ్యవహారాలకూ దాసుడై తాను పెట్టేఖర్చుల విషయంలో పేదవానికంటె యెక్కువ పారతంత్ర్యానికి గురియౌతాడు. అలా కాకపోతే ప్రతి ధనవంతుడూ ధర్మాత్ముడుగానే వ్యవహరించియుండేవాడు; ధనవంతుడుగా అతడు ఉండకపోయేవాడు. పీడకవర్గ మేధావులనేకులు ధనంలోను అధికారంలోను స్వాతంత్ర్యముంటుందని భావించారు. కాని వారి తాత్వికులే ధనమూ, అధికారం ఏవిధంగా ఇతరులను దాస్యానికి గురిచేస్తాయో అదే విధంగా వాటి యజమానులనుకూడ దాస్యబంధనాలలో పడవేస్తాయని ప్రబోధించారు. ఇది వాస్తవమే.

*అస్వాతంత్ర్యంనుండి స్వాతంత్ర్యానికి*

స్వాతంత్ర్యంకొరకు పోరాడటమంటే అర్ధమేమిటి? ప్రజలు తమ భౌతిక సాంస్కృతిక ఆవశ్యకతలను గుర్తించి, వాటి సాధనకై మార్గాలు తెలుసుకొని, ఆ ఆవశ్యకతను సాధించగల శక్తిని కల్గియుండి, అలా సాధించేందుకు ఉద్యమించడమే స్వాతంత్ర్యంకొరకు పోరాడటం.

సామ్యవాద సమాజంలో ప్రజలు ప్రకృతిపై తమ యాజమాన్యాన్ని నెలకొల్పుకొని ఉత్పత్తిసాధనాలను సమాజపరంచేయటంద్వారా సాంఘిక వ్యవస్థను తమ చైతన్యయుత సారధ్యంక్రిందికి తెచ్చుకుంటారు. అది స్వాతంత్ర్య సాధనలో ఒక పెద్ద ముందంజ. మనిషిమనిషిని పీడించేం దుకు వీలులేని సామ్యవాద వ్యవస్థలో ఉత్పత్తి సాధనాలన్నీ ప్రజల ఉమ్మడి ఆస్తి అవుతాయి. సమాజంలోని ప్రతివ్యక్తి యొక్క అవసరాలను నెరవేర్చుట కవి వినియుక్త మవుతాయి. అప్పుడు ప్రజలు స్వాతంత్ర్యం కోసం కలహించుకొనే సమస్యరాదు. తమ స్వాతంత్ర్యాన్ని కంటిపాప లాగా కాపాడుకొంటూ దానిని పూర్తిగా అనుభవించే కృషి ప్రాధాన్యం వహిస్తుంది. ఆపైన కమ్యూనిస్టు సమాజంలో ప్రజలు ఉత్పత్తి సాధ నాల అధీనతనుండి పూర్తిగా విడివడటంతో, వారు మహోన్నతమైన స్వాతంత్ర్య దశకు చేరుకుంటారు. 'శక్తికొద్దీ పని - అవసరంకొద్దీ అను భవం' అనే సూత్రం అమల్లోకి వస్తుంది. ఈ సమాజ వ్యవస్థనుగూర్చి ఎంగెల్స్ యిలా వ్రాశాడు :

"ఒక విధంగా మానవుడు మొట్టమొదటిసారి ఇతర జంతు జాలంనుండి పూర్తిగా వేరుచేయబడతాడు. జంతువుల జీవితపరిస్థితుల నుండి మానవ జీవిత పరిస్థితుల్లో అడుగుపెడతాడు. ఇది ఆవశ్యకత అనే రాజ్యంనుండి స్వాతంత్ర్యం అను రాజ్యంలోకి ఆరోహణ."

మానవులు జంతువుల జీవిత పరిస్థితులనుండి ప్రారంభించి, సాంఘికోత్పత్తిద్వారా స్వాతంత్ర్య పరిస్థితులను నిర్మించుకొన్నారు పదా ర్థాలను మార్చివేయుటకు ఉత్పత్తిసాధనాలను వినియోగిస్తూ, ప్రకృతి సూత్రాలను గుర్తించటంద్వారా, తమ ఆవశ్యకతల సాధనకై కృషి సాగించటంద్వారా స్వాతంత్ర్యం రూపొందుతుంది.

ఉత్పత్తిక్రమంలో మానవులు ఉత్పత్తి సంబంధాలకు లోనౌతారు. ఆ స్థితిలో జీవితావశ్యకతల సాధనకై వేలాది సంవత్సరాల సంఘర్షణలో జ్ఞానాన్ని పెంపొందించుకుంటారు. తద్వారా ప్రకృతిపైన సమాజంపైన యాజమాన్యం వహిస్తారు. సమాజ వ్యవస్థను శాసిస్తారు. ఈ పరిణామం

అనేక దశల్లో కొనసాగుతుంది. ప్రతి దశలోను మానవులు ఉత్పత్తి శక్తుల వికాసానికి అనుగుణ్యంగా ఉత్పత్తి సంబంధాలను మార్చుకుంటూ వచ్చారు. ప్రతి దశలోను విభిన్న వర్గాలు తమ స్వతంత్రాచరణను విస్తరించుకుంటూ వచ్చాయి. ఐతే ప్రతి నూతన దశలోను పాత వర్గాధిపత్యం స్థానంలో కొత్త వర్గాధిపత్యం నెలకొంటూ వచ్చింది. అలాగే ఆయా సాంఘిక వ్యవస్థల భౌతికావశ్యకత రీత్యా పాత వర్గాధిపత్యం స్థానే కొత్త పారతంత్ర్య రూపాలూ కొనసాగాయి. వర్గసమాజం యిలా పరిణామంచెందింది. నేటి వర్గ సంఘర్షణ స్థితి ఏమంటే, పీడిత వర్గాల విమోచనోద్యమం కేవలం కొన్ని వర్గాలనే కాక మొత్తం సమాజాన్ని వర్గ ఆధీనతనుండి విమోచన చేసే గుణాత్మకస్థాయిని అది తెలియజేస్తుంది. అంటే, సాంఘికవ్యవస్థ మానవుల చైతన్యయుత సారద్యానికి చెందేదశ ఏర్పడింది; సాంఘికాచరణ మానవుల స్వతంత నిర్ణయానికి చెందే ఉన్నతదశ రూపొందింది. మానవ స్వాతంత్ర్యానికి పునాదియైన శ్రమానుక్రమం మానవుని వర్గపారతంత్ర్యానికి దారితీసింది; తుదకు మానవుని అవసరాలన్నిటినీ నెరవేర్చే చైతన్యయుత సాధనంగా వినియుక్తమయ్యే స్థితి ఏర్పడింది. ప్రతివ్యక్తీ తీరికసమయాన్నంతటినీ తన మానసిక శక్తుల వికాసానికి, విభిన్నలక్ష్యాల సాధనకు వినియోగించుకునే అవకాశం, అంటే సామ్యవాద సమాజం నిర్మింపబడే అవకాశం, యీనాడేర్పడింది.

ఈ విధంగా మానవులు భౌతిక సూత్రాల కనుగుణ్యమైన చైతన్యంతో అస్వాతంత్ర్యంనుండి స్వతంత్రం సాధించుకుంటారు. కేవలం బాహ్యపరిస్థితుల ప్రభావానికిలోనై వర్తించే అస్వాతంత్ర్యంనుండి చైతన్యయుతంగా వ్యవహరించే స్వాతంత్ర్యం రూపొందుతుంది. ఈ స్వాతంత్ర్య యుగంలో మానవులు వ్యష్టిగాను సమష్టిగాను తమ ఆచరణను చైతన్యయుతంగా, జ్ఞానయుతంగా, సవిమర్శకంగా నిర్ణయించు కొంటారు; సంయోజిత క్రమంలో ఉద్దిష్ట ఫలితాలను సాధించుకుంటారు.

నీతి

పైన మనం స్వాతంత్ర్య పరిణామదశలను చూచాం. ఈ స్వాతంత్ర్య పరిణామ దశలకూ నైతిక పరిణామదశలకు సంబంధం ఉంది. నైతికాభివృద్ధి స్వాతంత్ర్యాభివృద్ధిలో అంతర్భాగం. కనుక నైతికాభివృద్ధియొక్క విభిన్నదశలు మానవ స్వాతంత్ర్య దశలకంటె భిన్నమైనవి కావు.

అనేకమంది తాత్వికులు నీతిని స్వాతంత్ర్య ప్రకర్షగా గుర్తించారు. ఉదాహరణకు హరిశ్చంద్రుడు. హరిశ్చంద్రుడు ఇష్టపూర్వకంగా, స్వాతంత్ర్యయుతంగా సత్యంకోసం త్యాగాలు చేస్తాడు. దీనివల్ల అస్వతంత్రుడు నైతికంగా ప్రవర్తించలేడని తేలుతుంది. ఒకవేళ బాహ్యకారణాల ఒత్తిడి మూలంగా ఒక వ్యక్తి చర్యలు నిర్ధరింపబడితే, అప్పుడా చర్యల మంచి చెడుగుల ప్రశ్నే ఉచ్చనీచతల ప్రశ్నే రాదు. అందువల్ల ఒకానొక పనిని మనం అనివార్యంగా, నిర్బంధంగా గాక స్వేచ్ఛాయుతంగా జరిపినప్పుడే నైతికవిలువల సమస్య ఉదయిస్తుంది.

కాని, నైతికవర్తన స్వతంత్ర వ్యవహారమని గుర్తించటం మాత్రమే చాలదు. నైతికవాదులు వర్గగత సమాజంలో స్వాతంత్ర్య వైవిధ్యాలను, నైతిక విలువల వైవిధ్యాలను చూడరు. నైతికశీలత దివ్య దత్తమైనదనీ, గుణీకృతభావాలద్వారా అది అందరికీ వర్తించాలనీ వారు చెప్తారు. ఉదాహరణకు సత్యం–అసత్యం, పరార్థం – స్వార్థం, లుబ్ధత – దాతృత్వం వగైరా. కాగా వారు నీతికి అంతరాత్మను కొలతబద్దగా తీసుకొంటారు. "నీ అంతరాత్మ ప్రబోధమే నీకు నీతి" అని వాదిస్తారు. క్యాంట్ "మానవేచ్ఛలో అంతర్గతమై యున్న అనివార్య ధర్మమే నీతి" అని చెప్పాడు. కాని వాస్తవంలో నీతి ఇచ్ఛలో అంతర్గతమైయున్న అనివార్యతకు కాక, అంతరాత్మకు కాక, కేవల మానసిక ప్రత్యేకతకుకాక సాంఘిక వ్యవస్థకు సహజఫలితం. మానవులు సమాజంలో నివసిస్తారు. కనుక, సాంఘిక వ్యవహార నిర్వహణ దృష్ట్యా వారు కొన్ని నైతికాభిప్రాయాలను, సూత్రాలను నిర్మించుకొంటారు. వాటి ద్వారా సాంఘిక సంబంధాలను, పరస్పర వ్యవహారాలను నిర్దేశించుకొని వ్యవహరిస్తారు. అందువల్లకొన్ని విధులు కొన్ని వర్గాలకు నీతిగాను,

మరికొన్ని వర్గాలకు అవినీతిగాను ఉంటాయి. ఉదాహరణకు బ్రాహ్మణులకుయాచన నీతి. కాని బ్రాహ్మణేతరులు యాచించరాదు. వారు పని చేయాలి. ఐతే కొన్ని నీతులు ప్రతివారికీ వర్తించేవిగా కూడ ఉన్నాయి. ఉదాహరణకు త్యాగం, సేవ మున్నగునవి. ఈనీతులు సమాజంలో వ్యక్తి పరంగా ప్రతివారికీ వర్తించేవే కనుక నైతికవర్తన ప్రతివారికీ చెందిన బాధ్యతగా కూడ ఉంటుంది. ఈ విధంగా నీతి సమాజంలో ఒక రూఢమైన శక్తిగా 'వ్యక్తులు ఇలాకాక అలా ప్రవర్తించాల'ని నిర్దేశిస్తుంది. తిరిగి ప్రతివారూ అనివార్యంగా పాటించవలసిన శాసనవిధులు – ప్రతివారు ఐచ్ఛికంగా పాటించవలసిన బాధ్యతలు ఉన్నాయి. ఇవి నీతియొక్క చైతన్యంలో సమన్వితమై యుంటాయి.

ఇలా నీతిశాస్త్రం మానవ వర్తనకు కొన్ని ప్రమాణాలను, సూత్రాలను విధిస్తుంది, 'ఈ పని చేయాలి' 'అది కూడదు' అని చెప్తుంది. తమ కిష్టమైనా కాకపోయినా సరే మానవులు నైతిక సూత్రాలను పాటించాలనీ, అలావారు పాటించ కున్నప్పటికీ వస్తుతః నీతి సూత్రాలు మాత్ర ముండేవేననీ భావింపబడుతుంది. ఒకానొక నీతి ఒకానొక వ్యక్తి అభిరుచికి, ఇష్టానికి, అవసరానికి సమన్వయిస్తుందా లేదా అనే దృష్టితో కాక, సాంఘికావశ్యకతలను బట్టి నైతిక విలువలు నిర్ణయింప బడ్తాయి.

కాని ఆయా నీతి సూత్రాలను గుర్తించటం, అంగీకరించటం వేరు; వాటిని ఆచరణలో పాటించటంవేరు. కనుక ఆచరణకు దూరమైన శ్రీరంగనీతులు కూడ కొనసాగేవే. ఐనా ప్రతి సమాజమూ ఆయాదశల్లో ప్రజలకు మంచిచెడ్డలను నయభయాలతో బోధించుటకొక నీతిశాస్త్రాన్ని అమలు పరుస్తుంది. నీతిని పుణ్యంగాను, అవినీతిని పాపంగాను చిత్రిస్తుంది మతం. నైతిక సూత్రాల ననుసరించే బాధ్యతను వ్యక్తుల నిర్ణయానికి వదలివేస్తుంది. కాని ప్రధానమైన అనేక విధి నిషేధాలను స్మృతులద్వారా, ధర్మ శాస్త్రాలద్వారా, నిబంధ రాజ్యాంగ యంత్రంద్వారా అమలుపరుస్తుంది. ఉదాహరణకు "దానం చేయటం పుణ్యం". ఇది నీతి. కాని "దొంగతనంచేయుట నేరం". ఇందుకు ఖైదు శిక్ష విధింపబడుతుంది. కాని ఒక వర్గం మరొక వర్గాన్ని పీడించే సమా

జంలో నీతులు, తాము అమలుపరచకుండా ఇతరులకు మాత్రం బోధించే ప్రచారంగా, అంటే శ్రీరంగనీతులుగా ఉండిపోతాయి. ఈ విధంగా నైతిక ప్రమాణాలు సంక్షోభితమై ఉపేక్షింప బడినదశల్లో నీతులకూ చేతలకూ సమన్వయం చెడిపోతుంది. సమాజ వ్యవస్థ మార్పు చెందుటకు సిద్ధంగా ఉన్నట్లు దానివల్ల స్పష్టమౌతుంది. అప్పుడు పాత నీతులు నశించి కొత్త నీతులు అమలౌతాయి. కనుక నైతిక సంక్షోభం సాంఘిక వ్యవస్థయొక్క మార్పుకు చిహ్నం అన్నమాట.

సాంఘిక వ్యవహారం ఉత్పత్తి సంబంధాల ఆధారంపై నిర్మింప బడుతుంది. కనుక సాంఘిక వ్యవహారానికి దారిచూపే నైతిక వ్యవస్థ కూడ ఉత్పత్తి సంబంధాల పునాది నాశ్రయించియుంటుంది. ఉత్పత్తి సంబంధాల మార్పుతోబాటు వాటిని ప్రతిబింబించే నీతి సూత్రాలుకూడ మారుతూఉంటాయి. ఐతే వర్గ సమాజంలో ప్రతి వర్గమూ తన ప్రత్యేక స్థితినిబట్టి కొన్ని నైతిక భావాలను చేకూర్చుకుంటుంది. ఎంగెల్స్ యిలా వ్రాశాడు :

"మానవులు తమ వర్గస్థితికి ఆధారమైన ఆచరణాత్మక సంబంధాలనుండి, ఉత్పత్తినీ సంపిణీని అమలుజరుపుకునే ఆర్థికసంబంధాల నుండి నైతిక భావాలను బుద్ధిపూర్వకంగానో, అప్రయత్నంగానో చేకూర్చుకుంటారు. కనుక గత కాలపు అన్ని నైతిక సిద్ధాంతాలూ తుది విశ్లేషణలో సమాజం చేరుకున్న నిర్దిష్ట ఆర్థికదశ ఫలితంగా ఏర్పడేవే".

అదేవిధంగా విభిన్న సాంఘికవ్యవస్థలలో, వర్గాలలో నైతికభావాలు మారిపోవటం సహజమే. ఐనప్పటికీ, సాంఘికవ్యవస్థలోని నైతికభావాల మధ్య సామ్యాలుకూడ ఉండకపోవు. విభిన్నదశలకు చెందిన సాంఘిక వ్యవస్థలోని సామ్యతలే ఈ నైతిక సామ్యతలకుకూడ ఆధారం. ఉదాహరణకు చరాస్తులపై వ్యక్తిగత యాజమాన్యం రూపొందిన పిదప చరాస్తులను కల్గియున్న అన్ని సాంఘిక వ్యవస్థల్లోను దొంగతనం గర్హింప బడుతుంది. అలాగే వివాహ వ్యవస్థ ఏర్పడ్డ అన్ని సమాజాల్లోను వ్యభిచారం అవినీతిగా ఉంటుంది.

నీతిశాస్త్రం ఒకానొక ఉత్పత్తి విధానంలో ఒకానొకవర్గంయొక్క స్వాతంత్ర్యభావాల వ్యక్తీకరణగా ఉంటుంది. కొన్ని వర్గాలు ఇతర వర్గాలకు అధీనములై, ఆవర్గాల నైతికభావాలనే అనుసరించవచ్చు. అందువల్ల తాము నష్టపడి ఇతరులకు లాభం కల్గించవచ్చు. కాని అలాంటి వర్గాలు తమ పరాధీనతను గుర్తించినప్పుడు, తాము పొందిన నష్టం ద్వారా ఇతర వర్గాలకు కలిగిన లాభాన్ని చైతన్యయుతంగా గుర్తించినప్పుడు తమ కోర్కెలనుకూడ స్వతంత్రంగా వ్యక్తీకరిస్తారు. స్పార్టకస్ చరిత్ర దీని కొక ఉదాహరణ. అలాంటి పరిస్థితుల్లోవారు సక్రియపాత్ర వహిస్తారు. ఈ క్రమంలో వారు తమ నూతన నైతికభావాలను, విలువలను పెంపొందించుకుంటారు. మధ్యయుగంలో కులమత వ్యవస్థలపై తిరుగుబాటుగా భక్తిఉద్యమం నూతన భావాలను ప్రవేశపెట్టింది. మహారాష్ట్రంలో భక్త విజయగాధలు, ఆంధ్రలో వీరశైవ ఉద్యమం, వంగ ప్రాంతంలో చైతన్య ప్రభువు వైష్ణవోద్యమం, ఉత్తర దేశంలో కబీర్ పంధ్ మున్నగునవి అగ్రవర్ణాల నైతిక ఆధిపత్యంపై తిరుగుబాట్లు. అవన్నీ నూతనభావాలను, నూతన నైతిక విలువలను ఆవిష్కరించి సాంఘిక పునరుజ్జీవనకు ఆధారమైనాయి.

ఈ విధంగా స్వాతంత్ర్యం నీతిని ఆవరిస్తుంది. మానవాచరణ నిర్బంధంపైన, అనివార్యతపైన కాక స్వతంత్ర వ్యవహారంపై ఆధారపడుతుంది. అలాకాక మానవులు ఒకవేళ అదృష్ట కర్మాధీనులై నిర్బంధంగాను అనివార్యంగాను మాత్రమే ఆచరణను కొనసాగించినట్లయితే, అప్పుడు స్వాతంత్ర్య సమస్యేరాదు. వారు ఇష్టపూర్వకంగా ప్రవర్తించినప్పుడే స్వతంత్రులై ఉంటారన్నమాట. కనుక తమ స్వాతంత్ర్యాన్నీ ఆ స్వాతంత్ర్యపు వినియోగాన్నీ గుర్తించి, అందుకు తోడ్పడే విధంగా, చైతన్యయుతంగా ఆచరించే క్రమంలోనే మానవ నీతిసూత్రాలు నిర్మాణం చెందుతవి. ఈ పునాదిపైనే మానవుల నైతిక విలువలు వారి లక్ష్యసాధనకు సమన్వయింపబడి, భౌతిక జీవితపు ఆధారాన్ని ఆశ్రయిస్తాయి. తోడ్తో వారు తమ నైతికవిలువలను, స్వేచ్ఛాచరణను కాపాడుకొనుటకు సంస్థలను, సంప్రదాయాలను కూడ

నిర్మించుకుంటారు. వాటిద్వారా తమ స్వతంత్రాచరణ విధానాన్ని, స్థాయినీ కాపాడుకొనుటకేగాక విస్తరించుకొనుటకు కూడ ప్రయత్నిస్తారు. ఈ విధంగా చరిత్రలో అనేక నైతిక - ధార్మిక సంస్థలు, ఉద్యమాలు కొనసాగుతవి

ఈనాడు కార్మికవర్గం కూడ తన నైతిక విలువలను నిర్మించుకొంటూంది. ట్రేడ్ యూనియన్‌లద్వారా, కార్మికోద్యమాలద్వారా ఐక్యకృషి సాగిస్తూంది. వర్గచైతన్యం కల్గిన కార్మికులూ, ఇతర శ్రమజీవులూ తమ వృత్తి సంఘాలద్వారా సమష్టి శ్రేయస్సుకొరకు ఉద్యమిస్తున్నారు. ఈ ఉద్యమంలో ఒకానొక కార్మికుని వ్యక్తిగత ప్రయోజనాలకంటె సాముదాయిక ప్రయోజనాలు హెచ్చు అను దృక్పథం పాటింపబడుతుంది. శ్రామిక వర్గోద్యమంలోని నైతిక విధానం ఈ విధంగా అమలుపరచబడుతుంది. ఐతే ఇందుకు ప్రతిగా ఏ కార్మికుడైనా వర్గచైతన్యం లోపించటంవల్ల ఎవరికి వారుగా స్వీయ ప్రయోజనాలను చూచుకోవాలని వాదిస్తే, అతడు కార్మికవర్గ నీతినికాక తద్విరుద్ధమైన వర్గనీతిని అనుసరించినట్లే. అలా యెవరికి వారు తమ వ్యక్తిగత ప్రయోజనాలను సాధించుకొనటం పెట్టుబడిదారులకు మాత్రమే సాధ్యం. ఆ విధానం కార్మికవర్గ స్థితిగతులకు సరిపోదు. ఇలా నైతికాచరణ విభిన్నవర్గాల్లో విభిన్నరీతులుగా అమలు జరుగుతుంది.

వర్గసమాజంలో నీతి ఎప్పుడూ వర్గగతమైయుంటుంది. విభిన్న వర్గాలు కోరుకొనే స్వేచ్ఛల ఆధారంపై ఆ వర్గాల నైతికదృక్పథం యేర్పడుతుంది. కార్మికులు ఐక్యంగా పోరాడుతారు. పెట్టుబడిదారులు వ్యక్తిగతస్వేచ్ఛకై, వ్యక్తి యాజమాన్య హక్కులకై పోరాడుతారు. ఇలా నీతిపరస్పర విరుద్ధమైన మార్గాల్లో అనుసరింపబడుతుంది. ఐతే ఒకానొక వర్గం పతనోన్ముఖమైనప్పుడు దాని నైతికస్థాయి కూడ దిగజారిపోతుంది. ఉదాహరణకు పెట్టుబడిదారులు తమలోతాము పోటీకి గురియై ఒకరివ్యక్తి యాజమాన్య హక్కును మరొకరు బలహీనపరచుకొంటూ అనైక్యతకు లోనౌతారు. ఈ స్థితిలోనే నూతననీతులు రూపొంది పెంపొందుతవి. పెట్టుబడిదారీ వర్గాల్లో పుట్టిన ముసలంమూలంగానే కార్మి

కోద్యమంయొక్క కొత్తనీతి విస్తరిల్లుతుంది. అందువల్ల, కాలదోషం పట్టిన పాతనీతికి కాక, సమాజాభివృద్ధికీ స్వాతంత్ర్య వికాసానికీ ఉపక రించే కొత్తనీతికే మనంప్రాధాన్యత నిస్తాం.కనుక మనం స్వాతంత్ర్యాన్నీ అభివృద్ధినీ దేనికదేగా విడిగా చూడం ఈ రెండూ అవిభాజ్యమైనవి. 'స్వాతంత్ర్యంద్వారా అభివృద్ధి - అభివృద్ధిద్వారా స్వాతంత్ర్యం' అనే రూపంలో యివి గతితార్కిక ఐక్యతగా ఉంటాయి. కనుక అభివృద్ధికీ, స్వాతంత్ర్యానికీ ఏకైకలక్ష్యం జీవితంలో సుఖసమృద్ధుల సాధన. దీన్ని మనం గుర్తించి సాంఘిక సుఖసమృద్ధుల సాధన అను లక్ష్యంద్వారా నైతిక ఔన్నత్యానికి విలువలు కడతాం. ఈ దృష్ట్యా నేడు శ్రామికవర్గ పోరాటానికి అతిరిక్తమైన నీతి అనేది లేదు. పెట్టుబడిదారీ సమాజం యొక్క నైతిక పతనాన్ని తొలగించుటకు కార్మికోద్యమం తప్ప గత్యంత రం లేదు. లెనిన్ యిలా వ్రాశాడు:

"మననీతి కార్మికవర్గం జరిపే పోరాటానికి పూర్తిగా అధీనమై యుంటుంది. మననీతి శ్రామికవర్గ పోరాట ప్రయోజనాల నుండి ఉత్పన్నమయింది. ఈనీతి పాతపీడక సమాజాన్ని నిర్మూలించుటకూ, శ్రమజీవుల నందరినీ కమ్యూనిస్టు సమాజ నిర్మాతలైన కార్మికవర్గం వెనుక సమీకరించుటకు వినియోగపడుతుంది. ఈ పోరాటానికి ఉపక రించి శ్రామికులను ఐక్యపరచేదే కమ్యూనిస్టు నీతి."

ఈ విధంగా వర్గపరిమితుల నధిగమించే నీతి 'అందరి అభివృద్ధికీ ఆధారం ప్రతివాని స్వేచ్ఛాయుతాభివృద్ధియే' నన్న సూత్రాన్ని అమలు పరుస్తుంది మానవుని అవసరాలేమిటి? వాటిని పూర్తిచేయటంయెలాగ? అన్నదే ఈనీతిసూత్రానికి పునాది. కనుక తమఅవసరాలను నెరవేర్చే సాధ నాలపై ప్రజలు చైతన్యయుతమైన అదుపు విధించటమే వారిస్వేచ్ఛ యొక్క వ్యక్తీకరణ, స్వేచ్ఛ యొక్క సారధ్యమూను. ఈ విధంగా సుశిక్షితమైనవిధానంలో కార్మికవర్గ స్వాతంత్ర్య పోరాటం మానవ నైతిక పరిణామంలోని ధనాత్మక విలువల నన్నిటినీగుర్తించి, వాటి ఆచరణాత్మక వికాసానికి మేలిబాటలు వేస్తుంది.

కొందరు గాంధేయులు ఈ అంశాన్ని తికమకకుగురిచేస్తారు. వారు సామ్యవాద నీతి విషయంలో సాధనాల పవిత్రత పాటింపబడదని ఆక్షేపిస్తారు. లక్ష్యాల అనివార్యతకంటె సాధనాల పవిత్రత ప్రధానమని వీరు వాదిస్తారు. అదేరీతిలో రాయిస్టులుకూడ లక్ష్యసిద్ధికంటె సాధనాల హేతుబద్ధత ప్రదానమని వాదిస్తారు. కాని మార్క్సిజం సాధనాలనూ లక్ష్యాలనూ దేనికదే విడివిడిగా చూడదు. సారాంశజ్ఞానానికి ప్రతికూల ధోరణిలోను చూడదు. అది హేతువాదాన్నీ పవిత్రతనూ సామ్యవాద ఉద్యమ భూమికపై గుర్తిస్తుంది. హేతువాద పూర్ణత, లేక పవిత్రత యొక్క సమగ్రత వర్గ సమాజంలో కేవల ఊహాగానమే. కనుక వాస్తవికమైన హేతువాదం, పవిత్రతాభావం సాంఘికోద్యమ పురోగతికి అవరోధం కాజాలదని మార్క్సిజం వాదిస్తుంది.

నేటి వర్గ సమాజంలో 'మానవనీతి' లేక హేతువాద. పవిత్రతావాద పూర్ణత అనేది లేదు. అలాంటి నైతిక సమగ్రతకు నిర్బంధం పీడన, హెచ్చుతగ్గులు గుదిబండలుగా ఉన్నాయి. కాని, రేపటి అఖిల మానవాళి నైతికధర్మాలెలా ఉంటాయో మనం ఊహించగలం. అవి పిడివాదంగా కాక శాస్త్రీయంగాను, ఆత్మ విమర్శకంగాను ఉంటాయి. నీతిని దివ్యదత్తమై. జన్మతో సంక్రమించే యే కొందరు అదృష్టవంతుల ప్రత్యేక ఘనతగానో కాక సాంఘికభూమికపై నిర్వచిస్తాం. అవినీతికి కారణం అవిద్య అనీ, నిర్బంధ పరిస్థితులే ఆ సాంఘికవర్తనకు కారణాలనీ నిరూపిస్తాం. కనుక అవినీతిని శిక్షించటంద్వారాకాక సంస్కరించటంద్వారాను బోధనద్వారాను నిర్మూలించాలని చెప్తాం. నీతిని స్వేచ్ఛా ప్రాతిపదికపై, సమానత్వ ప్రాతిపదికపై సౌమ్యతతో, మానుషత్వపూరిత విధానంలో పెంపొందించాలని చెప్తాము. ఈ విధంగా సామ్యవాద ఉద్యమం మాత్రమే ప్రతి వ్యక్తియొక్క స్వేచ్ఛా సౌభాగ్యాభివృద్ధిరీత్యా నీతిని నిర్మిస్తుంది.

కాని భావవాదులు నీతిని మత సంప్రదాయంతో జోడిస్తారు. నీతి దివ్యదత్తమైన దంటారు. మరికొందరు నీతి కేవలం మానసిక భావమనీ, దానికి భౌతికపునాది అనవసరమనీ వాదిస్తారు. ఈ రెండు ధోరణులనూ మార్క్సిజం ఖండిస్తుంది. నీతి దివ్యదత్తమైనదనే భావం ప్రచలిత

సంప్రదాయాన్ని శాశ్వతపరచి సాంఘికవిప్లవాన్ని నిరోధిస్తుంది. అలాగే నీతి మానసిక భావమనే ధోరణి దాని ఆచరణాత్మక దిశను బలహీన పరుస్తుంది. వాస్తవంలో నీతి సాంఘిక శ్రేయస్సును చెందే భౌతిక వాస్తవ పునాదిపై రు పొందుతుంది. మానవులు తమ భౌతికావశ్యకతలను సాధించుకొనేందుకు జరిపే స్వాతంత్ర్యోద్యమంతో అది ముడివడియుంటుంది.

ఈ రచనను ముగించే ముందు ఈనాడు మన ఉద్యమాన్నెదుర్కొనే కొన్ని సమస్యలను సారాంశరూపంలో సమీక్షించుకొనేందుకు ప్రయత్నిద్దాం.

ఈనాడు మానవచరిత్ర అపూర్వమైన పురోగమనం సాగిస్తూంది. మానవుడు ప్రకృతిపైన, సమాజంపైన తన ఆధిపత్యాన్ని నెలకొల్పుకొనుటకు అపారంగా కృషి కొనసాగిస్తున్నాడు. ఇందుకుగల అవరోధాలన్నిటినీ అధిగమించి ముందుకు సాగుతున్నాడు. విద్యా విజ్ఞానాలు పెంపొందుతున్నాయి. ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో విప్లవం శరవేగంతో కొనసాగుతూంది. సమాజంయొక్క ఆర్థికపునాదీ, దాని ప్రతిబింబమైన ఉపరి నిర్మాణమూ మారిపోతున్నాయి. సామ్యవాద శక్తులు దినదిన ప్రవర్ధమానంగా బలసంపన్నమౌతున్నాయి.

ఈ ప్రగతి పెట్టుబడిదారీ వర్గాలకు సరిపడటంలేదు. గుత్తపెట్టుబడిదారీ వర్గం పోటీలకూ సంక్షోభాలకు లోనై సతమతమౌతూంది. పతనోన్ముఖమైన స్వార్థపర వర్గాలు తమ వ్యక్తి యాజమాన్యాన్నీ వర్గాధిక్యతనూ సమర్థించుకొనుటకు నానా తాపత్రయం పడుతున్నారు. ప్రజాస్వామ్యం పేరును వల్లిస్తూనే వారు నిర్బంధ విధానానికి, నిరంకుశత్వానికి పూనుకొంటున్నారు. జాతీయ గౌరవాన్ని పేర్కొంటూనే వారు జాతీయాభ్యుదయానికి ప్రతికూలమైన పంథా ననుసరిస్తున్నారు. సాహిత్య కళారంగాల్లో వాస్తవికతను అణచిపెట్ట జూస్తున్నారు. శాస్త్ర - సాంకేతిక రంగాలను మానవ శ్రేయస్సుకై కాక యుద్ధనీతికీ మారణాయుధాల నిర్మాణానికీ వినియోగిస్తున్నారు. తత్వశాస్త్ర రంగంలో ఆశావాదానికి బదులు నిరాశా వాదాన్ని, జ్ఞానవికాసానికి బదులు అజ్ఞేయవాదాన్ని ఆశ్రయిస్తు

న్నారు. నేటి సాంఘిక సమస్యలకు పరిష్కార మార్గాలను చూపటంలో వారు విఫలమవుతున్నారు. ఈ సంక్షోభంనుండి గుత్తపెట్టుబడిదారీ వర్గాలు బయటపడ లేకున్నాయి.

మరోవంక నవోదిత కార్మికవర్గం ముందుకు సాగిపోతూంది. మానవ వారసత్వంలోని గత విలువల నన్నింటినీ కాపాడి వాటిలో నూత్న వికాసంచేకూరుస్తూంది ప్రజాతంత్ర సంప్రదాయాన్ని ప్రజాతంత్ర సంఘటనను ప్రబోధిస్తూంది. జాతీయ గౌరవాన్నీ, సార్వభౌమాధికారాన్నీ కాపాడుతూ దాన్ని అంతర్జాతీయ సామ్యవాదంగా వికసితంచేస్తూంది. సాహితీ సంస్కృతీ రంగాల్లో వాస్తవికతను పెంపొందిస్తూంది. శాస్త్ర సాంకేతిక రంగాల్లో మానవతా భావాలనూ స్వచ్ఛంద వికాసాన్నీ ప్రోత్స హిస్తూంది. విజ్ఞాన శాస్త్రాధారంపై తత్వశాస్త్రాన్ని మానవుని సిద్ధాంత సాధనంగా పెంపొందిస్తూంది. ప్రబలమైన కార్మిక, రైతాంగ ఉద్యమాల ద్వారా పారిశ్రామిక వ్యవసాయరంగాల్లో ఉత్తేజన కలిగిస్తూంది.

ఈ విధంగా, జీవితంయొక్క అన్నిరంగాల్లోను అభివృద్ధి నిరోధక శక్తులు, వారి భావాలు సంక్షోభ పరిస్థితులకు గురియై యుండగా, మార్క్సిజం పురోగామిక శక్తులనూ భావాలనూ నూతనమార్గాల్లో వికసింపజేస్తూంది. విజ్ఞానాన్నీ విద్యనూ అధికారాన్నీ యేకొందరో సంపన్నుల 'గుత్తబడి'గా కాక కార్మికుల, రైతుల పేదప్రజల హక్కుగా, ఉద్యమ సాధనంగా తీర్చిదిద్దుతూంది. పీడకవర్గాల స్వార్థపూరిత మిథ్యావాదాల నన్నింటినీ వాస్తవభావ ప్రకాశనద్వారా ఖండిస్తూంది. ఈ విధంగామ ర్క్సిజం మానవ చరిత్రలో వర్గపరిమితులకు, వర్గపీడనకు అతీతమైన నూతన శకాన్ని సృష్టిస్తూ, అఖిల మానవాళిని శాంతి సుఖసమృద్ధుల వంకకు నడిపిస్తూంది మనిషికీ మనిషికీమధ్యగల అంతరాలను ఛేదించి నూత్న సమైక్య సమాజాన్ని నిర్మిస్తూంది.

ఈ మహోద్యమానికి వెలుగుబాటను చూపటమే మార్క్సిస్టు తత్వశాస్త్రం లక్ష్యం. అందుకని మార్క్సిస్టు తత్వశాస్త్రం అభివృద్ధినిరోధకమైన, కాలదోషంపట్టిన అన్ని భావాలను, నమ్మకాలను, భ్రాంతుల ఖండిస్తుంది. తోడ్తో శాస్త్రీయ వాస్తవాలనూ ఆచరణాత్మకమైన నూ

భావాలనూ ప్రోత్సహిస్తుంది. పెట్టుబడిదారీ విధానాన్ని, ఆ విధానం యొక్క సిద్ధాంతాలను మార్క్సిజం వ్యతిరేకిస్తుంది. వాటిని నిర్మూలించటంద్వారా పరిపాలనాధికారాన్ని శ్రామికప్రజల పరంచేస్తుంది. తద్వారా సుఖ సమృద్ధులతోడి సామ్యవాద సమాజనిర్మాణానికి సాధనంగా వినియుక్త మౌతుంది. ఈ విధంగా శ్రమజీవుల రాజ్యం, సామ్యవాద నవసమాజం రూపు దీర్చుకొనుటకు మార్క్సిజం సిద్ధాంతసాధనంగా సక్రియపాత్ర నిర్వహిస్తుంది; ప్రపంచశ్రామిక ప్రజానీకాన్ని సామ్యవాద మహోద్యమంలో ఐక్యపరచి విజయం సాధిస్తుంది.

మార్క్స్ ఈ మహత్తర లక్ష్యంతోనే "ప్రపంచ కార్మికులారా ! ఏకంకండ"ని నినాదమిచ్చాడు. ఆయన చెప్పినట్లు సామ్యవాదంకొరకు జరిగే యీ పోరాటంలో శ్రామికప్రజలు కోల్పోయేదీ పెట్టుబడిదారీ వర్గాలు సాధించేదీ ఏమీలేదు. కనుక మార్క్స్ మహదాశయమైన ప్రపంచ కార్మికరాజ్యం విజయంచెంది తీరుతుంది. నిజమైన వర్గరహిత సమాజం ప్రపంచమంతటా సాధింపబడి తీరుతుంది.



# విషయ వివరణ సూచి

(సంఖ్యలు పుటల సంఖ్యను తెలియ జేస్తాయి)

# పారిభాషిక పదాలు

అజ్ఞానం - Ignorance
అజ్ఞాతం - Unknown
అజ్ఞేయం - Unknowable
అజ్ఞేయులు - Agnostics
అదనపు విలువ - Surplus Value
అదృష్ట - Invisible; unseen
అద్వైతం - Monistic idealism
అధిభౌతిక - Metaphysical
అనియత - Arbitrary
అనివార్యత - Inevitability
అనుచర్య - Rsponse
అనుద్దిష్ట - Unintentional
అనుభూతి - Perception
అనుమానం - Inference; doubt
అన్వర్థత - Validity
అనుబద్ధ చర్య - Interaction
అనుభవ వాదం - Empiricism
అభి వృద్ధి - Growth; development
అభివృద్ధి నిరోధక - Reactionary
అభివ్యక్తి - Cognition
అమేయ - Abstract
అవగాహన - Perceptual knowledge; understanding
అశిక్షిత - Vulgar

ఆగంతుక - Conditioned
ఆచరణ - Practice
ఆదిమ - Primitive
ఆధిపత్యం - Mastery; power of control
ఆధ్యాత్మిక - Spiritual

ఆనువంశిక - Hereditary
ఆనుషంగిక - Unintentional; secondary
ఆలంబన - Basis
ఆలోచనాక్రమం - Thought process
ఆవశ్యకత - Inevitable necessity; need
ఆస్తి - Property
ఆస్తికత్వం - Theism
ఇచ్ఛ - Will; desire
ఇంద్రియానుభూతి - Sense perception
ఉత్పత్తిక్రమం - Productive process
ఉత్పత్తి పరికరాలు - Instruments of production
ఉత్పత్తి వ్యవస్థ - System of production
ఉత్పత్తి వ్యవహారం } Productive activity
ఉత్పత్తి వ్యాపారం }
ఉత్పత్తి శక్తులు - Productive forces
ఉత్పత్తి సంబంధాలు - Productive relations
ఉత్పత్తి సాధనాలు - Means of production
ఉత్తేజన - Reaction
ఉత్తీర్ణ - Solve
ఉద్దిష్ట - Intended
ఉన్నత } - Higher
ఉన్నతతర }
ఉపరినిర్మాణం - Superstructure
ఊహాగానం - Speculation; imagination
ఋణాత్మక - Negative
ఏకత్రిత - Whole of parts
అంగ - Part
అంగి - Whole

అంగజీవి - Organism

కణం - Molecule
కక్ష్య - Ellipse
క్రమం - Process
క్రమబద్ధ - Systematic
క్రమీకరించు - Systematise
కార్యకారణభావం - Causality
కార్యకారణవాదం - Theory of causality
కాలాతీత - Out dated; late
క్రియ - Action
క్రియాశీల - Active
కేవలాలోచన - Pure thought
కేవల జ్ఞానం - Pure knowledge
ఖండసత్యం - Partial truth

గతితర్కం - Dialectics
గతితార్కిక భౌతికవాదం - Dialectical Materialism
గణం - Clan; tribe
గుణధర్మాలు - Properties
గుణసామ్యాలు - Common properties
గుణాత్మక - Qualitative
గుణీకరణ - Abstraction
గుణీకృత - Abstract
గురుత్వాకర్షణ - Gravitation
గ్రాహక కేంద్రాలు - Sensory centres
గ్రాహక చైతన్యం - Sensory consciousness

ఘర్షణ - Struggle

జ్ఞానం - Knowledge
జ్ఞాననిర్మాణం - Building-up of knowledge

జ్ఞానసంపుటి - Body of knowledge
జ్ఞానసంచయం - Accumulation of knowledge
జ్ఞానసంచయన - Acquisition of knowledge
జ్ఞానేంద్రియాలు - Sense organs

చలనం - Motion
చాపం - Arc
చాలక కేంద్రాలు - Motor centres
చేతనం - Animate; living
చైతన్యం - Consciousness; life
ఛాందసాలు - Superstitions; dogmas

జడం - Inanimate
జీవరాశి - Species
జీవశాస్త్రం - Biology
జీవిత వ్యవహారం } - Life activity
జీవిత వ్యాపారం }

తప్పు - false
తర్కం - Logic
తర్కవాదం - Logical argument
తర్క బద్ధత } - Logical consistency
తర్కసూత్ర సంబద్ధత }
తక్షణ - Immediate
తార్కిక జ్ఞానం - Rational knowledge
తార్కికీకరణ - Rationalisation
తులనాత్మక - Relative; balanced
త్ర్యణుకాలు - Triads consisting of three atoms, causing three dimensious to objects (as referred to in Vaiseshika philosophy.)

దర్శకత్వం - Direction

దిగ్వలయం - Horizon
దివ్యశక్తి - Divine power
దివ్యదత్త
దివ్య నిర్దేశిత } - Divinely ordained
దేహ వ్యాపారాలు - Physical activity
ద్వ్యణుకులు - Diads conisting of two atoms, causing length and width to objects (as referred to in Vaiseshika Philosophy)
ద్వైతం - Dualism
ద్రవ్యం
భూతం } - Materialism

ధనాత్మక - Positive
ధర్మాలు - Functions; properties
ధార్మిక - Religious; ethical
ధాతువులు - Metals

నకారాత్మక - Negative
నాడీమండలం - Nervous system
నాడీవ్యవహారం - Nervous activity
నిమ్నోన్నత్యాలు - Low and high levels
నియంతృత్వం - Dictatorship
నిరూపణ - Proof; verification
నిర్ణయం - Conclusion; decision
నిర్ణాయకపాత్ర - Decisive role
నిర్దిష్ట
ప్రత్యేక } - Concrete
నిర్నిబద్ధ - Unconditional
నిశ్చయజ్ఞాన సూత్రీకరణ - Syllogism
నిశ్చితాలు - Certainties

నేతి - నేతి - 'This is not - this is not' - the argument to prove Brahman (as referred to in Advaita philosophy)
నేత్రకటకం - Cornea

పదార్థం - Matter
పదార్థ విజ్ఞానశాస్త్రం - Physics
పదార్థత్వం - Thing-in-itself
పరస్పర సంక్రమణ - Inter penetration
పరిణామం - Evolution; development
పరిణామవాదం - Theory of evolution
పరిమాణం - Quantity; size
పరిమాణాత్మక - Quantitative
పరిసరాలు - Environment
పరిశీలన - Observation
పరిశోధన - Research; discovery
పరోక్ష - Indirect
పార్శ్వం - Part; aspect
పిడివాదం - Dogmatism
పారమార్థిక - Spiritual
పీడన - Exploitation
పీడిత - Exploited
పీడక - Exploiting
పునరావృత్తి - Reproduction
పునరుజ్జీవన - Renaissance
పూర్ణసత్యం - Absolute truth
పెట్టుబడిదారీ విధానం - Capitalism
ప్రక్రియ - Experimental process .
ప్రకృతి - Nature
ప్రకృతి విజ్ఞాన శాస్త్రాలు - Natural sciences

ప్రచలిత - Contemporary
ప్రతిచర్య - Reflex
ప్రతిబింబం - Reflection
ప్రతిపాదన - Proposition
ప్రతిప్రభావం - Opposite effect; reaction
ప్రత్యక్ష - Direct
ప్రత్యేకీకరణ - Specialisation
ప్రమాణం - Evidence
ప్రమేయం - Object of study; to intervene
ప్రయోగం - Experiment
ప్రయోజనాలు - Interests
ప్రవృత్తి - Instinct
ప్రాథమిక - Primary
ప్రాతిభాసిక - Illusory, as matter is referred to in Vedanta
ప్రాప్తకాలజ్ఞత - Utilitarianism
ప్రాయోగిక, ప్రయోగాత్మక - Experimental; practical
ప్రేరణ - Stimulus; motive force
బృందవ్యవహారం - Collective or clan activity
బుద్ధి - Right knowledge; intelligence
భావం - Idea
భావవాదం - Idealism
భావన - Feeling; emotion
భావనాత్మక - Emotional
భావ వినిమయం - Exchange of views
భావనిర్ధారణలు - Mental decisions
భాష్యం - Interpretation
భూస్వామ్యం - Feudalism

భూమిక - Basis
భౌతికవాదం - Materialism
భౌతిక మూలసూత్రాలు - Objective premises
భ్రాంతి - Illusion
మజ్జాముఖం - Cerebral cortex
మతకర్మలు - Rituals
మనస్సు - Mind; intellect
మనస్తత్వశాస్త్రం - Psychology
మానసికవ్యాపారం / మనోవ్యాపారం - Mental activity
మానసిక ప్రతిబింబం - Mental image
మానసికావశ్యకతలు / మానసికావసరాలు - Intellectual necessities
మానసిక సాధనాలు - Intellectual means or weapons
మానవత్వ - Humanist
మానసవాదం - Sophism
మాతృక - Source
మిథ్య - Falsity; illusory
మిథ్యాచైతన్యం - False consciousness
ముద్ర - Impression
మూలపదార్థం - Element; causal object
మెదడు / మేధ - Brain
మౌలిక - Basic; fundamental
యథాతథ - As it is; without change
యాజమాన్యం - Mastery; ownership
యాదృచ్ఛికత - Accidentalism; chance
యాదృచ్ఛిక సంఘటన - Unforeseen accident
యాంత్రికభౌతికవాదం - Mechanical materialism

యాంత్రికశాస్త్రం - Mechanics
రసవాదం - Alchemy
రసాయనశాస్త్రం } - Chemistry
రసాయనికశాస్త్రం
రూపగణితం - Algebra
రేఖాగణితం - Geometry
వర్తన - Behaviour
వర్గం - Class
వర్గ సామరస్యం - Class collaboration
వర్గ సంఘర్షణ } - Class struggle
వర్గ పోరాటం
వస్తుగత } - Objective
వస్తుశీల
వాస్తవికత } - Being real; reality
వాస్తవం
వికృతి } - Distortion
వక్రత
విజ్ఞానశాస్త్రం - Science
విధానం - Procedure
వినిమయం - Exchange
విప్లవాత్మక - Revolutionary
విమర్శాత్మక - Critical
విలోకన - Out-look
విలోమం - Inversion
వివేచన - Discrimination
విశ్లేషణ - Analysis; decifering
వైయక్తిక } - Individual
వ్యక్తిగత

వైరుధ్యం - Contradiction
వైధానిక - Procedural
వ్యవహారం } - Activity
వ్యాపారం }
వ్యవహారసాధనం - Medium of activity
వ్యవహారజ్ఞానం - Practical knowledge
వ్యవస్థ - Institution; phenomenon
వృత్తం - Circle
వృత్తకేంద్రం - Centre of a circle
శక్తి - Energy
శక్తిమార్పిడి సిద్ధాంతం - Law of transformation of energy
శరీరశాస్త్రం - Physiology
శబ్దకోశం - Word - stock; dictionary
శాక్త - Energyist
శాస్త్ర సిద్ధాంతాలు - Scientific theories
శాస్త్రసూత్రాలు - Scientific laws
శాస్త్రం - Science
శ్రమవిభజన - Division of labour
శ్రమవిలువ - Labour value
శ్రమశక్తి - Labour power
శ్రమానుక్రమం - Labour process
శ్లిష్ట } - Complex; compound
సంశ్లిష్ట }
సక్రియ - Active
సజీవ - Living; active
సత్యం - Truth
సత్తాసంతులన - Balance of power
సమన్వయించు - Correspond to

సమానాంతర రేఖలు - Parallel lines
సరళరేఖ - Straight line
సర్వాతిశయ - Sovereign
సర్వోపరి - Absolute; above all
సహజప్రతిచర్య - Unconditioned reflex
సహజప్రవృత్తి - Natural instinct
సంయోజిత - Preconceived; planned
సంకేతం - Signal
సంకేతక్రమం - Signal system
సంస్కృతి - Culture
సంజ్ఞ - Participle of illustration
సంజ్ఞి - Particular of illustration
సంయోగం - Composition; compound
సంచాలకశక్తి - Motive force
సంఘర్షణ - Struggle; confilict
సంప్రదాయ, సాంప్రదాయిక - Traditional; conventional
సాంప్రదాయవాదం - Revivalism
స్వగతశీల, స్వగత - Subjective
స్వతఃప్రమాణ - Self-evident
స్వవ్యాఘాత - Inconsistent
స్వభావ స్వరూపాలు - Content and form
సాధనం - Means; medium
సాధికార - Authoritative; ruling
సాపేక్ష - Relative
సాపేక్షత - Relativity
సారూప్యత - Coincidence with reality
సామ్యవాదం - Socialism

సామాన్యత - Generality
సారాంశం - Essence
సారాంశధర్మాలు - Essential characteristics
సామాన్యీకరణ - Generalisation
సార్వజనీన - Universal
సార్వకాలిక - Universal; absolute
సాంఘికశాస్త్రం
సాంఘికవిజ్ఞానశాస్త్రం } - Social science
స్వాతంత్ర్యం - Freedom
సిద్ధాంతం - Ideology; theory
సిద్ధాంతసూత్రం - Formula
సిద్ధాంతీకరణలు - Formulations
సూత్రం - Law; rule
సూక్ష్మ - Subtle
స్థితి - Being
స్థూల - Gross
స్వీయపరిశీలన - Introspection
స్వీయధోరణి - Subjective trend
స్వీయభావం - Subjective idea
స్వీయోద్దేశం - Subjective concept
స్వీయదృక్పథం - Subjective angle
స్వీయనిర్ధారణ - Subjective decision
స్వీయభావవాదం - Subjective idealism
సౌర - Solar

హేతువాదం - Reason; rationalism
హేతువాద జ్ఞానం - Logical knowledge;
Rational knowledge



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B127 |
| పుస్తకం పేరు | జ్ఞానసిద్ధాంతం |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 337 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 13,14 |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |